చందా సం॥ కు రూ. 3—0—0. విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 4. | రాక్షసనామసంవత్సరము ఆషాఢమాసము. | సంచిక. 5.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమును గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక

గీ. కేరడములంపుఁ బావలోకజవ్వని పూనుపఁ జామరంబు లి
ద్దఱు పరిచికల్గొని యిరుదాయలయం దిడ నొక్కపాటల
గర జేయిదండ యిరాయఁగ మదావళమంథరుఁడై మరుత్సభా
గురు వగుకొల్వుకూటమునకుం జనుదెంచి తదంతరంబునన్. 55

మ. వలిసంపుం బెరమాటులం దిరుగు జాళ్వావేలికిల్యాభష్మ లం
గెలనానుల్ విరిచందిపవామొకరిలేఁ దేంట్లార్భటు ల్వేత్రహ
స్తులు సామంతులు కొల్వు దెల్పుబలుసద్దుల్ చామరగ్రాహిణీ
వలయూరావము వందిమాగధులకై వారంబు తోరంబుగన్. 56

ఉ. మన్నె కొమాళ్లు రావారలు మంత్రులు మిత్రులు రాయబార్లు వి
ద్వన్నివహంబులుం గవులు వైణికులు న్నటులుం భజింపఁగాఁ
బున్నమచందురుండు పొమఘ్నలచక్కి వసించియున్న చా
య న్నవరత్నపీఠిఁ గొలునై బలువైభవ మొప్ప నున్నెడన్. 57

— * దశరథునొద్దకు విశ్వామిత్రుఁడు వచ్చుట. * —

సీ. కడజాతిత్రేనియాగము నిర్వహించిన యఘటనఘటనావిహారహారి
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసి వాసికి నెక్కు భారతీసహచరప్రతిభటుండు
మేనకాలావణ్యమానసాధీనుఁడై పరమహంసతఁగన్న వరతపస్వి
తనరాచదొరపుట్టువు నిరాకరించి బ్రహ్మర్షియై మెఱయుమహామహుండు
గీ. వచ్చె భువనోచ్చయాద్భుతావహనశీల, పాలితజటాలబాలవాక్ప్రముదితాది
తేయధారేయుఁ డల్లగాధేయుఁ డాతి, థేయుఁడై మించునైందుమతేయుకడకు.

శా. కావ్యప్రాకృతసూత్రబోధనలరేఖన్ సర్గభేదంబు వ
ర్ణవ్యత్యాసము గల్గి సోమసుతుఁడైనాఁ డంచు సాహిత్యవా
స్తవ్యుల్ శాబ్దికు లధ్వరుల్ తను మదిం దర్కింప సాక్షాన్మనీ
శవ్యంజార్కుఁడపోలె వచ్చుకుశవంశస్వామి నీక్షించుచున్. 59

ఉ. లేచి కరాంబుజాతముకుళీకృతియు న్నతియున్ ఘటిల్ల మా
యాచతురక్షపాచరభయానకజన్యవిహారకాతర
ద్యోచరవీరపాలకరథుం డగుపఙ్క్తిరథుం డొనర్చు పూ
జాచరణంబుచే ముదితుఁడై యతఁ డామహినేత కిట్లనున్. 60

సీ. చిప్పకూఁకటితోడి శిరసునం దిడినట్టి జిగిమట్టికుళ్లాయ సొగసుమీఱ
హారుమంజిముత్యాలయొంటులచకచకల్ తళుకుఁజెక్కులదండఁ దాండవింప

గోణముపైని రింగులువారఁ గట్టిన వలిపెదుప్పటి కటిస్థలి రహింప
నెడమకెంగేల నెక్కిడిన విల్ కుడిచేత నొకటిరెండుఱకోలు లొలుపు నెఱపఁ
గవదొనలు బూని వెంట లక్ష్మణుఁడు నడువ
రామభద్రుండు నావెంట రా నియోగ
మొసఁగితివయేని రాకాసిదొసఁగు మాని
యవభృథస్నాత నగుదు నోయధిప యనుడు. 61

— ॥ రాముని విశ్వామిత్రునితోఁ బంపుటకు దశరథుఁడు విచారించుట. ॥ —

ములుకులు గాఁడినగతి ముని, పలుకులు వీనులకుఁ దోఁప భయసంగతి మూ
ర్ఛిలి తనకుఁ దానె తెప్పిఱి, తలపోఁతకుఁ జొచ్చె నిట్లు దశరథుఁ డాత్మన్. 62
వెడతపసి నాకె నెద గొడ్డువీఁగికన్న, రాము నెడఁబాపునతినిష్ఠురంపుఁబలుకుఁ
జిలుకు తనవంటి పెనుదంటచేతఁగాని, మనుము నాచిన్నిపాపఁడే మనుచువాఁడు.
అక్కటా ! దిక్కటాహభయదార్భటీ బర్వెడు సోఁకుటెక్కటీ
లెక్కడ! కాకపక్షధరుఁ డీనిసు వెక్కడ! వారితోడ వీఁ
డెక్కటిపోరికిం దొడరు టెక్కడ ! యెక్కడి సంగతంబు లీ
మొక్కలపుంబ్రసంగములు మోసముఁ దెచ్చుదురూహలే కదా ! 64
బాలామణులజోలపాటలా నైశాటవాహినీఝాంటకోలాహలములు
గరిడిసాదనలా సగర్వపూర్వసుపర్వగహనసంగరరంగవిహరణములు
చెండుగోరింపులా కండూలభుజదండచండదానవశిరఃఖండనములు
పెన్నుద్దికొమరులపెనఁగులా పలలాశనద్వంద్వబంధురాసందనములు
చెల్లఁబో చూచిచూచి నిశీథినీచ, రప్రభులతోడిగొడవ కీరాచపుడమి
వేలుపుతుటారితాపసివెంట నరుగు, మనుచు నీరాము నేరీతిఁ బనుచువాఁడ.
అని యెడఁ దన్విచారపడునాదొరతోడ వసిష్ఠుఁ డిట్లనున్
జనవర ! కౌశికుం డనఁగ నల్వకు జోడితఁ డిత్తఱిం దపో
ధన ముడివోనిపూనిక వితాన మొనర్పఁ గడంగినాఁడు నీ
మనుకులకీర్తికామినికి మైకసిగందనిచాయ సంధిలన్. 66
అనిమిషరాజసంపదల కర్హుఁడు గోత్రవహుండు నెల్లమే
దిని భరియింప నోపునతిధీరుఁడు మానవసింహుఁడున్ జగ
జ్జననుతవిక్రమోన్నతుఁడు శాత్రవరాజహరుండు నైన నీ
తనయుఁడు పూనుకొన్న నొకతాపసిజన్నముఁ గావ నోపఁడే! 67

క. సీరాముని లక్ష్మణుతోఁ, సీరామునివెంటఁ బనుపు మింక నితనిచే
సీరజనీచర యగు ధర, నీరజహితవంశ చింత నీ కేమిటికిన్. 68

— ౬ దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రునితోఁ బంపుట ౬ —

గీ. అనివసిష్ఠుఁడుపల్కువాక్యములవలనఁ, దనయుమహిమంబునిజమనితలఁచెన్నృపుఁడు
విశ్వసింతురె ! భూపతుల్ వింతవార, లెంతవారైనఁ దమపురోహితుని గాక.

క. యోగవిధేయుం డెవ్వఁడు, యోగీంద్రుల కతఁడు గురునియోగవిధేయుం
డై గాధేయుని వెనుకొనె, యాగపరిత్రాణమునకు ననుజాన్వితుఁ డై. 70

ఉ. పైనముచేసి తండ్రి వనుపం బెనుపంతముతో డ ని ట్లయో
ధ్యానగరంబు వెల్వడి పదాంకపవిత్రితమార్గు లై రి త
న్మానికృపానుభావభజమానబలాతిబలాభిధానవి
ద్యానిరవద్యబోధవిజితశ్రము లై మహిపాలబాలకుల్. 71

చ. వడి గొరవంకబారు లిరువంకల రాఁ జెలరేఁగి చిల్కల
త్తడి దుమికించుకొంచు జడదాలువు వేలుపుకంటిమంటలోఁ
బడి వెడవిల్తుఁ డంగ మెడఁబాసిన మోసపుటెంకి యాటచేఁ
బడసిన యంగసంజ్ఞ నిల భాసిలు దేశ మతిక్రమించుచున్. 72

చ. అలక కెలంకునం దొలఁకు నాటకొలంకుననుండి వచ్చు గం
ధిలసలిలమిశ్రదధపధిన్ సరయూనది దాఁటి వృత్రని
గ్రహసముద్భవత్రిదశరాడఘనాశఘనప్రకాశముల్
మలదకరూశముల్ గడచి మార్గమునం జనుచుండువారికిన్. 73

సీ. యతుధానాన్వయసు కేతుకుక్షివారిధిఁ దోఁచు కాలకూటమువంటికలువకంటి
దివివెలయాలి కై దెగు సన్నదమ్ములం దగ్రజుకా ల్దొ్రక్కినట్టిజంత
మాయచే జగ మెంచు మారీచుఁ డనియెడు పాతకుఁ గనినట్టిపాపజాతి
వనధి గ్రోలినమానికినుకచేఁ దనయుండు తానును బొలదిండి యైనదుండి

గీ. యాత్మసాత్కారితచరాచరాత్యయప్ర
యత్నకృతకృత్యమృత్యుదుస్త్యజకృతాంత
నగరశృంగాటకశయాగ్రసర్తిత్రగ్ర
నిఖిలఖేటక తాటక నిలిచె నెదుట. 74

క. ఆదారుణ నీదారి న, రాదకులోత్పాతసంధ్య యనఁ దగు రుధిర
శ్లోదారుణఁ గని ఘృణి యగు, నాదశరథసుతునిఁ జూచి యతివరుఁ డనియెన్.

వనిఁ ద్రోయఁడే చంద్రవతిఁ గూఁతు రనక యుద్ధతి నాచి కేతుసూనుఁ డుహాళుఁడు
పినతల్లి యనక నిర్భేదింపఁడా మున్ను దితినింద్రుగర్భంబు శకలములుగ
ప్రియకాంత యనక దుల్పింపఁడా రేణుకాతరుణియావల జమదగ్నివాఁడు
బ్రాహ్మణి యని గణింపక తెంపుతోఁ బట్టి చంపఁడా భృగురాజు చక్రపాణి
నడతదప్పినయప్పుడె కెడపఁజెల్లు, బుధవితతి నైన యతి నైనఁ బోలఁతి నైన
దయదలఁప నీకునిటువంటి భయదబలలు, మనుపఁబిలచెల యబలయెమానుకులేశ.

నా విని యావినీతరిపునాముఁడు రాముఁడు కర్ణిపార్శ్వగా
దావిబుధారి నారి గుణమంటియు సంటకమున్న టంక్రియా
రావమునన్ ధనుర్గుణము రక్కసినొంచుట కచ్చరింప ర
క్షోవిసరాంగశోణితముఁ గ్రోలి మెఱుంగనికోల యేయుడున్. 77

— తాటకను రాముఁడు వధించుట. —

ప్రాణాహుతిగొనె నాశిత, బాణావలి యాతుధానభామినిపంచ
ప్రాణముల రావణాదిమ, కోణపసముదయము బుత్తిగొనుటను మొదలన్. 78

తాటక నీగతి శరహతి, గీటడఁచి నిశాటఝాటకీర్తికవాట
జ్యాటంకృతి యగురఘుపతి, యాటోపముఁ జూచి పొంగి రమరులు నింగిన్.

అంతటఁ గౌశికుఁడు గృశా, శ్వాంతికభృత జృంభకాది శస్త్రనికాయం
బంతేవాసికి రామున, కెంతే వాసిగ నొసంగె నింద్రునియాజ్ఞన్. 80

కౌశికుఁ డస్త్రదేశికుఁ డొకానొక దేశము సత్యలోకసీ
కాశముఁ జూపి యోరిపువిఖండన కంటివె నైగమాంతవా
ణీశరణీభవన్మునిమణీఖని నీవని నాశరేందిరా
నాశకళాపటుండు కుహనావటుఁ డున్నజనైకపావనిన్. 81

క్షితి నుదయంబుఁ జెంది బలిగిమునకున్ వడి వేరువాఱి యు
న్నత మగురూపుఁ బూని గగనస్థలి లోఁగొని యచ్చటం దరు
ప్రతతి చెలంగు లోకపరిరక్షకభిక్షుకచర్యఁ గన్న యా
మతకరిపొట్టిదిట్టమహిమంబు విడంబ మొనర్చుకై వడిన్. 82

— * విశ్వామిత్రుఁడు యజ్ఞమునకుఁ బ్రారంభించుట. * —

అని యిత్తెఱంగునం దరంగితామందమందాకినీవికచకనకారవిందమకరంద
నిష్యందమధురిమానర్ఘ్యంబును,సచిరసంకోచితప్రచురతరమార్గదైర్ఘ్యంబును,

నగునిజాలాపసరణిం దరణికులపావనుల వీనులకు విందు సంధించుచు మదాంధ సింధురపురంధ్రీకర్ణాంచలచలనసంచారితసమీరణనివార్యమాణ పంచాననద్వ్యాఘ్రకమధ్యాశ్రమం బగుసిద్ధాశ్రమంబునకు నేగి యాగాధినందనుండు యాగంబునకు నుద్యోగం బొనర్చి యున్న సమయంబున నంభోజినీకుటుంబబింబగోచరుం డగు హిమాచలకుమారికాసహచరశిరోభూషణం బైనయోషధీరమణుకతన భీతిలుచు వెలువడిన తద్గ్రాంతరాళవసదరాళతరకరాళహాలాహలంబు పోలికఁ ద్రిలోకీవిక్షోభకారియగు రక్షోబలారికి నగారం బైన తనదు నేరంబు పరిహరింప దాశరథి యై యున్న వెన్నునకు విన్నపంబు సేయింపఁ దదీయవంశకర్త యగువికర్తనుసమీపంబునకు యామునానుబంధంబునం జేరఁబోవులవణవారాశితీరున నఖండపటుకళాధూర్వహుం డై పర్వశర్వరిం గూడి క్రీడించుజాడ రేతేఁచు నాతోడివేడుకకు రాఁ డని యుపశమంబుతో హరిపదోపాంతసీమాసమాసన్న యగునమాయామినివిధంబున నంబరైకదేశంబునం ద్రిశంకుండు నివసించుటం జేసి నానాఁటికిఁ బ్రబలు నీచవాటిక నతిస్ఫూర్తి వర్తిల్లు దివాకీర్తిబృందంబుచందంబున దశస్యందననందనాగ్రణి మహోగ్రచాపప్రతాపకీలికీలాకలాపంబున నకూపారకుమారవిహారదమరారివీరవరశరీరపటలంబులం బుటంబు లిడుట కంభోరుహాకుమారుం డనునయస్కారుండు సంఘటించిన యింగాలసంఘంబుభంగి బంగరుగట్టుపట్టు కాఁ అడవి నిర్గమించుసౌవర్ణవాహినిజలావగాహంబునకు వచ్చు నుచ్చైఃశ్రవోవనస్తంబేరమకదంబకంబు డంబున, నిలింపసంపత్కలనుపారంపరుల కింపు సొంపు సంపాదించు రాత్రించరవధూటికాకోటకస్నిటియలజల్లి కాదికారణం బై, కౌశికారాధనీయచిత్రభానుప్రభానిరోధకం బైనధారాధరనికాయంబుసోయగంబున మహాబిలంబునం దుండియు మరుద్గ్రసనలాలసం బై తోఁచు మేచకాస్తోకదర్వీకరానీకంబువీఁక, నాకసంబున భయానకం బగుపలాదలోకంబు నాలోకించి కించిత్తైన ధైర్యంబు లేక యాకులం బైన యాజకసమూహంబు లితరేతరంబు నిట్లని గణియింపం దొడంగె. ౪౩

తపసులపాలిమృత్యువులు దైత్యులు వీ రిల నున్నవాళ్ళకుం
దప మని చేయఁ గూడునొ వ్రతం బని పట్టఁగ శక్యమో వితో
యిపు డిది యేటియత్నము వహించె వివేకవిహీనుఁ డైనయీ
నృపముని యంచుఁ గౌశికు వయిం గను నేరము లెంచువాగలుకా ౪౪

ఉ. హత్యకు రోయఁ జూతురె దురాత్మకులై చరియించురాక్షస
వ్రాత్యులు వీరివంక నగురట్లకుఁ దిట్లకుఁ బెట్ల కోర్చినా
ద్ధత్యవిశేష మెక్కడిది తాపసిబక్కల కింక మీర లా
ఘాత్యము చూప భూపతులు గారు చనుం డని యుక్కవారలున్. 85

మ. అరణుల్ పాత్రము లగ్ను లాస్తరణముల్ హవ్యంబులు న్నేరిరిం
డ రసాభాసత దోఁప దీక్ష కడముట్ట న్నోఁచెఁగా మౌని హ
ర్త్రీకారథుం డప్పుడె బాలుఁ డితఁ డని సందేహింపఁడా యూరకే
యరుదే నేటికిఁ జేతగానిపని కీమైత్రావకుఁ డన్వారలున్. 86

మ. మన మధ్వర్యుల మై కనం దగినసామ్రాజ్యంబు లే మున్న నీ
యనయజ్ఞంబున కేల వచ్చితిమి లెస్సాయెం గదా కూలిపో
యినయాగ్యాశ్రమము చాలు చాలు నిఁక హోమాత్యత్వముం బట్టుచుం బలా
యనపారాయణులైన ఋత్త్విజులు నై రిచ్చో ఘనాఘాగంసుకుల్. 87

సీ. కేల నున్మూలించి గిరిశృంగములు పూచి కాచినతరులపై నైచి నైచి
కన్నుల మిణుఁగురుల్ గ్రమ్మ నాశ్రమభూమి నెల్ల క్రొన్నెత్తురు చల్లిచల్లి
వడి ఖేచరుల నేలఁ బడ నీడ్చి సిగలూడ్చి కరములు పెడకేలు గట్టికట్టి
యట్టహాసము చేసి హస్తఘట్టనలతో నటునిటు పాతరలాడియాడి
గీ. నిండిరి నిశాటు లెడము లేకుండ మింట, వింట లే దిట్టిదుడుకు నీవింట నమ్ము
మనుపవే రామ యభిరామ యనుచు మౌను, లార్తి నెత్తిగింప లేనగ వంకురింప.

మ. విలు కేలం గొని రామభద్రుఁడు రణోర్వీం దమ్ముఁడుం దాను బె
క్కులకోరు ల్నిగిడించి రక్కసులముక్కుల్ చెక్కులుం గాళ్లు పి
క్క లురమ్ముల్ కరము ల్శిరమ్ములును బ్రక్క ల్డొక్కలుం చక్కు చ
క్కులు గావింప నిలింపు లెక్కు డని రక్కోదండపాండిత్యముల్. 89

గీ. కలితవర్ణాంతరుం డైనగాధిసూను
సహచరత నేమొకో నిజక్షత్త్రజాతి
కయినపిప్పలదండ మూనియుఁ బలాశ
దండకరుఁ డయ్యె నపుడు మార్తాండకులుఁడు. 90

శా. మారీచక్షణదాచరుం డవుడు రామస్వామితోఁ బోరికై
ధారంభించి తదీయమారుతశరవ్యాపారతూలీకృతా

చ కరువలి వారిమేనులును గౌనులుఁ గీల్జడలుం దొడ ల్నడల్
తఱులుఁ గురు ల్మరుల్గొలుపఁ దానిపు డెక్కడ సంతరించెనో
శరశత మైదుకైదువ్వులజంత యటంచు విరాళి కొగ్గి డ
గ్గఱుటయు రాచకూఁతురుల గాలికి గీలికి సోఁక శక్యమా. 99

చ. చులుకఁదనంబుఁ గోడిగముఁ జూపకు మోపవమాన మానినీ
తిలకములం గవుంగిటికిఁ దీసెద విట్టి విచార మాజడా
త్ముల దని పల్కగా డ్వలుకతో విరిఁబోండ్లయొడళ్లు వంపు దిం
పులుగొనరానిపెందెవ్రులుఁ బూంచె; నిశాంతముఁ జెంది రింతులున్. 100

చ. తనయలవాతచేష్టఁ గని తత్ప్రతికార మొనర్పఁ జూళినం
దనుఁ డగుబ్రహ్మదత్తునకుఁ దండ్రి యొసంగినఁ గన్యకామణుల్
నునుజిగిసానదేఱిన మనోజులకోరుల మించి రద్దిరా!
మునిసుతుఁ జెట్టవట్టుశుభమూర్తుల కెక్కడిగాలిసోఁకుడుల్. 101

మ. కుశనాభుం డల సోమదేయున కనుంగుంగూఁతులం బెండ్లి స
ల్పి శుభౌన్నత్యముఁ గన్నపిమ్మట జగత్ప్రేంఖోలికావర్తికీ
ర్తిశరచ్చంద్రసుధాపయోధి యగుగాధిం గాంచె నస్మద్గురుం
గుశసంజ్ఞుం డగుమత్పితామహుకృపం గోదండవిద్యానిధిన్. ? 102

గీ. అనుచు నిజవంశకథఁ దెల్పు నతనియుక్తి
రక్తిగనుచాయఁ గెంజాయ ప్రాచిడాయ
దినముఖవిధేయములు దీర్చి మనుకులీనుఁ
డనుజుఁడును దాను మునివెంట నవలఁ గదలి. 103

సీ. భవఫాలదృగ్వృత్తప్రవహత్తదీయకిరీటకోటిసుధాంశురేఖ యనఁగ
శైలాధిపాలానమూలకీలితసింధుగజరాజరజతశృంఖల యనంగ
నపవర్గమార్గసౌధారోహణాధారహీరమయాధిరోహిణి యనంగ
నతివేలసుకృతపక్షౌహూతిహేతుశారదవారివాహధోరణి యనంగఁ

గీ. గమలకువలయకహ్లారకుముదసాధు, సీధుమాధుర్యమేదురక్షీరమై భ
గీరథునిపాలి సౌరశృంగిణి యనంగ, మించు గంగాతరంగిణిఁ గాంచె నెదుట. 104

శా. హస్తాంభోదనిరస్తయాచనకథారాటచ్ఛటాదైన్యసా

# భాసనాటకములు.

ఇటీవలఁ గొన్నిసంవత్సరములనుండి తిరువాన్కూరు మహారాజుగారి ప్రోత్సాహమువలనఁ దిరువనంతపురముద్రణాలయమూలంబుగ ననేకము లగునపురూప సంస్కృతగ్రంథములు వెలువడుచుండుట యాభాషాధ్యేతల సుకృతపరిపాకంబని యెంచఁదగి యున్నది. ఇట్లు వెలువడినవాని నన్నింటను భాసమహాకవినాటకము లుపాదేయతమములు. "మాళవికాగ్నిమిత్ర" ప్రస్తావనలోఁ గాళిదాసుఁడు "భాససౌమిల్లకవిపుత్రాది" మహాకవులనాటకము లుండ, నవీనగ్రంథ మగు తననాటకము సభ్యులకు రుచించునా యని శంకించుచు నాశంకను,

> "పురాణ మిత్యేవ నసాధు సర్వం
> న చాపి కావ్యం నవ మిత్యవద్యం"

అని నివారించి యున్నాఁడు. ఇట్లిచ్చటచ్చట భాసమహాకవినిగుఱించి కొందఱు ప్రస్తావించి యుండుటచే నీతనిపేరు మాత్రము మనకుఁ దెలిసి యుండినది కాని యీతనిగ్రంథము లెవ్వియో తెలియకుండెను. మన యదృష్టవశముచే నిప్పు డీ మహాకవినాటకములు పదుమూఁడు వెలువడినవి. ఇతఁడు సుమా రిరువదినాటకములు రచించియుండునట్లు తెలియవచ్చుచున్నది. పదుమూఁడుమాత్రము లభ్యమై మిగతవి లభ్యము కామి విచారకరము. అలబ్ధము లగువానిలోఁ "గిరణావళి" యనునది యొకటి. ఇవి మనదేశమున నెచ్చో నైనను దాళపత్రములలో నుండు ననియే మానమ్మకము. అటు లుండునేని త్వరలో వెలువడునుగాక !

ఈమహాకవికాలమును గుఱించి విచారించుచు విమర్శకు లీతఁడు క్రీస్తుశకమునకు ముందు సుమారు నాలుగైదువందలయేండ్లక్రిందట నుండియుండవలయు నని యభిప్రాయపడుచున్నారు. ఈతని గ్రంథములలోఁ బాణినీయవిరుద్ధము లగు ననేకప్రయోగము లుండుటచే నీతఁడు పాణినిమహర్షికి సమకాలికుఁడుగనో లేక యాతని వ్యాకరణమునకుఁ బ్రాబల్యము గలిగిన కాలమునకు ముందుగనో యుండవలయు నని వారియభిప్రాయము. ఇతనినాటకములఁ జదివిన నీయభిప్రాయమే స్థిరపడున ట్లున్నది. ఆధునికనాటకసూత్రముల నీతనినాటకము లనుసరించినట్లు కానము. సూత్రధారప్రవేశానంతరమే మంగళాచరణము. "ప్రస్తావన" యనుటకుమాఱుగ నీతఁడు "స్థాపన" యని ప్రయోగించుచున్నాఁడు. స్థాపనలోఁ గవిప్రశంస యనునది లేదు. ఇటు లుండుటచే నొకవేళఁ బాణినిగ్రంథములచేఁ దెలియనగు గృశాశ్వ శిలాలీత్యాది ప్రాచీన నటసూత్రకారులమతము ననుసరించియే తననాటకముల నితఁడు వ్రాసియుండవచ్చు నని చెప్పఁదగియున్నది.

ఇతనివాక్కు సరళగంభీరము. క్లిష్టము లగునలంకారము లిచ్చట కానము. స్వభావోక్తులు మెండు. "స్వప్నవాసవదత్త"లో సాయంసమయమున ఋష్యాశ్రమమును వర్ణించుచు:

ఖగా వాసోపేతా స్సలిల మవగాఢో మునిజనః
ప్రదీప్తోగ్ని ర్భాతి ప్రవిచరతి ధూమో మునివనం।
పరిభ్రష్టో దూరాత్ రవి రపి చ సంక్షిప్తకిరణః
రథం వ్యావృత్యాసౌ ప్రవిశతి శనై రస్తశిఖరమ్॥

అనియు, "ప్రతిమా" నాటకమున శ్రీరాముఁడు ప్రత్యగ్రపూరితాలవాలము లగువృక్షములం జూచి సీతాదేవి సమీపముననే యుండు నని యూహించుచుండుతఱి,

భ్రమతి సలిలం వృక్షావర్తే సఫేన మవస్థితం
తృషితపతితా నైతే క్లిష్టం పిబంతి జలం ఖగాః।
స్థల మభిపతం త్యార్ద్రాః కీటా బిలే జలపూరితే
నవవలయినో వృక్షా మూలే జలక్షయరేఖయా॥

అని వర్ణించియున్నాఁడు. ఈవర్ణనాస్వారస్యము చదువరులకే తెలియును. ఇట్టి సరళగంభీరస్వభావోక్తుల కెన్నియో శ్లోకముల నుదాహరింపవచ్చును.

ఈతనినాటకములలో భాగవతము ననుసరించి "బాలచరిత" మనునదియు, రామాయణము ననుసరించి "అభిషేకనాటకము," "ప్రతిమానాటకము" అనునవియును, వత్సరాజకథ ననుసరించి "స్వప్నవాసవదత్త," "ప్రతిజ్ఞాయౌగంధరాయణము" అనునవియును, భారతము ననుసరించి "పంచరాత్రము," "మధ్యమవ్యాయోగము," "దూతవాక్యము," "దూతఘటోత్కచము," "కర్ణభారము," "ఊరుభంగము" అనునవియును గలవు. ఇవికాక "అవిమారకము," "చారుదత్తము" అనునవి స్వకపోలకల్పితకథాంశము లని తోఁచుచున్నవి. భారతకథ ననుసరించినవానిలోఁ గొన్ని భారతకథాపురుషుల నధికరించి యున్నను కథాసందర్భమునమాత్రము భారతకథాభిన్నము లై యున్నవి. ఇట్లు "ప్రతిమానాటకము"నఁ గూడ రామాయణకథాభిన్నము లగు ననేక కథాంశములు గలవు. రామాయణకథ ననుసరించిన నాటకము లయోధ్యాకాండము మొదలు యుద్ధకాండపర్యంతము కథను జెప్పుటచే, బాలకాండకథాభాగమును నొక "బాలచరిత"మున నితఁడు వ్రాసియుండవలయు నని శంకింపఁదగి యున్నది.

ఇతని యేకాంకనాటకములలో "ఊరుభంగము"ను, ఇతరములలో "అవిమారక" "ప్రతిమా" నాటకములును ప్రశస్యతమము లని మాయభిప్రాయము. "ఊరుభంగము" లోని దుర్యోధనపాత్రము గాంభీర్యనిధి. వ్యాస మహర్షి దుర్యోధనుని దౌరాత్మ్యనిధి యని నిందాపాత్రునిఁ జేసెను. భాసమహర్షి యాతనినే గాంభీర్యనిధి యని శ్లాఘాపాత్రునిఁ జేసియున్నాఁడు. "ప్రతిమా" నాటకములోని సీతాపాత్రము సహృదయహృదయాహ్లాదకర మని ప్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు.

కాళిదాసాదు లనేకస్థలముల నితనిపద్ధతి నవలంబించి యుండునట్లు వీరి నాటకముల విమర్శించినఁ దెలియనగును. అభిషేకనాటకమున రావణుని యశోక వనికను వర్ణించుచు,

"యస్యాం నప్రియమండనాపి మహిషీ దేవస్య మండోదరీ
స్నేహా ల్లుంపతి పల్లవాన్ ... ... ..."॥

అనిభాసుఁడు చెప్పియున్నాఁడు. దీని ననుసరించియే కావలయు కాళిదాసుఁడు గూడ శాకుంతలములో,

"నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవం."॥

అని చెప్పియుండునట్లూహింపఁ దగి యున్నది. ఇతని "చారుదత్త"మును మూలాధారముగ నుంచియే శూద్రకుఁడు మృచ్ఛకటికను జేసియుండు నట్లనేకశ్లోకములును గథాసందర్భములును సూచించుచున్నవి. మహాకవు లిట్లు భాసనాటకములఁ గొంత యనుసరించియుండుటచే వారల ప్రతిభావిషయమై మనము సంశయించుట పురోభాగికృత్యము. వారి గ్రంథములలోఁ బరకీయాంశము లుండినను వానిని దమప్రతిభాబలముచే వారెంతయో వృద్ధిపఱచి యున్నవారు. కనుకయే కాఁబోలు వీరిగ్రంథములముందు భాసమహాకవిగ్రంథములు ప్రచారవిహీనము లై యణఁగి యుండినవి.

ప్రకృత మీతనినాటకములలోఁ గొన్నిమాత్ర మాంధ్రీకరింపఁబడినట్లు తెలియుచున్నది. మిగిలినవియుఁ గూడ నాంధ్రీకరింపఁబడె నేని మనవాఙ్మయంబున కలంకారంబుగ నుండు ననుటకు సందియము లేదు.

**తిరుపతి.** **కపిస్థళం - కృష్ణమాచార్యులు.**

శ్రీరస్తు

# నిజాంరాష్ట్రాంధ్రదేశస్థితి.

---

. వరకాకతీయాన్వవాయపారావారపరిపూర్ణకళ్యాణబాంధవుండై
శ్రీత్రిలింగాహ్వయోర్వీమండనైకశిలానగరీసుహేలాధిపుండై
సతతసంప్రణతక్ష్మాభృదతులరత్నకిరీటకిరణనీరాజితాంఘ్రిద్వయుండై
గరిదానధారావిసరపరీమళమిళన్మహనీయకోశిమముం బెరుంచి

తే.గీ. భూరిమహిమోన్నతస్వయంభూపరివృఢ, పాదసరసీరుహద్వరేఫాయమాన
మానసుండు ముమ్మడంబాగసూనుండైన, భద్రగుణుండగుశ్రీవీరరుద్రుండలరె.

సీ. తనశౌర్యరవిధగద్ధగితకాంతి కమిత్రతరుణీశిరోరుహాతమము డించదం
దనమహాధైర్యభూధరమున కన్యభూధరపాదభూధరోత్కారము గుందదం
దనమహోదారతాస్తనయిత్నువున కర్థిబర్హిణాళిప్రమోదభరముం బెందదం
దనకీర్తిచంద్రాంశుతతికి నానాయోషిదాస్యకైరవము లాహ్లాద మొందద

తే.గీ. భద్రగుణముద్రితాత్ముండౌరుద్రుండనంగం, దనరె లతశతమన్యువిస్తారవిభవుం
డప్రమేయుండు శ్రీకాకతిప్రతాప, రుద్రదేవుండు కరుణాసముద్రుండెలమి. 2

క. అన్నమదేవనామకనృపాగ్రజుండైనప్రతాపరుద్రుండ
త్యున్నతసత్కవీంద్రుల కనూనధనాదు లొసంగి ప్రీతిసం
పన్నులంజేసి మేలగుప్రబంధములన్ వెలయింపంజేసి వి
ద్వన్నికరంబు మెచ్చ వసుధం బరిపాలన చేసె వాసిగన్. 3

శా. గాంగోత్తుంగతరంగమంగళమృదంగధ్వానభంగీసమా
లింగద్వాగమృతప్రవాహభరకేళీలోలుండై సంతతో
త్సంగప్రస్థితవీరరుద్రుండగువిద్యానాథవిద్వాంసుండో
రుంగల్నామపురంబునం దలరె నార్యుల్ పూర్వు లౌరౌరా! యనన్. 4

మ. ఉరుసారస్వతవాహినీవిహరమాణోద్యత్కవుల్ సత్కవుల్
నిరతానందదసంస్కృతాంధ్రకవితానిర్మాణకర్మోద్ధతుల్
గురుకల్పుల్ త్రిపురాంతకాదికవిముఖ్యుల్ పూర్వమం దోరుగల్
పురమందున్ వసియించి కాంచి రట తద్భూపాలసన్మానమున్. 5

ఉ. అక్కన బయ్యనల్ కుటిలులై మనుమావనిపాలుఁ దోలుడుం
దిక్కనయజ్వ యాగణపతిప్రభుపాలికి రాజుపంపునన్
గ్రక్కున వచ్చి కాకతిధరాతలనాథున కాత్మపాండితీ
ఫక్కికఁ జూపి యాతనిసపర్యలఁ గాంచె సమంచితంబుగన్. 6

చ. విపులరసప్రపూర్ణబహువిశ్రుతకావ్య పురాణకల్పనున్
ద్విపదకవిత్వతత్త్వఘను ధీమహితున్ సకలాగమజ్ఞు గ
ర్వపదగతాత్ముఁ బాల్కురికివంశజు సోమకవీంద్రు నీనిజా
ముపృథివిగాంచి యెంతయు నమోఘయశమ్ము సతమ్ముఁ జెందెఁ దాన్. 7

ఉ. భట్టవరేణ్యుఁ డైనహరిభట్టు నిజాముననుండు కంబపున్
మెట్టను సద్విధానపరమేశ్వరకీర్తి గడించి పాపముల్
మట్టఁగఁ జాలుసట్టి యలమత్స్యవరాహపురాణముల్ రసం
బుట్టిపడన్ రచించి బహుళోపకృతిం బొనరించె బాసకున్. 8

సీ. బమ్మెర యనుపేరఁ బరఁగుగ్రామం బోరుగల్లుచెంగట నె రాజిల్లుకతన
నారయకవి యింటిపేరైన యావెలిగందల యచ్చోటఁ గలుగుకతన
మానసీమైకశిలానగరీనామ మల్లయోరుగల్లున కలరుకతన
నూరూరవసియించు శ్రీరామునకు భాగవతమంకితంబుగా వఱలుకతన
తే.గీ. సహజపాండిత్యఘటితవిశాలయశుఁడు
పోతనామాత్యవర్యుండు బుధహితుండు
శ్రీనిధాన మనందగు మానిజాము
దేశమున నుండువాఁ డని తెలుచుండె. 9

శా. విద్వద్వర్యుల నేఁటికిం బెరిమెమై వీక్షించి పూజించు నా
గద్వాల్ మనుతద్ధరాధిపునియాజ్ఞం బ్రాజ్ఞవర్యుల్ మహా
ముద్వారాశినిఁ దేలఁ గావ్యనివహమ్ముం జేసెఁ గాణాదశ్రీ
సద్వంశ్యుం డగుపెద్దనార్యముఖ భాషాయోషకున్ భూషగాన్. 10

మ. కనఁగా నింక నిజామునన్ మెదుకుదుర్గం బంటియున్నట్టి బి
క్కనవోలందున మల్లరెడ్డి కవిజోకన్ శైవధర్మోత్తర
మ్మును బ్రహ్మోత్తరఖండపాద్మములుఁ దామ్ముం జేసియున్నట్లు త
ద్ఘనవంశ్యుల్ దెలుపంగ నిత్తఱి నెఱుంగన్ వచ్చెడిన్ హెచ్చుగన్. 11

మ. లలిఁ జెన్నారెడియా "కరీంనగరుజిల్లా" యందు శ్రీకుందవ
ఝ్ఝులగోపాలకవీంద్రుఁ డంచితవచస్సారం బపారంబుగాఁ
జెలఁగం గృష్ణసుజన్మఖండము రచించెం గావె పూర్వంబునం
దెలుఁగుంబాస యొయారికిన్ సొబగు నెంతేఁ జేకుఱంజేయుచున్. 12

సీ. అరవిందములయందు నిరవొందు నెలదేఁటి జిల్లేళ్ళపాలయి చెడినయట్లు
ఎసలారుబిసములన్ మెసవుకాదంబము బబ్బూరములపాలఁ బడినయట్లు
దొండపండులదండ నుండుకీరము వేపకాయలం దినుగతిఁ గాంచినట్లు
తొగరైన చిగురాకు లొగిమెక్కుకోయిల చిగిరింతపాలయి పొగిలినట్లు
తే.గీ. పూర్వ మత్యంతవృద్ధిచేఁ బొదలుశ్రీనిజామునం దున్న యాంధ్రదేశంబు కాల
వశమునను బ్రస్తుతము దురవస్థఁ జెంది, దేవురింపఁగవలసెఁ గా దిక్కుమాలి.

మ. తొలి నైజాము తెలుంగుదేశ మదియెందున్ లోటులే కెల్లవి
ద్యలకుం దావలమై కవీంద్రులకుఁ బ్రాపై పార్థివశ్రేణికిన్
నెలవై సౌఖ్యదమయ్యె నంచు నిపు డెన్నే నెంచుటల్ లంకణం
బులలో మన్గడుపుం దలంచినక్రియం బుట్టించు బల్ సిగ్గులన్. 14

ఉ. ఎక్కడనేని గవ్వకును నించుకతక్కువ యైనవా రహో
యిక్కడ శ్రోత్రియుల్ బుధులు సిద్ధపురాణకథాప్రవీణులుం
జక్కని గాయకుల్ కవులు సారవచోవిభవాభిరాము లై
యెక్కుడుకీర్తిఁ గాంతు రిపు డింతటిదుర్గతి పట్టె బిట్టుగన్. 15

చ. "గొదకొని పల్లెకూటమునకుం జనకుండిన ముందు నీ వెటుల్
బ్రదుకఁగనేర్తు వోరి వెధవా" యని బాలునిఁ గొట్టిరేని నన్
వదలుఁడు గోలకొండ చని వందలు వేలు గడించువాఁడ నన్
బదులువచించు నట్టిగతి పట్టెను దీనికి దైవవంచనన్. 16

సికందరాబాదు (దక్కన్) చిపుకుల వేంకటాచలశాస్త్రి.

# రావూరి సంజీవరాయకవి.



ఈకవిచే రచింపఁబడిన రుక్మిణీపరిణయ మనుపద్యకావ్యము నే నీనడుమ బాపట్లతాలూకా పుసులూరు గ్రామమునకుఁ బోయినపుడు తత్కవిదౌహిత్రపౌత్రులు నాకొసంగి యాగ్రంధమునకు సంబంధించిన కొన్నివిషయములను వినిపించిరి. అంత దానినిఁ జూచి తద్గ్రంధకర్త మనయాంధ్రలోకమున కశ్రుతపూర్వుఁడు గా నున్నాఁ డని తలఁచి యాతనివిషయమును నించుక వ్రాయ బుద్ధిపొడమ నిట్లు వ్రాయుచున్నాఁడను. ఇందలి తప్పుల మన్నించి యొప్పులఁ జేకొనవలయు నని విద్వాంసులను బ్రార్థించుచున్నాఁడ.

కవిజన్మస్థలము:—తెనాలితాలూకాకు సమీపమున నుండు చినరావూరో, లేక, పెదరావూరో, యైయుండుటంబట్టి యేతత్కవికి "రావూరి" వా రని గృహనామధేయము కలుగుటకు వలనయిన దనితోఁచెడిని. ఈయభిప్రాయమును బలపఱచుటకుఁ బైకవిచే రచింపఁబడిన త్రివిక్రమవిలాసములోని సీసపద్యమందుండెడిగీతపద్య మొకటి ప్రమాణము కాఁగలదు. చూడుఁడు,

గీ. "భళిభళీప్రాక్కవులరీతిఁ బ్రస్తుతింపఁ, దగిన వాఁడవు రావూరునగరధామ
పృథుగుణాలలామ గుర్వనపెద్దమాంబ, సుదతినందన సంజీవసుకవిసోమ.

ఈపద్యమందున "రావూరునగరధామ" యనినందువలనఁ బైయభిప్రాయము సరియైన దని దృఢ మగుచున్నది. కొందఱు బెజవాడకుఁ జేరువ నుండు మందడ గ్రామము తత్కవిజన్మస్థల మని నుడివెదరు కాని యందులకుఁ దగినప్రమాణ మొకటికూడఁ గనుపడకపోవుటచే నద్ది విడువవలసిన దనియె నాభావము. కాని యీమందడగ్రామము కవి జన్మస్థలము కాకపోయినను దద్వంశజు లిప్పటికిని దద్గ్రామమం దుండుటంబట్టియుఁ దత్కవిదౌహిత్రపౌత్రులు నాకుఁ జెప్పినసంగతిసందర్భములంబట్టియు నాకవి వాసస్థల మని మాత్రము చెప్పుటకొప్పుచున్నది.

కవికాలము:—ఈతనిజన్మకాలమును గుఱించి వ్రాయుటకు నెక్కువ ప్రయాసపడ నక్కఱలేదు. కారణ మేమన, ఈకవిచే రచింపఁబడిన "కొలనుపాకశతకము" అనుమాఱుపేరు గల "వీరనారాయణశతక" మందు,

సీ. గుణబాణషట్చంద్రగణనతో శాలివాహనశకవర్షంబు లరుగ వర్త
మానవిరోధికృన్మార్గ శీర్షాదిమపక్షతృతీయలా భానువాస
మునకు సంపూర్ణ మై తనరిన యీకృతి—

అనిచెప్పియున్నాఁడు. దీనింబట్టి శాలివాహనశకము 1653 సంవత్సరమునకు సరియగు విరోధికృన్నామసంవత్సర మార్గశీర్ష శుద్ధ తృతీయాభానువారమున వీరనారాయణశతక మనుదానిని రచించి ముగించినట్లు తెలియవచ్చినది. అనఁగా నీశతక మిప్పటికి 184 సంవత్సరములక్రిందట రచించినట్లు తెలియవచ్చినది. కాని యింతకును గవికాలనిర్ణయము కాలేదు. రుక్మిణీపరిణయము ద్వితీయాశ్వాసాంతమందు నీకవి—" శకమజ ఖషీందు సంఖ్యను దగుపరాభవ రాధ పూర్ణిమాభాను తిథిని." అని చెప్పియుండుటచే శాలివాహనశకము 1709 సంవత్సరమునకు సరియగు పరాభవనామసంవత్సర వైశాఖశుద్ధ పూర్ణిమాభానువారమున నీరుక్మిణీపరిణయ మనుప్రబంధమును ముగించినట్లు స్పష్టమగుచున్నది. వీరనారాయణశతకము వ్రాసినతరువాత 56 సంవత్సరములకు రుక్మిణీపరిణయము రచించినట్లు తేలినది. అనఁగా నిప్పటికి 128 సంవత్సరములక్రిందట రుక్మిణీపరిణయముఁ గావించినట్లును, 184 సంవత్సరముల క్రిందట వీరనారాయణశతకమును రచించినట్లును, వ్యక్త మైనది. ఈకవి వీరనారాయణశతకము వ్రాయునప్పటికి 20 సంవత్సరములవాఁడైన నుండవలయును గదా. ఈపైదాని నంతను బట్టి చూడఁగా నీకవి రమారమి 200 సంవత్సరములక్రింద జన్మించినాఁడని స్పష్ట మగుచున్నది.

కవికుటుంబము :—దీనిగుఱించి తెలిసికొనుట కీకవిచే రచింపఁబడిన రుక్మిణీ పరిణయములోని 29 వ పద్యము ముఖ్యముగాఁ దోడ్పాటు కాఁగలదు.

సీ. శ్రీకృష్ణపదయుగాశ్రితుఁడు సాంఖ్యాయనగోత్రుఁడు రఘుపతిపౌత్రుఁడు గురు
వకవీంద్రపెద్దమాంబాపుత్రుఁడు రఘునాథునకుఁ బూర్వజుఁడు మృత్యుంజయునక
నుజుఁడు రావూరివంశజుఁడు హనుమకొండసంజ్ఞను గలయాదిశాఖను వెల
సినవాఁడు.

అనిచెప్పియున్నాఁడు. దీనివలన నీకవి తల్లి పెద్దమాంబ, దండ్రి గురవకవీంద్రుఁడు. తాత రఘుపతి, అన్న రఘునాథుఁడు, తమ్ముఁడు మృత్యుంజయుఁడు ననియు, హనుమకొండ ప్రథమశాఖ యనియు, సాంఖ్యాయనగోత్రుఁ డనియు, విదిత మగుచున్నది. మఱియు శ్రీకృష్ణునియందు భక్తికలవాఁ డని స్పష్ట మగుచున్నది.

కవివిద్యాప్రాప్తి:—దీనినిగుఱించి కవిగారి బంధువులు మొదలగువారు చెప్పినయంశములను వ్రాయుచున్నాఁడను. ఈకవి బాల్యమందుననే గృహము నుండి వెడలి విద్యార్జననిమిత్తమై యచ్చటచ్చటఁ బర్యటనం బొనర్చుచుఁ, దుట్ట తుదకు ఘనతఁ జెందిన శ్రీనైజామువారి దొరతనమువారి పరిపాలనలో నున్న భువనగిరి (భోన్‌గీర్) తాలూకాలో నొకసామంతరాజుండెడివాఁ డనియు, నాయన యాస్థానమందు గొప్పపండితుం డొకండు గలండనియు, విని యాయనదరికిఁ జని యాతనిపాదపంకజములకు భయభక్తులతో దండప్రణామంబు లాచరించి "గురువరా"! విద్యార్థినై తమకడకు వచ్చితిఁ గాన విద్య నఱమఱలేక యఱిముఱిగా నొసంగి కరముదీవింపవలయు నని ప్రార్థించె నఁట. అంత నప్పండితుఁ డందుల కంగీకరించి శుభముహూర్తంబున విద్యఁ బ్రారంభించె నఁట. చదివినదానిని మఱలఁ జింతనఁజేయ రాతిరిపూఁట నింటింటఁ దిరుగుచు నెక్కడనో యొక్కయిక్కను జేరి చదువుకొనుచుండెడివాఁ డఁట. ఇట్లు కొంతకాలము గడచినది. అటులే యొక దినమందు రాతిరి దీపము గలిగినచోటునకై గ్రామ మంతయుఁ దిరిగి ప్రతిగృహస్థునిచే మాయింట దీపమున్నను మీరు చదువుకొనుటకుమాత్రము వలనుకా దని చెప్పఁబడినవాఁడై చింతాక్రాంతస్వాంతుం డై యుండ నింతలో నుత్తరమున నుండుశ్మశానమునందుఁ బెద్దవెలుఁగు తత్కాలినయనములకుఁ గనుపడెను. దానిని జూచి హర్షోత్కర్షమనస్వియై యావెలుఁగుదరికిఁ జిటికలోఁ జేరి తనపాఠములను బఠనచేయఁ బ్రారంభించెను. తత్సమయముననె యాయూర నుండురాజుగారు తనరమ్యహర్మ్యమం దెక్కి యటు నిటుఁ జూచుచుండఁగా నీశ్మశానమందుం డెడి వెలుఁగును నచటనె పద్మాసనము వేసికొని స్వస్థచిత్తముతోఁ జదువుకొనుచున్న బాలుని గాంచి దుర్భ్రమఁజెంది దిగు లొంది "ఏమిరా"! నేనెంతకఠినాజ్ఞ నొనరించి పిశాచములను బ్రయోగించుట మాన్పఁ బూనినను మానకపోవుటయె కాక మీఁదుమిక్కిలి శుక్లపక్షచంద్రునిమాడ్కి దినదినము వృద్ధియై జనులకుఁ గీడులఁ గలుగఁజేయుచున్నవే యని చింతించి తనభృత్యవరులను బిలిపించి యామొలికిమిట్టయందుఁ బ్రయోగముల నొనరించు నాబాలకు నీడ్చుకొని వచ్చి కారాగారమున నుంపుఁ డని చెప్పి పంపెను. వార లట్లె యొనరించిరి. అంతఁ బ్రాతఃకాలమున రాజుగారు కొలువునఁ గూర్చుండి యాచిఱుతనిఁ దీసికొని రమ్మని తనసేవకులను బంపెను. అంత వారాపిల్లవానిని బట్టుకొని వచ్చి యాతనికట్టెదుట నిలువఁబెట్టిరి. ప్రభువు పిల్లవానిచేతిలోనుండు పొత్తములను

సుకుమారభావమును గాంచి "నిన్నరాతిరి పిత్రుననము దేమిచేయుచున్నా" వని యడిగెను. మీయాస్థానము దుండుపండితులయొద్ద జదువుకొనిన పాఠములను పచటివెలుఁగునఁ జింతనచేసికొనుచున్నాను. ఇవియే రఘువంశము, మొదలైన పాఠపుస్తకము లని బాలుఁడు చూప నాప్రభువు తనసంస్థానపండితు నడుగ నతఁడు సరియని పలుక నెద మెచ్చి యిచ్చమెయి నాపిల్లవానికి భోజనమజ్జనాది సదుపాయములఁ గుదిర్పించి పంపించెను. అట నటులొకుఖ్జాఁడు చదివి గొప్పపండితుఁడై తిరిగి స్వదేశమునకు రావలయు నని వచ్చుచుండఁగా మధ్యమార్గంబునఁ గొలనుపాక యనుగ్రామముఁ జేరనలసి వచ్చెనఁట. ఆయూరిబైట వీరనారాయణస్వామివిగ్రహ మున్నట్లును, దాని భూమినుండి తీయఁదలఁచినను రానట్లును, దానిని గాంచి యాగ్రామము దుండునొకజమీందారుఁడు చింతించుచుండ నీకవి యా విగ్రహముదరిఁ జేరి యావీరనారాయణస్వామి మీఁద శతకముఁ జెప్పఁగా నాస్వామి కనుగ్రహము గలిగి యావిగ్రహ మివతలికి వచ్చినట్లును, నందుపై నాజమీందారుఁ డీకవిని మెచ్చుకొని "మీకేమికావలయు" నని యడుగ నితఁడు, "మా స్వగ్రామము సేరువఱకు నడుమనుండు నొక్కొక్కగ్రామములో నొక్కొక్కకుచ్చెల భూమి నిప్పింపవలయు" నని కోర నాజమీందారు డావిధముగనె యిచ్చినట్లును, మొత్తముమీఁద నీకవిస్వగ్రామము సేరువఱకు 24 కుచ్చెళ్లభూమి సంపాదించినట్లును, నందున నిప్ప డుండు నాకవిమునిమనుమలు కొంతభూమి పోఁగొట్టినట్లును, దెలియవచ్చుచున్నది.

ఈకథవలన నైజాము దేశమునందు విద్యనభ్యసించినట్లును, వీరనారాయణశతకమును గొలనుపాక యనుగ్రామమున రచించినట్లును, మఱియు దేశ సంచారమొనర్చి భూసంపాదనఁజేసినట్లును వ్యక్త మగుచున్నది.

కవికృతగ్రంథములు :—ఈ సంజీవకవి తనరుక్మిణీపరిణయములో నీ విధముగాఁ జెప్పికొనియున్నవాఁడు.

"జాతకసిద్ధాంతముఖకళాచతురుఁడు, విరచితబహుకావ్య వీరనారాయణాది
శతకదండకసంస్కృతసరసపద్యగేయపదుఁడైన సంజీవరాయఁసుకవి."

దీనింబట్టి యీకవి జ్యోతిశ్శాస్త్రమందుఁ గూడ నేర్పరి యనియు, ననేకకావ్యములను, వీరనారాయణశతకము, దండకములు మొదలైనవానిని రచించినాఁ డనియు సంస్కృతభాషయందుఁ గూడఁ గవిత్వముఁ జెప్పఁగలవాఁ డనియు, నెల్లరకుఁ దెల్ల మగుచున్నది. ఈపద్యమందు రచియించిన గ్రంథములను గుఱించి చెప్పనప్ప

డిదివఱకు నేను సందర్భోచితముగాఁ జూపిన త్రివిక్రమవిలాసమును నెత్తుకొని చెప్పకపోవుటచేఁ దద్గ్రంథ మీకవికృతము కా దని తెలియవచ్చుచున్నది. కాని యీకవి దౌహిత్రపౌత్రు లగు గంధం చలమయ్యగారు చెప్పినదానిం బట్టియు నీ పద్యమందుననె "బహుకావ్య" యని చెప్పియున్నను నొక రుక్మిణీపరిణయము మాత్రమె మనకనులకుఁ గనఁబడి తక్కినవి కనఁబడకపోవుటంబట్టి యింకను దత్కవికృతప్రబంధములు కొన్ని యుండవచ్చు నని చక్కనియూహ జనించుటను బట్టియు, నాకొన్నిటిలోనీత్రివిక్రమవిలాస మొక్కటియై యుండవచ్చు ననియు నది నామావశిష్ట మైనను నీసంజీవకృత మనియుఁ దోఁచెడిని. ఈకవి రచించినగ్రంథములలో రుక్మిణీపరిణయముఁ జేర్కొనియున్నాను. కాని యీరుక్మిణీపరిణయములోని ప్రతి యాశ్వాసాంతగద్యమందుఁ జెప్పినదానింబట్టి రుక్మిణీపరిణయ గ్రంథకర్త సంజీవకవి కాఁ డని తోఁచును. కాని దానికిఁ గారణసహిత మగుసమాధాన మవధానిశిరోమణీత్యాది బిరుదాంకితు లగుశ్రీకాశీకృష్ణాచార్యులవారు తద్గ్రంథపీఠికయందు వ్రాసియున్నందునఁ దద్విషయ మిచట విస్తరింపఁ బూనుకొనలేదు.

కవికవితారీతి:—ఈకవి కవిత్వము పటుత్వముకలదై మూఁడువంతులు సాంస్కృతికపదములును, నొకవం తాంధ్రపదములును గలదై, శైలి ప్రౌఢమై వర్ణనములు హృదయంగమములై విషయములు సుమనోమనోజ్ఞములై యలరారుచుండును. ఈకవి తనగ్రంథమందుఁ జతుర్విధ కవితారీతిఁ జూపించియున్నాఁడు. ఈరుక్మిణీపరిణయమందు నేకాక్షరద్వ్యక్షరార్ధభ్రమర సర్వభ్రమరాది వివిధపద్యములును గలవు. అందు సర్వభ్రమర కందపద్యమును జూపెదను.

క. దామదకరిభానవశర, సామరమాభూతనయ దశరథకుమారా !
రామాకుధరశదయనత, భూశారమసారశవన భూరికదమదా.

ఈపద్యమును జివరనుండి మొదటివఱకును, మొదలనుండి తుదివఱకు నొకసారి చదివిచూడుఁడు. ఇట్టిచిత్రపద్యము లెన్నియేని కలవు. ఈకవి వ్యాకరణవేత్త. ఇతఁడు తాను రచించిన గూఢపద్యముల కర్థమును సవిగ్రహముగా సంస్కృతభాషయందు వ్రాసియున్నాఁడు. ఈగ్రంథమందు నాగూఢపదార్థదీపికను బూర్తిగాఁ బ్రకటించి యుండలేదు. కారణము తెలియదు. ఈ రుక్మిణీపరిణయమందచ్చటచ్చట మీననేత్రి, పద్మనేత్రి, యని వాడియున్నాఁడు. ఈకవి వ్యాకరణవేత్తయయ్యు ని ట్లేల యుపయోగించెనో తెలియదు. లేక లేఖకప్రమాదమేమో. మొత్తముమీఁద నీ గ్రంథము విద్యార్థులకు ముఖ్యపాఠ్య మని నాయాశయము.

ఇట్టి ప్రౌఢగ్రంథమును బ్రకటించిన శ్రీమైదవోలు వెంకమ్మ, మాఱెళ్ల బసవమ్మగార్లింతయుఁ బ్రశంసనీయులు.

ఇటులనె యిట్టిగ్రంథములు దొరకినచో వానిని ముద్రింపించి జగమున వ్యాపింపఁజేయవలయును. తమకుఁ గలిమి లేమి గాని బడలికవలసఁ గాని శక్తిలేనిచో నాంధ్రభాషోద్ధరణము గావింప నడుకట్టి వెలయుచున్న యాంధ్రసాహిత్య పరిషత్తునకు నిచ్చి కృతకృత్యు లగుట శ్లాఘ్య మనుహెచ్చరికతోఁ బ్రార్థించి యీ వ్యాసమును ముగించుచున్నాను.

శికింద్రాబాదు. చిలుకూరి అప్పయ్యశాస్త్రి.

# ప్రకృతి—చైతన్యము.

—

మ. జడసంయోగముచేతఁ జేతనపుఁదేజం బైహికామోదముం
గడనం జేయుటయందుఁ దత్పరతయుం గైవల్యమానందముం
గడనం జేయుటయంద వాంఛగల నానాజీవకోటుల్ జనిం
చెడి నేశక్తికతాన నయ్యదియె నాచిత్తంబునన్ నిల్చుతన్. 1

ఉ. అంచిత మైనశాంతి కిర వయ్యెడు నోసకలాంతరాత్మ! ప్రా
పంచికఘోషయందునను భవ్యము నైనభవత్ప్రశాంతి సం
ధించు టెఱుంగఁగా ననుమతింపుము; శోకవికారముల్, బ్రయ
త్నించెడుశక్తి నాకు ననధీనముచేసి యనుగ్రహింపుమా. 2

మ. "కలదే దైవముగాని యిప్ప్రకృతికిం గర్తృత్వముం జేకొనం
గల వేఱొక్కఁడు శక్తిగాని, కలదే గన్పట్టదే" యంద్రు, క
న్నులకుం గన్పడ కెన్ని లే వది యటుండుంగాక కాలుష్యసం
కలితుల్ స్వచ్ఛపుఁబ్రేమ లేక యెటులం గాంచంగలా రాతనిన్. 3

మ. జగ మేరీతి సృజియింపనేటి కణులేశంబుల్ హఠాత్సంగముం
బగుటన్ సృష్టికిఁ గారణం బనుదు రౌరా! బుద్ధిజాడ్యంబు; ఎ
ట్లగునొక్కొ జడజాతికిం గదల, నన్యావస్థలం జెందఁగా
స్వగతం బైనసుశక్తి చేతనపుసంబంధంబు లేకుండఁగన్. 4

మ. భగవంతుండు స్వకారణం బనుచు సంభావింపఁగాఁబోక త
ద్భగవంతుండు కలండు, చూపుఁ డీక నేతత్ప్రష్ట తత్స్రష్టనం
చుఁ గుతర్కంబులఁ బ్రజ్ఞఁజూపుదు రహో శోభాకరం బౌప్రశ
స్తగతిం దక్కి స్వవాదమందు ననవస్థాదోషముం జూడకే. 5

మ. ప్రకృతిం జిత్రము నాత్మ లీన మొనరింపంజాలు తత్సర్వరం
జకసౌందర్యమహత్వ మింకఁ దదవస్థాభేదముం జూచి యి
ప్ప్రకృతిం జేసినకర్త యుండుట తలంపంబోవ రాఁగాదె కా
రకుఁ డౌవాఁ డొకఁడుంట కర్తృత కవార్యం బంచు గుర్తింపమిన్. 6

మ. అతిచిత్రంపుద్విపాదజంతు వగు నౌరా యిమ్మనుష్యుండు స్వ
ల్పతరం బైన స్వకీయశక్తిమెయి నిర్లక్ష్యంబుగా సృష్టిసం
గతులుం దల్లయకారణంబులును దుర్గ్రాహ్యంబులైనట్టిసం
గతు లైనం దెలియంగలాఁడ ననుచుం గర్వంబు సూపించెడున్. 7

మ. తెలియుం డొక్కయమోఘ మైయెసఁగుశక్తిన్ గుహ్యమే యైన ది
క్కుల నన్నింటను వ్యాపకంబయినఁ దజ్ఞుల్ శంక, నైర్లక్ష్యమున్
మిళితంబైన స్వభావు లై కనరు దేనిన్ దేనికాజ్ఞానుబ
ద్ధుల మై యుండమి పాప మద్ది భగవంతుం డంచు నెంచం దగున్. 8

మ. అమితాశావశు లై ప్రపంచకసుఖవ్యాసక్తిమై నద్ది తు
చ్ఛమునున్ వ్యాకులమిశ్రితం బనియు నెంచంబోక తాత్కాలిక
ప్రమదం బిచ్చెడుదాని కాత్మసుఖముం బాటింపకున్నారు స్వ
ప్నము సత్యంబుగ, సత్యముం గలఁగ సంభావించుచున్నా రహో. 9

మ. అతిదుఃఖప్రద మైనసంగతుల నత్యానందముం గూర్చుసం
గతులం జేసెడి నెప్పుడేనియు వృథాగాఁ బోదు తత్సేవ, సం
తతసౌఖ్యాకర మద్దియే ప్రణయ మేతద్దైవికానంద మ
ర్పితమై నాదగునాత్మ కింకఁ బరిపూర్తిత్వంబు చేకూర్చుతన్. 10

చ. మరణ మవార్య మా నసెడిమాట నిజం బని లో నెఱింగియున్
మరణముమాట యించుక వినంబడినన్ వికలత్వ మంది దు
ర్భర మగువేదనం బడుట ప్రాజ్ఞుల కౌనె? శరీర మన్న మా
టరసినఁ జచ్చునట్టి దని యర్థము దానికి నై తపింతురే. 11

మ. జనులర్థించిన రాజకీయవిషయ స్వాతంత్ర్య మొక్కింత య
బ్బిన సర్వత్ర స్వతంత్రు లైతి రని తబ్బిబ్బందుదు ర్గాని యి
మ్మనుజుం డెట్టు లనేకజన్మకృతకర్మప్రాప్తదౌర్గత్యబం
ధనముల్ వీడకమున్నె తా నలస్వతంత్రత్వంబు చాటించెడున్. 12

మ. తనపుణ్యస్థితిఁ బాసియున్ననరు సత్యం బౌ ననం జెల్లు దే
వునిభావంబుల భావనన్ సలుపఁగం బూజ్యంపుఁబ్రేమం బనన్

జనునే తద్ధృదయప్రకంపముమెయిం గంపింపఁగాఁ జేయ దే
వునితో నైక్యముసేయు టయ్యెడి మతంపుంభావ మీక్షించినన్. 13

మ. కృతనానావృజినౌఘకల్మషకళంకీభూత మై యుంట నీ
చతకుం బాల్పడెఁ గాని దైవికపుఁదేజం బాత్మ, తత్సూర్యగ్వసు
స్థితికిం దానినిఁ జేర్చి పాపములఁ బోఁజేయంగ యత్నించున
త్కృతియే మానవజన్మకెల్ల ఫలసిద్ధిం గూర్చు యోగంబగున్. 14

మ. మన మత్యంతవికారకారకముసుమ్మా, స్వీయ మస్వీయ మా
నని భ్రాంతిం బడెదున్, స్వకీయపరకీయజ్ఞాన ము ద్భేధకం
బౌనరింపంగలయట్టిశక్తి, సుఖదుఃఖోద్భూతికం బౌగుణం
బును నీవస్తువులందు నున్నదె? నిజంపుందత్త్వ మీక్షించినన్. 15

మ. ఇది నా దయ్యది యన్య మంచు, నిది యెంతే సౌఖ్యసంధాయకం
బది దుఃఖప్రద మా నటంచుఁ, దలపోయంజేయు నిమ్మానసం
బదిరా! బంధవిమోక్షకారణము సౌఖ్యాసౌఖ్యకర్తృత్వము
న్నదియే? వస్తువులందు భ్రాంతిజనితాంధత్వమ్ము కాకుండినన్. 16

మ. మనుజుల్ సౌఖ్యము దుఃఖమున్ మఱియుఁ బ్రేమంబున్ విరోధంబు, తృ
ప్తి నతృప్తిన్ నటియించి యంతట సమాప్తిం గాంతురే; కాంతమా
వనధిన్ వెన్నెలరేలనే యల భవం బై యున్నతిం గాంచి పో
యిన యాసంగతి నేర్గనుంగొనెద రట్లే వారివృత్తాంతమున్. 17

మ. అకటా! సుందర మైకనంబడుజగంబం దున్నదే? సౌఖ్యదా
యక మావస్తు వదెట్టి దేనియు, భవిష్యన్నిశ్చయం బాత్తర
తుకసామర్థ్యము, స్వేచ్ఛ మాప్రణయమున్ జ్ఞానంబు తేజం బిఁకే
లొకో; యీమానవు లజ్ఞతాంధు లయి యన్యోన్యంబు గర్హించుటల్. 18

మ. కృతదుష్కార్యపరంపరార్జితమనఃక్లేశంబ! నాయిచ్ఛనా
గతముం గైకొనఁగాఁ దగున్, మనకు సాంగత్యంబు మత్సర్వజ
వితకాలంబును నుండునట్టిదిసుమా, ప్రేరేపుమా మ్మస్మనో
గతులం, బల్కులఁ, జేఁతలన్ మిగుల నిష్కాలుష్యపుంద్రోవలన్. 19

మ. అనివార్యం బగుకర్మరజ్జునకు లోనై యెప్పుడేఁ దన్ను బా
యున వాప్రాణము లేటికో నిలుప నుద్యోగించి, సుం తేని మా
ర్ప నశక్యం బగుభూతమున్, మిగులఁ గ్రూరం బైనయీప్రస్తుతం
బును, సందిగ్ధభవిష్యదక్రమము లామోదించుచున్నాఁడ హా హా. 20

మ. అదియే చిత్రములందుఁ జిత్ర మగు నౌరా! కాలమన్ వస్తువా
గదనంతం బతిమానగామి; క్షణికోల్కం బోలె నీప్రాణు లె
ల్లఁ దదత్యాతురవాహడోలికలపై లాస్యంబు గావింతు ర
య్యది సర్వావృతశక్తియుక్తము నచింత్యం బింక నజ్ఞేయమున్. 21

మ. అలయాకాశవితానమందునను బాల్యంబందు నయ్యింద్రచా
పలసద్వర్ణము లెల్ల స్వచ్ఛమయి కన్పట్టెన్ వయోవృద్ధితో
నలుపుల్ మేఘములం బలెన్ వ్యసనముల్ నానాఁటికిన్ హెచ్చి య
గ్గలపుంజీఁకటిలోన నన్ను దిగమ్రింగంగాఁ బ్రయత్నించెడున్. 22

మ. అతిభీతావహభూధరాంతరగుహావ్యాప్తాంధకారంబు సం
తత మంభోనిధిక్రింద డాఁగుతమమున్, దర్పించి ఘోరాజికా
యత మా కార్మొగులందు నున్ననిబిడం బౌచీఁకటుల్ గూడి హృ
ద్గత మానంతమసంబుతోడ గెలువంగా లేవు పోరాడినన్. 23

మ. సకలోపద్రవకారకంబు లగునీచప్రాణులున్, దుష్టకం
టకవృక్షంబు, లగాధ మాపరిఖ లుట్టంకించునీజీవయా
త్రికు లేఁగందగునట్టి బెట్టిదపుదారిం గాని, సౌఖ్యప్రసా
ధక మాసద్గుణ మేక మున్న దది యేతన్మార్గహ్రస్వత్వమే. 24

చ. ప్రకృతివిధాన మెల్ల బహిరంగరహస్య మ దెట్లటన్న సృ
ష్టికిఁ గత మెయ్య దెవ్వఁడు సృజించెడువాఁ డని ప్రశ్నఁ జేయుపృ
చ్ఛకులకు హేతుయుక్తముగ సందియముల్ విడిపోవ, సర్వముం
బ్రకట మొనర్చెడుం బ్రకృతి నాఁబడుపొత్తము విప్పి చూచినన్. 25

చ. అమలినరామణీయక మనన్యసమానసితత్వమున్, మృదు
త్వమునుఁ బవిత్రతాదిగుణభాస్వర మై యలరారునట్టి ప
ద్మము, మలినంపుఁబంకమునఁ దా జనియించుటఁ జూడఁ గా నదృ
శ్య మగుమహత్వ మెల్లయెడ వ్యాపిత మాట యె గోచరించెడున్. 26

చ. ప్రకృతిమహాసుషుప్తికిఁ గరంబు విరోధులు మానవుల్ స్వకా
ర్యకథల నెల్ల మాని నిదురం గన మిన్నునఁ జంద్రుఁ డొక్కఁడే
యొకటియొ రెండొ తార లెపు డోడక వెంబడ, మెల్లఁ బ్రాఁకున
య్యకలుష మైనయట్టిసమయంపుఁ బ్రశాంతియె నాకుఁ గల్గుతన్. 27

మ. సదసన్మిశ్రిత మైనయీనరులనైజం బెంతచిత్రంబొకో
హృదయంబందు వసించుసాత్త్వికతమోవృత్తుల్ మహాకాదార్వభా

తదయోదుల్, బహునీచలోభమున హంతాజన్యవిద్వేషమా
గద తాదైవికరాక్షసాంశముల సాంకర్యంబు యోజింపఁగన్. 28

మ. మిత మీమానవజాతిబుద్ధి బల మేమేరం గనన్ రానిదే
మితియున్ లేనిది దైవ మన్ విషయ మీమీబుద్ధిచేతం దిర
స్కృతిఁ గావింపకుఁ డార్యసత్తముల నేరేన్ "సంశయాత్మా విన
శ్యతి" ను న్మందురు వారి నమ్మకపుస్థైర్యం బేమనంగాఁ దగున్. 29

చ. పరిమితమే మనోబల మపారమె దైవవిధాన, మైన నీ
పరిమిత మామనోబలముపాటిది వేఱొకశక్తి యున్నె? యీ
నరునకు నెందు, దానివలనం బడయం దగునట్టి జ్ఞానముం
బరిమిత మయ్యు నిద్దియు సుమా జగమందు శరణ్య మారయన్. 30

మ. ఒకఁ డౌ సేవకుఁ, డింకొకం డగును సేవ్యుం, డొక్కఁ డౌ పాల్యుఁ, డిం
కొకఁ డాపాలకుఁ డౌ, నికృష్టుఁ డొకరుం డుత్కృష్టుఁ డింకొక్కఁ డెం
దుకొ యీభేదము లేరునుం దెలియశక్తుల్ గారు సూ, యయ్యనం
తకృపాంభోనిధి సృష్టికర్త కగునే? నైర్ఘృణ్యవైషమ్యముల్. 31

మ. తనదుశ్చేష్టలచే జనించు భయమున్, దైన్యంబు నష్టే నెఱుం
గనివజ్ఞాతము లేవిధం బయిన హృత్కాలుష్యముల్, చూడఁబో
వని దీలోకులనీచభావము, మనోవాక్కాయకర్మంబులం
జనదే భేదము నట్టిశైశవమనో నైర్మల్యమే ధ్యేయ మా. 32

మ. పరమోత్కృష్టమయాత్మ యయ్యది మనోద్వారంబునన్ వెల్వడం
బరిణామంబునుజెందు బుద్ధి యయి, హృద్ద్వారంబునం బ్రేమ యై
పరిణామంబును గాంచు, నిచ్ఛ యనునాద్వారంబునం బుణ్యమై
పరిణామంబును బొందు, నేననెడిశబ్దం బద్దియే తెల్పెడున్. 33

మ. అకటా! సౌఖ్య మనంగ నేమి? యది దుఃఖాభావమే, భావసూ
చకమా? కాద, యభావసూచకమ, తత్సంధాన మెట్లన్నఁ, గో
రికలం గల్పనచేసి తద్విఫలతాప్రేరేపితక్లేశనా
శకయత్నంబు లొనర్చు టేమనుదుఁ దత్సారస్యవైరస్యముల్. 34

వేలూరి చంద్రశేఖరం.

ఓమ్.

నమఃపరబ్రహ్మణే

# విప్రనారాయణచరిత్రము

## పీఠిక.

---

విప్రనారాయణచరిత్ర మనెడి యీప్రబంధమును చెదలవాడ మల్లయకవి రచియించెను.

ఇతఁడు ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. కవిత్రయములోనివాఁ డని వన్నెకెక్కిన యెఱ్ఱాప్రెగ్గడవంశములోని వాఁడు. మల్లనార్యునకుఁ బ్రపౌత్రుఁడు. ఎఱ్ఱనార్యునకుఁ బౌత్రుఁడు. లింగనార్యున కును గామమాంబకును బుత్రుఁడు. ఈయంశము లవతారికలోని యీక్రింది పద్యములవలనఁ దేటపడఁగలవు.

కవి కృత్యాదిని మంగళాచరణాదిక మొనరించి పూర్వకవిస్తుతిఁ జేయుచు—

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప
నేర్తునే యైన నేను వర్ణింతు నతని
చిన్నిమనుమఁడఁ గావునఁ జిఱుతవాంద్ర
కొదలుపలుకులు ముద్దుసేయుదురు గాదె.

సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ గవులకుఁ జెవులపండువులు గాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహునిపురాణ మొనర్చె హరి మెచ్చి నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ రెండును రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న

ఆ. దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద, ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ, డను నుతింప బ్రహ్మకును దరంబె?

అని భారతారణ్యపర్వశేషాదులను దెలిఁగించిన యెఱ్ఱాప్రెగ్గడను వర్ణించి, యాతనికి సాక్షాత్పౌత్రుఁడు గాక యాతనివంశములోనివాఁ డను నర్థమును సూచించు 'చిన్నిమనుమఁడ' నను విశేషణమును దన కుపయోగించికొని తనవంశము లో మిక్కిలి పూర్వుఁ డనునభిప్రాయమును సూచించు "వంశకర్త' యనువిశేష ణము నెఱ్ఱాప్రెగడ కుపయోగించెను.

మఱియు నీతఁడు గ్రంథావతారికయందుఁ దనతల్లిఁ దండ్రిఁ దాతముత్తా తల నీక్రిందివిధముగా వర్ణించెను.

క. వినయోన్నతుఁ గామాక్షీ, జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని నార్వేలాన్వయ, జనితుని శ్రీవత్సగోత్రు శైవాచార్యున్.

శా. రాజుల్ మెచ్చఁగఁ జెప్పి కావ్యములు హేరాళంబుగా సద్రిక
న్యాజాని న్భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినముం బంచాక్షరీమంత్రము
దేజోవంతుఁడు లింగనార్యుఁడు గుణోత్కృష్టుండు మాతండ్రియున్.

ఉ. శాతకృపాణనిర్దళితశత్రుఁడు సాళువనారసింహధా
త్రీతలభర్తయు న్గజపతిప్రముఖుల్ చతురంతయానభూ
షాతపనీయవస్తువు లొసంగఁ దనర్చిరి నీయనుంగుము
త్తాతయుఁ దాతయు న్భువి విధాతలు మల్లనయెఱ్ఱనాహ్వయుల్.

కవి యవతారికలో నెఱ్ఱాప్రెగడను "చెదల్వాడనిలయు నాదువంశకర్త' యని పేర్కొనుటయే కాక యాతనికిఁ 'ప్రబంధపరమేశ్వర' యనుబిరుదమునే నామముగా నుపయోగించి యాతనివంశమున జన్మించినవాఁడ నని యర్థమును దెల్పుచు నతని ఫక్కినే యనుసరించి యాశ్వాసాంతములయందు "ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వర వంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చెదల్వాడ మల్లయనామధేయప్రణీతం బైన" యని వ్రాసికొనుటచే వీరియింటిపేరు తప్పక చెదల్వాడవా రని తెలియుచుండఁగా, రావుబహదరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి యాంధ్రకవులచరిత్రము, గురుజాడ శ్రీరామమూర్తిగారి యాంధ్రకవిజీవితము గూడఁ గవిత్రయప్రసిద్ధుఁ డగునెఱ్ఱాప్రెగడ యింటిపేరు 'ఏర్చూరివా' రని తెలుపుటకుఁ గారణ మేమో చర్చింపఁదగి యున్నది.

ఇందులకుఁ గారణము భాగవతషష్ఠస్కంధకర్తయుఁ గసువనామాత్యపుత్రుఁడు నగుసింగయమంత్రి యాస్కంధము మొదల—

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డాపస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్చూరిశాసనుం డెఱ్ఱనప్రెగ్గడపుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగునాదయామాత్యునకుఁ బోలమాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి సింగధీమణియు నంచితగుణాఢ్యు

గీ. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ, సారిది మూర్తిత్రయంబన శుభకీర్తిఁ
బరఁగి రందులఁ గనువనప్రభువునకును, ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె

క. ఆకనువయమంత్రికిఁ బు,ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మ మము న్న
వ్యాకులచిత్తుల నిరువుర, శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్.

అని తనవంశమును వర్ణించికొనిన పద్యములోని శ్రీవత్సగోత్రత్వమును, శివభక్తియుక్తుఁ డనువిశేషణముచే నాకర్షింపఁబడిన శంభుదాసత్వమును, ఎఱ్ఱాప్రెగడ యనునామమును, సరిపోవుచున్నవి గదా యని యాయెఱ్ఱాప్రెగడయే భారతారణ్యపర్వశేషము దెలిఁగించిన యెఱ్ఱాప్రెగడ యని భ్రాంతిపడుటయే కాని వేఱుగాదు. సింగనమంత్రి తెల్పినవంశావళిలో నెఱ్ఱాప్రెగడవంశమునందు వీరన, ఆదెయ్య, కసువమంత్రి, సింగయమంత్రి యనువారు క్రమజనితపురుషులుగాఁ గనఁబడుచుండ, మనకవి తెల్పిన తనవంశావళిలోని ఎఱ్ఱాప్రెగడ, మల్లన, యెఱ్ఱన, లింగన, మల్లన యనువారిక్రమము పైక్రమమునకుఁ గేవలము విరుద్ధముగాఁ గనఁబడుచున్నది. ఒకవేళ, ఎఱ్ఱాప్రెగడవంశమునందు భాగవతషష్ఠస్కంధకర్తకుఁ దరువాత నీమల్లకవి తెల్పిన వంశావళిలోని మల్లన యెఱ్ఱనాదులు పుట్టియుండిరేమో యని యెవ్వరయినను హాస్యాస్పద మయినయుక్తి చెప్పవచ్చును గాని, యిది యెఱ్ఱాప్రెగడయొక్క సువిదితకాలమునకే హాని తెచ్చును. కావున నీ యెఱ్ఱాప్రెగడ లిద్దఱు వేర్వే ఱనియు, వీరికిఁ దోడు శ్రీవత్సగోత్రుఁడు, శివకృపాపాత్రుఁడు, కూచనమంత్రిపుత్రుఁడు, కొక్కోకకర్తయు నగునెఱ్ఱాప్రెగడ యింకొకఁడు గలఁ డనియు నెఱుంగునది. సింగనమంత్రి వంశకర్త యగునెఱ్ఱాప్రెగడయే కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడయేని యతఁడు భారతారణ్యపర్వశేషరామాయణహరివంశాదులను రచియించినట్లు సింగనమంత్రి భాగవతమున వ్రాసికొనకపోవునా? ఇంతయేల? భారతారణ్య హరివంశాదులను రచియించిన యెఱ్ఱాప్రెగడ నావంశకర్త యని మనమల్లయకవి ఘోషించుచుండఁగా నాతనియింటిపేరు చెదల్వాడవా రగుటలో సంశయమేమి? కాఁబట్టి సింగనమంత్రి భాగవతషష్ఠస్కంధములోని పైపద్యమందలి 'ఏర్చూరిశాసనుం' డను విశేషణమును బట్టి కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ యింటిపేరు 'ఏర్చూరివా' రని భ్రాంతిపడరా దనియు, నెఱ్ఱాప్రెగడలు పలువురు గల రనియు, సుప్రసిద్ధుఁ డగునెఱ్ఱాప్రెగడ మనకవికి వృద్ధప్రపితామహుఁ డనియు, నీతనియింటిపేరు చెదల్వాడవా రనియు స్పష్టపడుచున్నది. సింగనమంత్రి వంశకర్తయైన యెఱ్ఱాప్రెగడ గోలకొండదేశములోని నల్లగొండ

మండలమునందలి యేర్చూరుగ్రామమున నుండువాఁడు. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ పాకనాటిదేశమువాఁడు. అతఁడు భారతారణ్యపర్వాంతమున—

సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూరనార్యునకును బోతమాంబికకును
నందనుం డెలఁబాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసకి మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ

గీ. డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ, డైననన్నయభట్టమహాకవీంద్ర
సరసనారస్వతాంశప్రశస్తి దన్నుఁ, జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి.

అనుపద్యమునఁ దననివాసము గుడ్లూ రని వ్రాసికొనుటచే నప్పటికతని యింటపేరు గుడ్లూరువా రనియుండి పిదప నీతఁడో యితనివంశ్యులో చెదలవాడకుఁ జేరియుండుటచే నేతద్వంశ్యులకుఁ జెదల్వాడవా రనుగృహనామము గలిగినట్టు యుండునని తోఁచుచున్నది. కావుననే యితఁడు తననివాసము గుడ్లూ రని భారతములో వ్రాసికొనుట యెఱింగియుండియు మనకవి యాతని[illegible] "చెదల్వాడనిలయు నాదువంశకర్త" నని చెప్పియుండెను. కాఁబట్టి యెఱ్ఱప్రగడ యింటిపేరు చెదల్వాడవా రగుట నిర్వివాదాంశము. ఏర్చూరివా రనుట భ్రాంతిమూలకము ననాకరము నగును. ఇఁక నీతని "చిన్నిమనుమఁ" డగు మాఁడ మల్లయ కవి కాలము నీక్రిందివిధముగాఁ దెలియఁ దగును.

— కవికాలము. —

పూర్వోదాహృతపద్యములలో మల్లనమంత్రి తాతయుఁ బాతయుఁ సాళువనరసింహరాజువలనను, గజపతివలనను గౌరవింపఁబడినా రనుటయే యాతనికాలము తెలియుటకు ముఖ్యాధారముగా నున్నది. ఈసాళువ నరసింహరా జాంధ్రపద్యజైమినిభారతమునకుఁ గృతిపతి. డిండిమకవికృత సాళువాభ్యుదయనామక సంస్కృతకావ్యమునకుఁ గృతినాయకుఁడు. ఆంధ్రవరాహపురాణకృతిపతి యగు తుళువనరసింహరాజునకుఁ బ్రభువు. ఈరా జించుమించుగాఁ గ్రీ. 1500 సంవత్సరపర్యంతము కర్ణాటరాజ్యము పాలించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఈకాలమునఁ గర్ణాటరాజ్యములోని తూర్పుదేశములో నెల్లూరిసీమలోని యుదయగిరివఱకును గటకపురాధీశ్వరు లగుగజపతిరాజు లాక్రమించికొని యుండఁగా 1515 సంవత్సరప్రాంతమునఁ గృష్ణదేవరాయలు, వారినోడించి యాదేశము

స్వాధీనముచేసికొనెను. దీనింబట్టి మల్లయకవి గాంత 1500 సంవత్సరప్రాంతమున జీవించియుండవచ్చు నని యూహింపనగును.

మఱియు, నీకావ్యము కార్వేటినగరరాజగుతిరుమలరాజున కంకితము. ఈ తిరుమలరాజు తండ్రి మాకరాజు. ఈమాకరాజుకొడుకగుతిరుమలరాజు కుమారుఁడు రాజ్యము సేయుచుండఁగాఁ గార్వేటినగరసంస్థానములోఁ జేరినసారాయణ వనగ్రామము నందలి కల్యాణ వేంకటేశ్వరస్వామికి 1544, 1545 శాకాబ్దములలోఁ గొందఱు భూమ్యాదిదానములు చేసినట్లు దేవాలయద్వారములమీఁద రెండు శాసనము లున్నవి. 1545 వ శాకాబ్దము 1623 వ క్రైస్తవాబ్దమునకు సరిపడును. ఈసంవత్సరము మల్లయకవికుమారుని తరములోని దయి యుండు నని యూహించినచో మల్లనతాతకును మల్లనకుమారునకును 120 సంవత్సరముల యంతరముండును. తరమునకు 30 సంవత్సరములపైగాను, 40 సంవత్సరములలోపుగాను నయినది. ఇది యసంభావ్యముగాదు. ఈలెక్కను బట్టి మల్లయకవి రమారమి 1585 వ క్రైస్తవాబ్దమున నుండినట్లు చెప్పవచ్చును.

పరమయోగివిలాసకర్త యగుతిమ్మభూపాలుఁడు నీకాలమువాఁడే. ఇతఁడు తా నళియరామరాజ తిరుమల వేంకటాద్రులకు భాగినేయుఁడ ననియుఁ, గొండవీటి రాజ్యమును బాలించునపు డీగ్రంథమును రచియించితి ననియుఁ జెప్పికొనెను. ఈతని మేనమామ లగుపైరాజులు కర్ణాటరాజ్యాధిపతి యగుసదాశివరాయలకు మంత్రులుగా నుండిరి. 1565 లోఁ గర్ణాటులకును దురుష్కులకును తల్లికోటలో జరిగిన ఘోరయుద్ధములో రామరాజును వేంకటాద్రియు హతులైరి. మఱి కొంతకాలమునకు సదాశివరాయలు చనిపోయి యాతనితోఁ దుళువవంశ మంతరింపఁగాఁ దిరుమలరాయలు కర్ణాటరాజ్యమునకు రాజయ్యెను. సదాశివరాయల కాలములో 1486 వ శాకాబ్దమునకు సరియగు రక్తాక్షిసంవత్సరమం దాషాఢ శుద్ధ ౧౧ నాఁడు "శ్రీమన్మహామండలేశ్వర రామరాజుతిరుమలరాజయ్యదేవ మహారాజులుంగారు" అప్పాపండితుఁ డనునాయనకుఁ గొండవీటిసీమలో భూదానముచేసి తామ్రశాసన మిచ్చి రనియు, నాసంగతి "సిద్ధిరాజు తిమ్మరాజయ్య వారికి ఆనతి స్తేను ఆసిద్ధిరాజు తిమ్మరాజయ్యవారు దానమును బరిపాలించినా" రనియుఁ గొండవీటి దిగువకోటలో నున్నగోపీనాథస్వామి యాలయములో మధ్యమండపము నుత్తరద్వారము తూర్పుతాతిమీఁదఁ జెక్కఁబడిన శాసనము వలనఁ దెలియుచున్నది. క్రైస్తవమానముచేఁ జైసంవత్సరము 1564 అగు

చున్నది. ఇది తల్లికోటయుద్ధమునకుఁ బూర్వసంవత్సర మయినది. ఈకాలము నందే పరమయోగివిలాసము పుట్టిన దనికొనినచో దానికిని మన మింతకుము న్నే ర్పఱచిన యీవిప్రనారాయణచరిత్రకాలమునకును రమారమి 20 సంవత్సరముల యంతర ముండును.

ఇఁక వైజయంతీవిలాస మెపుడు పుట్టినదో చూతము. తిమ్మయకవి తనవంశము వర్ణించుచుఁ జివర నిట్లు చెప్పెను.

చ. ఇనసమతేజు లౌనృపుల నెల్ల మహమ్మదుశాహి యేలునీ
యెనుబదినాల్గుదుర్గముల నేలిన యేలిక గోలకొండఁ ద
ద్ఘననగరస్థలిం గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్ము హొ మ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థు లౌనన౯.

పై పద్యములో వర్ణింపఁబడిన తమ్మమంత్రియే వైజయంతీవిలాసకర్త యని రావుబహదరు వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు. దీని పై పద్యములలో వర్ణింపఁబడిన వంశక్రమమును బట్టి చూడఁ బైయభిప్రాయము సరియైనది గానే తోఁచుచున్నది గాని, పద్యములోఁ బ్రథమపురుషప్రయోగమును, దాని తరువాత "అట్టివంశంబున మహోన్నతుండనై వివిధభోగంబు లనుభవించుచుండ" నను వచనంబును, బైపద్యమునందుఁ జేర్కొనఁబడిన తమ్మమంత్రి కవికిఁ బూర్వుఁ డేమో యనుసంశయము గలిగించుచున్నవి. మహమ్మదుశాహి యను గోలకొండనవాబు 1581–1611 సంవత్సరముల నడుమ రాజ్యముచేసెను. ఇతని కాలమందు గోలకొండకుఁ గరణముగా నున్నతమ్మమంత్రి వైజయంతీవిలాసగ్రంథకర్తయే యయినయెడల నాతఁడు 1600 సంవత్సరప్రాంతమున నుండె నని యూహింపవచ్చును.

పై చర్చంబట్టి తిమ్మభూపాలుఁడు క్రీ. 1564, మల్లయకవి 1585, తమ్మయకవి 1600 సంవత్సరములయం దుండి రని తెలియుచున్నది. అనఁగాఁ గొంచెమించుమించుగా నీముగ్గురు సమకాలికులే యని తేలుచున్నది. 1600 ప్రాంతమం దుండిన తమ్మమంత్రి వైజయంతీవిలాసకర్తకుఁ దాత యని యూహించినచో నక్కవి యింకను 50, 60 సంవత్సరముల తరువాతివాఁ డని యెంచవచ్చును. మూఁడుగ్రంథములు చదివిచూడఁగాఁ బరమయోగివిలాసమును మల్లయకవియు, విప్రనారాయణచరిత్రను దమ్మయకవియుఁ జదివియుండు రనియు, విప్రనారాయణ

చరిత్రమునకు మెఱుఁగుపెట్టవలె ననుతలంపుతోఁ దమ్మయ వైజయంతీవిలాసము రచియించె ననియు స్ఫురింపకపోదు.

— మూలకథ —

పన్నిద్దఱాళ్వారు లనుభగవద్భక్తులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారు (భక్తాంఘ్రిరేణువు) చరిత్ర మీగ్రంథమున వర్ణింపఁబడినది. దీనిమూలకథ ద్రవిడ భాషలోనిది. అదియే ప్రపన్నామృత మనుసంస్కృతగ్రంథమునకును మాతృక యయినట్లు తోఁచుచున్నది. తొండరడిప్పొడియాళ్వారుచరిత్రము పరమయోగి విలాసము మూఁడవయాశ్వాసమున నున్నది. ఆకథను మాత్రమే గ్రహించి చెదలవాడమల్లయకవి విప్రనారాయణచరిత్ర మనియు, సారంగుతమ్మయ్య వైజయంతీవిలాస మనియు, ప్రబంధములు రచియించిరి. ఈమూఁడుగ్రంథముల పౌర్వాపర్య మిదివఱకే నిర్ణయింపఁబడినది.

ఈమూఁటియందు నించుమించు వైషమ్యముగా మూలకథాసారము సమానము. ఎట్లన:—చోళదేశములో మండగుడి యనుగ్రామమున నొకబ్రాహ్మణుఁ డుండెను. అతనికి విప్రనారాయణుఁ డనుకొడుకు గలఁడు. అతఁడు సహజవైరాగ్యసంపన్నుండును భగవత్కైంకర్యతత్పరుండు నయి శ్రీరంగమునకేగి యచ్చటఁ బుష్పవన మొకటి సర్జించికొని పూలదండలు గ్రుచ్చి నిత్యము శ్రీరంగనాథున కర్పించుచు మాధుకరవృత్తిచే దేహధారణము చేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు వేశ్యాంగన లిద్దఱాదారినిఁ బోవుచు నావైష్ణవబ్రహ్మచారిని గని "యీతఁడు దృఢవైరాగ్యసంపన్నుఁ" డని యొకతెయు, "నెట్టివాఁడయిన వనితకు వశ్యుఁడుగాక పోఁ" డని యొకతెయు, వాదించికొని వారిలో దేవదేవి యనునది "యీతనిఁ దప్పక కాముకునిఁ గావించెద" నని ప్రతిజ్ఞయొనరించెను. వెంటనే యది తనభూషణములను త్యజించి దాసరిసాని వేషమును బూని యాభూసురునిఁ జేరి నీచమైన వేశ్యావృత్తికి రోసి వైరాగ్య మూని నీసేవకై వచ్చితి నని కపటవాక్యములు చెప్పి యాతని నమ్మించి యాతఁడు తనదాస్యమున కంగీకరింప నాతనికి సహాయ మొనర్చుచు నందే యుండెను.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి గొప్పగాలివాన విసరఁగాఁ, దనతోఁట యేమయిన దో యని యావిప్రుఁడు తనపర్ణశాల తలుపు తెఱచి చూచునంతలోఁ, జెంత నున్నయొకరావిచెట్టుక్రింద వడవడ వడఁకుచు నిలిచియున్న దేవదేవి మెఱుపువెలు

తురున నాతనికిఁ గనఁబడెను. అంత దయార్ద్రహృదయుఁ డగునతఁడు దానిని గుడిసెలోనికి రమ్మని పిలిచెను. అదియే సందు చేసికొని దేవదేవి లోపలఁ బ్రవేశించి తనజాణతనమున నాబ్రహ్మచారిచే మదనసామ్రాజ్య మేలించెను. పిదప దానితోఁ గూడి యతఁడు దానియింటికిఁ బోయి, రిక్తుఁ డగుటఁ గొంతకాలమునకు దాని తల్లిచే నిల్లువెడలఁగొట్టఁబడి విచారించుచు దానిపైఁ జనే పడియుండె. ఇట్లుండ, శ్రీరంగస్వామి తనభక్తునియందలి యనురాగమున శిష్యవేషముఁ బూని తనయాలయములోని బంగరుగిన్నె యొకటి తీసికొని వచ్చి విప్రనారాయణుఁడు పంపినట్లుగా వేశ్య కొసంగెను. పిదప నదియు మరల నాతని రావించి ప్రేమించెను. అంత, మఱునాఁడు గుడిలోని స్వర్ణపాత్రము లేమిని బూజారు లధికారికి విన్నవింప నావృత్తాంతము చిట్టచివరకుఁ జోళరాజు నంతకుఁ బోయెను. రాజభటులు దేవదేవీవిప్రనారాయణులను బంగరుగిన్నెతోఁ గూడ రాజునెదుటకుఁ దీసికొని వచ్చిరి. రాజును వారిరువురను గిన్నెవృత్తాంత మడిగి తెలిసికొని, తుదకు విప్రుఁడే దొంగ యని నిశ్చయించి, దండనము విధింప నున్నంతలో శ్రీరంగనాథుఁడు ప్రత్యక్షమై యిది యంతయు విలాసార్థమై తాను జేసిన పని యనియు, విప్రనారాయణుఁడు దోషిగాఁ డనియుఁ జెప్పి యంతర్ధాన మయ్యె.

### కథారచనము.

తిమ్మభూపాలుఁ డీకథను బెంచక భక్తిరసప్రధానముగా మృదుమధురశైలిని వర్ణించెను. మల్లయ తిమ్మయ్య లిరువురును యథామతిగఁ బెంచి శృంగారరస ప్రధానముగాఁ బ్రబంధశైలిని రచియించిరి. వీరిలో మల్లయకవి కథాప్రారంభంబునఁ జోళదేశము, అందు మండగుడి యనుగ్రామము, హరివనమాలికాంశ మా గ్రామమున నొకవైష్ణవస్త్రీకి విప్రనారాయణుఁడై జన్మించుట, విష్ణుభక్తుం డగు నతఁడు కథకు రంగస్థల మయిన శ్రీరంగపురమును జేరుట, శ్రీరంగపురము, తత్ప్రాంత మందలి కావేరీద్వీపంబున నొకపుష్పారామము నిర్మించుకొని యతఁడు నిత్యము పూలమాలికలు శ్రీరంగేశునకు సమర్పించుచుండుట యనునంశములను యథాక్రమముగా సందర్భోచితంబుగ సరసముగా వర్ణించె. వైజయంతీవిలాసమందుఁగూడ నియ్యంశము లన్నియుఁ జక్కఁగా వివరింపఁబడినవి, గాని, చోళదేశమునకు బదులుగాఁగూడ శ్రీరంగపురమే ముందుగా వర్ణింపఁబడుటచే నివ్వర్ణనము ద్విరుక్త మయినది. హరివనమాలికాంశమే విప్రనారాయణరూపంబున నుదయించె ననువిషయ మీరెంటియందును దుల్యమే యైనను, నారా

యణుని పుష్పమాలికయే స్వయముగా భూమిపై నవతరింపఁదలఁచి యొకవిప్ర స్త్రీగర్భమునఁ బ్రవేశించె నని యిందును, గొండొక వైష్ణవాంగన సంతానము లేక విచారించుచుండఁగా నామెకుఁ గలలో శ్రీహరి గన్పడి పూలదండ నిచ్చిన ట్లును, దానిచే నామె గర్భము దాల్చినట్లును వైజయంతీవిలాసంబునను, గొంచెము భేదముగాఁ గన్పట్టుచున్నది. ఇక్కథకు మూలమైన ద్రవిడపురాణములో నె ట్లున్నదో, కాని, పెక్కండ్ర విష్ణుభక్తులకథలను దెల్పు పరమయోగివిలాసమందుఁ గూడ—

ఉ. ఆపురియందు నొక్కవసుధామరముఖ్యునకుఙ జనించెఁ బ
ద్మాపతిదాల్చునట్టి వనమాలికయంశమునం దనూజుఁడు ...

అని యుండుటచే వైజయంతీవిలాసంబున స్వప్నవృత్తాంత మపూర్వముగాఁ గల్పింపఁబడిన దని చెప్పవచ్చును.

మఱియు—

చ. అనుచును సంతసించి తనదైన వినోదము చూపఁగోరి చ
క్కని దగు నిందుజవ్వని నొకానొకయచ్చరపూవుఁబోఁడిఁ జ
య్యన హృదయంబునం దలఁప నయ్యది సమ్ముఖమందు నిల్చి వం
దన మొనరింపఁ జూచి యెలనవ్వు గనుంగవ నంకురింపఁగఙ.

అనునదియాదిగా నవ్యాజభక్తియుక్తుం డగువిప్రనారాయణునిభక్తి కానందించి, శ్రీరంగేశుఁ డొకవినోదము సేయఁదలంచి, యొకయప్సరసను రప్పించి 'నీవుభూలో కంబున వేశ్యవై జనింపు' మని చెప్ప, నదియే యిందలికథానాయిక యగుదేవ దేవియై పుట్టినట్లుగా నీగ్రంథమున వర్ణింపఁబడినది. కథాంతంబున బంగరుగిన్నె దొంగిలించె ననెడి యపవాదమును దొలఁగించి శ్రీరంగస్వామి విప్రనారాయణుని రక్షించె ననెడి విషయంబునకుఁ బ్రధానబీజమై యొప్పెడి యీకల్పన మిందే కాక పరమయోగివిలాసంబునఁగూడ—

క. ఈరీతి ననుదినముఁ బుష్పారాధన సేయుచుండ నాత్మనలరుచుఙ
శ్రీరంగవిభుఁడు సిద్ధమనోరథుఁ డొకచిట్టకపువినోదముఁ గోరకుఙ.

వ. అప్సరోవిలాసిని నొక్కతె రప్పించి ... నీవు నర్తకివై యుదయింపుము.
అని కన్పట్టుచున్నది.

కథాసన్నివేశకౌశలమం దీముగ్గురుకవులలోఁ దారతమ్యము నిరూపింప వల

సినచోఁ గొన్నిపట్లఁ దమ్మకవియే యధికుఁడని చెప్పఁ దగినను, ననేకప్రధానవిషయంబుల మల్లయయే మేలనిపించుకొను నని మాయభిప్రాయము.

— నాయకుఁడు —

సహజవైరాగ్యసంపన్నుండును, భగవదధీనమానసుండు నగుబ్రహ్మచారిని దేవదేవి విటునిఁగావించుపట్టే యీకథయందు రసమున కునికిపట్టు. తిమ్మభూపాలుఁడీవిషయము నొకవిధముగాఁ దేర్చివైచెను, గాని, రసపోషణ మంతగాఁ గావింపలేదు. విప్రనారాయణునిమన స్సొకసంవత్సరమువఱకుఁ జలింపకుండె నని నిరూపించి యాదృఢధైర్యమును భేదించుటకై చీకటిలో గాలివాన నుపాయముగాఁ గల్పించెను. ఇది యుచితముగానే యున్నది గాని "చీకటులివ్విరియు టారసి మబ్బు తెఱంగుఁ జూడ" నాబ్రాహ్మణుఁడు గుడిసెతలుపు తీసి చూచె నని చెప్పుటచేఁ దలుపు తెఱచిచూచుటకుఁ బ్రయోజన మంతగా లేకపోయినది. ఇది కథలో ముఖ్యాంశ మగుటచే దీనికిఁ దగిన హేతువుఁ గల్పింపక పోవుట గొప్పలోపము, మఱియు దేవదేవి యలంకరించికొని గుడిసెలోపలకుఁ బోఁగానే—

ఉ. ఇమ్మెయి నేగుదెంచిన మృగేక్షణఁ గన్గొని చోద్యమందుచుం
గ్రమ్మఱ నోనితంబిని సుగంధపటాభరణాదికంబు నీ
నెమ్మది కింపె నేఁడు ... ... ... ...

అని విప్రనారాయణుఁడే ముందుగాఁ బల్కరించె ననియు, నంతమాత్రము ననే యావేశ్య చనవుఁ గల్పించికొని,

ఉ. ఏమని దూఱుదాన నొకయేఁ డగుచున్నది నిన్నుఁ జేరి యో
భూమిసుపర్వ తోఁటపనిపూనికవేళనకాని యెప్పుడుం
బ్రేమను జేరవచ్చుట యభీష్టముఁ జెప్పుట మంచిమాపుచే
నామొగముం గనుంగొనుట నవ్వుట గానమ యించుకేనియున్.

గీ. ఏను దక్కినట్టియింతులయట్లకా, కకట! యధికనే సమస్తవిదుఁడ!
పెక్కులేల యోర్వఁ బ్రియుఁడ యింక! విడంబ, మనుచుఁ జేరి పట్టె నంఘ్రితలము.

ఇట్లా విప్రుని లోఁబఱచుకొనె ననియుఁ జెప్పుటచే విప్రనారాయణుని ధైర్యమునకుఁ గొఱఁత గలిగినది. అప్రయోజనముగాఁ దలుపు తెఱచి దేవదేవిని జూచి విప్రుఁడు లోపలకు రమ్మనుటయు, నక్కాంత యట్లురా వేగమే దానితో సరససల్లాపము లాడుటయు నతఁడు తలుపు తెఱచుటకు ముందే యతనిచిత్తము

దానిపైఁ దగులుకొనె నని సూచించుచున్నది. దానివలన నాయకుని ధీరతకుఁ గొంత హాని గలిగినది.

ఇంతకంటెఁగూడ వైజయంతీవిలాసములోని నాయకుఁడు మిక్కిలి బేలగా వర్ణింపఁబడుటచే మొత్తముమీఁద విప్రనారాయణచరిత్రయందలి నాయకుఁడే యౌచిత్య మతిక్రమింపక యామూలాగ్ర మొక్కరీతిగా వర్ణింపఁబడె ననుట నిక్కము. ఇఁకనో, నిజవైరాగ్యమునకు భంగము గలిగించు దేవదేవీసమాగమ మైనను "ఎంతవారికైన దైవ మలంఘ్యు" మనుటకుఁ దార్కాణగాఁ గల్పింపఁ బడిన దగుటచేఁ బ్రబంధమునకుఁ బ్రధానోద్దేశ మగునిది నాయకౌచిత్యమున కుపకారమే గాని హాని గలిగింపదు.

దేవదేవి దాసరిసానివేషంబునఁ బరిచర్య సేయవచ్చుటయు, దానివైరాగ్య మునకుఁ గారణంబుఁ బరీక్షించుటయు, దానిసపర్య నంగీకరించుటయు ననుకథాం శంబు లుభయత్ర సమానముగానే యున్నవి, గాని, యిందలి నాయకుఁడు దాని వేఱుగా నొకపొదలో నుంచెను, గాని, వైజయంతీవిలాసమందు వలెఁ దనపర్ణమం దిరముననే యుంచికొన లేదు. మఱియు, నిందు నాయిక యొకసంవత్సరముగా సేవసేయుచున్నను నాయకుఁడు రాతిగుండెతో నెప్పటివలెనే వైరాగ్యధీరుఁడై యుల్లియుండెను, గాని, వైజయంతీవిలాసమందువలెఁ గొన్ని దినములకే దానిపరిచ ర్యమున మెత్తపడి దానిపరిచర్యకుఁ దాను బూనుకొన నారంభింప లేదు. మఱియు, నొక్కనాఁడు నడికిరేయి పెద్దగాలియు వానయు రాఁగాఁ దనపుష్పవన మే మయి ననో యని తలుపుతీసి చూచుచున్న యిందలి నాయకుఁడు, వానలోఁదడియుచుఁ దన్ను బిలుచుటకుఁగూడ జంకి రావిచెట్టు చాటున నిలువఁబడియున్న నాయికను మెఱుపుఁగాంతిచేఁ జూచి విచారించి తనయింటిలోనికిఁ బిలిచి యిందుండు మని చెప్పినకథాభాగ మెంతయు స్వభావసిద్ధముగా సరసముగా నున్నది గాని, వైజ యంతీవిలాసమందువలె వాన గురియుచుండఁగా నాయకుఁడు తనంతఁ దానే నా యికను బలాత్కరించెద నని తలంచినట్లుగాఁ జెప్పఁబడియుండలేదు.

ఈసందర్భంబున నిందు నాయికను బిలిచినతరువాతఁగూడ నాయకుఁడు సెప్పినమాటలును, వైజయంతివిలాసములో వాననెపంబున నాయికను బిలువఁ దలఁచికొనుచుఁ దనలో నాయకుఁ డనుకొనినమాటలును, నాయకౌచిత్యనిర్ణయం బునకు నిదర్శనములు గాఁగల వని యిం దుదాహరించుచున్నారము,

సీ. తడికాళ్లతోఁ ద్రొక్కెదవుసుమీ యిదె కుశాస్తరణ మాత్మధ్యానసమయమయ్యె
నెడలేదు వేష్టువ లిటురమ్ము *ముట్టెదు కనకపాత్ర స్నానమునకు వలయుఁ
బీఠంబుపైఁ దీర్థపెరుమాళ్లు వేంచేసి యున్నవా రపచార మోసరిల్లు
పెట్టెనారము పట్టె బుట్టిలోఁ దులసిని జతనంబు భానువాసరము తేపు
గీ. పల్ల మామూల వలిసిరి చల్లు నిచట
నురియు నీచాయ నిద్రమై నుందు నిచట
మహితరామానుజోదీర్యమాణభాష్య
ముఖబహుగ్రంథసామీప్యమునకుఁ జనకు. విప్రనారా.

ఉ. వారిజపత్రనేత్ర నిటు వాననెపంబున నింటిలోనికిం
జేరఁగఁ బిల్చి నాతలఁపుఁ జెప్పినఁ జేకొనకుండినన్ బలా
త్కారము దోషమంచుఁ బలుకం బరభామిని గాదు చెంతకుం
జేరినమీఁదఁ గుక్కుటము సేయు నుపాయముఁ జేయు టొప్పగున్.
వైజయంతీ.

వైజయంతీవిలాసములోని నాయకుఁడు దేవదేవిని లోపలకుఁ బిలిచి తానే ముందుగాఁ దనమనోరథమును వావిడిచి తెలుప నమ్మాయలాఁడి కొంతబింకము నూపి యాతని నలయించి చిట్టచివర కియ్యకొనియెను. వేశ్యాసాహచర్యమువలన లోకాపవాదమును బ్రమాదమును గలుగునని భయపడుటచేతనే యందలినాయకుని మనసు పదిలముగా దని స్పష్టపడుచున్నది. కావుననే యతఁ డత్యల్పకాలముననే కాముకుఁ డయ్యె నాయికయు నెట్లయిన నతని వశపఱచుకొనుటకే యత్నించుచుండెను. ఇట్లిరువురను సమావేశాసక్తి సిద్ధమై యుండ గాలివాననెపమును గల్పించుట కంతగా నవసరము గానరాదు. దీనివలన నాయిక ప్రౌఢధీరయు, నాయకుఁ డధీరుఁడు నైనట్లు తెలియవచ్చుచున్నది. సహజవైరాగ్యసంపన్నున కధీరత యనుగుణము గాదు. నాయకుని ధీరునిఁగా వర్ణించినచో నాయకలక్షణము పోషింపఁబడుటయేకాక, యట్టివానిని వశపఱచుకొనిన నాయిక ప్రౌఢిమగూడ నతిశయించును. మల్లయకవి యీసందర్భమున కందము చెప్పెను. ఎట్లనఁగా:—

విప్రనారాయణచరిత్రనాయకుఁడు గాలివాననాఁటిరాత్రి తోఁటగతిఁ జూచుటకై తలుపు తెఱచి మెఱుపువెలుతురున దేవదేవిని జూచువఱకు నీసంవత్సరములోను నాతనిధైర్య మిసుమంతయుఁ జలింపలేదు. అట్టిదృఢధైర్యమును భేదిం

* ముట్టెదుగనుక ప్రాతస్స్నానమునకు వలయు-నని యుండవలెనోపు.

చుటకు సాధారణోపాయము చాలదు గాన, గవి గాలివానను మెఱుపును గల్పించెను. చిమ్మచీఁకటిలో మెఱుపు మెఱయుటచే దేవదేవిసౌందర్యమునకు మెఱుఁగు పెట్టిన ట్లయ్యెను. ఆక్షణముననే నాయకుని హృదయమునందు మనోజాస్త్రమున కించుక యవకాశము గలిగెను, కాని, యాబ్రహ్మచారి యది యెఱుంగఁడు. కావుననే నాయిక పర్ణశాలలోనికి వచ్చినపుడుగూడ మున్నువ్రాసినట్లుగా దానిని దూరముగానుండ నియమించెను. కాని, దేవదేవి యింతకంటె సమయములే దని తలంచి—

ఉ. గోపవధూసనాథపదకోకనదద్వయభక్తియుక్త యో
తాపసవర్య యీచలికతంబున నిద్దురరాదు విష్ణుగా
థాపదలీలలం గడపెదం దగుఁబ్రొద్దని విన్నవించి యా
లాపము సేసి కోకిలకలధ్వని యెంతయు వింతసేయఁగన్.

మ. తలిరుంబోఁడి దొడంగి మాధవుఁడు రాధంగూడి క్రీడించుగా
థలు కుబ్జం గయికొన్న వార్తలును సత్యావాంఛ లీడేర్చు సు
ద్దులు నాభీరవధూటులందుఁ గలపొందున్ రుక్మిణీదేవిపై
చెలిమిం గ్రొన్ననవిచ్చులాగు వినిపించె న్మాధురీవైఖరిన్.

వ. ఇవ్విధంబున శృంగారప్రధానంబు లగుకథాప్రసంగంబులం గొంత యభిముఖుంజేసి కలఁకయగు ధైర్యంబున నున్న యతనిఁ జేరంజని.

చ. పడఁతుక తేనె లుట్టిపడఁ బల్కెను వైష్ణవకులావతంస యిం
పడరఁగ మార్దవంబునెల వయ్యెడు నీచరణంబు లొత్తెదన్
బడలినవార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్
నుడవలు దీర్చియుం బిదప మార్చియుఁ గాలువ లేర్పఱిచియున్.

అని యిట్లుగా నతని కనురాగ మంకురింపఁజేసి యాతని సమీపించి, పాదసంవాహనంబున కంగీకరింపఁజేసి, తుద కతని మనోజాస్త్రంబుల కీరవు గావించె.

దీనివలన నాయకుఁడు సహజముగా ధీరుఁడనియు, నాయిక సహవాస మొకసంవత్సరమువఱకు నతనిధైర్యమును జలింపఁజేయక పోయిన దనియు, గాలివానలో నాయికను మెఱుపువెలుతురునఁ జూచినపుడే రాగ మావిప్రుని హృదయమును స్పృశించి, శృంగారగీతాశ్రవణంబున నాశ్రయించి, పాదసంవాహనంబునఁ బ్రజ్వరిల్లి, యతని ధైర్యమును నిర్మూలముచేసిన దనియుఁ దెలుచున్నది. మదనుఁడు విప్రనారాయణుని హృదయదుర్గముకు సంవత్సరము ముట్టడివైచి

యేమియుఁ జేయఁజాలక యంత దైవసంకల్పమున నొక్కయదను కుదుర నది సందుచేసికొని చీఁకటిలో విద్యుత్కాంతిచే దేవదేవిని జూపుట, యాసుందరిచేఁ బాటలు పాడించుట, పాదము లొత్తించుట యనుమూఁడువాఁడియమ్ములు నొకటి మీఁద నొకటి ప్రయోగించి ధైర్యప్రాకారమును భగ్నముగావించి హృదయ దుర్గము నాక్రమించికొనెను.

అంతకాలము సురక్షితమయినధైర్య మొక్కగడియలోఁ జెడిపోయె ననుట స్వభావసిద్ధము గా దని కొందఱకుఁ దోఁచవచ్చును గాని, యది సరిగాదు. కల కాలము జాగరూకులుగా నున్నపురుషులు దైవవశమున భ్రష్టులగుట యసాధారణ మని చెప్పినఁ జెప్పవచ్చును గాని, యదిస్వభావవిరుద్ధము గాదు. స్వాభావికము నసాధారణము నయినవస్తువే కావ్యయోగ్యము ఈకారణములఁబట్టి కథాసన్ని వేశమందును, నాయకచరితౌచిత్యమునందును మల్లయకృతియే యుత్తమ మని తేలుచున్నది.

— * నాయిక * —

జితేంద్రియుఁ డగు విప్రుని వశపఱచికొనుట యశక్య మనుతలంపుతో మధురవాణికిని, ఎట్లయిన నితని విటునిఁ జేయవచ్చు ననెడియూహతో దేవదేవికి నేదో యొకవిధముగాఁ బందెము జరగె ననుట యీరెండుగ్రంథములయందును గనఁబడుచున్నది. కాని, యీపన్నిదముయొక్క యుద్దేశమున కనుగుణముగా నిందలి నాయిక యొకసంవత్సరి మతిక్లేశపడి, యేల యూరక లేనిపోనికష్టము తెచ్చి పెట్టికొంటి నని విచారించి, తుద కెట్లో తనప్రతిజ్ఞ నెఱవేర్చికొనినట్లుగా వైజయంతీ విలాసనాయిక ప్రతిజ్ఞానిర్వహణమునకుఁ గ్లేశపడినట్లే కానరాదు. కాని, వైజ యంతీవిలాసనాయికవలె నిందలి నాయిక హావభావాదిశృంగారచేష్టలచే నాయ కుని మనసు కరఁగించుటకై యెడనెడ విశేషించి యత్నించినట్లును గానరాదు.

— * అమానుషకార్యములు. * —

శ్రీరంగనాథుఁడు వినోదార్థమై మోక్షకామి యగు విప్రనారాయణుని గామిగాఁ జేయఁదలంచి దేవదేవిని జన్మింపఁ జేసెననియు, సంవత్సరముపఱకు నది యేమియుఁ జేయలేమిని జూచి తానే గాలివాన కల్పించె ననియుఁ, తానే శిష్య రూపముదాల్చి బంగారుగిన్నె దేవదేవి కిచ్చె ననియు నిట్లు మూఁడుస్థలములయం దమానుషకార్యములు కల్పింపఁబడినవి. వీనిలో మూఁడవది యవశ్యకథాంశమే కావున నుండవలసినదియే; కాని, తక్కినవిరెండు ననావశ్యకము లగుటయేకాక

రసభంగకరములుగాఁగూడఁ గన్పట్టుచున్నవి. పరమభాగవతోత్తముఁడు నియమభ్రష్టుఁ డగుటకు భగవత్ప్రేరణము దక్క వేఱొండు కారణము దగ దని యీయుపపత్తులు గల్పింపఁబడి యుండును. ఇట్టికల్పనలు పురాణములం దనేకములు గలవు. కాని, కావ్యములయం దవి యంద మీయవు. సీతారాములు లక్ష్మీనారాయణావతారము లని తొలుత నొకచోటఁ జెప్పినను, బిదప రామాయణమం దెల్ల వాల్మీకి వారిని మానవులనుగానే వర్ణించెను; కాని, యధ్యాత్మరామాయణమందువలె నడుగడుగునకు వారు లక్ష్మీనారాయణు లని ప్రశంసింపలేదు. కావుననే, వాల్మీకిరామాయణము కావ్య మైనది. సాధారణముగా నాయికానాయకులు తోడిమానవులుగా నుండినఁగాని చదువరులకు వారిచరిత్రమును దెలిసికొనుటయం దాసక్తియుఁ గుతూహలమును గలుగవు. దివ్యపురుషులచరిత్రములు వర్ణించునపుడుగూడ వారిని మర్త్యసమానులనుగా వర్ణించుటయే యుచిత మగుచున్నదని విదితమే. ఎంతటి దృఢచిత్తుఁడై నను గాలవశమునఁ బ్రమాదవశుఁడు కావచ్చు ననునదియే విప్రనారాయణచరిత్రములోని సారాంశము. విప్రనారాయణుఁడు కాముకుఁ డగుట దైవప్రేరణమువలనఁ గలిగినది గాని, యతనిధైర్యము చెడుటవలనఁ గాదని చెప్పుట ప్రధానకథోద్దేశమునకు భంగము గలిగించుచున్నది.

— వర్ణనములు. —

పరమయోగివిలాసములో హృద్యము లగువర్ణనములు గొన్ని గలవు గాని, భక్తిరసము ప్రధాన మగుటచేతను, గథ విస్తరింపఁబడకపోవుటచేతను వర్ణన లందంతగా లేవు. తమ్మయకవి దేవదేవి విప్రనారాయణునిఁ జేరుట, వేశ్యావృత్తి, విప్రనారాయణుని వంచించుట, నాయికశృంగారచేష్టలు మొదలగువానిని మిక్కిలి సరసముగా వర్ణించెను గాని, కొన్నిచోట్ల సందర్భౌచిత్యమునకు విరుద్ధముగా వర్ణనములు పెంచెను. నాయకుని వర్ణించినపిదప గ్రీష్మర్తువర్ణనమునకుఁ బూర్వము వసంతవర్ణనము గావింపఁబడినది. ఇది నిష్ప్రయోజనము. మల్లయ దీనిని విసర్జించెను. దేవదేవీమధురవాణులు రాజసభనుండి యింటికిఁ బోవుచు విప్రనారాయణుఁ డున్నచోటికి వచ్చి రని చెప్పునపుడు మల్లయ నాలుగుపంక్తులలో నిమిడ్చిన రాజసభావర్ణనమునకుఁ దమ్మయకవి యైదాఱుపద్యములు వినియోగించెను. ఇదియు నప్రస్తుతమే. మఱియు, దేవదేవి నాయకునియొద్దకు వచ్చి తనవృత్తాంత మంతయుఁ దెల్పుసందర్భమును మల్లయకవి తొమ్మిదిపద్యములతో హృద్యముగా వర్ణించియుండఁగాఁ దమ్మయకవి దానిని బెంచి ముప్పదిపద్యములు చెప్పెను. దేవదేవి తన

వైరాగ్యమును విస్పష్టపఱచుటకు వేశ్యావృత్తిని నిందించుట యుచితమే గాని తమ్మయకవి చేయించిన ట్లతిమాత్రగా నిందించుట యుచితము గాదు. నాయకునిఁ గవయుతఁజే వస్త్రవిసర్జనము గావించిన నాయికను తమ్మయ కవి వర్ణించినవర్ణన జుగుప్సాకరముగా నున్నది. మల్లయకవి యీసందర్భమును మిక్కిలి గుప్తముగా వర్ణించెను.

## — హాస్యరసము —

మల్లనకవి హాస్యరసమునుగూడ సమయోచితముగా నందందుఁ బ్రయోగించెను. దేవదేవి వైరాగ్యోపన్యాసముచేసి, తనమాటల నాబ్రహ్మచారి విశ్వసించి తన్నుఁ గుశలప్రశ్న మడుగఁగా నది "చిక్కె దమ్మం" డని సంతసించినట్లును, దేవదేవి పర్ణశాలలోనికి వచ్చినపుడు దానిసాంసర్గము తన కెక్కడఁ గలుగునో యనుభీతిచే "తడికాళ్లతోఁ ద్రొక్కెదవుసుమీ..." యనునట్లును జెప్పినవర్ణనములు నవ్వు పుట్టింపకపోవు. నాయిక వెంట వేశ్యావాటికకుఁ బోవునపుడు తన వస్తువులన్నియుఁ బొఱవైచి, దానిబట్టల మోచుకొని పోవుచున్ననాయకుని వర్ణన మెట్టివారికైనఁ గడు పుబ్బ నవ్వింపక పోదు. విటకంటకివేషము, దానిమాటలు, దానికృత్యములును దెల్పుభాగమును జదువునపుడు హాస్యముతోఁగూడ వేశ్యాసాంగత్యమునందలిరోఁత కన్నులకుఁ గట్టినట్లు తెలియకపోదు. శ్రీరంగస్వామి బంగరుగిన్నె తెచ్చి తలుపుతీయు మని పిలిచినపుడు విప్రనారాయణుఁడే వచ్చినాఁడనికొని విటకంటకి యన్నమాట లామాయావిష్ణువునకుఁగూడ నవ్వుగలిగించుట యచ్చెరువు గాదు. ఇట్లే యీభాగమంతయు సరసముగా హాస్యశృంగారముగా వర్ణింపఁబడినది. తమ్మయకవియు నీపట్టున హాస్యరసపోషణము గావించెను గాని, కొన్ని తావుల హద్దు మీఱెను.

వేశ్యలు తొలుత విప్రనారాయణునిఁ జూచినసందర్భమునఁ దమ్మయకవి—

సీ. ప్రతిమాసవపనముండితమైనమస్తంబు పెడతలఁ దూలాడుపిల్లసిగయుఁ
దులసినెత్తమ్మిపూసలగొప్ప పేరులు విపులరంధ్రము లైన వ్రేలుఁజెవులు
నడుపీథి గల నిల్వునామంబుపట్టెలు శోభిత బగుతిరుమూర్తి రేఖ
పెన్నూలిత్రాటఁ గీల్కొన్న కౌపీనంబు వితతంపు నీర్కావివేష్టువలును
గలిగి పద్మాసనస్థుఁడై కన్ను మోడ్చి, భగవదారాధనైకతత్పరతనున్న
శ్రీమదష్టాక్షరీమంత్రచింతనావ, రాయణుండైన విప్రనారాయణుండు,

అని వర్ణించెను. ఈవర్ణనము కొంతవఱకు స్వభావోక్తియే యైనను, రూపము హాస్యాస్పదముగా వర్ణింపఁబడినది. ఈసందర్భమున విప్రనారాయణుని గౌరవాస్పదుఁ డగుభగవద్భక్తునిఁగా వర్ణింపవలయును గాని, హాస్యాస్పదునిఁగా వర్ణించుట యనుచితము. ఈవర్ణనమే మల్లయకవి ప్రౌఢముగాను సమయోచితముగాను గావించె నని సహృదయులు తలంపకపోరు. అది యెట్లన:—

సీ. తొగలచెలిలోకందు దిగజాఱె ననఁగ మొగమ్మున బవిరిగడ్డమ్ము మెఱయ
నుదయాద్రిశిఖరంబు తుద భానుబింబంబు సాటి నొదలఁ గావిశాటి మెఱయ
బొమల నెన్నడిమిపద్మము దళంబులరేఖ రహిఁజూపు నూర్ధ్వపుండ్రంబు నిగుడ
లోనిడి హరిభక్తి పైని ముద్రించె నా శంఖచక్రములు భుజములఁ జెలఁగ

గీ. ద్రివిధగాథాన మొకచోటఁ దెలుపుచున్న
త్రిపథపదివోలె నలుత జన్నిదము దనరఁ
బూర్ణతరుమూలజలకుంభముల గణించు
సరణితోఁ జుత మాధవస్మరణ మమర.

మల్లయవర్ణించిన—

క. నామములు దీర్చి తులసీ, దామంబులు వైచి బేలతనమునఁ దగునీ
సామిలె కారా మగువల, బాములఁబడువారు వేషభాషల గుఱుతే?

అనుపద్యముకంటెఁ దమ్మకవి చెప్పిన—

క. ఇటువం టయ్యలె కారా, చిటుకుమనక యుండ సంజచీఁకటివేళన్
ఘటచేటీవిటులై యి,క్కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ!

అనుపద్యమే సరసముగా నున్నది. కాని, దేవదేవి యోగినీవేషము వేసికొని విప్రనారాయణునిఁ జేరినపు డాతని—

క. అమ్మగువఁ గనుంగొనియెన్, ముమ్మరముగఁ బట్టెనామములు మై నెల్లం
గ్రమ్మికొన నుట్టిఁ బెట్టిన, గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతనిన్.

అని పరిహాసించినపద్యముకంటె మల్లయ కవి చెప్పిన యీక్రిందిపద్యమే సరసముగా నున్నది.

చ. ననిచినగుజ్జుమావికెలనం దగుగందపుమ్రానికొమ్మలం
బెనఁగొనియున్న మల్లికలపెక్కువ గన్గొని నీళ్లుగట్టి సం
జనితకుతూహలాంకురము శాఖలువాఱఁగ వచ్చుచున్నయ
మ్మునికులసార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్.

# విషయసూచిక.

చందా సం॥ కు రూ. ౩—0—0. విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 4. } రాక్షసనామసంవత్సరము శ్రావణమాసము { సంచిక. 6.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమును గడపటివారములో బ్రకటింపఁబడును

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి

# విషయసూచిక

ధ్వస్తారాతినృపాలసైన్య ! యమ్మృషావాణీపదాధ్వన్య ! ధీ
రస్తోమస్తవనీయజన్యగరిమప్రాధాన్యయోధాగ్రణీ ! 105

క. కంధరవాహనసింధుర, సైంధవచందనసుగంధ సౌగంధికినీ
బంధుసుసింధురశరమరు, దంధఃపరిపంధిబంధురాయతకీర్తీ ! 106

మానిని. పాటవసంగితురంగభటోద్భటబంధురగంధగజేంద్రఘటా!
హాటకకూటధురీణపులీనమహత్తరమత్తరిపుక్షితిభృ
ద్ఘోటవిపాటనశాతవిహార ! నిశాటవిరోధికటాక్షనిరా
ఘాటకృపారసపూరసమేధితగాఢనిరూఢనిజాభ్యుదయా! 107

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితావిలాసవా
సిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకర
సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతి
ప్రణీతం బైనచంపూరామాయణం బనుమహాప్రబంధంబునందు,

ద్వితీయాశ్వాసము.

---

క. తనయులు దడయుట కధిపతి, మనమునఁ బనుచుటయు నలఁసు మహాబిలపదవిం
జని నిగుత్తైన పితృవ్యులఁ, గని వారిం దనుప వారిఁ గాంచెం దను నేర్పన్. 15

క. చదలేటినీటఁ దడుపక, కొద లేటికిఁ దీఱు సగరుకొడుకుల కని ప్రే
మ దివంతచరుఁడు గరుడుఁడు, మదివంతి యడంప నంశుమంతుండంతన్. 16

చ. కపిలు సహాశ్వపార్శ్వగతలుఁ గన్గొని జన్నపుఁదేజియుంచు ం
న్నప మొనరించి వానికరుణన్ హయముం గొని తెచ్చి యిచ్చినన్
నృపుఁడు తనూజమన్యువు భరించియు మన్యసమాప్తిఁ గాంచి ది
వ్యపదవి కర్హుఁ డయ్యె నతివార్ధక మొందియు నిర్జరోన్నతిన్. 17

క. అసమంజసుతుం డంతట, వసుమతిఁ బెక్కేండ్లు ప్రాని వలిసులకడఁ దా
పసియై తిరిగియు సురనది, వసుధకుఁ దేనోపఁ డయ్యె వానిసుతుండున్. 18

గీ. తండ్రిక్రియఁ బోనలదిలీపతనయుఁ డగుభ
గీరథుండు గోకర్ణంబుఁ జేరి సలుపు
తపమునకు మెచ్చి యిలఁ దూఱు తనదువేగ
మాఁగికొనఁజూచు నుగ్రుపై నాగ్రహించి. 19

సీ. తొగఱేని పరివార మగుతారసంఘంబు శంఖరింప న్మణిసరణిఁ జూప
జవనీతహారిదంతజలధరవ్రాతంబు కూలశైవలజాలలీలఁ దోఁప
సుడివడి తిరిగెడు సురవిమానశ్రేణు లెడనెడఁ బడవలవడువుఁ దెలుప
ఛిదురాసి తను నెందు వెదకింపఁ జొదంతి డిండీరఖండపాండితి భజింప

గీ. గగన మేకోదకీభూత మగుట నబ్జ, హితుఁడు దిగ్భ్రమము వహింప నతని తేరి
హరులఁ దరఁగలవెల్లిఁ బోనాఁప లేని, తహతహ ననూరుఁ డాత్మఁ బోఁ దల్లడిల్ల.

మ. నురుఁగన్నవ్వు ముఖాబ్జమం దొదవ నన్నుం బూసి పోసీక శం
కరుఁ డేయాఁగెడువాఁడు చూతమనుచుం గల్లోలవాచాలతన్
సురకల్లోలిని కేలిసీరమణహృజ్జూటీజటారుద్ధ యై
గటికిం బట్టిన మంచుబొట్టు కరణిం గన్పట్టెఁ జిత్రంబుగన్. 21

క. పృథుకేందుమౌళి సురనదిఁ, బృథివికి రానీక యడ్డుపెట్టుటయు భగీ
రథుఁ డాత్మ నపూర్ణమనో, రథుఁ డై నుతియించె ధరణిరథు నీకరణిన్. 22

సీ. కుసుమవాటియు మహాసనము నై పొసఁగు నేదేవదేవునకును దేరివలువ
చూపులు రూపులు నై పొల్పుమీఱు నేపరమపూరుషునకు బండికండ్లు

లాయంబుఁ గంచంబు నై యుల్లసిల్లు నేదంటవేల్పువకును గంటసరము
లీలాబ్జ మంపకముల్కియు నై చెలంగు నేయసమవైభవునకు నొసలికన్ను
గీ. నతని జితకంతు నతులబాహాప్రతాప, దూరతోవార్యమాణసింధూరసింధు
రాశరకళత్ర సీమంతు నంఘ్రిహతకృ, తాంతు వామార్ధశుద్ధాంతు నభినుతింతు.
మ. జయ మృత్యుంజయ! వాసరాత్యయవియచ్చారీవినోదప్రియా!
జయ గంగాధర! మేదినీధరధనుర్జ్యాకర్షణోద్యత్కరా!
జయ గౌరీధవ! సారసోద్భవరమాజానిప్రణీతస్తవా!
జయ విశ్వాధిక! దారుకావనమునిశ్యామాప్రియంభావుకా! 24

వ. అని యిట్లు నిజకపర్దనిర్దయరుద్ధసిద్ధవాహినీమహీతలావతారకారణ నైపుణంబుఁ జూపునాదిలీపభూపాలతనయు నాత్మీయచిత్రచారిత్రబహువిధోచ్చారణంబునకు మెచ్చి వైయచ్చరపరంపరాకిరీటకోటిమణిఘృణిపాటలమరీచి మాలికారచితనీరాజనోపచారచారుచరణరాజీవుండును, కైవల్యవితరణానుకూలకరుణారసార్ద్రిభావుండును, శిఖండిపదమార్గణవ్యగ్రశాబరీ మరాళగమనరోధికాదంబినీడంబరవిడంబికాకోలకాళిమాళికమృగమదానులేపన మనోహరగ్రీవుండును, వినోదమేదినీధరాయమాణరాజతగ్రావుండును, నఖండస్వీయంవ్యక్తసూక్తిశీలితానేకభావమోహకప్రకాశితానన్యదేవసామాన్యదివ్యప్రభావుండును, నభంగురస్వీయసంగరోపకరణతాసమంచితప్రపంచ దురహంకరణవంచనాచుంచుకించిదవదాతహసితమాత్రనిర్వాపిత పురత్రితయపూర్వదేవుండును, నగు మహాదేవుండు దను నవని కవతరించుట కనుమతించుటయుఁ బంచశరపంచశాఖామండలితపుండ్రకోదండదండంబునం దుండి చిటిలిపడు బటువుకట్టాణిముత్తియంపుఁ బూసకరణి ధరణిజనపాతకప్రతతి కుత్పాతహేతు వై గగనపదవిం దెగి పడిన మిక్కుటంపుఁదోఁకచుక్క తేఁకువ మరకతంపుటుప్పరిగకొణిగ దప్పి యుఱుకుబకదారిపారువామిటారితీరునఁ గుమారనారాచధారావిదారితధరాధరవివరసరణి నిర్గమించు రాయంచమించుఁబోఁడి పోఁడిమి హిమాద్రిమంజులనికుంజంబు నిష్క్రమించు పంచాననప్రమదకొమరున నమరపురవనాంతరాళతంతర్యమాణ నిష్క్రాంతి యైన చౌదంతియొప్పిదంబున నంబరగవీలలామంబు పొదుగునం బరిస్రుతం బగు నురుక్షీరపూరంబు డంబున నాదేవదేవుపాటలజటాజూటంబు వెలువడి చిలువచెలువ చెలువలర, దంష్ట్రికలసెకలం దొలంగించు బలుచలువఁ బరివసతి నెలకొన, నలకమురపతి వీఁడుచిప్పుఁ దాఁకి యుప్పరం బెగసి జగదండక

పనుపునఁ దపము సల్ప నగారి కైతవంబునఁ బరిచర్య సల్పుచు వినీతుఁ
డై యుండి యొక్కనాఁ డంఘ్రి నెన్నెఱులంట నళుచియై కూర్కనయ్యతివకుక్షిఁ

గీ. దూఱి గర్భంబుఁ బవి నేడు తునుకలుగ నొ, నర్పనవి సప్తమారుతినాఁ జెలంగె
నాశరులతల్లి వసియించు నప్పు డిప్పు, రము గుశేప్లవమను కాన రవికులీన. 27

క. పొడమెన్ సుకృతి యలంబస, యెడ నొకఁడు విశాలుఁ డనఁగ నిక్ష్వాకునకుం
గొడు కతనిపేరి దఘుముప, కెడయీఁదు విశాల యయ్యు నిది రఘువీరా! 28

చ. సుమతినృపాలుఁ డేలుపురిఁ జూత మనం జని మువ్వు రాధరా
రమణుసపర్య గైకొని పురందరుఁ డేజడదారి నారిపైఁ
దమి గతశోకుఁడై పిదపఁ దాల్చె నజాండభరంబు నట్టిగా
తమజటి యున్నయాశ్రమపదంబు కుఱుగటత్రోవఁ బోవఁగన్. 29

క. పాషాణ మొకటి రఘుకుల, భూషామణి పదపరాగములు పైసోఁకన్
యోషాతిలకం బగుచుం దు, రాషాడరవిందగంధిరహిఁ జూపట్టెన్. 30

మ. మనువంశేంద్రుపదాబ్జరేణువు పయిం బాఱంగ నెమ్మోము కౌ
ను నెఱుల్ పొక్కిలి పాణిపాదములు కన్నుల్ పుష్కరచ్ఛాయ మ
య్యె నయారే యనఁ బద్మవాసనలు మేనెల్లం గన న్నోఁచియుం
జనుకోయి న్విడదయ్యె శైలగరిమస్వాభావ్య మయ్యింతికిన్. 31

గీ. అరిది యనఁగఁజెల్లదె రజోగుణమె ఖేద, మునకు మోదమునకు మూలమగుట
రజమువలన వికృతి భజియించినయహల్య, ప్రకృతిఁ దాల్చె రామపదరజమున. 32

సీ. తనచంచలతవాయ దని తపంబొనరించు తొలకరిమెఱుఁగొ యీతలిరుఁబోఁడి
హరసాంధ్యకృతిఘాటి ధరకు జాఱినసుధాకరరేఖయేమొ యీకంబుకంఠి
వసుమతి తనపేరువాసింపఁ గన్న పైఁడిసలాక యేమొ యీబిసరుహాక్షి
తనచెలికాని కామిని కనంగుఁ డొసంగిన కృపాణి యేమొ యీచలితపాణి

గీ. యనఁదగు నహల్యయాతిథ్యమునకు నలరి
కౌశికుఁడు రాఘవులతోడఁ గదలి యంత
జనకమఘవాటి కరుగఁ బూజన మొనర్చి
యినకులునితో శతానందుఁ డిట్టులనియె. 33

— * రామలక్ష్మణులకు శతానందుఁడు గాధేయవృత్తాంతముం జెప్పుట. * —

శా. కన్యాకుబ్జపురి న్వసించునపు డీగాధేయుఁ డక్షౌహిణీ
సైన్యంబుం గొని యొక్కనాఁడు మృగయాజాతాశయానందుఁడై

వన్యం బ్రగుష్మరఁ దోఁచు ఘర్మ మడఁగన్ వాసిష్ఠసద్మంబునం
దన్యూనామరధేనుకర్తృకతదీయాతిథ్యసంతుష్టుఁ డై. 34

ఉ. ఈపసి గాచియుంట వసియించుటకుం దగుఁగాక దక్కనే
తాపసి కంచుఁ దద్గవికతం బగునుద్ధతిఁ బెట్టుఁ జేసి క్షా
త్రపబలంబు బ్రహ్మబలధిక్కృత మౌట యెఱింగి చాపముం
రోషముఁ బాఱవైచి మునిరూపముఁ దాలిచి తత్క్షణంబునన్. 35

చ. తప మొనరించు నత్తఱిఁ బతంగకులాబ్ధిశశాంకుఁ డాశయ
వ్యపగతశత్రుశంకుఁ డగునట్టి త్రిశంకుఁడు బొందితోడఁ ది
వ్యపదవికై వసిష్ఠు విడనాడి తదాత్మజులన్ దురుక్తిచేఁ
గుపితులఁ జేసి శాపము దగుల్పడి తన్ శరణంబు సొచ్చినన్. 36

ఉ. మాలతికంబు సూడక సమస్తఋషుల్ తనుఁ గూర్చి నవ్వ నా
వేళ వసిష్ఠసూను లొదవెం గద రాజకయాజకుండు చం
డాలపుసోమయాజి కని నవ్విన వారి యవాచ్యజాతులై
కూల శపించి వేలుపులు కుంభిని కిన్ దిగమి స్వర్గోప్తుఁ డై. 37

చ. దివికిఁ ద్రిశంకుఁ బంపుటయు దేవవిభుండు తదీయకల్మష
ప్లవపతివేషముం గని యిలం బడఁద్రొబ్బ నభంబునందు న
య్యవనిపు నుండఁబంచి భువనాంతరకల్పన మంత నబ్జసం
భవకృతసాంత్వవాదుఁ డయి మాని తపోభరితాంతరాయతన్. 38

క. పశ్చిమదిక్కున కరిగి వి, పశ్చిదపశ్చిముఁ డతండు బహువర్షము లం
దాశ్చర్యకృతాస్తోకత, పశ్చర్య వహించె భూనభశ్చరనుతుఁ డై. 39

మ. నరమేధంబున కంబరీషుఁ డడుగం దన్ దల్లిదండ్రుల్ ఘనా
తురులై యమ్మఁగొనం బశూకరణభీతుం డై శునశ్శేఫుఁ డీ
కరుణాబ్ధిన్ శరణంబు వేఁడ నతనిన్ గాధాయుగప్రీణితా
మరుఁ గావించి భజించె నిట్టి త్రిజగన్మాన్యుండు సామాన్యుఁడే. 40

క. వెండియుఁ బడమటిచాయని, తం డుగ్రతఁ బూనుకొన్న తపముఁ జెఱుప నా
ఖండలుఁ డలసుమనఃకో, దండుని వేదండమైన తనుఁ బనుచుటయున్. 41

క. మేనక మానివిరక్తి భ, యానక రతిరాజరణజయానకనిభసిం
జానకనత్తరనూపుర, యానకళానుగతగాంగహంసాంగన యై. 42

బున దీపంబు గొని వచ్చుట మహాశ్చర్యం బనికొనియాడుచు నఖండంబు వెలిఁగింపు మని ప్రార్థించిన మౌనవ్రత యై కొంతతడ వుండి యూరక చనుచుండ నేన త్తఱి నుత్తరీయంబు పట్టిన నమ్మహాదేవి బలాత్కారంబునఁ జనుచుండి తొట్రుపాటున నేలంబడి జ్ఞానప్రసూన యనుదాన నని యమృతోపమానంబు లైన వాగ్విశేషంబుల నన్నాదరించి చిద్విలాసం బైనసూక్ష్మతత్త్వంబు బోధించుచుండ విస్మయానందుండ నై మున్ను లభ్యం బై చెదరిన యోగనిద్రాకీలకం బనుగ్రహింపు మని విన్నవించుసమయంబున నమ్మహాదేవి యంతర్ధానంబుఁ బొందె. ఆప్రసాదంబు వడసి నామనోముసలంబు విజ్ఞానకిసలయంబులం జెలఁగి పరమాణురూపంబునఁ బ్రకాశించెఁ గావున ... ... ...

చ. మనసు గుదించి సూక్ష్మతనుమార్గము నంటుచు సత్తు చిత్తునం
దనుకువచేసి యాత్మసుఖ మానెడితత్త్వరహస్యమాధురిన్
వినఁదగు రాజయోగులకు వీనులవిందొనరింపఁబూని నేఁ
డెనుఁగునఁ దేటచేసెద నుదీర్ణకవిత్వపటుత్వసంపదన్.

కవికాలము :—ఈకవి గ్రంథావతారికలో ముక్తిరామేశ్వరపురమును, రామేశ్వరుఁడే చంద్రమౌళీశ్వరలింగమై జనియించుటను, ఆలింగమును శ్రీ శంకరభారతీనృసింహస్వామి పుష్పగిరికిఁ దెచ్చుటను, వర్ణించి యీభారతీనృసింహస్వామికి జ్ఞానోపదేశము చేసి పీఠాధికార మిచ్చిన యభినవోద్దండ బిరుదాంకితు లగు శ్రీవిద్యానృసింహభారతీస్వాములవారు శాలివాహన శకము 1744 చిత్రభాను సంవత్సర జ్యేష్ఠశుద్ధపూర్ణిమాకుజవారమున (అనఁగాఁ క్రీస్తు శ. 1822) బ్రహ్మైక్యమును జెంది యనంతర మొకనాఁడు తనకుఁ గలలోఁ గనఁబడి తత్త్వవిద్యారహస్యంబు విస్తరింపు మని యానతీయఁ గాఁ దా నీగ్రంథమును రచియించి పుష్పగిరిపీఠమున కర్పించినట్లు వ్రాసికొనెను. దీనింబట్టియు, నీస్వాములవారిశిష్యు లగుశంకరభారతీస్వాములవారి పరిపాలనము వర్ణించుటంబట్టియు, నిచ్చటిప్రతిగూడ 60—70 సంవత్సరములక్రిందటనే రచియింపఁబడినట్లు కనఁబడుచుండుటంబట్టియు, వెనుకఁ జూపిన క్రీ. 1822 లోనే యిక్కవి యున్నట్లు స్పష్ట మగుచున్నది. ఇతఁడు జ్ఞానప్రసూనాంబాభక్తుఁ డగుటచేఁ గాళహస్తిప్రాంతమువాఁ డయినట్లును, ఆలూరి సుబ్బరాయశాస్త్రిని, వీరరాఘవపురమును, వర్ణించుటచేఁ దద్గ్రామవాసుఁ డయినట్లును, గ్రహింపవచ్చును గాని తనగ్రంథమును బుష్పగిరిపీఠమునకు సమర్పిం

చుటచేతను, పుష్పగిరిని వర్ణించుటచేతను, నితఁడు పుష్పగిరిలోఁ గూడఁ గొంత కాలము నివసించినవాఁ డనియే ధ్రువపడుచున్నది.

గ్రంథవిషయము :—తనగ్రంధనిర్మాణమునకు జ్ఞానప్రసూనాంబయు శ్రీవిద్యానృసింహభారతీస్వామియుఁ గూడఁ గారణ మయినట్లు వేఱువిధముగా వర్ణించికొని నట్లు కనఁబడును గాని గ్రంథారంభమునకు జ్ఞానప్రసూనాంబ యొసంగినజ్ఞానమే కారణ మనియు గ్రంథవ్యాప్తికిని గ్రంథము పుష్పగిరివీర మలంకరించుటకును స్వామి కారణ మయినట్లును సరిపుచ్చుకొనవలసివచ్చినది.

ఇచ్చటిగ్రంథము శిథిలముగాక చక్కఁగనే యున్నది. కవిత్వ మంతనిర్దుష్టమైనది గాదు గాని ధారాళముగానే యుండును. ఇందుఁ గర్మయోగము, భక్తియోగము, మతభేదవిచారము, సృష్టిక్రమము, ఆత్మోపదేశము మొదలగు సకల తత్త్వవిషయములును వర్ణింపఁబడినవి. శైలిఁ దెలుపుటకు రెండుపద్యము లుదాహరించెదను.

క. ధర్మాధర్మద్వయ మగు, కర్మంబులు చేయఁ బూని కడతేఱుదురే
నిర్మలయోగులు పల్కిరి, కర్మము సంసారఘోరగహనం బనుచున్.

శా. దేవుం డొక్కఁడు జీవుఁ డొక్కఁ డనుచున్ ధీయుక్తి శాస్త్రోక్తులన్
దా వాదించుచు భక్తిముక్తిగతికిన్ దథ్యంబయే మాత్రమే
జీవుం డెంతటివాఁడొ నిశ్చయముగాఁ జింతింప నేరూపమో
యీవైకల్యమె జన్మకర్మములయం దిష్టంబుగాఁ దోఁచెడిన్.

## 50. భాగవతము.

ఇందు 11—12 స్కంధములు మాత్రమే కలవు. బమ్మెర పోతనామాత్యుని ప్రియశిష్యుఁ డగువెలిగందల నారయకవి తెలిఁగించిన యేకాదశద్వాదశ స్కంధములకంటె వేఱయిన యీరెండుస్కంధములను హరికభట్టారకుఁ డనుకవి రచియించెను. ఈతనిం గూర్చి తెల్పుగద్య మొక్కటి యీక్రిందివిధముగా నున్నది. "ఇది శ్రీహనుమల్లబ్ధవరప్రసాద సకలవిద్యానవద్య సహజ సారస్వత చంద్రనామాంక రామవిద్వన్మణికుమార హరికభట్టారకప్రణీతం బైనభాగవతమహాపురాణంబునందుఁ గశ్యపాదిమునిసమాగమంబును......"ఇట్లే తత్కథావృత్తాంతంబు పరిపూర్ణం బైన యేకాదశస్కంధమును. ఇందలి చంద్రనామాంకవిశేషణము గృహనామపర మని తోఁచుచున్నది. పైగద్యముంబట్టి యితఁడు రామ

పండితునిపుత్రుఁ డనియు, నాంజనేయోపాసకుఁ డనియు, సహజపాండిత్యము గల వాఁడనియు, మాత్రము తెలియుచున్నది.

ఇతఁ డేకాదశస్కంధము మొదల విష్ణుధ్యానరూపమంగళాచరణమును స్వేష్టదైవాంజనేయస్తుతియు నొనరించి—

శా. బంధూకప్రసవాతిరిక్తవదనున్ బ్రఖ్యాతునిన్ రామహృ
ద్బంధున్ వాయుతనూభవుం దలఁచి విద్వత్కోటి మద్వాగ్విభూ
తిం ధాత్రి న్నుతియింప భాగవతమం దేకాదశద్వాదశ
స్కంధంబుల్ దెనిఁగింతుఁ బూర్వకథితస్కంధానురూపంబుగన్.

అని ప్రతిజ్ఞ కావించియున్నాఁడు. కాని వెలిగందల నారయ తెలిఁగించిన యీరెండుస్కంధములను గంఠపాఠము గావించి యందలిపద్యములు పద్యములు గాను గొన్నివచనములు పద్యములుగాను గొన్ని పద్యములు వచనములుగాను మార్చి రచియించిన యీతఁడు బమ్మెర పోతనామాత్యునకును నతని ప్రియశిష్యుఁ డగునారయకును మిక్కిలి తరువాతివాఁ డయినట్లు కనఁబడుచుండుటయే కాక గ్రంథచౌర్యకవులకుఁ బ్రథమోదాహరణముగాఁ గనఁబడుచున్నాఁడు. కావుననే యీతని యీగ్రంథమునకు లోకమునఁ బ్రఖ్యాతి రాలే దని తలంపవచ్చును. పోతనామాత్యునకు శిష్యుఁడై యాతనికి సమకాలికుఁడయిన నారయ యీతని గ్రంథమును జూచి చివరిరెండు స్కంధములను రచియించెనేమో యని యాలోచించుట యసమంజసమును యుక్తిరహితము నగుటచే నతనిప్రాచీనత్వము నీతని యర్వాచీనత్వమును గూర్చి చర్చింప నక్కఱలేదు. ఇఁక నీతని సరియయిన కాలము తెలియరాదు గాని యిందలిప్రతిమాత్రము కడచినక్రోధనసంవత్సరములో వ్రాయఁబడినట్లు కనఁబడుచున్నది.

గ్రంథవిషయము :—ఈప్రతిలో ద్వాదశస్కంధములోఁ గొంతవఱకు మాత్రమే యున్నది. ఏకాదశస్కంధము పూర్తిగా నున్నది. ఇది నారయరచియించిన యేకాదశస్కంధముకంటెఁ బెద్దదిగానే యున్నది. ఈతనిగ్రంథచౌర్యమునకు రెండు పద్యములుదాహరించెదను. గ్రంథమంతయు నిట్లే యుండుటచేఁ గవి చేసిన "పూర్వకథితస్కంధాను రూపంబుగన్" అనుప్రతిజ్ఞావచనమునకు "పూర్వుఁడయిన నారయచేఁ జెప్పఁబడిన యేకాదశద్వాదశస్కంధముల కనుసరణముగా" నని యర్థముచెప్పికొనుట తగియున్నది.

మ. విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారముం మాన్పి దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుది ముట్టన్ వధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యం బయ్యె నత్యుగ్రమై.

క. నరవర యీప్రశ్నమునకు, సరిచెప్పఁగ రాదు నేను సామర్థ్యముచేఁ
బరికించి నీకుఁ జెప్పెద, గరమొప్పఁగ భావికాలగతులన్ వరుసన్. 11—12.

నారయ.

మ. విదితుండై సకలామరుల్ పొగడ నుర్వీభారముం మాన్చి దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదిముట్టన్ వధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమిలోన నవిషహ్యంబయ్యె నత్యుగ్రతన్.

క. నరపాలక యీప్రశ్నకు, సరిచెప్పఁగ రాద యేను సారస్యముచేఁ
బరికించి నీకుఁ జెప్పెదఁ, గరమొప్పఁగ భావికాలగతులన్ వరుసన్. 11—12.

హరికభట్టు.

## 51. జలక్రీడావిలాసము.

ఇది యొకయక్షగానకావ్యము. దీనికవి అకలంకము కృష్ణమాచార్యుఁడు. ఆనందసంవత్సర పుష్యమాఘఫాల్గునమాససంచికలలో ధనుర్విద్యావిలాసమును గూర్చి వ్రాయునపు డితనికాలము నిర్ణయింపఁబడినది. అప్పటి కీగ్రంథము పరిషత్తునకు లభింపకపోవుటచే నితనియింటిపేరు తెలుపకపోవుటయు, దానిచే మాధ్వుఁ డనిసంశయించుటయు, సంభవించెను. దీనింబట్టి యితని యింటిపేరు, అకలంకమువా రని తెలియుటయే కాక వైష్ణవుఁ డనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. ఇతఁ డొక్కశకుంతలాపరిణయమునే రచియించినట్లుగా, కృష్ణకవి యను పేరఁ గవులచరిత్రమున కెక్కియుండెను. కాని యందుఁ గాలనిర్ణయము లేదు. ఈతని కాలము ధనుర్విద్యావిలాసప్రసంగమున వ్రాయఁబడియుండుటచే మరల నిం దనావశ్యకము.

కవిగ్రంథావతారికలో వినుకొండసీమలోని కొమ్మాలపాడు గ్రామమున నున్న గుమ్మడవు బుచ్చిమాంబా పాపరాజులకుఁ గుమారుఁడైన రమణరాజు ప్రేరేపింపఁగా జలక్రీడావిలాసము రచియించిన ట్లీ క్రిందివిధముగా వ్రాసికొనెను.

సీ. "శ్రీమిళద్విను కొండ సీమసీమంతినీ ... ...

... ... ... ... ...

భద్రసౌధంబు కొమ్మాలపాటిపురము"

క. మణిమాలాలంకృతగృహ, మణిమాలాలలితచతురిమం బగునాప

ట్టణమున నృపకులచూడా,మణి యగుశ్రీరమణభూరమణమణి వెలయున్."

ఇతఁడు ధనుర్విద్యావిలాసమును శకుంతలాపరిణయమును జలక్రీడావిలాసమును గ్రంథములను రచియించినవాఁ డయ్యు నొకగ్రంథమున మఱియొకగ్రంథమును జేర్కొనియుండ లేదు.

ఇతండు శకుంతలాపరిణయమును చిరుమామిళ్ల పాపయ్య ప్రేరణచే రచియించినట్లే, కొమ్మాలపాటిదండకము వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడుగారి ప్రేరణచే వ్రాసి గౌరవము పొందినట్లును గొందఱువలనఁ దెలియుచున్నది. ఆదండకమును, శకుంతలాపరిణయమును, బరిషత్తున కింకను దొరకలేదు. శైలి దెలుపుటకై జలక్రీడావిలాసములోని యొకపద్య ముదాహరించెదను.

క. తదనంతరమున దేవకి, కుదయించె రథాంగపాణి యుచితగ్రహసం

పదగల్గుముహూర్తంబున, నుదయాచలవీథి సూర్యుఁ డుదయించుగతిన్.

52. బ్రహ్మపురాణోత్తరఖండము.

అయిదాశ్వాసములు గల దీనిని రచించినకవి పట్టమెట్ట సోమనాథ సోమయాజి. గద్యములో నాశ్వాసాంతములందు "ఇది శ్రీభవానీశంకర కింకరతాఖిల ప్రియంకర కవితాపట్టభద్ర పట్టమెట్ట వేంకటామాత్యపుత్ర హారితసగోత్రపవిత్ర ఆపస్తంబసూత్ర సాధుమేధావిరాజి సోమనాథ సోమయాజి ప్రణీతము" అని వ్రాసికొని యుండుటచే గోత్రనామాదులు స్పష్టము. ఆంధ్రకవులచరిత్రమువలన నీ కవి పేరు సోమనాథుఁడనియు, బిక్కవో(నో)లి కామారెడ్డి కంకితముగా సూతసంహిత నేడాశ్వాసములు గలదానినిగఁ దెనిఁగించె ననియుఁ దెలియవచ్చెడిని. ఈ గ్రంథమును పై కామారెడ్డికుమారుఁ డగునెల్లారెడ్డి కంకితము చేసినట్లు గనఁబడుచున్నది.

శా. కారుణ్యాకర బిక్కవోలి వసుధాకాంతావతంసేంద్ర కా

మారెడ్డిక్షితిపాలసంభవ జగన్మాన్యప్రభావాఢ్య మ

ల్లారెడ్డిప్రభు శేఖరాగ్రభవ యెల్లారెడ్డిభూపాల చే

తోరాజీవని జైత్రుభావన సుధాదుష్ట ద్విరేఫార్భకా.

అను నిందలి యొకపద్యమువలన నీ యెల్లారెడ్డి మల్లారెడ్డి యన్ననైనట్లు స్పష్టపడుచున్నది. ఈ మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రమును రచించినవాఁడే యని మల్లారెడ్డి రచించిన శివధర్మోత్తరములోని—

సీ. సిద్ధరామేశ్వరశ్రీమహాదేవ శాశ్వతకృపాసంచితైశ్వర్యపదము
కామినేనికులేశకాచభూపతనూజ జంగమరెడ్డి విస్ఫారితంబు
సకలరాజాస్థాన సంస్తుత్యగుణకామరడ్డినరేంద్రసంరక్షితంబు
ప్రోల్లనరెల్ల భూవల్లభతల్లజ లోకవందిత మనోజ్ఞాకరంబు.

అని బిక్కనోలిపురంబును గూర్చిన పద్యమువలనఁ దేటయయినది.

మాయొద్ద నిదియొక్కటియే ప్రతి గలదు. అందు—

క. శ్రీమల్లింగారాధ్య, స్వామికటాక్షాప్త సకలవైభవయెల్ల
క్ష్మామండలేంద్ర సుమనో, రామా వేశునకు సిద్ధరామేశునకున్.

వ. నిశ్చితాంతఃకరణభక్తి సమర్పితంబుగా నాయొనర్పంబూనిన...అనునది మొదలుకొని యున్నది. మాగ్రంథముంబట్టియు మల్లారెడ్డిగ్రంథములంబట్టియుఁ జూడఁ గవులచరిత్రము చెప్పినట్లు గోదావరిమండలములోనిది గాక యీబిక్కనోలుపురము శివధర్మోత్తరములోని—

మ. ఘనుఁ డాకాచనృపాలశేఖరుఁడు ముం గర్ణాటదేశంబునం
దున దుర్గాధిపతిత్వవైభవము దోడ్తోఁ గాంచి సుల్తాను పి
ల్పునఁ గృష్ణానది దాఁటి యామెదుకుబల్దుర్గంబుక్రిందం బురం
బనమా బిక్కనవోల నుండె నదియాత్రాస్థానరాజంబుగన్.

అనుపద్యమువలన నిజాంరాష్ట్రములోని మెదకుదుర్గమునకు సంబంధించిన దైనది. గోదావరిమండలములోని బిక్కవోలులో సిద్ధరామేశ్వరస్వామి ప్రసిద్ధి మొదలయినవి కనఁబడవు.

మాగ్రంథములో మొదటిపద్యములు లేనికారణమునఁ బై "కారుణ్యాకర బిక్కవోలివసుధాకాంతావతంసేంద్ర కామారెడ్డి క్షితిపాలసంభవ జగన్మాన్యప్రభావాఢ్య" యనుదానిలోని కామారెడ్డి యీయెల్లారెడ్డికిఁ దండ్రి యెట్లయ్యెనో, ఒకవేళ నాపద్యములోఁ బొరపాటున్నదో తెలిసికొనవలను పడలేదు. మల్లారెడ్డి శివధర్మోత్తరములోని,

సీ. మున్ను నీయన్న లభ్యోన్నతస్థితి గామిరెడ్డివరుఁడు నెల్లరెడ్డివరాళి
సూతసంహితయు నాశోక బ్రహ్మోత్తరఖండంబు లంది రఖండపటిమ

నంతట నెల్లభూకాంతుండు వాసిష్ఠలైంగధర్మము రామలింగమునకు
నంకితంబొనర్చె ... ... ... ...
... ... వాసికెక్కిన షట్చక్రవర్తి సుకృతి
నర్థి శ్రీ సిద్ధరామేశ్వరార్పణముగఁ, జేసినాఁడవు. ...
అనుదానివలన కామారెడ్డి యన్నయుఁ, గాచరెడ్డితండ్రియుఁ గావలయును.

ఇక్కవి సూతసంహిత రచించిన పిమ్మట సోమయాజియయ్యె నని తోఁచెడిని. పట్టమట్టవారి ప్పటిస్థితినిబట్టియుఁ బృధుచరిత్రముం జెప్పిన పట్టమెట్ట సరస్వతీ సోమాయజులు "నవఘంట సురతాణినామధేయమువాఁడు తాత వెల్వలపల్లి పోతరాజు" అను పద్యము ననుసరించియు గోదావరిమండలములోని వెల్వలపల్లి నివాసులే కావచ్చును. ఈతనిశైలికై రెండుపద్యములు చూపుచున్నారము.

మ. చని నానావిధపుణ్యపట్టణ నదీశైలాశ్రమక్షేత్రకా
నన సిద్ధస్థలముల్ చరించుచును జంతాయుక్తుఁడై వెంటవెం
టను ఘోరోగ్రపిశాచ యొక్కరితె గాఢస్ఫూర్తి నేతేరఁగాఁ
జనుచుం దానొకనాఁడు కేవలపరిశ్రాంతాత్ముఁడై చింతతోఁ.

ఉ. స్యందన మెక్కి వజ్రకవచంబు వహించి మహాధనుస్సు చే
నంది నిషంగయుగ్మమున నమ్ములు దీయుట నారిగూర్చు టే
చంద మెఱుంగకుండఁ దమసైన్యముపై నిగిడింప నప్పు డ
య్యందఱు మాగధుల్ పొదివి రవ్విభు నొక్కనిఁ బెక్కుఱోకలై.

## 53. రామాయణవచనము.

తుపాకుల అనంతభూపాలునిచే రచియింపఁబడినది. సుందరకాండము మాత్రము ౫ అశ్వాసములు. ఈ యనంతభూపాలుఁడు దనగద్యములో "శ్రీవసుదేవనందన చరణారవింద సేవాహేవాక నిరంతరాంతరంగ ... సారసారస్వతధురీణ సముదాటోప వైరిమండలాక్రాంత... విపక్షక్షమాపతి నిర్జిత మదవారణ శ్వేతాశ్వగోసహస్రప్రముఖ మహాదానాతిదానానవరతాన్నదాన ... కీర్తికౌముదీ కబళిత దశదిశాంతరాళ, గడియమన్నియవిభాళ హిమువన్నగ సేతుమధ్యమావనీమండల సమాయాతవిద్వత్కవిజనచాతకవ్రాతసమానంద...కాంచనధరాప్రదాన నూతనపర్జన్య సకలజనమాన్య సౌజన్య నిఖిలపురాణేతిహాస కథానుసంధాన సమేధమాన చాతుర్య వచనరచనావైచక్షణ్య...కవేరకన్యా వేగవతీ తామ్రపగి

ప్రముఖనదీతీర ప్రతిష్ఠాపిత నిస్తులాగ్రహారనిచయసంతోషితమనీష్యమోఘాశీర్వాద సమాసాదిత సమగ్రవైభవ భాగమాంబాతనూభవ, హనుమధ్వజ బిరుదావలోకన కాందిశీకవైరిమండల, ... చతుర్విధోభయభాషాసాహిత్య చంద్రగిరి కృష్ణనృపతనూభవ తుపాకుల అనంతభూపాలక ప్రణీతంబైన" అని వ్రాసికొని నాఁడు. దీనింబట్టి యీరాజకవి "శాపాదపి శరాదపి" యనునట్లు కవిత్వమునఁ బరాక్రమమున దానమున వినయాదిగుణముల నొప్పుచున్న వాఁడనియు దక్షిణ దేశవాసియనియుఁ దెలియఁదగు. మఱియు "వచనరచనానైచక్షణ్యా" యను వాక్యముంబట్టి వచనములయం దెక్కుడిష్ట మున్నట్లు తేలుచున్నది. కావుననే యీతఁడు భగవద్గీతలు, విష్ణుపురాణము, రామాయణము, భారతమును వచనములుగ వ్రాసి యున్నాఁడు. విష్ణుపురాణప్రతి యొకటి పరిషత్తునకు లభించినది. భగవద్గీతావచనముం గలదుగాని యది కవినామము తెలియరానిస్థితిలో నున్నందున నిశ్చయముగాఁ జెప్పవలను పడలేదు. రామాయణములో నీసుందరకాండ మొక్కటియే లభించినది. భారతమున సభాపర్వము, భీష్మపర్వము కనఁబడు చున్నవి. భారతము వచనముగ రచియించుటలో నీభూపాలునకు వీరరాజకవి యొకఁడు తోడ్పడి నిర్వహించినట్లు సభాపర్వము చివరనున్న రెండుగద్యముల వలనఁ దేటపడు చున్నది. కవికాలనిర్ణయము చేయుట కాసభాపర్వములోఁ గడ పటనున్న—

సీ. వేయున్నియా...దియు రెంటె, మీఁదటిశకవర్ష మెలమినడుచు
 వరుస సాధారణవత్సరంబున మాఘశుద్ధపంచమి యందు శుభ ...
 ... ... దళవాయి దొడ్డేంద్రసుతుఁడు వీరేంద్రుండు సుకవినుతుఁడు
 వచనభారతమందు వైఖరినసభాపర్వ ... ...

అను నసంపూర్ణపద్యము తోడ్పడుచున్నదిగాని "గణితమెఱిఁగినట్టి కరణాలఁబిలిపించి, యడుగవలయు" నన్నరీతిగా "వేయున్నియా...దియురెంటె" నడుమలు ప్తము పూరింపవలయును.

ప్రతిగ్రంథమును సంస్కృతమునుండి యథామూలముగాఁ దెనిఁగించిన ట్లధ్యాయసంఖ్య యాయాతావుల నీయఁబడినది. గద్యములు ప్రతిపుస్తకమునఁ గొంతకొంతవాక్యభేదముగ వ్రాసికొనియున్నాఁడు. రామాయణమున నీ సుందర కాండ మొక్కటియే వ్రాసెనో తక్కినకాండలున్నవో తెలియదు. భారతమున నిట్లేసందేహము.

# స్వాగతోపన్యాసము.



సోదరులారా! ఆర్యకులౌన్నత్యమహాశయులారా!

అనురాగాతిశయముననో, పురాకృతకర్మసంబంధబాంధవ్యంబుననో విద్యాభివృద్ధ్యతిశయబుద్ధిచేతనో, దూరప్రయాణప్రయాసాతిశయముల కోర్చి యింత దూరము మీరు వచ్చితిరి. మీరాకచే మాకుఁ గలిగినసంతసం బపరిమితంబు. అయినను మీ కొనరింపం దగినయతిథిసత్కారంబులు మే మొనరింపఁ గాలధర్మం బునుంబట్టి యశక్తుల మైతిమే యని చింతిలుచున్నవారము. దశసహస్రవర్షముల నుండి తరతరముగ మనకు నలవా టగునార్యధర్మము లనేకము లున్నవి. అప్పుడపుడు మనకుఁ గలిగినయాపదలకారణంబునఁ గొన్నిధర్మములు వదలుట యావశ్యక మయ్యెను. ఎప్పు డేధర్మములు వదలినను నతిథిపూజ యనుధర్మమును మాత్రము వదల మైతిమి. ఋగ్వేదకాలమునకు ము న్నీధర్మ ముండినదో లేదో చెప్పఁజాలను గాని, ఋగ్వేదములో నేమి, బ్రాహ్మణములలో నేమి, యీధర్మంబు గల్పింపఁబడినది. కావుననే సూత్రయుగమున నేమి పురాణయుగమున నేమి యతిథిసపర్య పరమధర్మం బని నిర్ధరింపఁబడినది. అతిథులు దైవము లని నుతింపఁబడినారు. ఇటీవల ననేకకారణములంబట్టి యార్యులు పేదవడి వస్త్రభోజనాదులచే, నతిథులఁ దృప్తికరముగ నాదరింపలేక యథాశక్తిన్యాయముగ "పత్రం - పుష్పం - ఫలం-తోయ" మ్మని యొకయాపద్ధర్మము నవలంబించిరి. ఆధర్మ మైన నవలంబింత మన్ననో, "పత్రపుష్పఫలములకు నీపురంబు దూరం బయ్యెను. అతిథు లగుమీకు మంచితీర్థం బయిన నిచ్చి తృప్తిపఱచవలయు నని యెన్నియుంటిమి. మాదౌర్భాగ్యవశమున నిర్మలమధురజలము దొరకనట్టి తుంగభద్ర గల విరూపాక్షక్షేత్రము మాకు నబ్బ దయ్యెను. కావున సోదరులారా! దూరము నుండీ వచ్చిన మీకు నేవిధ మగుసపర్యలను జేయఁజాలము. మాకిపుడు మిగిలినది తీపుమాట. మహాశయులారా! మాలోపముల నెన్నక యభావవైరాగ్యమూని, మన మెల్లర మొకయింటివార మని యెన్ని సుఖమునఁ గొన్నిదినము లిచట నుండుఁడు.

సుగుణభూషణులారా ! సోదరులారా యని మిమ్ము నేను సంబోధించితిని. ఆ పదమే, మిము సంబోధింప సార్థకపద మని త్రికరణశుద్ధిగ నే నెన్నితిని. సూక్ష్మదృష్టిని జూడ నాపదము మనబాంధవ్యమును స్పష్టముగఁ దెలియఁజేయు ననుట నిస్సందేహము.

క్రీస్తుశకమునకు మూఁడుశతాబ్దములు ముందునుండియును గ్రీస్తుశకమునకుఁ బిదప మూఁడుశతాబ్దములవఱకు మన పెద్ద లాంధ్రరాజుల యేలుబడిలో నుండిరి. ఆంధ్రరాజు లనేకులు గోదావరినుండి కృష్ణానదివఱకును గల దేశములను బ్రారంభమున స్థాపించి తుంగభద్రవఱకుఁ బిదప వ్యాపించిరి. కాలాంతరవశములనైన నుద్భవిల్లిన యుపాధులచే నాంధ్రరాజుల విజృంభణము తగ్గెను. కాలచూర్యులు, కాదంబులు, పల్లవులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, గంగులు, బల్లాళులు మొదలగు రాజుల యాధిపత్యము మించెను. కాలానుగుణ్యముగ నాంధ్రుల మగు మన మాయారాజులకు లోఁబడినను, మనకు నాంధ్రదేశాభిమానంబు పోదయ్యెను. ఎవ రేలినను, మన దేశంబునకు నాంధ్రదేశ మనునామంబు తప్ప దాయెను.

ఇది, కర్ణాటకదేశమనియుఁ గర్ణాటకు లాంధ్రులకు వేఱనియుఁ బురాతనచరిత్రలు తెలియనివా రనుకొనిన ననుకొననిండు. క్రీస్తుశకమునకు మున్నుండిన చరిత్రాంశములలో నెచటను గర్ణాటకదేశ ముండినటులు నా కగపడదు. గోదావరినుండియుఁ గాళహస్తివఱకు నాంధ్రదేశం బని యే నెన్నెద. కృష్ణానది దాఁటి దక్షిణంబుననుండిన యేదేశంబు లాంధ్రరాజులు జయించిరో యాదేశములను బరులు కర్ణాటకరాజ్యం బని పిలువసాగిరి. కారణంబు మన మూహింపనగును. ఆంధ్రరాజు లనిపిలువంబడు ముప్పదిమందిరాజులలో ననేకులు “కర్ణ” నామాఙ్కితులు. శ్రీమల్లశాతకర్ణినుండి చంద్రశ్రీశాతకర్ణివఱకు నుండినయాంధ్రరాజు లేలిన దక్షిణదేశము కర్ణాటకరాజ్యం బని పిలువఁబడుచుండెను. “కర్ణ” యను బిరుదు గలరాజు లేలినకతంబునఁ, గర్ణాటకరాజ్యం బని నామము వచ్చినది. కర్ణాటకరాజ్యంబునకును నాంధ్రదేశంబునకును భేద మెద్దియును లేదు. కర్ణాటకదేశమునకును, కన్నడభాషకును సంబంధ ముండినటులు నా కగపడదు. మేము కర్ణాటకరాజ్యమం దుండినను నాంధ్రులమే కావున మన మెల్ల సోదరులము.

భ్రాతృవరులారా! ఏది యెటు లుండినను మన మిప్పు డిరువదిరెండు శతాబ్దములుగ నాంధ్రశబ్దగ్రహములోఁ గూడి యొక్కరుగ నున్నవారము. కావున

మనము సోదరుల మనుటకు సందియంబును లేదు. మూఁడవశతాబ్దమధ్యమున నాంధ్రరాజుల ప్రాముఖ్యము తప్పి పోయినను వారు సామంతరాజులుగఁ గొంత కాలము కొన్ని దేశములు లేలుచుండిరి. సామంతరాజులుగ నుండినందున వారి చరిత్రములు కానరావు. ఆంధ్రరాజులను జయించి యీరాజ్య మేలినవారు కాదంబులు. వీరే కాలచూర్యులేమో యనుసందియంబు గలుగుచున్నయది. ఈకాదంబు లుత్తర "కన్నరా"నుండి వచ్చినవారు. వీరు జైనులు. వీరినుండియే కన్నడభాష యీదేశమునఁ బ్రబలెనని నేనూహించెద. ఈజిల్లాకుఁ జేరిన హరుపనహళ్లితాలూకు "ఉచ్చంగిదుర్గము" వీరిముఖ్యపట్టణము. అప్రాంతమునందుఁ గన్నడభాషాప్రచారము హెచ్చుగ నున్నది. ఆఱవశతాబ్దమునఁ జాళుక్యులీదేశమును జయించి యేలసాగిరి. వీరు క్షత్రియులు. ప్రారంభమున జైనులుగ నుండి పిదప హిందువు లైనవారు. వీరిముఖ్యపట్టణము "వాతాపి." దీనినే యిపుడు "బాదామి" యందురు. ఈబాదామికొండలో నతివిచిత్రము లగుజైనబస్తీలున్నవి. భూమినిఁ ద్రవ్వినలాగునఁ గొండను ద్రవ్వి గుహ లేర్పఱచి చిత్రలేఖలు గల బస్తీలు నిర్మించినారు. ఈపట్టణమునకు సమీపముననే "లక్కుండి" యని యెడి మఱియొకపట్టణము జైనులకు ముఖ్యస్థానముగ నుండెను. వీరిమూలపురుషుఁడగుకృతవర్మ చాళుక్యరాజ్యమును స్థాపించినవాఁడు. (566-97) ఇతనిసుతుఁడు రెండవపులకేశి విశేషదేశములను జయించి యిచటికిఁ బది మైళ్లసమీపమున నుండు కురుగోడనుముఖ్యపట్టణములో నివసించుచుండెను. ఏడవశతాబ్దముననే రెండవపులకేశి వేంగిదేశము నేలం దనతమ్ముఁ డగుకుబ్జవిష్ణువర్ధనుని నియమించెను. ఇది 609 వ సంవత్సరమున జరిగినవార్త. 615 వ సంవత్సరమునఁ గుబ్జవిష్ణువర్ధనుఁడు స్వాతంత్ర్యముఁ గలరాజయి పూర్వచాళుక్యవంశమును స్థాపించెను. చాళుక్యసోదరు లిరువురు వేంగికర్ణాటకరాజ్యములం దుండునాంధ్రులను గొంత కాల మేలుచుండి రనునది చరిత్రలు స్పష్టపఱచుచున్నవి.

ఏడవశతాబ్దాంతమునుండి యెనిమిదవశతాబ్దమధ్యమువఱకుఁ బల్లవులు చాళుక్యులనుండి యీదేశమును లాగికొని యేలినారు. ఇటులుండ రాష్ట్రకూటులనువా రీపశ్చిమచాళుక్యులను బల్లవులను జయించి వారిని దమసామంత రాజులుగ నొనర్చికొనిరి. అంతటనుండి పశ్చిమచాళుక్యు లీజిల్లాకుఁ జేరిన హరుపనహళ్లి, హాడగలిదేశము లేలిరి. పల్లవు లీజిల్లాకుఁ జేరిన కణేకల్లు కోగిలిదేశము లేలుచుండిరి.

పదియవశతాబ్దాంతమువఱకు నీదేశము రాష్ట్రకూటులవశములో నుండెను. చాళుక్యవంశజుఁ డగు రెండవతైలరాజు కుంతలరాజ్యంబు మరల సాధించుకొనియెను. కుంతలరాజ్య మనిపిలువంబడునది యీదేశమే. చాళుక్యరాజగు పరాంతకుఁడు పల్లవులను జయించి మరలఁ దనదేశమును సాధించుకొని కల్యాణపట్టణము రాజధానిగ నొనర్చుకొనెను. పండ్రెండవశతాబ్దాంతమునఁ జాళుక్యరాజ్య మంతమాయెను. కాలచుర్యసేనాధిపతి బిజ్జలుఁడు చాళుక్యరాజును జంపి రాజాయెను. ఈబిజ్జలుఁడు జైనుఁడుగ నుండి వీరశైవుల నిరువురఁ జంపినందున బసవారాధ్యుఁ డనుబ్రాహ్మణమంత్రి బిజ్జలుని జంపించెను. అంతటనుండి లింగాయతమతము దేశ మెల్ల వ్యాపించెను. పిదప యాదవరాజులును హొయిసాలరాజులును దేశ మాక్రమింపఁ గలహించుచుండిరి.

మహాశయులారా!—ఆంధ్ర - చాళుక్య - చోళు లేలిన - బెజ్వాడ, శ్రీకాకుళము, అమరావతి, రాజమహేంద్రవరము, మొదలగుదేశములందు నాంధ్రభాష యభివృద్ధిఁ జెంది యీదేశమునమాత్ర మభివృద్ధి నందనందులకుఁ గారణంబు లూహింపనగును.

(*a*) ప్రారంభమున నాంధ్రు లనేకులు గోదావరీకృష్ణాతీరములందు నెలకొని యీదేశమునకు రా రైరి.

(*b*) ఈదేశము ప్రత్యేకముగ నొకప్రభుని నుండక వివిధదేశాధిపతుల కలహములకు మధ్యస్థాన మయ్యెను.

(*c*) పదునాలుగవశతాబ్దమువఱకు నాంధ్రభాషకు రాచమన్నన లేదయ్యెను.

(*d*) పండ్రెండవశతాబ్దమువఱకు నీదేశము జైనులతో నిండి యుండెను, పిదప లింగాయత మతము ప్రబలెను. ఈమతస్థు లిరువురును గన్నడభాషపైఁ బ్రీతి గలవారు. కావునఁ గన్నడభాష హెచ్చెను. ఆంధ్రభాష తగ్గెను. క్రీస్తుశకమునకు మున్నే యీదేశమున జైనులు నిండియుండి రనుటకు నిదర్శనములు చాలగ నున్నవి. ఈజిల్లాకు ననంతపురముజిల్లాకును జేరిన యనేకగ్రామములందు జైనులదేవాలయములును వారిశాసనములును వారిదిగంబరవిగ్రహములును నిండినవి. మైసూరునకుఁ జేరిన శ్రావణబెళ్గోడు హళేబేడు మొదలగు గ్రామములలోను వారిదేవాలయములు, విగ్రహములు, శాసనములు నిండినవి. చాళుక్యాదు లీదేశ

మున వ్యాపించి రాజ్యములు స్థాపింపకమున్నే, జైను లిచటఁ బ్రబలి యనేకము లగుకట్టడములు కట్టినారు. కొనకొండల, హిరేతుంబుళము, కుడుతిని, ఐప్పగిరి, కురుగోడు, హంపి, హరుపనహళ్లి, ఉచ్చంగిదుర్గము మొదలగుగ్రామముల చరిత్రలు బళ్లారి యనంతపురము జిల్లాల గెజటియర్లలోఁ జదివినయెడల నాంధ్రరాజులకాలముననే జైనమత మీదేశములందుఁ బ్రబలియుండె నని తెలియవచ్చుచున్నది. దేశచరిత్రలు చదివినను నిచ్చట బహుకాలమునకు మున్ను జైనులు చేరి నటులు స్పష్ట మగుచున్నది. కారణము లేమన :—

(1) క్రీస్తుశకమునకు నాలుగుశతాబ్దములకు మున్ను రమారమిగ నొక్కకాలముననే, బౌద్ధమతస్థాపకుఁ డగుబుద్ధుఁడును, జైనమతస్థాపకుఁ డగుమహావీరుఁడును, మగధదేశమున నుద్భవించిరనువిషయము చరిత్రలు దెలుపుచున్నవి. పిదపఁ జంద్రగుప్తుఁ డనురాజు తనవార్ధకదశలో జైనమతావలంబకుఁ డయి దేశసంచారమొనర్చుచు నీదేశమునకు వచ్చి క్రీస్తుశకమునకు 297 వత్సరముల మున్నీదేశమునకు సమీపమున నున్నశ్రావణబెళ్గొళములోఁ జనిపోయె నని జైనులగ్రంథములో నున్నది. అపు డనేకజైను లిచటకి వచ్చియుందురు.

(2) జైనుమతస్థాపకుఁ డగుమహావీరుఁడు చనిపోయినపిదప మగధదేశమును మహాక్షామము బాధింపసాగెను. భద్రబాహుఁ డనురాజు తనజైనులతో నీదేశమువచ్చి చేరెను. బహుకాల మిచటనే నిలిచెను. పిదప వీరిమతవిధులందుఁ గొన్నివ్యత్యాసములు గలుగుటచే నిచ్చట నుండినజైనులు దిగంబరు లనిపిలువంబడిరి. మగధదేశపుజైనులు శ్వేతాంబరు లని పిలువంబడిరి.

(3) వాతాపి, లేకబాదామికిఁ జేరినరాష్ట్రకూటులు జైనమతస్థు లనియు మతపక్షపాతులయి యాఱవశతాబ్దమున బౌద్ధులను హింసించి రనియుఁ దెలియవచ్చుచున్నది.

(4) పదియవశతాబ్దప్రారంభమున జైనులు రాష్ట్రకూటులను బ్రేరేచి చోళరా జగురాజాదిత్యునిపై దండెత్తఁజేసి యాచోళరాజును జంపించి కాంచీనగరమువఱకు వ్యాపించిరి.

(5) పదియవశతాబ్దాంతమునఁ జాళుక్యరా జగుత్రిలేపుఁడు జైనురాజు లగురాష్ట్రకూటులను నశింపఁజేసినను జైనుమత మచట నచ్చటఁ బాడుకొని యపు డపుడు తలయెత్తుచుండెను. ఈత్రిలేపుఁడే కుంతలదేశమునకు రాజధానిగఁ గళ్యాణనగరము నేర్పఱచినవాఁడు.

ప్రారంభమునుండియు జైనమతస్థులు ద్రావిడ లనగనుండి తామిలుభాషలోను గన్నడభాషలోను ననేకగ్రంథములు వ్రాసినారు. వా రాదిని సంస్కృతంబున గ్రంథంబులు వ్రాయుచుండిరి. పిమ్మట జనసామాన్యమునకు సంస్కృతము తెలియకయుండుకారణంబున దేశభాషలలో గ్రంథములు వ్రాసి జనులఁ గుమిగూర్చి చదువుచుండిరి. కన్నడభాష క్రీస్తుశకమునకు నాలుగయిదుశతాబ్దములకు మున్నే దక్షిణహిందూస్థానమెల్ల వ్యాపించినటు లాభాషలోనుండు గ్రంథములే చాటుచున్నవి. కన్నడజిల్లాలోని "కర్నాడయుం" అనుదేశమున నీభాష పుట్టినట్లు తోఁచుచున్నది. ఇటఁ గర్ణాటకశబ్ద మెట్లుపుట్టె ననుటకుఁ గొన్ని కారణంబులు పలువురు పలు విధములుగ వ్రాసినారు. ద్రావిడవ్యాకరణములను గురించి వ్రాసిన కాల్డ్వెల్ దొరగారు వ్రాయురీతి యేమనః:—

"The term "Karnata or Karnatica" is said to have been a generic term including both the Telugu and Canarese peoples and their languages. Karnataka means that which belongs to "Karnata."

గన్దర్టుదొరగారు కరు + నాడు = కర్నాడు లేక కర్ణాట యయినదనియు, నల్లభూమి యని దానియర్థ మని వ్రాసినారు. ఈయర్థము సమంజసముగ లేదు.

విశ్వగుణాదర్శనములో "కర్ణేఅటతీతి" కర్ణాటః యని వ్రాసినారు. చెవులలో సంచరించున దని తాత్పర్యము. ఇదియును సమంజసముగ లేదు.

కర్ణబిరుదాఙ్కితు లగునాంధ్రరాజులు సంచరించి జయించిన దేశము కర్ణాటదేశ మని నాయభిప్రాయము. దీనిని నాంధ్రసాహిత్యపరిషత్తువారు నిర్ధరింపవలెను.

కన్నడభాషకు మాత్రము కర్ణాటకభాష యనుట యాదరణీయము గాదు. భీమఖండ మాంధ్రకవిత్వముగ నుండినను శ్రీనాథుఁడు, "నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" యని వచించినాఁడు. కర్ణాట యనుదేశమున నుండునాంధ్రభాష యని దాని తాత్పర్యము. కావునఁ గర్ణాటకభాష యనిన మాత్రమునఁ గన్నడ మని యర్థముసేయుట తప్పు.

పదునొకండవశతాబ్దమునకు బహుశతాబ్దములకు ముందు నుండియు "టామిల్లు" భాషలోనేమి కన్నడభాషలోనేమి విశేషగ్రంథములు రచింపఁబడి యుండినను, నాంధ్రభాషకు ముఖ్యస్థానము లగుశ్రీకాకుళము, రాజమహేంద్ర

పరము మొదలగు దేశములందు నన్నయ్యకు మున్ను తెలుఁగుగ్రంథము లెవరును రచింపలే దనుట చోద్యముగ నున్నది. అనేకాంధ్రగ్రంథంబులు నన్నయ్యకు మున్నే రచింపఁబడి యుండవలెను. నన్నయ్యగారు తమకును మున్నుండినకవుల నామము లెత్తక యుండినమాత్రాన వారికి మున్నాంధ్రగ్రంథరచన యుండలే దనుట సమంజసముగాదు. నన్నయకాలముననే "నారాయణభట్టు" పావులూరి మల్లయ్యగా పండితుల గ్రంథములే సాక్ష్యములుగా నిలిచినవి, ఇఁక వారికి మున్ను కవులుండి గ్రంథములు రచించి రనువిషయమును ననేకగ్రంథశోధకు బహుపాశ్చాత్య పండితుల యభిప్రాయ నిర్ధారింపఁ బొందుపఱచినాను.

"The earliest writer on Telugu Grammar is said to have been a sage called Kanva who lived at the court of Andhra-Raya, the King in whose reign Sanskrit is said to have been first introduced into the Telugu country .Kanva's work is now lost; and the oldest extant work on Telugu Grammar was written by a Brahmin called Nannaya Bhatta or Nannappa who is the author of the Telugu version of the Maha-Bharata which is the oldest extant composition in Telugu. Nannappa lived in the reign of Vishuu-Vardhana, a king of the Kalinga-branch of the Chalukya family, who reigned at Rajamundry......Mr. C. P. Brown in his cyclic tables, places it in the beginning of the twelfth century A. D. Though the Telugu literature which is now extant cannot boast of a high antiquity, the language must have been cultivated and polished and many poems that are now lost must have been written in it long prior to the twelfth century—the date of Nannaya's translation of the Maha-Bharata,for,as this translation is considered " the great standard of Telugu poetry, " it cannot be supposed to have sprung into existence all at once, without the preparation of a previous literary culture. It must have been the crowning achievement of several centuries of earnest work."—*Grammar of the Dravidian languages, by Caldwell, p.* 123.

బ్రౌనుదొరగారు తమనిఘంటులో నీవిషయ మీరీతిగఁ దెలిపినారు.

" Maha-Bharata and Ramayana were translated into Telugu in the days of "Vishnu-Vardhana" (at first called Betta Raya—hill king) a Chalukya 1120 A.D. As the poet and grammarian Nannaya

Bhatta who wrote the Adiparva in Telugu lived in the reign of Vishnu-Vardhana, we are now in possession of the era when the author flourished; and at that period the Telugu language had already attained classical perfection.

సోదరులారా :—పై విధముగ నభిప్రాయపడిన పాశ్చాత్యపండితులు సామాన్యులు కారు. ఆంధ్రకన్నడభాషలను సాంతముగ నేర్చినవారు. కాల్డ్వెల్లు గారివ్యాకరణము మీరు చదివినచో వారిప్రాజ్ఞతయును వారివిమర్శనాసామర్థ్యమును మీకుతెలియుటయెగాక యచ్చెరువందుదురు. కావున వారి తాత్పర్యము గౌరవార్హము. నన్నయకన్న ముందు గ్రంథంబు లాంధ్రంబున నెన్నియో యుండిన వనుటకు సందియము లేదు. ఆంధ్రసోదరులగు మన మెల్లర మాగ్రంథము లేమూలఁ బడినవియో వెదుకవలెను. దొరకనేని యితరగ్రంథముల సాహాయ్యమున నట్టిగ్రంథము లుండినవియా యనువిషయమునైనను నిర్ధరింపవలెను. మఱియొక విశేషాంశమును నేనిచట సూచింప నిశ్చయించెద. పదునొకండవశతాబ్దము వఱకు వేంగిదేశము, మాదేశమువలెఁ గన్నడభాషాప్రాచుర్యముఁ గలదిగ నుండెను. పదునొకండవశతాబ్దమున నాగవర్మ యనుపండితుఁడు ప్రాకృతపింగళసూత్రములనుబట్టి నాగవర్మఛంద స్సనుగ్రంథము నత్యద్భుతముగ రచించినాఁడు. సంస్కృతమునకంటెను హెచ్చుగ ననేకవిధము లగుజాత్యుపజాతివృత్తములను రచించినాఁడు. అక్కరలు, తరువోజలు మొదలగు నుపజాతివృత్తము లనేకములు కల్పించినాఁడు. భారతమునందు రెండువిధము లగునక్కరలు, తరువోజలు నన్నయగారు నాగవర్మఛందస్సునుండి గ్రహించి రని నాకుఁదోఁచుచున్నది. ఈ విషయము సభవారు నిర్ధరింపవలెను. ఈనాగవర్మ వేంగిపురమున నుండినవాఁ డనుటకుఁ గన్నడభాషానిఘంటు వ్రాసిన కిటిల్‌గారి యభిప్రాయ మించుక యీ క్రింద వివరించెద.

"The Vengi country (said to be now the Northern Circars ....) was conspicuous as being a surpassing one in the world......In that country was the charming Vengipalu or Vengi Nagara. In it was one Vennamaiyya a Pundit of Koundinya Gotra. His wife's name was Pola Kabbe. To that Pola Kabbe and Vennamaiyya... the first-born son was Naga Varma who was gifted with the qualities of the poetry gem of Vak-Sripathi."

సభ్యులారా! ఈనాగవర్మ కౌండిన్యసగోత్రోద్భవుఁ డగుబ్రాహ్మణుఁ డనియు, వేంగిదేశస్థుఁ డనియు మహాపండితుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ఈ పండితుఁడు భాషాభూషణ మనుకన్నడవ్యాకరణమును సంస్కృతసూత్రములుగ రచించెను. దీనిని రైసుగా రింగ్లిషులోనఁ బరివర్తించి భాషావిషయమున నొక యుపన్యాసంబును బీఠికఁగ నలంకరించినారు. ఇదియుఁగాక నాగవర్మ "కావ్యావలోకన" మనెడిఁ యలంకారగ్రంధమును రచించినాఁడు.

సోదరులారా! పదియవశతాబ్దమునను బదునొకండవశతాబ్దమునను వేంగిదేశమని పిలువంబడు చుండిన యిప్పటి యుత్తరజిల్లాలలోఁ గన్నడభాష యత్యున్నతస్థితిలోనుంటయ కాక కన్నడభాషలో నత్యద్భుతముగఁ గవనముసేయు సామర్థ్యము గలిగి రత్నద్వయ మనిపించుకొనిన కవులకు నది జననస్థానముగ నుండినది. పూర్వపశ్చిమచాళుక్యు లొక్కఁటివా రయినపిదప వేంగిదేశమునకుఁ బశ్చిమచాళుక్యులు పోవునపు డెల్లను నిచ్చటిపండితులును రాజులవెంటఁ బోయి వేంగిదేశముననే నిలిచి యుందు రని నాకుఁ దోఁచెడు. కాలమెల్లఁ దమస్వాధీనములోఁ గలిగి యాంగ్లేయభాషాప్రావీణ్యమును విమర్శనాశక్తియును గలయాంధ్రభాషానిపుణులు గొందఱు పై వివరము లన్నియును జక్కఁగ శోధించి పై సందేహములకుఁ దృప్తికరము లగుసమాధానము వ్రాసి యాంధ్రప్రపంచంబునకు మహోపకారం బొనర్తు రని నే నమ్మినాను. పైని నుడువంబడిన రత్నద్వయంబు విషయము నించుక సూచించెద.

క్రీస్తుశకము పదియవశతాబ్దప్రారంభమున "ఆదిపంప" యనుమహాకవి, ఆదిపురాణము, భారతము లనురెండు గ్రంథములు కన్నడభాషలో రచించినాఁడు. ఇతఁడు వేంగిదేశమునందలి వసంత, కొట్టూరు, నిడుగుంది, విక్రమపురములలో నగ్రగణ్యుఁ డని ప్రసిద్ధికెక్కిన మాధవసోమయాజుల మనుమఁడు. ఇతనితండ్రి జైనమతము నవలంబించెను. 950 వ సంవత్సరమం దున్న పొన్న యనుమహాకవి కన్నడభాషలో శాంతిపురాణమును రచించినాఁడు. ఇతఁడును వేంగిదేశస్థుఁ డని తెలియవచ్చుచున్నది. కావున వేంగిదేశములో సుప్రసిద్ధు లగుకవులు కొందఱు కన్నడభాషలో నధికప్రావీణ్యము గలవారుగ నుండి రని తోఁచుచున్నది. పైని పలుకంబడిన యుభయకవులును గవిరత్నత్రయములోఁ జేరినవారు. ఆంధ్రకవు లనేకులు కన్నడభాషలో గ్రంథములు రచించినవా రున్నారు. క్రీస్తుశకారంభము నుండియును గన్నడభాషలో జైను లనేకగ్రంథములు రచించినా రనుటకు వారు

వ్రాసినగ్రంథములే సాక్ష్యములుగ నిలిచినవి. టామిలుభాషలో నైతము జైనులు పదుమూఁడవశతాబ్దమువఱకు ననేకగ్రంథములు వ్రాసినారు. పంచద్రావిడము లని పిలువంబడు భాషలలో టామిలు, తులువ, మలయాళ, కన్నడ భాషలలో రెండువేలసంవత్సరములుగ వ్రాయంబడిన గ్రంథము లుండగ నాంధ్రంబున మాత్రము నన్నయభట్టుం దనఁగాఁ బదునొకండవశతాబ్దమునకు మున్ను గ్రంథరచన లే దనుట విశ్వసనీయము గాదు. వేములవాడ భీమకవి నన్నయకంటెను బూర్వముం దున్నవాఁడో యతనిసమకాలీనుఁడో యని బ్రహ్మశ్రీ, గురుజాడ శ్రీరామమూర్తిగారు కొన్నికారణంబులు చూపినారు. వేములవాడ భీమకవి చెప్పిన దను సీసపద్యములోఁ దనకుఁ బూర్వ ముండినకవులు "మేఘావిభట్టు, కవిమల్లు, కవిభానుఁడు, బడబాగ్నిభట్టు" అనిపలికినాఁడు. రా వ్రబహద్దూరు వీరేశలింగము పంతులువారు దీనిని ఖండించినారు. ఈసందేహాంశములు లాంధ్రపరిషత్తువారు పరిశోధించి నిర్ధరింపవలెను. సమస్తద్రావిడభాషలలోను జైనులు వ్రాసినగ్రంథము లుండ నాంధ్రంబునమాత్ర మట్టిగ్రంథములు లేవయ్యెనా యను సందేహము గలుగుచున్నది. పదియవశతాబ్దమునకు మున్నుండిన గ్రంథములు గానరాక పోవుటకుఁ గారణములు వెదకినచో దొరకకపోవు. పరరాజుల మతాభిమానాతిశయమునఁ బరశురామప్రీతి యయ్యెనో, కాదేని వేఱొక్కవిధమున నశింపఁజేయఁ బడెనో కనిపెట్టవలెను. భాషాభూషణ మనుకన్నడవ్యాకరణమునకుఁ బీఠిక వ్రాసిన లూయిస్రైసు దొరగారు గ్రంథనాశనమునకుఁ గారణ మొకటి యీక్రింద వివరించిన రీతిగ వ్రాసినారు.

"It must not hastily be concluded that no literary effort was put forth in an earliar phase of the language ; for, one form which the persecutions under Kumarila Bhatta and later under Sankaracharyar in the 8th century, took was the destruction of Buddhist and Jain literature. It was on the occasion of Sankara's casting such works into the waters of the Tungabhadra "so the story goes" —that one book was observed to keep floating and could not be made to sink. On examination it proved to be the Amara Kosa, which, being thus as it were evidently destined to be immortal, was suffered to live."

పైకథయొక్క చిత్రభాగ మెట్టులైన నుండినను, ముఖ్యభాగ మగుజైనుల గ్రంథనాశనకారణము విశ్వసనీయముగ నున్నది. ఇట్టికారణములనుబట్టియే య

నేకపుస్తకభాండాగారములు లయమైనవి. సాహిత్యపరిషత్తువా రీవిషయమును గుఱించి పరిశోధింపయత్నింతురు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పరిశోధించి నిర్ధరింపఁదగిన ముఖ్యాంశము మఱియొకటి యున్నది. ఆంధ్రలిపినిగుఱించిన విషయ మిది. భాషాభూషణమున రైసుగా రిచ్చిన కన్నడభాషాక్షరములపట్టిక, క్రీస్తుశకమునకు మున్ను 250 సంవత్సరములుగ నుండి వచ్చినయక్షరభేదముల నన్నిటిని జూపుచున్నది. క్రీస్తుకాలమునకు నేఁడువందలసంవత్సరములకు మున్ను బాబిలోనియన్ వా రుపయోగించిన యార్మేనికాక్షరములు రైసుదొరవారు తమపటమునఁ జూపిన ప్రథమాక్షరములను బోలిన వని నేసుదొరగారు వాక్రుచ్చినారు. పటములోని ప్రథమాక్షరములశోకునికాలమునందు దక్షిణదేశములోని యక్షరము లని చూపి, దానినుండి రెండవతూరి మాఱి రూపుగొనినది పూర్వదహళకన్నడ యనియును, పిదప హళెకన్నడమునకు మాఱె ననియును, నాల్గవయవస్థలో హొసకన్నడ మయ్యె ననియుఁ బిదపఁ దెనుఁగులిపి వచ్చినట్టును వ్రాసినారు.

దీనినిజమును బరిషత్తువారు స్థాపింపవలెను. అథర్వణాచార్యులు చెప్పిన యక్షరరూపక్రమ మీపటాక్షరములతో సరిపోలునో భిన్నించునో చూడవలెను. భిన్నించునెడల నథర్వణాచార్యుల యక్షరక్రమ మెద్ది యనునది వారిశ్లోకములనుబట్టి యొక్కపటముఁ బ్రకటించినచో నాంధ్రులకు మహోపకారంబుగ నుండును.

సోదరులారా:—మన మిపు డుండునది కుంతలదేశ మని నే నిదివఱలో వ్రాసినాను. ఆ విషయమును జరిత్రలు నిస్సందేహముగ స్థాపించుచున్నవి. ఈ ప్రాంతపుఁ గుంతలదేశమునకుఁ గురుగోడు ముఖ్యస్థానముగ నుండెను. ఆ పట్టణ మిపుడు సౌభాగ్యస్థితిలో లేకపోయినను బూర్వకాలమున నది మంచిస్థితిలో నుండె ననువార్త నచ్చటి దేవాలయములు స్థాపించుచున్నవి. అచ్చటశాసనము లనేకము లాంగ్లేయులు సమకూర్చినారు. కొన్ని భూమిలోఁ బూడిపోయినవి. మైసూరు గెజటియరులో రైసుగా రీకుంతలరాజ్యపు సరిహద్దు లిచ్చుచు నీ రాజ్యము చంద్రగుప్తునివంశ మగుమౌర్యుల దని వ్రాసినారు. ఉండిన నుండనగును. ఆంధ్రులుసైత మశోకునిరాజ్యమున నుండినవారేను. అశోకునిరాజ్యము తుంగభద్ర దాఁటి నెల్లూరునొద్దనుండు పెన్నారువఱకును వ్యాపించినరీతిగ స్మిత్తుదొరగారు హిందూదేశచరిత్రలో నిచ్చిన పటమువలనఁ దెలియవచ్చుచున్నది. అశో

వల్లభపుర మనియుండిన యీనామము "బల్హారి" "బళ్లారి" యని మారినదని నేనూహించెద. ఈ బళ్లారినామ మెటువచ్చిన దనుటకు నొకగాథ యున్నది. బలుఁడను రాక్షసుఁడు జనులను బాధించుచు స్వర్గమునుండి విహరింపవచ్చిన దేవతాస్త్రీలను బట్టుచు నుండ శ్రీహరి యిచట వానినిఁ జంపెను. కావున "బలహారి" బళ్లారి నామమువచ్చె నని జనులు వాడుకొనుచున్నారు. ఇది యెంతవిశ్వసనీయ మగుగాథయో మీరే యూహించుఁడి. బల్లూకులనుండి బళ్లారి నామము వచ్చినదేమో యనుసందియము కలుగుచున్నది.

పదునాఱవశతాబ్దప్రారంభమున బళ్లారి గ్రామకపల్లెగ నుండెను. విజయనగరరాజులక్రిందఁ బనిసేయుచుండిన బాలద హనుమప్పనాయక యనుకుఱుబవానికి విజయనగరరాజులు జహగిరుగ్రామముగ నిచ్చియుండిరి. ఆ హనుమప్పనాయక యీపురికిఁ బాళేగారుగ నుండెను. విజయనగరనాశనానంతరము బీజాపూరునబాబుస్వాధీన మయ్యెను. ఆనబాబు, బళ్లారి, కురుగోడు, తెక్కలకోట యనుమూఁడుగ్రామములును హనుమప్పనాయకునకు నిచ్చి సంవత్సరమునకు 5000 రూపాయలు పేష్కస్సు పుచ్చుకొనుచుండెను. హనుమప్పనాయకుఁడు తగినరీతిగఁ గోటను గట్టించుకొని బలవంతుఁ డాయెను. పెనుగొండ చేరిన విజయనగరరాజు వీనిదేశము సాధింప యత్నించి సేనను బంపెను. ఆసేనను హనుమప్పనాయకుఁడు తుంగభద్రాతీరమం దున్నకంపిలియొద్ద జయించెను. వీనిసంతతివారు 1631 సంవత్సరమువఱకుఁ బాళేగార్లుగ బళ్లారియం దుండిరి. 1678 సంవత్సరమున శివాజి యీకోటను స్వాధీనపఱచుకొనెను. అక్కాలమునఁ బాళేగారునిభార్య 27 దినము లీకోటను రక్షించి పిదప శివాజీవశపఱచెను. చౌథా యిచ్చు నొడంబడికపైన మరలఁ బాళేగార్లే యధికారులైరి. 1729 సంవత్సరమువఱకుఁ బాళేగార్ల మగసంతతివారే పాలించుచుండిరి. తుదిపాళేగారు చిక్కరామప్ప, వానికి సంతానము లేనందున వానిసవతితల్లి నీలమ్మ యనునది యీపురికి నధికారిణి యయ్యెను. బావు లనేకములు త్రవ్వించి తనపేరు శాశ్వతముగ నిలుపుకొనెను. ఆమె దొడ్డతలి రామప్పను దత్తుతీసికొనెను. 1764 సం॥ వఱకునతఁ డధికారిగ నుండెను. 1769 సం॥ హనుమప్పయనువాఁడు పాళేగారుగ నేలుచుండ హైదరాలీ యీపురిని ముట్టడించి విశేషనష్టముతోఁ దిరిగి పోయెను. దొడ్డప్ప యనుపాళేగారునికాలమునందు (1775 సం॥) వాఁడు తురుష్కులకు పేష్కస్సీయ నిరాకరించినందున బసాలత్జుంగనుతురుష్కాధికారి తనమంత్రిని, లాలీ యను

ఫ్రెంచియింజనీరును సేనతో బళ్లారికోటను ముట్టడింపఁ బంపఁగ, దొడ్డప్ప తనకు సాహాయ్యము కమ్మని హైదరాలీకి వార్తఁబంపెను. హైదరాలీ వచ్చి దక్కను సేనను జక్కాడి పురిని స్వాధీనపఱచుకొని పాళెగారును పాఱఁద్రోలెను. హైదరాలియే కొండపైనిఁ గోటకట్టించెను. క్రిందికోట కట్టించినవాఁడు నతఁడేను. 1792 సంవత్సరము వఱకును నీకోట టిప్పుస్వాధీనమున నుండి పిదప నైజాం స్వాధీనమయ్యెను. 1800 వ సంవత్సరమున నైజా మీదేశమును నింగ్లీషువారి కిచ్చెను. కంపినీవారు కోటలో నుండిన హిందువులకు నిపుడు గృహములు నిర్మించి యుంచుస్థళము నిచ్చి పట్టణాభివృద్ధిఁ గావించిరి సేనకు ననుకూలము లగుబజారులు నిర్మించుటకును, సేనాధికారులక్రిందఁ బనిసేయువారు గృహములు కట్టుకొనుటకును నేపన్నును రాఁబట్టుకొనక యిపు డుండు కౌలుబాజారుస్థళము నిచ్చిరి.

సభ్యులారా! మాదేశాభివృద్ధికిని భాషాభివృద్ధికిని మార్గము, జూపినది ప్రారంభమున యాదవరాజులు. ఈరాజు లాదినిఁ జాళుక్యులకు సామంతులుగ నుండిరి. అల్లాయుద్దీన్ యొక్క సేనాని దేవగిరిపై దండెత్తి రామచంద్రుఁ డను యాదవరాజును జంపిన పిదపఁ దురుష్కులబాధలకు సైఁపనోపక బుక్కరాయ హరిహరు లనుసోదరులు తమజనులతో వచ్చి విరూపాక్షక్షేత్రమును జేరిరి. వారి భాగ్యవశంబున విద్యారణ్యస్వామి లని సుప్రసిద్ధికి నెక్కినమాధవాచార్యులవారు వారికి సాహాయ్యపడి పదునాలుగవశతాబ్దమున విజయనగరసంస్థానమును స్థాపించిరి. ఈవిషయమున సూయిల్ గారు మఱియొకవిధమున "Forgotten Empire" అనుగ్రంథములో వ్రాసినారు. అటువ్రాయుటకు వారి కేమయిన నాధారములు నమ్మఁదగినవి యుండినచో వారు వ్రాసినది విశ్వసనీయముగ నుండును. ఏది యెటులుండనీ బుక్కరాయహరిహరులు విజయనగరసంస్థానము స్థాపించి రనుటకు సందియము లేదు. హరిహరుఁడు 1335 నుండి 1343 వఱకు రాజ్యమేలెను. ఈ రాజే పంపాపతి దేవాలయమును గట్టించినవాఁడు. ఇతనియనంతరము బుక్కరాయలు రాజులైరి. వీ రోరంగల్లువారితోను హొయసాలావారితోను జేరి తురుష్కులను జయించి ఓరంగల్లును మరల హిందూరాజ్యముగ నొనర్చిరి. 1399 సం॥ నుండి 1406 సం॥ వఱకు నేలిన రెండవబుక్కరాజు విజయనగరపట్టణము విశేషముగ నభివృద్ధిఁజేసెను. తుంగభద్రానదికి నడ్డుగ నానకట్ట గట్టి తురుతుకాలువ గుండ నీరు దెచ్చి ఫలవృక్షములతో నగర మలంకరించెను. ఈ వీరునియనంతరము వచ్చినయాదవరాజులు బలహీనులయి తమభాగ్యమును బోఁగొట్టుకొనిరి. నర

సింహరాజు రాజ్యము స్వాధీనపఱచుకొని 1490 సం॥ లో రాజాయెను. ఇతని యనంతరము నరసింహనాయకుఁడు రాజయ్యెను. ఇతనికొమారుఁడే శ్రీకృష్ణదేవ రాయలు. వీరే పంపాపతిదేవాలయ మెదుటరంగమండపమును, విఠ్ఠలస్వామిదేవా లయము, హజారురామస్వామిదేవాలయమును, కృష్ణస్వామిదేవాలయమును గట్టించినవారు. అనేకస్థళములందు తుంగభద్రకు నానకట్టలు కట్టించి వ్యవసాయ మునకు నీటిపాఱుదల కాల్వలు త్రవ్వించినవారు వీరేను. యాదవరాజులకాలమం దును శ్రీకృష్ణదేవరాయల కాలమందును ప్రతాపరుద్రుఁ డేలిన ఓరంగల్లు ప్రాం త్యములనుండి విద్వాంసు లనేకు లీ విజయనగరమును జేరి కవులయి రాజమన్నన లందుచుండిరి. పరాక్రమవిక్రమార్కుఁ డనియును నాంధ్రభోజుఁ డనియును జగ త్ప్రసిద్ధికి నెక్కిన శ్రీకృష్ణదేవరాయలవా రాకాలపురాజులకును గవులకును శిరోభూషణులయి వెలసిరి. ఆంధ్రభాషాధిదేవత యువతియై శృంగారవతియయి వాక్చమత్కృతిఁ గలిగి సుగుణగణాలంకృతయయి వాసిఁగాంచినది శ్రీకృష్ణదేవ రాయలకాలమునందే. సమస్తద్రావిడభాషలును, సౌరాష్ట్రభాషలును, శ్రీకృష్ణదేవ రాయలకాలమునందు నత్యుత్కృష్టదశకు వచ్చినరీతిఁ జరిత్రలు దెలుపుచున్నవి. వీరిపిదప నుండిన రాజులకాలమున భాషాధిదేవత సంపూర్ణముగఁ గ్రుంగకయుం డెను గాని, భామినీసుల్తానులు పదునాఱవశతాబ్దమునఁ దాళికోటయుద్ధమందు రామరాజును జంపుటయగాక విజయనగరభాగ్యముతో భాషాధిదేవతను సైతము రూపుమాపిరి. అయినను నాంధ్రసరస్వతియొక్క శబ్దార్థాలంకారశారీర సౌరభ మెల్లెడ వ్యాపించియుండెను. కావుననే శ్రీకృష్ణదేవరాయలవారి వంశజు లెచట నెచట నివసించిరో యచ్చట తప్పక యాంధ్రభాష యభివృద్ధిఁ జెందు చుండెను. వారేలినదేశములలో సైత మాపరిమళ మిప్పటికిని బరిఢవిల్లుచున్న యది. ఆభాషాలావణ్యదేవతను వికారదేవతగ నొనరించి రూపుమాప నెవ రెంత సాహసించినను, నది ఫలకారి గాకయున్నది. శ్రీకృష్ణదేవరాయల కాలమునందలి కవులు భాషాధిదేవతకుఁ గొన్ని యన్యదేశీయ శబ్దరూపకము లగునాభరణములఁ దొడిగినను నవి యాదేవతరూపము హెచ్చింపఁజేసెను గాని వికృతినందింప వయ్యెను. రాజరాజనరేంద్ర కృష్ణదేవరాయల కాలమున నుండినరీతిగ భాష యుండులాగున నుద్ధరించుటకు నీ "యాంధ్రసాహిత్యపరిషత్తు"ను గొందఱు మహనీయులు నిర్మించినారు.

సోదరులారా !—సాహిత్యపరిషత్తనుశబ్దము పూర్వచరిత్రలు తెలిసిన వారికి మానసాహ్లాదముగ నుండును. సాహిత్యశబ్దస్వారస్యము సకలకళాసహిత మగుపాండిత్య మనిస్థాపించును. ఇప్పటివారు కొందఱు పంచకావ్యములలోని కొన్నిశ్లోకములు నేర్చుకొని తమకు సాహిత్య మైనదని పలుకుచున్నారు. ఒక్కొక శాస్త్రమునఁ బండితు లగుట సాధ్య మగును గాని, సాహిత్యమున సంపూర్ణుఁడగుట సులభసాధ్యము కాదు. వేదవేదాంగములు, ఉపనిషత్తులు, న్యాయవ్యాకరణాదిశాస్త్రములు, భరతశాస్త్రము, పురాణేతిహాసములుఁ, జరిత్రాంశములుఁ గొంతవఱకుఁ దెలిసి కావ్యనాటకాదులు సంపూర్ణముగ నేర్చినవాఁడు సాహిత్య మైనవాఁడు. అట్టి పాండిత్యము లేనివాఁడు తనకుసాహిత్య మైన దని చెప్పికొనుట ప్రల్లదము.

ఇఁకఁ బరిషత్తనునది మనలోఁ బురాతనకాలమునుండి యుండిన పద్ధతి. యూరోపు దేశములో "యూనివర్సిటీసు" (Universities) అనియుఁ బూర్వకాలపు గ్రీకుదేశములో "అకెడెమీసు" (Academies) అనియు, నుండినరీతిగ మనకుఁ బూర్వకాలమునఁ బరిషత్తు లుండెను. ఏకాంతముగఁ బెద్దకుమారున కైనను సంపూర్ణానుగ్రహ మందిన శిష్యున కైనను వేదాంతవిద్య బోధించునది "ఉపనిషత్తు." అటుగాక బహిరంగముగ విద్యను బోధింప నేర్పడిన పండితసభ "పరిషత్తు" విద్యార్థుల విద్యాభివృద్ధికిఁ గా నేర్పడిన పండితసభ లివి. పూర్వకాలమునఁ బాంచాలదేశములోఁ బరిషత్తు లుండె ననియును, నచటఁ జదువుటకు శ్వేతకేతువు పోయినట్లును బృహదారణ్యకములోఁ బలుకంబడినది. అక్కాలములోనే యనేకము లగుపరిషత్తు లుండి బాలురు విద్యాభివృద్ధినందుచుండి రని పురాతనగ్రంథములనుండి తెలియవచ్చుచున్నది. కాశీ, నవద్వీపము, పునహా పట్టణములం దిట్టిపరిషత్తు లుండినవి. ఐదవ శతాబ్దముననే మధురలో నొక "తామిల్ భాషాపరిషత్తు" ను వజ్రనంది యను జైనుపండితుఁడు స్థాపించె నని దిగంబరదర్శన మనుజైనులగ్రంథములో వ్రాయఁబడినది.

సోదరులారా ! ఆంధ్రభాషాభివృద్ధికినై యీసాహిత్యపరిషత్తు నేర్పఱచిన మహానుభావు లెల్లకాలములందును సంస్మరణీయులు. కేవలముగఁ గన్నడ

భాషలోనే యభిరుచిఁ గలయీజిల్లాలో నీసంవత్సర మీపరిషత్తు నుంచి యాంధ్రభాషాభివృద్ధికి మార్గముసూపిన పెద్ద లగుమీకు వందనంబులు. మహానుభావులారా!—కష్టనిష్ఠురముల కోర్చి దూరదేశప్రయాణము లొనర్చి, ధనవ్యయమును సరకుసేయక, శారీరకష్టమును లక్ష్యపెట్టక, యిచ్చటికి వచ్చి మ మ్మనుగ్రహించు మీకు నేలాటిసపర్యలు సేయఁజాలమే యని చింతిలుచున్నాము. మే మిడు కించిత్సపర్యల నంది, కృష్ణుఁడు కుచేలునిచేతి యటుకులు దని సంభావమిచ్చినరీతిగ, మ మ్మనుగ్రహింతు రని ప్రార్థించెదము

కోలాచలము శ్రీనివాసరావు.

# కర్మము.

"దైవాధీనము సర్వమ్మున్ మనమతిన్ దప్పింపఁగా వచ్చునే"—భారతము.

మ అతిగుహ్యంబు విలంఘనీయము నజేయం బప్రమత్తం బవాం
ఛిత మప్రార్థితమున్ దిరస్కృతమనస్స్వేచ్ఛాప్రవృత్తమ్ము, జీ
వితమందొక్క యదృష్టసంఘటన గాన్పించుం, దదీయమ్ము ప్రా
క్కృతకర్మానుసరమ్ము చేయుటది ప్రాగ్దేశీయసామాన్యమే.

చ ప్రకృతికి నీమనుష్యునకు బద్ధపరస్పరవైరభావమే
సకలజగమ్మునందు సహజంబుగఁ గన్పడెమున్, మనుష్యుఁ డీ
ప్రకృతిఁ గలట్టిశక్తుల స్వపక్ష మొనర్చుకొనున్ స్వశక్తి నీ
ప్రకృతియు మానవాళిపయిఁ బాలనసేయును నిర్దయాత్మమై.

మ మఱియుం బ్రాకృతమున్ నిసర్గ మగు కామక్రోధదుర్లోభమ
త్సరమోహాదుల కిక్కలింద్రియము, లేతద్వశ్యుఁడై యుంట కా
పురుషత్వంబు, తదీయనిగ్రహణమే పుణ్యావహం బన్నిటం
బురుషార్థం బనుటే, స్థిరం బొనరుచుం బూర్వోక్తవైరుధ్యమున్.

మ. పరతంత్రంబొ, స్వతంత్రవృత్తి కలదో, ప్రాగ్జన్మసంవర్తితా
చరణాసన్నఫలానుబద్ధమొ, యదృచ్ఛాకర్మశీలంబొ, యా
చరణల్ నాఁ జనునట్టితీవలకు నెంచన్ మూలకందంబునై
పరఁగంగాఁ దగునట్టి మానసము, చెప్పన్ వచ్చునే యేరికిన్.

చ. ప్రకృతభవమ్మునందు సలుపం దగుకర్మము లెల్లఁగూడఁ బూ
ర్వకృతవశమ్ములైనయెడఁ బ్రాక్కృతకర్మలకేమికారణం
బౌకో యని ప్రశ్నఁ జేయకుఁడి! యొక్కట నీయనవస్థ దాపరిం
పక నిలఁబోదు, దానియెడ మానవుప్రజ్ఞ లవజ్ఞముల్ సుఁడీ.

ఉ. ఈనరుఁ డేవిధంబయిన కృత్యముఁ జేయఁగ నిచ్చగించినన్
దానయి యడ్డగించెడుఁగదా ప్రకృతిస్థము నైనశక్తి, య
ట్లని స్వతంత్రతాగరిమ మెక్కడిదో, పరతంత్రుఁడౌట నెం
దైన నిమిత్తమాత్రుఁ డగునట్టిమనుష్యున, కేటికర్తృతల్.

మ. తన కేకార్యముపట్ల నైనను స్వతంత్రం బైనకర్తృత్వ మొ
ప్పని డా నంట, నిమిత్తమాత్రుఁ డఁట, స్వల్పంబైన స్వేచ్ఛాప్రవ
ర్తనమున్ లే దఁట యిట్టు లయ్యునకటా! ప్రాక్కర్మ సర్వంబు నీ
కనుభావ్యం బని నెత్తిపై నిడుట యన్యాయ్యమ్ము కాకుండునే.

చ. జగమున నేదియైనను నసంశయమున్ మఱి నిశ్చయంబునై
తగువిషయుం బెఱింగినను దానిది యయ్యెడుఁగాదె, పుణ్యపా
పగతులకున్ సుఖాసుఖవిభాజనకుం గలయక్రమం బె, యే
మగునొకొ కార్యకారణమహానియమంబుల నిట్టిపట్టునన్.

మ. కమలాప్తుండును, జంద్రుఁడున్, మఱియు నక్షత్రంబులున్ బుణ్యపా
పములన్ జర్చ యొనర్ప కందఱపయిన్ భాసిల్లుచందంబు, మే
ఘము నట్లే సదసద్విచక్షత నెఱుంగంబోనటుల్, సౌఖ్యదుః
ఖములున్ బ్రాప్తము లయ్యెడిన్ నియమమే గన్పట్ట దెప్పట్టునన్.

ఉ. ఎంతయు వైపరీత్యము వహించెడు నీవిషయమ్ములన్ సమ
ర్థింతు మటంచుఁ జాలఁ బ్రయతించి సుఖాసుఖవృత్తు లెల్ల వే
దాంతులు భ్రాంతు లౌననిరి యన్యశరణ్యము లేమిఁ గాని యీ
భ్రాంతులకన్న డెందమును రాయిడివెట్టు యథార్థ మున్నదే?

మ. భగవంతుం డనువానికిం గఠినతావైషమ్యనైర్ఘృణ్యదు
ష్టగుణమ్ముల్ జనకుంటయున్, బ్రకృతపుం జన్మంబునం దైన క
ర్మగతుల్ ప్రాప్తసుఖాసుఖమ్ములకు సంబంధింపమిన్, బ్రాక్కృతా
నుగమం బెంచిరి ప్రస్తుతానుభవమున్ యోజించి తత్త్వాధికుల్.

ఉ. మాయయొ మిథ్యయో, జగముమాట యెవం డెఱుఁగంగ శక్తుఁ డ
ల్పీయము లైనబుద్ధు లవలీలగఁ దేల్పఁగలట్టివా నొకో
యాయత మైనకర్మవిషయాదులు నైనను గొంద ఱన్యదే
శీయులుగూడ నిర్ణయము సేసిరి ప్రాకృతశక్తి నొప్పుచున్.

చ. కలదు స్వతంత్రశక్తి, చిరకాలపుఁ జేఁతలయొక్కశక్తియున్
గల దిఁకముందుఁ జేయఁ గలకార్యము లయ్యవి యెల్లఁగూడఁ ద
న్మిళితబలంబుచేత నవి నిర్ణయముల్; తనచేయునట్టి చేఁ
తలఫల మెప్పుడేనియు వృథా చనదేని కృతుల్ పొనర్చినన్.

చ. అరయఁగ నెట్టికార్యవిషయంబులనైన స్వతంత్రశక్తి యి
న్నరునకు నొప్పు కారణమునన్ గద పుణ్యము పాప మంచు నే
ర్పెఱ విభజింపఁ గల్గుట, విధించెడు శక్తికి లోఁగి సల్పు సం
చరణమునందు నొప్పునె విచక్షణధర్మ మధర్మమం చొగిన్.

చ. ప్రకృతికి నీమనుష్యునకు వైరమె యొప్పెను నంట సత్యబా
ధకము, నరుండు పాపపువిధంబుల లోఁగి, నిసర్గ మందుచేఁ
బ్రకృతి హితమ్మునై తగుస్వపద్ధతులన్ ద్యజియించి పాపపుం
బ్రకృతిగలట్టి వాఁడగుట వైరమె యొప్పెడురీతిఁ దోఁచెడున్.

గీ. భయము,సంభ్రమ మాశ్చర్య భావములను, రగులఁజేసెడునట్టిపర్వతములందుఁ;
గన్నుల కగోచరంబైన గరిను చేతఁ, జన్మమంది లయించు వృక్షమ్ములందు ;
వనములకు జోలపాడెడు ననఁగఁదోఁచి, పాఱు చుండెడునట్టి చిట్టేఱులందుఁ;
బ్రకృతి నొప్పెడు సర్వజీవములయందుఁ, బ్రజ్వరిల్లెడు శక్తియే స్వహృదయమ్ము
నందుఁ బ్రభవించు ననెడు సత్యమ్మునెఱుఁగు, నతఁడె యోఁగాదె? జ్ఞానిశబ్దార్హుఁ
[డరయ.

మ. కలఁడో, లేఁడో, యెవం డెఱుంగును జగత్కర్తృత్వముం బైకొనం
గలవాఁ డీమన కట్టిపృచ్ఛకుల జోక్యంబేల, యెల్లప్పు కే
వల నిష్కల్మష మైనవృత్తుల మనోవాక్కర్మలం దుంచి య
న్యుల నాత్మీయుల రీతిఁ జూచుపథమే యోగ్యంబు వర్తింపఁగన్.

గీ. అఖిల భూతములందు సౌహార్దబుద్ధి,
యితరులను దన్నుఁబోలె లోనెంచు బుద్ధి,
సర్వసమత నెఱింగెడు సన్మతమ్ము
సర్వమతములలోన శ్రేష్ఠమ్ము మతము.

వేలూరి చంద్రశేఖరము.

చందా సం॥ కు రూ. 3—0—0. విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 4. | రాక్షసనామసంవత్సరము భాద్రపదమాసము. | సంచిక. 7.





# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy

## ప్రధానవ్యాసములు.

# విషయసూచిక

# బాలవ్యాకరణము.

మన తెలుఁగుభాషతో గ్రంథములు వ్రాయునపుడు సంస్కృతమునందు వలెనె వ్యాకరణలక్షణలక్షితభాషతోడనె వ్రాయవలయు ననుసిద్ధాంతము బలపడియున్నది, కావున నిపుడు మునుపటివలెఁ గాక వ్యాకరణావశ్యకత యధికమయి యున్నది. మనభాషకుఁ గలవ్యాకరణములలో సంస్కృతభాషయందువలెఁ బ్రకృతులను గాని, వాక్యరచనమును గాని, సాకల్యముగా నియమించు వ్యాకరణ మొకఁ టైన లేదు. బాలవ్యాకరణములోని కృత్తద్ధితప్రక్రియ యత్యల్పము. వాక్యరచనవిషయమున బాలవ్యాకరణములో స్వల్పముగ సంస్కృత వ్యాకరణములోని కారకప్రక్రియ యెక్కింపఁబడెను. కాని యది సాకల్యముగ నాంధ్రభాషలోని వాడుకలకు నియామకముగా నుండ నేరఁజాలము. కాఁబట్టి ప్రకృతులకును వాక్యరచనమునకును వ్యవహారమె యాధార మై యున్నది. కాని యట్టివిషయమును బహిరంగముగా మనవా రొప్పుకొనఁజాలరు. ఏమన వ్యాకరణసాధ్యములు కాని వెల్ల గ్రామ్యములె యని వీరిసిద్ధాంతము.

కాఁబట్టి, భారతమందుఁ గాని, లేక కొన్నిశతాబ్దములందలి గ్రంథములందుఁ గాని, లేక యావన్మృతకవిగ్రంథములందుఁ గాని యటుగాక యిప్పటికిఁ బుట్టియున్న గ్రంథములలో మనవారి యిచ్చకు వచ్చినగ్రంథములయందుఁ గాని గలప్రయోగముల నాధారముగాఁ జేసికొని యిఁకఁ బుట్టఁబోవు గ్రంథముల కైన సలక్షణతారూపైకవిధప్రవృత్తి వెలయునట్లుగ నొకవ్యాకరణము వ్రాయవలసి యున్నది. లక్షణసాధ్యము గానిభాష గ్రామ్య మని వాదించువారే గాని యాంధ్రభాషకుఁ గలవ్యాకరణముల దారిద్ర్యమును బరిశీలించువా రెవ్వరును నగపడరు.

ఆంధ్రభాషలో సంధిప్రత్యయాది మాత్రవిషయకము లగువ్యాకరణము లైనను బూర్తిగా లేవు. సంధిప్రత్యయాది ప్రవృత్తినిర్ణయవిషయమున నేటివఱకుఁ బుట్టియున్న యాంధ్రవ్యాకరణములలోఁ జిన్నయసూరిగారి బాలవ్యాకరణమె కొంతవఱకు విపులముగా నున్న దనియు, నయ్యది యహోబలపండితీయాదుల సారము లేర్చి కూర్పఁబడిన దనియుఁ జెప్పుదురు గాని యదియు సామాన్యముగా గ్రంథములందు వాడఁబడిన ప్రయోగముల ననేకములను సాధింపఁ జాలకున్నది,

మఱియు, నీబాలవ్యాకరణములో సామాన్యముగాఁ దర్క వ్యాకరణ శాస్త్రములజ్ఞానము లేక యన్వయింపరాని విషయము లనేకములు పచరింపఁబడినవి. ఇట్టివ్యాకరణమును, భాషాజ్ఞానవిషయమున క్షీరకంఠు లనఁదగు హైస్కూలుబాలురకుఁ బఠనీయగ్రంథముగఁ గొందఱు వాడుకచేయుచుండుట శోచనీయము. పూర్వవ్యాకరణవిరుద్ధ మగుభాష గ్రామ్య మనియుఁ జిన్నతరగతుల బాలురును బ్రాచీనాంధ్రలక్షణలక్షితముగనె వ్యాసముల వ్రాయవలె ననియు మనవారిచేఁ దలఁపఁబడుచున్నందునను నిప్పటికిఁ బుట్టియున్న వ్యాకరణములలో బాలవ్యాకరణమె కొంతవఱ కైనఁ బ్రాచీనాంధ్రనియమములను జూపఁజాలిన తెలుఁగువ్యాకరణ మగుటచేతను, దాని నుపయోగింప సాహసించుచున్నా రని తలంచెదను.

పై నుదాహరించినరీతి నతిగూఢ మగునీవ్యాకరణమునందు గ్రంథకర్తగారు దాఁచికొనిన యర్థములనెల్లఁ బ్రకాశింపఁజేయఁదలఁచి సుంకరి రంగయ్యగారు దీనిలోఁ గొంత భాగమునకు బాలవ్యాకరణగుప్తార్థదీపిక యనునొకటీకను రచించిరి, గాని, యేకారణముననో యావ్యాఖ్యానములో ననేకస్థలములందు మూలములో లేనిబాధలు సైతము సంగ్రహింపఁబడినవి. మఱియుఁ ద్రిలింగలక్షణశేష మను దానికిని గొన్ని లేనిపోనిచిక్కులు చూపఁబడినవి. మఱియు నీవ్యాఖ్యానమునఁ దఱచుగాఁ బ్రౌఢవ్యాకరణములోని విషయములును నం దుదాహరింపఁబడిన లక్ష్యములును గ్రొత్తవానియట్లు కొన్నితావులందుఁ జూపఁబడినవి.

పై నుదాహరించిన విషయములు విచక్షణు లగుచదువరులకు విశదపఱచుటకై యిట దిఙ్మాత్రముగ నుదాహరించెదను.

— * బాలవ్యాకరణములోని శాస్త్రపరిభాషలు * —

"ప్రథమేతరవిధి నిరవకాశంబుగావున దీనిని బాధించెడిని" (సంధి 9 సూ॥ చూ)

"పృథగ్భూతంబు లగునర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు" (చూ॥ సమాస సూ)

"ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు" (చూ॥ తద్ధిత, సూ)

"భూతంబునా విద్యమానధ్వంసప్రతియోగి" (చూ॥ క్రియా 8 సూ)

"భావినా విద్యమాన ప్రాగభావప్రతియోగి" (చూ॥ క్రియా 8 సూ)

"కృతాకృతప్రసంగి నిత్యంబునాఁబడు" (చూ॥ క్రియా 50 సూ)

"అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు" (చూ॥ క్రియా 48 సూ)

"అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు" (చూ॥ క్రియా 12 సూ)

పైనుదాహరించిన రీతిగల సామాన్యదురవగాహవిషయము లిం దనేకములు గలవు. అయ్యవి సంస్కృతసాహిత్యమును దర్క-వ్యాకరణశాస్త్రజ్ఞానమును గలవారికే బోధపడును. హైస్కూలు బాలురమాట కేమి, అధిక మగుపట్టుదలతో వాదించుచున్న మనగ్రాంధికభాషావాదులలో నెందఱ కట్టి జ్ఞానము గలదో నేను జెప్పఁజాలను.

ఇట్లె టిత్వకిత్వాదులఫలములును, (సంధి. 3, 25) సంస్కృతశబ్దముల పుంస్త్రీనపుంసకలింగాదుల (తత్సమ. 21, 39, 57, సూ) రూపములును, హలంత సంస్కృతశబ్దముల ప్రథమైకవచన ద్వితీయైకవచనరూపములును, (తత్స, 67, 70, సూ) "ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు" ననుమొద లగుకారక పరిచ్ఛేదసూత్రములును, వానివృత్తులలోని "క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణం" బనుమొదలగు లక్షణములును, సంస్కృతతద్వ్యాకరణజ్ఞానము గలవారికె గాని యితరులకు సుబోధములు కానేరవు.

— * బాలవ్యాకరణవిషయములవిమర్శనము. * —

"నకారంబు ద్రుతం"బను (సంజ్ఞా. 11 సూ) సూత్ర మాంధ్రశబ్దచింతామణిమార్గానుసారిత్వమును జూపుచున్నది. అట్లు నకారరూపవ్యంజనమాత్రమె ద్రుత మయినచో సంధిపరిచ్ఛేదములోని యిరువదవసూత్రములోని ద్రుతస్వర లోపవిధాన మసంగత మగును. మఱియు ద్రుతమునకు స్వత్వరూపము నువర్ణమని గ్రంథకర్త యంగీకరించియున్నాఁడు. (బాల. సంధి. 17 సూ)

కారకపరిచ్ఛేదములోని ముప్పదిమూఁడవసూత్రము చొప్పున సిద్ధించునట్టి పండితుఁడను, వెళ్లినాఁడను మొదలగురూపములు సూరిగా రుదాహరించిన ద్రుత ప్రకృతికములపట్టికలోనివి గానందున "ద్రుతప్రకృతికంబులు గానిశబ్దంబులు కళలనంబడు" నను (సంజ్ఞా. 13 సూ) సూత్రము చొప్పున నవి కళలు కావలసివచ్చును. అవి యుత్తమపురుషైకవచనములవంటివి గాన ద్రుతాంతము లయ్యెనంద మన్నచో "వాఁడు చదివినాఁడు" మొదలగువానిలోని 'చదివినాఁడను మొదలగు నవియు, భూతకాలికప్రథమపురుషైకవచనములవంటి వగుటంజేసి ద్రుతాంతములు కావలసివచ్చును. ఇట్లె 'చేయఁగూడదు' మొదలగువానిలో

నుజ్యంతరూప మగు 'చేయు' ననుమొదలగువానికిని ద్రుతప్రకృతికత్వము సిద్ధింప కున్నది.

పైలోపములు వారించునట్లు ప్రౌఢవ్యాకరణములోఁ "బ్రత్యయాగమావ్యయాత్మక మయి యుత్వవిశిష్ట మైన నకారము ద్రుతసంజ్ఞకం" బని సవరింపఁబడెను గాని యిందు సంధిపరిచ్ఛేదములోని "కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చుపరం బగువో ద్విత్వంబు నాపన్నబైడి" ననుసూత్రమునందు నకారమాత్రమునె ద్రుతముగా నంగీకరించెను. లేనిచో "సర్వము న్నతని" యను మొదలగు వానిలోని ద్విత్వోదాహరణము సందర్భింపదు గదా! మఱియు నిందు సమాసపరిచ్ఛేదములోని "యొకండ్వాదులు పరంబు లగుచోఁ దఱచుగ నుగ బది కగు" నను సూత్రముచొప్పున వచ్చిన "యుగ" ప్రత్యయ ముత్వవిశిష్టము కామింజేసి ద్రుత మనిపించుకొనఁజాలదు. దానికి ద్రుతత్వము నంగీకరింపనిచోఁ "బదుమూఁడు" మొదలగుచోటులందు ద్రుతలోపశాస్త్రము ప్రవర్తింపదు. కావునఁ "పదున్మూఁడు" మొదలగు ననిష్టరూపములు సిద్ధింపవలసి వచ్చును. మఱియు నిందు సమాసపరిచ్ఛేదమున నున్న "గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుం బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు" నను సూత్రముచొప్పున సిద్ధించు "కమ్మందేనె" మొదలగువానిలోని బిందువునకును ద్రుతత్వ మంగీకరింపక తప్పదు. లేనిచో నిట్టిప్రయోగములలో సరళాదేశము నిరాధార మగునుగదా!

పై నుదాహరించినరీతి నొకగ్రంథమందును ద్రుతత్వము నిష్కృష్టముగాఁ బరిష్కరింపఁబడలే దని చెప్పవచ్చును. ఆంధ్రవ్యాకరణమున నధికభాగ మీకళాద్రుతములనె యాశ్రయించి యున్నది. ఇది వైయాకరణులకె యిట్లు లోఁగకుండిన నీక బాలకులగతి యే మగును? ఈవిషయమున బాలవ్యాకరణగుప్తార్థదీపికాకారు లగుసుంకరి రంగయ్యగారు పడినప్రమాదము తద్గ్రంథవిషయ విమర్శ సందర్భమున వ్రాయవలసినదే యయినను బ్రసంగవశమున నిచ్చట నుదాహరించుటయె యుక్త మని తోఁచి వ్రాయుచున్నాను.

"కన్దోయి" (కన్ను+దోయి) ఇట్లుండఁ బ్రకీర్ణకపరిచ్ఛేదములోని యేడవసూత్రంబున ద్విత్వనకారలోపంబు గలిగి "కనుదోయి" అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రంబున "కను" శబ్దంబుయొక్క యుకారంబునకు లోపంబు రాఁగా "కన్+దోయి" అగును. ఇప్పుడే సంధిపరిచ్ఛేదములోని పదు

నేడవసూత్రంబున "(పదునెనిమిదవ" యని యుండవలెను) నీ ద్రుతంబునకు డకారసరళంబు పర మగుచుండఁగా వచ్చె గోవులు, అయినట్టులు నకారలోపము గలిగి "కదోయి" అనునవిష్టరూపము ప్రాప్తించుచున్నది. "కను" శబ్దనకారము ప్రథమప్రాస్వంబుమీఁదిది కాన నిరువది రెండవది యగునీప్రకృతసూత్రంబున ద్రుత లోపంబు కలుగక "కన్దోయి" అని సంశ్లేషరూప మగును" అని యిట్లు బాల వ్యాకరణగుప్తార్థదీపికలో నిరువది రెండవసూత్రపు వ్యాఖ్యానసందర్భమునఁ జర్చిం పఁబడెను. ఇచ్చటఁ గన్ను, దోయి, యనునవి వ్యస్తము లని యభిప్రాయపడుట యొకవింత. ఇఁకఁ బ్రథమావిభక్తి యగుటంజేసి కళ యగు కన్నుశబ్దరూపాంతర మగు 'కన్' శబ్దము ద్రుతప్రకృతిక మగుట రెండవ పెద్దవింత. కన్ శబ్దము ద్రుతప్రకృతిక మైనపుడు దాని స్వత్వరూపాంతర మగుకనుశబ్దమును నట్టిదె కావలయును గదా. అట్లయిన శబ్దరత్నాకరోదాహృతము లగు "కనుపెట్టు, కనుపొట్టలు" మొదలగువానిలో సరళాదేశాభావమున కేమి కారణమో తెలియ కున్నది. రంగయ్యగారు వ్రాసినట్లు 'కనుదోయి' యనుస్థలమందు వలెనె ప్రకీర్ణక పరిచ్ఛేదములోని పదునాఱవసూత్రములోని యుత్వలోపమున కుదాహరణము లగు "ప్రమాన్పడె, మిన్నడె" మొదలగు సూరిగా రుదాహరించిన లక్ష్యములందు ద్రుతకార్యాభావమునకును గళాకార్యరూపగసడదవాదేశమునకును నేమి గతి? "కేవల నకారంబు ద్రుతనామంబున సామాన్యంబుగా వాడఁబడుచున్నను బ్రత్య యంబును 'ఫలమును, నేను, వెళ్లుచున్నాను,' ఆగమంబును 'వానిచేతను, చేయు చును, మమ్మును.' అవ్యయంబును 'అపుడును, మఱియును, అన్నయును' నైన యుకారాంతనకారంబె ద్రుతసంజ్ఞ గలది యని చెప్పుట యుక్త" మని యిట్లు సం జ్ఞాపరిచ్ఛేదములోని పదునొకండవ సూత్రపువ్యాఖ్యానమునఁ బ్రౌఢవ్యాకరణము లోని ద్రుతలక్షణపరిష్కారము నెక్కించినవీరు ప్రత్యయాగమావ్యయములలో నన్యతరంబు కానట్టియు నుకారాంతత్వము లేనట్టియు, శబ్దసిద్ధ మగునీసహజనకార మునకు ద్రుతత్వ మెట్లు లంగీకరించిరో తెలియకున్నది.

"ప్రథమేతరవిభక్తిశత్రర్థక చువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వై కల్పికముగా నగును" (సంధి 2 సూ) "ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు" (సంధి 9 సూ) ఈ రచన సరికాదు. ద్రుతప్రకృతికమునకు సంధి ప్రాప్తియే లేదు నిషేధ మేల? ద్రుతవ్యవధానమందును నాంధ్రశబ్దచింతామణి యందువలె సంధి నంగీకరించెద మన్నఁ గల్పనాగౌరవమునకు ఫలము లేదు. ఇఁ

కానులతోఁ బాటుగ సంధిప్రాప్తి గలప్రథమేతరవిభక్తి ప్రభృతులకు సంధివిధించి ప్రథమేతరసూత్రమును ప్రత్యాఖ్యానము చేసినయెడల నిరవకాశపరిభాష నపే క్షింపను నక్కఱలేదు. ఇట్టి రచనచే "గురువీక్షించె" (గురువుఁ+ఈక్షించె) నను మొదలగునవిష్టరూపములు వారింపఁబడును. సూరిగారిరచనలో నివి దుర్వా రములు లై యున్నవి.

ఆచ్ఛికపరిచ్ఛేదమున ముప్పదెనిమిదవసూత్రమున "వఱుత"నని యుదా హరింపఁబడెను. "ఔపవిభక్తికంబుల తృతీయాన్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు" (ఆచ్ఛిక 38 సూ) ననుసూత్రముచే "వఱితి" యనుదాని నుండి "వఱిత" నని సిద్ధించును, కాని శకటరేఫోపరిస్థ మగునికార ముకార మె ట్లగును? "టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు" (ఆచ్ఛి 36 సూ) నను సూత్రముచే విధింపఁబడిన యిత్వము చేయకముందే యత్వము చేసెద మన్న "రెండిట" నను మొదలగురూపములు సిద్ధింపనేరవు. ఈ సందర్భ మున "వఱుత" ననురూపసిద్ధికే కావలయును గుప్తార్థదీపికలో నిత్వకార్యము చేయకయే "వఱుతిచేత" నను మొదలగురూపము లుదాహరింపఁబడెను. కాని మూలకారుఁడే ముప్పదినాల్గవసూత్రములో "వఱితి" నని యుదాహరించుటచేఁ దత్సాదృశ్యంబున దీనికిని "వఱితిచేతను" మొద లగురూపములే సూత్రకారసమ్మ తము లని విశద మగుచున్నది. కాఁబట్టి సుంకరి రంగయ్యగా రుదాహరించిన "వఱుతిచేతను" మొదలగు రూపములు ప్రామాదికము లని స్పష్టముగాఁ జెప్ప వచ్చును. సూరిగారి "వఱుత" ననునుదాహృతి కాధారమును సగపడదు.

"నీళ్లు, చేయఁబట్టి, జ్ఞానముంబట్టి (పంచమీవిభక్తి) పఱచు మొదలగు రూపపరంపర బాలవ్యాకరణముచే సాధ్యము కాదు. కావుననే యాయాసందర్భ ములలో నట్టిరూపములను సూరిగా రుదాహరింపలేదు.

'బహువ్రీహిని స్త్రీవాచ్యం బగు-చో నుపమానంబుమీఁది మేనునకు బోఁడి యగు" ననుచొప్పునఁ (సమాస 23 సూ) నలరుఁబోఁడి యనునది సిద్ధించు నని సూరిగారు వ్రాసినారు. అట్లయినచో నిఁక "నలరుంబోఁడి" యను మొద లగు సబిందుకరూపముల కేమి గతి? ఇచట 'బోఁడి' యనునది పోఁడిశబ్దయోగ మున లభించె ననుట యుచితము. ప్రౌఢవ్యాకరణమునం దిట్లె సాధింపఁబడెను.

"గతిబుద్ధిప్రత్యవసానార్థ శబ్దకర్మకాకర్మకంబుల కప్రేరణంబునఁ గర్త యగునది ప్రేరణంబునం గర్మ యగు" (క్రియా 123 సూ) ఈ సూత్ర మాంధ్ర

వ్యాకరణములలోఁ జేర్పఁబడిన వాక్యరచనావిషయక నియమములు తెలుఁగు వాసుకల కంతగా నుపచరింప వనియు, నవి సంస్కృతభాషాసంబంధము లైన వనియుఁ జెప్పుటకుఁ బ్రథమోదాహరణ మై యున్నది. దీనినిబట్టి చూచినచో "గురువు శిష్యునిచేత వాక్యమును బలికించె" ననుమొదలగు సరళము లైనవాక్యములును గ్రామ్యములె కావలసివచ్చును.

"సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందు వునకుం బూర్ణం బగు" (అచ్చిక 15: సూ) ఈ సూత్రముచే "మాఁడుచుట" యనుదానిలోని డకారముపై నున్నయుకారములోపించి చకారసంయుక్త మగు డకారము పరమం దున్నపుడు 'మా' యనుదానికిఁ బరమున నున్నయర్ధానుస్వారము పైసూత్రముచొప్పునఁ బూర్ణము కావలసియున్నది. అపుడు 'మాంఢ్చు' నను ననిష్టరూపము సిద్ధింపవలసివచ్చును. కావునఁ బైసూత్రములో "సంయోగంబు పరం బగునపు" డనుచోట "బహువచనలకారసంయుక్తవర్ణంబు పర మగునపు" డని నిలుపక తీరదు. అట్లు నిలిపినపుడు పయిసూత్రములోని "సమాన పదమునం" దనుదానికి సార్థక్య మగపడదు. బహువచనలకారసంయుక్తవర్ణము ఖండబిందువునకుఁ బరం బగుట యేకపదమునందు మాత్రమే సంభవించును గాన "సమానపదంబునం" దనుదళ మీసూత్రమునఁ బ్రత్యాఖ్యేయమె యగును.

### — * బాలవ్యాకరణగుప్తార్థదీపికావిమర్శనము. * —

"సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు" ననుసూత్రమువివరణమున "నలుగడాదుల నీయాగమంబు లే దం"డ్రని సూరిగారు స్పష్టముగాఁ జెప్పియుండ నిచటియాగమశబ్దమునకు సంశ్లేషమర్థ మని యపార్థము చేసి బాలవ్యాకరణగుప్తార్థదీపికాకారుఁడు "నలుఁగడలు, నలుంగడ" లనురూపము లుండవచ్చును గాని 'నలున్గడ లనురూప ముండఁగూడ దని భావ" మని వ్రాసియున్నాఁడు. ఇట్టియపార్థము చేయుటకుఁ గారణము లేకపోలేదు. సూరిగారిమూలములో లేఖకాదిప్రమాదమున "నలుఁగడాదు" లని యిట్లు సార్థానుస్వారముగ ముద్రితగ్రంథములలో నున్నది. ఈమాత్రపుఁ బ్రమాదమును సవరించుకొనక యిట్లు వ్యాఖ్యానము చేయుట వింతగ నున్నది. బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరమందును నలుశబ్దవివరణమున "నలుగడ" యని నిరనుస్వారముగనే

వ్రాయఁబడియున్నది. "సరసాదిత్యనేన నలుగడలు ఇత్యాది వ్యావృత్తి" యని యహోబలపండితుఁడును సమాగమ మిచట నిషేధించియున్నాఁడు.

"అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకం బగు" నను (తత్సమ 39 సూ) సూత్రమునకు హ్రస్వాకార మంతమందుఁ గలయమహత్తు లయిన నపుంసకలింగ శబ్దములకు ము వర్ణకంబు వచ్చు" నని యీగుప్తార్థదీపికలో నర్థము వ్రాయఁబడి యున్నది. అట్లయినచోఁ బుంలింగ మగు వృక్షశబ్దమునకు మూలములో నుదాహరింపఁబడిన "వృక్ష" మనురూప మెట్లు సిద్ధించును? మఱియు, దైవతము, వృషభము, మొదలగు ననేకశబ్దములగతి యేమగునో తెలియకున్నది.

"స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు" (తత్సమ 57 సూ) నను సూత్రమునకు 'స్త్రీలింగము లనఁగా స్త్రీవాచకము' లని యర్థము చేయుట కేవలము పొరపాటు. అట్లు కానిచో దేవతావిద్యాది శబ్దములు స్త్రీవాచకములు కామింజేసి 'దేవత, విద్య' యను మొదలగురూపములు సిద్ధింపనేరవు. వ్యాఖ్యాత యిట్లపార్థము చేయకుండినచో స్త్రీవాచకములు కాకున్నను నవి స్త్రీలింగములె గాన మూలమును బట్టి సాధ్యము లగును.

పైరీతిని బాలవ్యాకరణగుప్తార్థదీపికాకారుఁ డనేకస్థలములం దపార్థములు చేయుటయే గాక కొన్నిచోట్లను దాను బొరపాటుపడి ప్రౌఢవ్యాకరణకర్త పొరపడినట్లు వ్రాసియున్నాఁడు. ఇది మిక్కిలి వింతగ నున్నది.

"ప్రౌఢవ్యాకరణమునందు 'అంత+వారు' అని శబ్దద్వయమ్మును గ్రహించి ద్వితీయశబ్దంబులోని వాకారంబునకు లోపంబును, లఘురేఫంబునకు నలఘురేఫాదేశంబును, పూర్వశబ్దంబులోని తకారంబునకు దాదేశంబును రాఁగా 'అందఱు' అనురూపం బయ్యె నని శబ్దనిష్పత్తి చూపఁబడినది. కాని యీ మార్గము ద్వితీయాదివిభక్తులందుఁ బాధకం బగును. ఏల యన, ద్వితీయాది విభక్తులయందుఁ బైని జెప్పిన చొప్పున (అంత+వారిన్) అని యుండ వాలోపంబును లఘురేఫంబున కలఘురేఫాదేశంబును, పూర్వశబ్దంబులోని తకారంబునకు దాదేశంబును జేయఁగా 'అందఱిని' అను ననిష్టరూపంబు కావలసివచ్చును. ఇట్లె 'అంతవారిచేతన్' ఇత్యాదులి కారాన్త శకటరేఫయుక్తరూపంబులు కావలసి వచ్చును. కాన నట్టిప్రక్రియ ప్రామాదికం"బని సుంకరి రంగయ్యగారు వ్రాసియున్నారు (బాలవ్యాకరణగుప్తార్థ దీపిక 128 పుట) ఇచ్చటఁ బ్రౌఢవ్యాకరణ ప్రక్రియ

ప్రామాదిక మనుట కేవలము ప్రామాదికము. ఈవిషయము చదువరులకు విశద మగుటకై యీసందర్భమున నున్నప్రౌఢవ్యాకరణసూత్రము లిట నుదాహరించు చున్నాను.

88 "అంతాదులకు వారు పరం బగుచో వాకు లోపంబును రురలకు ఱుఱలాదేశంబు నగును. ఉ. అందఱు, అందఱన్. మొ—

89 వాలోపంబుతఱి వానితకారంబునకు దకారం బగు. ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు.

90 ద్వితీయాదులం దసంయుక్తరవర్ణంబునత్వంబున కిత్వంబు తఱచుగనగు. ఉ. వారిఱ్, వీరిఱ్, వేరిఱ్, ఒకరిఱ్, వాండ్రఱ్, వీండ్రఱ్, వేండ్రఱ్, ఒకండ్రన్.

ఘొ—తఱచుగననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు కలుగదు. పైసూత్రములలోఁ దొంబదవసూత్రమునం దసంయుక్తరవర్ణంబున కనుటచే రేఫ మాత్రమె గ్రహింపఁబడును. కాని శకటరేఫము గ్రహింపఁబడదు. 'వాండ్ర' నిత్యాదులలో విభక్తిప్రత్యయసంయుక్తరేఫ ముండుఁగాని విభక్తి ప్రత్యయ సంయుక్త శకటరేఫ ముండదు గదా. ఒకవేళ నిత్వకార్యానంతరమున నెనుబది యెనిమిదవ సూత్రముచే రేఫమునకు శకటరేఫాదేశమును జేయుదమన్నఁ దత్సూత్రమునందలి రగ్రహణమునకు వైయర్థ్యము సంభవించును గాన నట్లు చేయ వలనుపడదు. ద్వితీయాదులం దికారాదేశమె ముందుగఁ జేసినచో నిఁక నెనుబది యెనిమిదవ సూత్రములోని రగ్రహణమునకు నెచ్చటను బ్రసక్తి లేమింజేసి యది వ్యర్థ మగు ననుటకు సందేహము లేదుగదా. కావున 'నందఱు' ననియే ప్రౌఢ వ్యాకరణప్రక్రియచే లభించును గాని 'యందఱి' నను ననిష్టరూపము సిద్ధింపనేరదు. ఇంతసందేహ మేల, ఎనుబది యెనిమిదవ సూత్రమున 'నందఱు' నని గ్రంథకర్త యుదాహరించియే యున్నాఁడు. ఈమాత్రపుఁ బరిశీలన మయినం జేయక యట్లు గ్రంథకర్తలందు స్వదోషము ద్రోయుట శోచనీయము—

గ్రంథవిస్తరభీతిచే విరమించితిని గాని పయి నుదాహరించిన రీతిగల లోపములు మూలమునందును వ్యాఖ్యయందును బెక్కులు గలవు. వ్యాకరణ సాధ్యము లగుపదములె ప్రయోగార్హము లనియుఁ దక్కినవి గ్రామ్యము లనియు గ్రహించినప్పుడు వేయియేండ్ల క్రిందటిభాషకును బుట్టఁబోవు బాలవ్యాకరణమే గతియని యంగీకరించినను గ్రాంథికభాషలోఁ దండోపతండములుగ గ్రాంథికవాదులచే

నేర్చుకొనుటకు మూలస్థాన మిండియా యని "హీరన్" అను పండితుఁడు వ్రాసినాఁడు. పూర్వకాలంబున గ్రీసులోఁ బ్రసిద్ధికెక్కిన ప్లేటో, థేల్సు, పైథోగరీసనువేదాంతులను దమశిష్యులుగ నుంచుకొనునంతటి ఋషులును, ఖగోళజ్ఞానాతిశయమునఁ బ్రసిద్ధి కెక్కిన జ్యోతిష్కశాస్త్రనిధులును, పాశ్చాత్యులు శ్లాఘింపఁదగిన శిల్పవిద్యానిపుణులును, నెట్టికఠినచిత్తుని మనమైనను గరఁగింపఁగల గాయకశిఖామణులును, గలిగిన దేశ మిండియా తప్ప మఱి యెందుఁ జూడఁగల మని కౌంట్ట దొర ప్రశ్నించినాఁడు. సముద్రమార్గమున సంచరించి దూరతీరములకు నూతన వస్తువులఁ జేర్చినట్టియు, నంతరిక్షమును బరిశీలించి, నక్షత్రస్థానము లేర్పఱచి, గ్రహాగమనములను గుర్తెఱింగి, వానికి నామంబు లిచ్చినట్టియు, దేశస్థు లిండియావా రని దయానిసిస్సు వ్రాసినాఁడు. లిఖితసాక్ష్యమును బట్టి చూడ హిందువు లతిపురాతనజాతివా రనియును, గరగరికయందుఁ గాని, నాగరకతయందుఁ గాని హిందువులను మించినవారు లే రని 1872 వ సంవత్సరము అక్టోబరు నెలలోఁ బ్రకటింపఁబడిన యెడింబరోరివ్యూలో వర్ణింపఁబడినది. మానవవిచారదృష్టికి నెంతదూరము వ్యాప్తి కలదో యంతటిమానసశక్తి హిందువులకుఁ గలిగి యుండె నని మానింగుదొరసాని వ్రాసినది. దేవీస్థార్ అనుశాసనమునుబట్టి యిప్పటికి 8,000 సం॥ లక్రిందటనే హిందూదేశము నాగరకత మించియుండె నని బారన్ జార్నష్టు జర్న వ్రాసినాఁడు. ఇప్పటికిఁ బండ్రెండువేల సంవత్సరములక్రిందటఁ బ్రబలియుండిన అట్లాంటియన్సుల కాలమునందే యిండియాలో సూర్యసిద్ధాంత మేర్పడిన దని "Man, Fragments of Forgotten History" అను గ్రంథములో వ్రాయఁబడినది.

పైని వివరించినవిషయ మార్యులపురాతనౌన్నత్యమును గుఱించి పాశ్చాత్యుల యభిప్రాయము కావున నది విశ్వసనీయ మనుటకు సందియంబు లేదు. ప్రపంచము నందలి నాగరకతకు నెల్ల యీజిప్టు, కాల్డియా, సిరియా, గ్రీసు దేశజులు కారణభూతు లని కొందఱు పాశ్చాత్యులు వాదించుచుందురు గదా! ఆ దేశస్థు లెవరయినదియు, వారికి నాగరకత యెటు వచ్చినదియు, నెవరినుండి నాగరకత నేర్చినదియు మనము తెలియవలసినది. దానిని మనము తెలిసినచో, మనవార్త మనము తెలిసినవార మగుదుము. నాగరకత హెచ్చిన జాతివారి మూలపురుషు లనాగరకతఁ గల యడవిజనులు గానుండుదు రని కొంద ఱభిప్రాయపడినారు. ఆయభిప్రాయము కొంతవఱకు నిజమయినను నాగరకతఁ గల

జాతి యొకటి ప్రారంభమునుండి యుండియే తీరవలెను. అటులేనిచో మోటువా రభివృద్ధి నందుటకు మార్గ ముండదు. గ్రీసువారి నాగరకతకు ఫినీష్యనులు కారణ భూతు లైరి. రోంవారికి గ్రీసువా రాధారు లైరి. రోంవారును, గ్రీసువారును యూరోపియనుల నాగరకతకు మూలపురుషు లైరి. ఫినీష్యనులు, ఈజిప్టు బాబిలోనియనుల నుండి నేర్చిరి. ఈజిప్టు బాబిలోనియను వారు "అస్సిరియా" వారి నుండి తెలిసికొనిరి. అక్కేడియాజనులనుండి 'అస్సిరియా'వారు గఱచిరి. కావునఁ బ్రథమమున నొక నాగరకతఁ గల జాతి ప్రపంచమునఁ బుట్టియుండి మిగతవారి యభివృద్ధికి మార్గదర్శిగ నుండవలెను. అట్టి నాగరకత గల జాతి యార్యుల దని నాచే ముందుఁ జూపఁ బడును. ఐరాను లని పిలువఁబడు పరిష్యనులతోను నార్యులతోను నాగరకత ప్రారంభమున నేర్చినవా రక్కేడియనులు. వారు పూర్వ ముండిన ప్రదేశము "ఆర్యులు, ఐరానులు" ఉండిన ప్రదేశమున కుత్తరమునఁ గల కొండల భాగము. కావుననే సామీప్యసంబంధబలమున నార్యుల నాగరకత వారికిఁ బట్టువడెను. టైగ్రస్సు, యూఫ్రటీస్ నదీతీరములందుఁ బూర్వ మస్సిరియా యని పిలువంబడు రాజ్య ముండినది. రాజులపట్టణములు పూడిపోయినవి. ఇపు డాప్రాంతములు పాశ్చాత్యులు త్రవ్వుచుండ నిండ్లగోడలు దొరకినవి. ఆగోడ లిటిక పెల్లలతోఁ గట్టఁబడినవి. ఆపెల్లలపై ననేకము లగుచరిత్రాంశము లున్నవి. ఋగ్వేదములోని ఋక్కులకు సమానార్థ మిచ్చుఋక్కు లున్నవి. వాని నిపుడు పాశ్చాత్యులు పరీక్షించుచున్నారు. అందులోని వ్రాఁత యేవిధముగను శిథిలము గాక యున్నది. ఈ యిటిక లయిదువే లేండ్లుగ భూమిలోఁ బూడి యుండినను క్రొత్తవిగ నగపడుచున్నవి. ఈ యిటికపెల్లల శాసనములు, పైని నాచే వ్రాయఁ బడిన యక్కేడియను జాతి వారివి.

నల్లనివర్ణము గలవారు ప్రారంభమున జనించి రనియు నెఱ్ఱనివర్ణమువారు రెండవ వా రనియు, బంగారుచాయతోఁ గూడిన తెల్లనివర్ణము గలవారు మూఁడవ వా రనియు బ్రహ్మజ్ఞానసమాజమునకుఁ జేరిన పాశ్చాత్యపండితుఁ డొకఁడు వ్రాసి నాఁడు. నాల్గవసృష్టికిఁ జేరిన యట్లాంటియన్సు సకల విద్యల యందును విశేష ప్రావీణ్యము గలవారుగ నుండి రనియు, వారు శాస్త్రోక్తముగ విమానములు గట్టి యాకాశమార్గమున నెంతదూర మయినను సంచరించు చుండి రనియు వారినుండి యార్యు లనేక విద్యల నేర్చి రనియు నాపండితుఁడే వ్రాసినాఁడు. అట్లాంటియ న్సుండినది 11,470 సం॥ ల క్రిందట. అప్పటినుండియు నార్యు లన్నివిధముల దిన

దినాభివృద్ధిఁ గాంచుచు వచ్చిరి. ఆర్య లక్షణములను గానరూపకముగ మాట లాడుచుండి రఁట. మధ్యాసియా నార్యులు వదలిన పిమ్మటఁ గ్రమక్రమముగ క్షీణించుచున్నా రనియు, నిండియా చేరినవారే యార్యులలో శ్రేష్ఠు లనియు, వారు ప్రారంభమున స్వాభావజనితకౌశలము (Intuition) గల వారుగ నుండి నందున వారికి యాథార్థ్యదైవభక్తి కలిగె ననియు, బుద్ధికౌశలము హెచ్చిన పిమ్మట వారికిఁ బ్రాకృతగుణములు పట్టువడె ననియు, దానివలన వారిక్షీణతకుఁ గారణము గలిగె ననియు వ్రాయఁబడినది.

మీఁద నాచే వ్రాయఁబడిన నల్లనివారు నీగ్రోలు. వారినే ఋగ్వేద ఋషులు రాక్షసు లని పిలుచుచుండిరి. ఎఱ్ఱనివా రీజిప్ష్యనులు. వీరి నార్యలసురు లనుచుండిరి. ఋగ్వేదఋషు లార్యులను గొన్నిచోట్లఁ దెల్లనివా రని వర్ణించినారు. వీరి తెలుపు యూరోపియనులను బోలిన శ్వేతచ్ఛాయ గాదు. వీరి వెండ్రుక లెఱ్ఱనివి కావు. కన్నులు పచ్చనివి కావు. బంగారు చాయతోఁ గూడిన తెలుపువర్ణము వీరికి ముఖ్యము. ఆర్యస్త్రీల కనుఁగవ విశాలముగను, నీలవర్ణముగను, జింకకన్నులంబలెఁ బ్రకాశించునట్టిదిగను నుండునది. వెండ్రుకలు నలుపుగను బొడుగుగను నుండును. పురాతనార్యులు స్వాభావికముగ నాగరకతలో హెచ్చుగువారు. దేహమానసబలమునం దద్వితీయులు. విద్యాబుద్ధులయం దసమానులు.

ఇంతటి నాగరకతఁ గల పురాతనార్యు లుండిన స్థలమెద్ది? కాలమెద్ది? యని యడుగ నగును. ఈవిషయము లిదమిత్థ మని నిర్ధరించుట కష్టము. కొందఱు మధ్యాసియా యని నిర్ధరించినారు. కొంద ఱేష్యామైన రని సల్కిరి. కొందఱు కాశ్మీర మనిరి. కొంద ఱార్కిటిక్ సముద్ర మనిరి. ఇవి యన్నియు నిజముగ నుండును. అయితే సమయభేదములు. భూమధ్యసముద్ర ముప్పొంగి హిమాలయపర్వతము సైతము నీటిలో మునిఁగినపు డార్యులు కాశ్మీరములోఁ గాని, యేష్యామైనరులోఁ గాని యుండి రనునది యసమంజసము. శతసహస్రవర్షముల క్రిందట నార్కిటిక్ సముద్రప్రాంత మార్యుల జననగృహముగ నుండిన నుండ నగును. ఋగ్వేదకాలమునఁ గాని, యంతకు నించుక మున్నుగాని యార్యులు కాశ్మీరాది దేశములం దుండి రనుటకు సందియంబు లేదు. సరస్వతీదృషద్వతీ నదులమధ్యస్థల మార్యావర్త మని మనవా రనున దతినూతనము. ఆర్యులు పంజాబు చేరిన పిదప వచ్చిన నామ మిది. ఈవిషయమునఁ బాశ్చాత్యులును, హిం

దువులును వ్రాసిన గ్రంథములనుబట్టి చక్కఁగ నాలోచింప నాకుఁ దోఁచిన దీవిధముగ నున్నది. కాశ్మీరము, ఆఫ్గనిస్థానము, బెలూచిస్థానము, పర్షియా, కుర్డిస్థానము, ఆర్మీనియా, ఏషియామైనరు, మెసపొటేమియా, ఈమొదలగు ప్రదేశములును, టర్కీస్థానములోఁ గొంతభాగమును, చేరినప్రదేశ మార్యావర్తము. అనఁగ నీయార్యుల యావరణములోఁ గాశ్యపి సముద్రము, ఆర్యసరస్సు, పర్షియన్ సముద్రము, మధ్యభూసముద్రము, కాశ్యపికొండ, ఆర్యావర్తపర్వతము నివి యన్నియును జేరినవేను. ఇచట నున్నవారు ప్రారంభమున దిగ్దేశములు చేరి రని చరిత్రకారులు వ్రాసినారు. ఈ యార్యావర్తమున నుండుకాలముననే యార్యుల నుండి ఇరాన్లు వేఱుపడి పర్షియాలో నిలిచిరి. ఆర్యులు కాశ్మీరము చేరిరి. కాశ్మీరదేశమునకే కాశ్యపి నామంబు పూర్వ ముండినది. జలమయమై యుండిన ప్రదేశమును గశ్యపుఁ డుద్ధరించినందునఁ గాశ్యపి యను నామంబు గలిగెను. ఆర్యులు కాశ్మీరదేశమునం దుండినవా రనుటకు 'రాగోజిన్' అను పండితుఁడు (వేదిక్ ఇండియా) "Vedic India" అను గ్రంథములోఁ జూపిన కారణము లొప్పఁదగినవిగ నున్నవి. అవి యెవ్వియన:

(*a*) ఆర్యులు సోమరసముఁ బానము సేయువారు. సోమలత కాశ్మీరదేశోత్తరము నందలి హిమాలయపర్వతోన్నతప్రదేశములం దున్నది గాని మఱి యెందును లేదు.

(*b*) ఆర్యస్థానము జంబూద్వీప మని యున్నది. జంబూవృక్షములు కాశ్మీరమునందు విశేషముగ నున్నవి.

(*c*) 'భుర్జ్యా' అను వృక్షము యూరోపియన్ నిఘంటువులందు "ఆర్యస్థానమున నున్నది" అని వ్రాయఁబడినది. ఈవృక్షము కాశ్మీర ప్రదేశమందలి హిమాలయపర్వతములో నున్నది.

పై కారణంబు లనభిశంకనీయములుగ నున్నవి. ఆర్యులు కాశ్మీరము చేరినపిదప దీని నన్వయింపవలెను.

ఇఁక నార్యులు నాగరకతఁ గలవారయి యెపుడుండి రను విషయ మాలోచింపవలెను. ఇది ఋగ్వేదకాలముగ నుండును. ఋగ్వేదకాల మెద్దియని నిర్ధరించుట కష్టతమ మగు పని. ఈ యుపన్యాసమున నిముడఁ దగినది కాదు. [illegible] సిద్ధాంతశిరోమణి గ్రంథకర్తరీతిగఁ

మగును. నాచే వ్రాయంబడిన ఋగ్వేదపీఠికలో నీవిషయము వివరముగ వ్రాయఁబడినది. దైవానుగ్రహము కలిగినచో నాపుస్తకము త్వరలోనే ముద్రింపఁబడును. నాచే నింతకు మున్ను వ్రాయఁబడిన యార్యావర్తమున నార్యుల జనసంఖ్య హెచ్చెను. జనులు నివసించుట కష్టమాయెను. కావున నపుడపు డార్యులార్యావర్తమును వదలి యితరదేశములు చేరిరి. ఇపుడు 'సెమిటిక్కు, హెమిటిక్కు' అని పిలువంబడుతెగవారు ప్రారంభమున వేఱయినవారు. వీరు బాహుబలమున రాజ్యములు స్థాపించుకొనిరి గాని వీరియందు నాగరకత హెచ్చలేదు. క్రూరులైరి. అంతమున వేఱయినవా రైరాణులు. వీరు పర్షియా చేరి ప్రసిద్ధికెక్కిరి. వీ రిరువుర మధ్యకాలంబున వేఱయినవారు తమతమ యిష్టానుసారంబుగఁ బ్రపంచ మెల్ల వ్యాపించి రాజ్యములు స్థాపించుకొనిరి. ఇదియునుగాక భారతయుద్ధమునకుఁ బూర్వమును, యుద్ధానంతరమును వలస పోయినవా రనేకులు, ఇతరదేశములం దార్యులు వ్యాపించి రనుటకుఁ బ్రబల మగుసాక్ష్యము లీక్రింద వివరించినవిధముగ స్థాపింపఁబడినది.

| | |
|---|---|
| (*a*) శబ్దసామాన్యము. | (Language) |
| (*b*) ఆచారసామాన్యము. | (Religion) |
| (*c*) పద్ధతులసామాన్యము. | (Customs) |
| (*d*) శారీరావయవలక్షణము. | (Anthropology) |
| (*e*) జాతినిర్ధారణశాస్త్రము. | (Ethnology) |
| (*f*) చరిత్ర. | (History) |
| (*g*) పెద్దలవాక్యము. | (Tradition) |

పైని వివరించిన లక్షణములనుబట్టి ప్రపంచంబున నుండుజను లెల్ల రార్యులు, గాక యార్యుల సాంబంధికు లని ప్రతియొకవిషయము స్థిరపఱచు కాలంబు గా దిది. కావున సాధ్యమైనంతవఱకు సూక్ష్మముగ వ్రాయుచున్నాను. ప్రారంభమున నైరాణ లని పిలువంబడు పర్షియావా రార్యు లను విషయము వ్రాయఁ బూనెద.

ఆర్యులు నీరాణులు సోదరప్రాయులుగ నొక్కస్థలముననే యుండి విశేషకాలము మతాచారవ్యవహారములు సైతమొక్కరీతిగనే యవలంబించినవా రనుటకుఁ గల సాదృశ్యము లీదిగువ నుదాహరించెద.

| సంస్కృతము. | | ఈరాణ్లజండ్. | |
|---|---|---|---|
| హోతారు | ... | జోతార్ యాతార్. | (Priest) |
| సోమ | ... | హోమ | (Drink) |
| యమ | ... | యిమి | (Pluto) |
| ఇష్టి | ... | యేష్టి | (Sacrifice) |
| అధ్వర | ... | అధర్వన్<br>అథ్రవన్ | (Priest) |
| వసిష్ఠ | ... | వహిష్ఠ | (Sacrificial priest) |
| ఉర్వి | ... | ఉర్వి | (Earth) |
| అమృతత్వ | ... | అమిరోతత్ | (Immortality) |
| ప్రవర | ... | ఫ్రవరాణి | (Departed souls) |
| మిత్ర | ... | మిద్ర | (Sun) |
| మంత్ర | ... | మంద్ర | (Manthras) |
| అసుర | ... | అహుర | (Powerful or living) |

పై రీతిగ నుండు శబ్దము లనేకము లున్నవి. ఈరాణ్ల భాషానిఘంటువు పరిశీలించినచోఁ బదిశబ్దములకు నేడుశబ్దములు సంస్కృతముగ నుండును.

ఉభయజాతివారేక మనుటకు నిది ముఖ్యసాక్ష్యము కాదనిన మఱియొక సాదృశ్య మున్నది. మతాచారవిధు లుభయులకు ననేకవిషయముల సామాన్య ముగ నున్నవి, ఎవ్వియనిన :—

(*a*) ఈరాణ్లు సూర్యునకు నున్నతపదవి నిచ్చి యారాధించుచున్న వారు. అటులే యార్యులు.

(*b*) యజ్ఞములందుఁ బ్రారంభమున నార్యులచే నుచ్చరింపఁబడు 'ఆప్రి' ఋక్కులు 'అఫ్రి' యను నామమున నీరా న్లుచ్చరింతురు.

(*c*) ఆజ్యమంత్రము లుభయులకు సామాన్యము.

(*d*) ఆశ్లేయామంత్రణవిధు లార్యులబలె నీరాన్లకును గలవు.

(*e*) సోమరసపాన ముభయులకు సామాన్యము.

(*f*) నిత్యాగ్నిపూజ యుభయులకు సామాన్యము.

(*g*) సోమపానస్తుతులు స్వల్పాక్షరభేదములతో నీరాన్లకు నున్నవి.

(h) ఋగ్వేదములోని 'నివిద్' సూక్తములు 'నివేదయామి' అను క్రియాపదమూలకముగ నీరా ల్లుపయోగింతురు.

ఇంకను నిట్టి మతాచారవిధులుభయులకు సామాన్యముగ ననేకము లున్నవి.

ఈరాణ్ల జండవస్థలోఁ దమదైవము 'అర్యనవీజు' అనుప్రదేశమును బ్రారంభమున సృష్టించె ననియు, నాప్రదేశమునందు సంవత్సరమునకుఁ బదినెలలు చలికాల మనియు వ్రాయఁబడినది. ఇట్టి దీర్ఘహేమంతర్తువునుగురించి ఋగ్వేదములో నచట నచట నిరూపింపఁబడినది.

డెరయ స్సను ప్రసిద్ధి కెక్కిన పర్షియాచక్రవర్తి తనకుటుంబవంశావళి శ్రీముఖములోను, శాసనములలోను 'నే నార్యుఁడను, నార్యపుత్రుఁడ' నని వ్రాసికొనినాఁడు.

శారీరావయవలక్షణములు భయులకు సామాన్యముగ నున్న వని మైలరు గారు వ్రాసినారు.

పై విషయములను బట్టి యార్యులు నైరాణులు నొక్కరని తెలియవచ్చుచున్నది. వా రొకట్య ంతో భిన్నించినందులకుఁ గారణము లనేకము లున్నవి. ఇది చరిత్ర కాదు కావున వ్రాయనైతిని. మతవిషయము లైరానులలో మాఱుటకు జొరాస్టరు కారణము. ఈ మైరానులు పురూరవునివంశజుఁ డగు నేరాయను వానికిఁ జేరినవారు, చంద్రవంశజులు.

పైని నాచేఁ బలుకఁబడిన యార్యులు ఏషియా, ఆఫ్రికా, అమెరికా, యూరోపుఖండములు చేరిరి. వారి విషయ మించుక వ్రాసెద. పర్షియకు వ్రాసినన్ని విషయముల వ్రాయవలె ననిన నుపన్యాసంబు గొప్ప దగును గావున సూక్ష్మముగ వ్రాసెద.

### ఏషియాఖండము = జంబూద్వీపము.

మీడులు.—అజామీఁఢునకు నీల యను భార్యయం దైదుగురు సుతులు పుట్టి రనియును నందు నొకఁడు మీడియన్ రాజ్యము స్థాపించె ననియును, నజామీఢుని జయధ్వజము మేక కావున 'అస్సిరియన్ మీడియన్' జాతివారు తమ మతగ్రంథములో మేషచిహ్నము శ్రీముఖముగ నుంచినా రనియు వీరు యయాతి వంశజు లనియుఁ దెలుపఁబడినది. వీరివిషయమునఁ గల వివరములను "టాడ్స్ రాజస్థాన్" నను గ్రంథమునఁ జూడ నగును.

కాల్డియా.—'కుల + దేవ' అను రెండుశబ్దముల చేరికచే ప్రారంభమున, కుల్ + దియా యయి పిదప కాల్డియా యయినది. వీ రిండియానుండి పోయిన బ్రాహ్మణు లని యనేకు లభిప్రాయపడినారు. వీరును, కుల్చీలును, బాబిలోని యనులు, వీ రిండియావా రని జార్న్ష్టన్ జర్న వ్రాసినాఁడు. కుల్చీ లనఁగ గుల శీలురు. వీరును బ్రాహ్మణులేను.

బాబిలోనియా.—ఈదేశపు దక్షిణభాగములో నుండువారు ప్రాచీనకాలములో నార్యావర్తమునుండి వచ్చి చేరినవారు. ప్రారంభమున వారచటికి నిప్పూరనుపట్టణము కట్టి యెన్‌లిప్ దేవాలయమును నిర్మించిరి. వీ రచట రాజ్య మొనరించుకాలమున యూఫ్రెటీస్ నది యుప్పొంగి యాప్రాంతమునఁ బ్రళయము సంభవించెను. ఈ ప్రళయానంతరము జంగి డ్డనురాజు దైవబోధితుండై నావలో రక్షింపఁబడి పిదప దైవమునకు బలు లిచ్చెనఁట. ప్రారంభమున వీరు సమ్మరియన్ లని పిలువఁబడు చుండిరి. వీరిది శైవమత మని తోఁచుచున్నది. వీరికిఁ జేరిన లాగా ష్టను పట్టణమున గిరీశునకు దేవాలయమును గట్టించి యెదుట నొక యెద్దును నిలిపినటులు హచ్చిన్సన్‌గారు వ్రాయు చరిత్రగ్రంథములోఁ బటమున్నది. ఋగ్వేదమున నెచటను దేవాలయములు నుడువంబడ లేదు. కావున ఋగ్వేదానంతరము వీ రచటఁ జేరినట్టు తోఁచు చున్నది. వీరు సూర్యు నారాధించువారు. వ్యవసాయపరులు. జ్యోతిశ్శాస్త్రమును జక్కఁగ నేర్చినవారు. ఎప్పనిని శకునములపైఁ జేయువారు.

అస్సిరియా.—వీరి మొదటిరాజు బలి యనియు, హిందు వనియు, నిండియారాజ్య మేలినవాఁ డనియు, ప్రొఫెసర్ మారీస్‌గా రభిప్రాయపడినారు. ఈ విషయము పోకాక్కుగారు 'ఇండియా ఇన్ గ్రీస్' అను గ్రంథములో వివరముగ వ్రాసినారు.

ప్రసిద్ధి కెక్కిన ట్రోజన్ యుద్ధమందు 'అబంతి' వారు శూరాగ్రేసురు లని వర్ణింపఁబడినది. వారు మాల్వాలోని యవంతినుండి యేష్యామైనరు చేరిన వా రని పోకాక్కు వ్రాసినాఁడు. (India in Greece, p. 33).

ఆఫ్రికా = క్రౌంచద్వీపము.

ఈజిప్టు.—ఏడెనిమిది వేలసంవత్సరము క్రిందట హిందువు లనేకులు 'ఈజిప్టు' చేరి యచట నివసించి రని 'బక్లచే' వ్రాసినటులు కర్నల్ ఆల్కాటుగారు

లిఖించినారు. పావన మగు పున్టుదేశమునుండి తాము వచ్చినటు లీజిప్టువారు తమ పురాతనశాసనములో వ్రాసినారు. ఈపు న్టను నామమునకుఁ బునీతస్థళ మని పేరు. హాస్లీత్రోపుగుడిశాసనమును బట్టి చూడఁ బున్టనునది యిండియా యని స్థిరపడుచున్నది. పంజాబులోని జనులును, సింధునది ముఖప్రదేశమున నున్న జనులును, నరేబియా పూర్వభాగముగ రెడ్ సముద్రముగుండ నైలునది చేరి దానిని దాఁటి యీజిప్టు, నూబియా, అబిసీనియాలలో రాజ్యములు స్థాపించి రని పోకాక్కు వ్రాసినాఁడు. ఆర్యులే యాఫ్రికా చేరినవా రనుటకు వారాఱు విధము లగు సాదృశ్యములు చూపినారు.

(1) ఆఫ్రికాలో నుండు నదులకు బంజాబునదులపే ర్లున్నవి.

(2) ఇండియాపట్టణములపే ర్లందును గలవు.

(3) రాజ్య మేలు రాజులపేర్లు రామ యని యున్నది.

(4) చెక్కడుపనుల పోలిక లుభయదేశములందును సరిపోలినవి.

(5) కట్టడములు సరిపోయినవి.

(6) ప్రాకృతశబ్దము లీజిప్టువారికి నున్నవి.

పై యాఱువిధముల సాక్ష్యములనుబట్టి యీజిప్టువా రార్యు లని నిర్ధరించినారు. పురాతన యీజిప్టుచరిత్రవిషయము "Faiths of the world" అను గ్రంథములో నించుక వ్రాయఁబడినది. ఆగ్రంథమందలి 165 వ పుటలో వర్ణింపఁ బడిన దేవాలయములు, గర్భగుళ్లు, పూజారులు గర్భగుడిలోఁ బ్రవేశించుట, మిగతవారు గర్భగుడికి వెలినుండుట, యుత్సవవిగ్రహసేవ, యూరేగింపులు, పశువులను స్వేచ్ఛగ దేవునిపేర విడుచుట, వానియుత్సవము, బలు లిచ్చుట యీ మొదలగు వర్ణనలు చదివినచో నవి యెల్లను బ్రాహ్మణముల కాలములోనో, సూత్రయుగములోనో యిండియాలో నుద్భవించిన పద్ధతులు తు చ తప్పక యనుసరించును. కావున నార్యులు కొందఱు బ్రాహ్మణముల కాలములోనో, సూత్రకాలములోనో, యీజిప్టు చేరి రని తెలియ వచ్చు చున్నది. ఇది యాఱువేలయేండ్లకుఁ బైఁబడిన కాలమునం దుండునుగాని తక్కువగ నుండదు. బ్రాహ్మణముల కాలమును గుఱించియు, సూత్రకాలమును గుఱించియుఁ, బాశ్చాత్యపండితులు కొందఱు వ్రాసిన యభిప్రాయము విశ్వసనీయముగ లేదు.

<u>నైలునది.</u>—ఈనామ మాఫ్రికాదేశమునందలి గొప్పనదికి నార్యులిచ్చినది. అటక్కునుండి పదిమైళ్లదూరము వఱకు సింధునదీ జలము నిర్మలముగ, నగాధ

ముగఁ బ్రవహించి కాలాబాగునుండి నూఱుమైళ్లు దూర మతివేగముగఁ బ్రవహించుచున్నది. జలము నీలవర్ణముగ నుండును. కావున నాభాగమునఁ బ్రవహించు సింధునదికి 'నీలాబ్' అను పేరు వచ్చెను. ఇచ్చటి దేశవాసులే యీజిప్టు చేరి యచ్చటి ప్రవాహమునకు నైలని పేరిడిరి.

ఆబ్సీనియా.—సింధూనదికి 'ఆబోసీన్' అని మఱియొకపేరు బహుకాలముగ నున్నది. ఆనామమే 'ఆబుసీనా' యని ప్రారంభమున నుండి పిదప నబ్సీనియా యని మాఱినది.

'హీరాన్' అను పండితుఁడు బంగాళీల తలలును, బూర్వకాలపు నీజిప్షియన్ల తలలును జక్కఁగ శోధించి వారి ముఖచ్ఛాయలను బరీక్షించి యీ రెండుజాతులవా రొక్కటెగకుం జేరినవా రనియును, వారికి నేభేదంబును లే దనియును వ్రాసినాఁడు. నడవడికలు, మతాచారములు, సాంఘికరాజకీయవ్యవస్థలును, బోల్చి చూడ నీయుభయు లొక్క రనియును వైశ్యజాతికిఁ జేరినవా రనియును నదేపండితుఁడు వ్రాసినాఁడు.

ఆఫ్రికా మధ్యభాగమునందలి పట్టణములపేర్లు ఇండియాపట్టణముల పేర్లుగ నున్న వనియు నవి సంస్కృతనామము లనియును టాడ్డుదొర వ్రాసినాఁడు. అట్టి పట్టణనామముల పట్టిక యేషియాటిక్కు జర్నలులో వ్రాయఁబడినది.

అమరిక = పుష్కరద్వీపములు.

యూరోపియనులు అమరికా చేరకమునుపే యొకానొక కాలమున నచ్చట నాగరకత హెచ్చి యుండె ననియు నచ్చట నుండిన గొప్ప పట్టణములు, గొప్ప కోటలు, గొప్పకట్టడములు, చెఱువులు, బాటలు, కాలువలు, సాక్ష్యములుగ నిలిచినవి. వీనిని జూడ నెప్పుడో నాగరకత గల విజాతిజను లచ్చట నుండి రని స్పష్టమగుచున్నది. వా రెవ రయినదియుఁ బాశ్చాత్యపండితులు పరిశోధించి యీజను లిండియాదేశమువారే యని నిర్ధరించినారు. హిందువు లచట నుండినటులు చిహ్నము లిప్పటికి నగపడు చున్న వని బారన్ హంబోల్టుదొరగారు వ్రాసినారు. పెరూవియన్ల పూర్వీకులు హిందువులే యని పోకాక్కు వ్రాసినాఁడు. పూర్వము చిలీలో నుండిన కట్టడము లిండియాలో నుండిన కట్టడములను బోలిన వని హార్డీదొర వ్రాసినాఁడు. హిందువుల బలె నమరికావారు

(a) భూదేవతను దల్లిగ భావించి పూజించుచుండిరి.

(*b*) దైవములయొక్కయు, శూరులయొక్కయు, పాదములు తాళ్లపైఁ జెక్కి యమరికను లిప్పటికిని హిందువులబలెఁ బూజింతురు.

(*c*) సూర్యచంద్రులను గుఱించి హిందువుల మతమే యమరికావారిది. రాహుకేతువులు సూర్యచంద్రులను మ్రింగుదు రను హిందువుల యభిప్రాయమే యమరికనులది.

(*d*) ఈశ్వరుఁడును, గాళియును సర్పభూషణు లైన రీతిగ నమరికన్లు తమ గురువుల మెడచుట్టును బాములఁ దవిలించి పూజించుచుందురు.

(*e*) హిందువులు గణేశునిఁ బూజించిన రీతిగ మెక్సికన్లు కట్టెతో మనుజుని శరీరమును నేనుఁగుతలయును జెక్కి యావిగ్రహమును బూజించుచుందురు.

(*f*) ప్రళయమును గుఱించినకథ యించుమించుగ నుభయులకు సామాన్యము.

(*g*) కూర్మావతారకథ యుభయులకు సామాన్యము.

(*h*) సూర్యారాధన ముభయులకు సామాన్యము.

(*i*) వేదమతము రీతిగఁ బ్రకృతి శక్తుల నుభయులు నారాధించు చుండిరి.

(*g*) హిందూవేదాంతమే యమరికనులది.

(*k*) జన్మాంతరములందు నాత్మసంచార ముభయులకు సమానము.

అమెరికాలో "ఇంకా" యను జాతివా రొక రుండిరి. వారి యాచార విధులు బ్రాహ్మణములలోని విధులకంటెను హెచ్చుగు చిక్కులు గలవిగ నుండును. ఆగమవిధులందు పశుబలులు, గింజల బలు లుండుటయే గాక యాఁడువారిని బిల్లలను బలి యిచ్చుచుండిరి. జాతీయపు కట్టడములు హిందువులం బలె హెచ్చుగఁ గాపాడుచుండిరి. మెక్సికనులకు దేవాలయములు, దేవాలయములకు భూములు, దేవాలయములందు నందాదీపములు నుండినవి. చంద్రునకు సైతము దేవాలయ ముండినది.

ఇఁక నార్యు లెపు డమరికా చేరి రనువిషయము దృఢముగఁ దెలుపుటకుఁ జరిత్రలు లేకయున్నను రామాయణయుద్ధానంతర మని చెప్పుటకుఁ దగిన సాధనము లున్నవి. సీతారాములవిగ్రహముల నానామములనే యమరికనులు పూజించుచున్నారు. దశరాలో 'రామచంద్రాజీమేలా' యనునుత్సవము ప్రతిసంవత్సరము జరుగును. పెరూవియనులు సీతారాములఁ బూజించుచు 'రామసీతా'

యను నుత్సవము సేయు చున్నారు. వీరు సూర్యవంశజు లగు క్షత్రియు లనుటకు సందియంబు లే దని "యేష్యాటిక్ రిసర్చ్" స్సను గ్రంథములో వ్రాయఁబడినది. బట్టలు తొడుగు విధము, చెప్పులు తొడుగు పద్ధతి, యాఁడువారలు చీరలు గట్టెడు రీతియు నొక్క విధముగ నుండె నని చరిత్రకారులు వ్రాసినారు. మహర్షి వ్యాసులు శుకునితో నమరికాకుఁ బోయి యచటఁ గొన్నివత్సరంబు లుండె నని శాంతి పర్వములో శుకోత్పత్తి భాగమున 326 వ యధ్యాయమునఁ దెలుపఁ బడినది. మూఁడువత్సరములపైన శుకుఁడు మరలి యేయే దేశములు సంచరించి వచ్చినది వ్రాయఁ బడినది. ఉత్తరామరికాకుఁ బుష్కరద్వీప మనియును, దక్షిణ పమరి కాకుఁ బ్లక్షద్వీప మనియును బేర్లు.

### యూరోపు = శాకద్వీపము.

గ్రీసు.—దేశచరిత్రలు కర్నల్ టాడ్డుగారును, కర్నల్ విల్ఫర్డుగారును, తమ జీవితకాలములోఁ గష్టపడి వ్రాసియుంచిన యంశములను పోకాక్కుదొర పరిశీ లించి 'India in Greece' అను గొప్ప గ్రంథమును వ్రాసినాఁడు. ఆ గ్రంథము చదివినచో గ్రీసుదేశస్థు లెంతటి గొప్పవా రనునదియును వారందఱును హిందు వులే యనియును దెలియ నగును. హోమరు కాలమునందు గ్రీసు సంఘవిషయ ములు వర్ణించుచు హిందువుల సంఘములతోఁ బోల్చినాఁడు.

మగధదేశము ముఖ్యపట్టణమునకు రాజగృహ మని పేరుగదా! అచటి జనులు గ్రాహికు లని పిలువఁ బడుచుండిరి. వారికే గ్రాహికు లనియును గ్రేకు, లేక, గ్రీకు లనియును నామంబు వచ్చెను. కావున గ్రీకులు మగధదేశమువారు, మఱి యొక విషయము. మగధదేశమున కంతటికిని పెలాస్గా యని పేరు. ఈదేశము నుండి ప్రారంభమున గ్రీసుదేశము చేరినవారు పెలాస్గీ లని పిలువఁబడు చుండిరి. పెలాస్గీ లనినను గ్రీకు లనినను మగధదేశము వారని యన్వయింప వలయును. 'పెలాస్గస్' అను గ్రీకు రాజును వర్ణించునపుడు 'యేషియన్' అనుపురాతన కవి యారాజు గయలోఁ బుట్టినవాఁ డని పలికినాఁడు. ఈ 'గయ' పెలాస్గా, లేక, బే హారు ముఖ్యపట్టణము. హెల్లా: బెలూచిస్థాన్‌లోని పర్వతమునకు హేలా యని పేరు. అచ్చటివారు గ్రీసు చేరినపుడు హెల్లా సనియును హేలనీ సనియును నా మము వచ్చెను.

యూబియా.—ఈదేశమున బాహుజులు చేరిరి. యూ—బాహూ—యాన్ అని ప్రారంభమునఁ బేరుండి యది చెడి యూబియా యయిన దని చరిత్ర కారులు వ్రాసినారు.

మాసిడన్.—వీరు మగధదేశమునుండి మరల వచ్చిన వారనియు వీరిని 'మాసిడన్' లేక 'మాకిడన్' అని పిలుచుచుండి రనియుఁ, జరిత్రలు దెలుపు చున్నవి.

బియోటియా.—జీలము నదికి బిహూట్ అని పేరు. ఆ తీరమునుండి వచ్చినవారు బియోటియా లైరి.

కసోటియా.—కాశ్యపి, లేక, కాశ్మీరమునుండి పోయినవారు.

రోం.—ఉత్తరహిందూస్థానము వదలి యేష్యామైనరు చేరిన యార్యు లనేకులు ట్రోజన్ యుద్ధములో సంబంధపడి యుండిరి. వారే యూరోపుఁ జేరి రోములైరి. ఈ 'రోం' శబ్దము రామశబ్దభవము. విక్రమార్కుని కాలమునందు రోమునకు నిండియాకు సంబంధ ముండినది.

జర్మని.—మానవులలో మనువు మొదటివాఁ డని యార్యులు పలికిరి. ట్యూటన్ల ప్రథమపురుషుఁడు మాన స్సని జర్మనీవారు పలికెదరు. ప్రాతఃకాల ముననే స్నానము సేయుట జర్మనీవారిపద్ధతి యని టాసిట్ వ్రాసినాఁడు. ఈపద్ధతి పూర్వదేశములం దుండునుగాని చలిదేశమున నుండదు. పొడుగుగ జాటిన యంగ రక్షు దొడిగి జుట్టు ముడివేసికొను పద్ధతి బ్రాహ్మణులబలె జర్మను లనుసరించి యుం డిరి. కావున జర్మన్లు బ్రాహ్మణు లని టాడ్డు వ్రాసినాఁడు. బ్రాహ్మణులకు శర్మ యని బిరుదు. 'శ' యను నక్షరమునకును 'జ' యను నక్షరమునకును భేదము లేనందున 'శర్మ' యనునది జర్మ యయినది. ఈ జర్మనులు సాక్సన్ జాతికిఁ జేరిన వారు. ఇండియాలో 'శక' యను తెగవా రున్నారు. శక + సూన్ = శాక్సూన్ = శకవంశీకు లని యర్థము.

స్కాండినేవియా.—వీరికి స్కంధనాభియా యని పేరు. స్కంధుని ముఖ్య జాతివా రని యభిప్రాయము. వీరు బాహుజులు. వీరి యుద్ధగాథలు, సమరసా హస విజయములు, నార్యుల పురాణములను బోలినవి. వీరి మతగ్రంథము 'యిడ్డు' అనునది వేదమునుండి పుట్టినది. హిందువుల వారముల పేర్లును, స్కాండినేవి

యర్ లు వారముల పేర్లును, నొక యర్థము నిచ్చునవిగ నున్నవి. స్కాండినేవియన్ దేశజుఁడయినట్టియు సమస్తదేశచరిత్రలు పరిశీలించి ప్రసిద్ధికెక్కిన పండితుఁడు నగు "కౌంటజార్నస్టు జరన్" అను నతఁడు "Theogony of the Hindus" అను గ్రంధమున లిఖించెను. అతఁడు తనదేశపురాణములు హిందూపురాణములనుండి వచ్చిన వని వ్రాసినాఁడు.

గ్రేటుబ్రిటన్.—బ్రిటన్ లోఁ బూర్వ ముండిన డ్రూయి డ్సనువారు బ్రాహ్మణులు. ఆత్మ యుండె ననియును, నాయాత్మయే మరల దేహము నాశ్రయించు ననియును వారి మతము. సృష్టి స్థితిలయములు గావించు త్రిమూర్తు లున్నవారని వారు నమ్మియుండిరి. దేవరహస్యములు తమకుఁ దప్ప మఱి యెవరికిని దెలియవని బ్రాహ్మణుల బలె వారును బలుకు చుండిరి. బ్రాహ్మణుల శాపములకుంబలె డ్రూయిడ్ల శాపములకు జనులు భయపడు చుండిరి. స్కాచ్చి కులస్థులు సంపూర్ణముగ నాఘనులు. 'హుర్రా' యనెడి బ్రిటిషువారి జయధ్వని 'హరా' యనెడి హిందువుల జయధ్వనియె. వీరు డ్రుయిదేశస్థులు. రోమన్ రాజు వీరిని బాధించినతఱి మోనా యనుద్వీపముఁ జేరిరి. మోనా యనఁగ మునుల నివాస మని యర్థము. పూర్వ మచటఁ జేరిన రాజపుత్రులకు గురువులుగ నచటి డ్రూయిడ్లు చేరిరి. హిందూదేశము వదలి బ్రిటన్ చేరిన హిందువుల మతగురువులు డ్రూయిడ్లని స్థాపించుచు 'గాడ్ఫ్రే హిగ్గిన్సు' అను నతఁడు కెల్టిక్కు డ్రూయి డ్సను నామమున నొక గ్రంథమును వ్రాసినాఁడు. గరుత్మంతుఁడు బ్రాహ్మణోత్తము నొక్కని శాకద్వీపమునకుఁ బిలిచికొని పోయినట్టు గాథ యున్న దని కోల్ బ్రూకుగారు తమ "Miscellaneous Essays, Vol II Page 179" లో వ్రాసినారు. డ్రూయిడ్లు తమ మతగ్రంథము నేర్వ నిరువదియేండ్లు కష్టపడుచుండి రని సీజర్ చక్రవర్తి వ్రాసినాఁడు. ఈ మతగ్రంథము బహుశః వేదమై యుండ నగును. మనవలెనే వారును వేదము నోటితో నేర్వవలసి యుండెనుగాని గ్రంథమూలకముగ నేర్చుచుండ లే దని యతఁడే వ్రాసినాఁడు.

రష్యావారు.—ఋషికులజు లని నే నెచటనో చదివినటుల జ్ఞప్తిలో నున్నది. ఇపుడు తోఁపనందున వదలితి. ఇంక శాల్మలీద్వీప మగు నాస్ట్రేలియా, కుశద్వీప మగు ఓసీనియా, ఇండియాద్వీపము లగు, జావా, బోర్నియో, బాలి, సుమిత్ర, సిలోన్ మొదలగునవి, బర్మా, జపాన్, చైనా, యీప్రాంతములందు నైతమార్యులు బహుకాలమునకు మున్నే చేరి యాదేశముల విద్యాతిశయము లభి

వృద్ధిపఱిచి నాగరకత నేర్పిరి. ఆవిషయ మిచట వ్రాయను గ్రంథ బాహుళ్యభీతిని వదలినాను.

సభ్యులారా! పురాతనార్యుల నాగరకత యతులిత మనుటకు సందియంబు లేదు. ఋగ్వేదమునం దీవిషయ మచట నచట వర్ణింపఁబడినది. ఆర్యుల సాహస మద్వితీయము. బుద్ధికౌశల మసమానము. ధాతువిద్య, వృక్షాయుర్వేద విద్య, వాస్తువిద్య, గీతవాద్య, నృత్తాలేఖ్యాది సమస్తకళలందును వీరికిఁ బ్రజ్ఞ యుండెను. వీరి భాషాప్రావీణ్య మన్ననో చెప్ప నలవికాదు. భాషను సృష్టించుటలో వీరి కుండిన కౌశలము మఱి యెవరికిని లేదని హిందు వగు నే ననినచో సందేహింతురు. ఆ విషయమునుగుఱించి పాశ్చాత్యపండితులే పొగడుచున్నవారు. చిన్న చిన్న ధాతువులు కొన్ని యేర్పఱిచి యొక్కొక్క ధాతువునుండి వేయాఱు శబ్దములు పుట్టించిరి. ఈ ధాతువులు ప్రపంచ మెల్ల వ్యాపించి పలుభాషలు పుట్టెను. ఆభాషల కన్నిటికి నార్యులభాష మాతృస్థాన మాయెను. పలుభాషలు చదివి పాండిత్య మార్జించి యేయేతెగవారి భాషలలో మాతృభాష చేరినదియో యా తెగవా రందఱు పురాతనకాలమున నార్యులుగ నుండి రని పాశ్చాత్యపండితులు నిర్ధరించినారు. వీరి భాషాప్రావీణ్యము దెల్పుటకు గృహకృత్యసాంబంధిక సామాన్యభాషలో నుండు కొన్నిశబ్దము లిచట వ్రాసెదను. పితృ, మాతృ, భ్రాతృ, శ్వశుర, దుహితృ, దేవర, విధవ, పతి, పత్ని, భార్య, భర్త, మొదలగునవి. వీనిలోఁ గొన్నిశబ్దము లొకరికొకరికిఁ గల బాంధవ్యముఁ దెలుపుటయుగాక యింటియందు వారొనరింపం దగిన కార్యములు సైతము తెలియులాగు శబ్దములు నిర్మించినారు. అది యెటులనిన:—

(*a*) పితృ = 'పా' యనుధాతువు = పాలించువాఁడు, పతి. భర్త. రాజు.

(*b*) మాతృ = 'మా' పోషించునది. పత్ని = శిశురక్షకురాలు.

(*c*) భ్రాతృ = సాహాయ్యపడువాఁడు.

(*d*) స్వసా = ఊఱడించునది, పిల్లల నూఱడించు పనిసేయునది.

(*e*) దుహిత = పాలు పిండునది.

పైరీతిగ ననేకశబ్దము లున్నవి. వాని నన్నిటిని వ్రాయఁ జాలకాలము పట్టును. పెక్కుతెగలవారి భాషలలో నీ శబ్దముల మార్పు లిదేయర్థమునఁ బరిఢవిల్లుచున్నవి. ముఖ్యముగ పర్షియా, గ్రీసు, ఇటలి, రష్యా, ట్యూటన్స్, కెల్టిక్

యీమొదలగు భాషలలో నిట్టిశబ్దములే యున్నవి. మఱియొక సాదృశ్యమును జూపెద. సంస్కృతమున నావును 'గో' వందురు. ప్రాఁతజర్మన్ భాషలో 'ఖో' యందురు. క్రొత్త జర్మన్ భాషలో 'ఖూ' యందురు. ఇంగ్లీషులో 'కౌ' యందురు. ప్రాఁతస్లేవిక్కు భాషలో నావులమందను 'గోవ్యాదో' యందురు. క్రొత్త భాషలో 'గోవిదర్' అందురు. రష్యన్లు, ఆవుమాంసమునకు 'గవ్యాదిన' యని యెదరు. ఈరీతిగ యూరోపియన్ భాషలలో నెల్ల సంస్కృతశబ్దములకు సంబంధించిన శబ్దములు కొన్నిమార్పు లందివ్యాపించినవి. మానవ, నరశబ్దములు ప్రపంచములోఁ గల యనేకభాషలలో నున్నవి. ఆర్యులు కాశ్మీరమున నుండునపుడు నంతకు ముందును సిథియన్ జాతివా రనేకు లిండియాచేరి నిండి యుండిరి. ఆర్యులు వీరిని దస్యు లని పిలుచుచుండిరి. దస్యు లనేకులు జయింపఁబడి యార్యుల దాసులయి విద్యాబుద్ధులు నాగరకత నేర్చి యార్యులైరి. మఱికొందఱు వారికి లోఁబడక యడవి జనులుగ నుండిరి. ద్రావిడు లింతకుముందు వచ్చినవా రనియు, వీరికిని సిథియనులకు సంబంధము లేదని కాల్డ్వెల్లుదొరగారి యభిప్రాయము. అది యాథార్థ్యమని నాకును దోఁచుచున్నది.

ఆర్యకులౌన్నత్యమహాశయులారా! సకలదేశములను జయించి యజేయుఁ డని సుప్రసిద్ధిఁ గాంచి మించిన 'డెరయస్సు' చక్రవర్తి 'ఆర్య' శబ్దమునుండి తనకవు డుండిన గౌరవమునకంటె నధికగౌరవము కలుగు నని యెంచి తనశాసనములమీఁదను, దనవంశవృక్షముయొక్క శ్రీముఖముమీఁదను "నే నార్యుఁడ, నార్యపుత్రుఁడ" నని వ్రాయించెను. పాశ్చాత్యు లిపు డనేకులు తామార్యుల వంశమునకుఁ జేరినవార మని పొగడుకొనుచున్నారు. నిజముగ నార్యుల మగు మనకు మన మెవరయినది తెలియదు. మన మత మెట్టిదయినది తెలియదు. మనమతగ్రంథ మెద్ది యయినదియు ననేకులకుఁ దెలియదు. ప్రపంచమున మతమని పేరిడికొనిన జాతివాఁ డెవఁడును దన మతగ్రంథమును సాంగోపాంగముగఁ జదువును, చదివించికొనును, చదువుచుండ వినును, మతగ్రంథమును బ్రతిమనుజుఁడు నింటనుంచుకొని గౌరవబుద్ధిచే దానినిఁ బూజించుచుండును. హిందువుల దుస్థితి యేమియో దానిని సరకు సేయక యుదాసీనబుద్ధిచే వెలిద్రోయు చున్నారు. పండితులు సైతము దానినిఁ గన్నెత్తి చూడరు. వేదాంతవిచారమున మునిఁగి తేలువారు సైతము తన్మూల మగు వేదమును సరకు సేయరు. నేర్చుకొనిన కొందఱు

పాటలవలె వల్లించి యుదరపోషణార్థము దాని నుపయోగింతురు. అందుఁ భావ మున్నదో తే లున్నదో చూడరు, విమర్శింపరు, మన మితరులతో నేరీతిగ సం బంధ పడితిమో యని యైనను విచారింపరు. అశనాదిసుఖము లుండినఁ జాలుఁ, బరులజోలి మన కేల యనుచున్నవారు. ఇట్టివారి నేమని పిలువవలెనో మీరే యూహింప నగును.

పండితశిరోమణులారా ! సాహిత్యకళలలోఁ జరిత్రాంశములు దెలియుట ముఖ్యము. అందున మనపూర్వీకులచరిత్ర తెలియుట యతిముఖ్యము. అటు చేయనిచో మనకు దేశాభిమానముగాని, మతాభిమానముగాని, భాషాభిమా నముగాని పట్టువడదు.

కోలాచలము శ్రీనివాసరావు.

# సంకల్పసోపానములు.



అడుగు వెట్టక పరువెత్తు * నట్టిశక్తి, పక్షవిక్షేపమే కానఁ * బడకయుండ
నంతరాళాన నెగిరెడు * నట్టిశక్తి, రూపమెఱుఁగక యెన్నియో * రూపములను
నఖిలజగముల విహరించు * నట్టిశక్తి, కానఁగారానికాలంబుఁ * గాంచుశక్తి
యఖిలశక్తులఁ జేపట్టి * నట్టిశక్తి, చూడఁగారానితావును * జూచుశక్తి
వడసియుండియు మాయలోఁ*బడి మునింగి, లీల సంకల్పసోపాన * పాళియందు
గంతులిడుచును విహరించు*కర్మ మేమొ ? పరువులెత్తుట మాని లోఁ*గరుణనూని
మనస ! మఱవక నాకొక్క * మాఱుచెపుమ, చిటికలోన సౌధాంతర* సీమలందు
మెత్త నగుపట్టుపఱుపుల*మీఁద జేరి, యెలమి నొకచెలి వీడియ * మిచ్చుచుండ
నొకవిలాసాంగి చిఱునవ్వు * లొలుకుచూపు, లలర వింతగ ముచ్చట లాడుచుండ
నొక్కభామిని కోపించి * యోరచూపు, తూపులను గుప్పుచుండంగఁ*గోపుమీఱ
సేవకాజన మెందఱొ*చేరి కొలువఁ, దిరుగుచుంటివి నిన్ను నీ*వెఱుఁగకుండ
ఉత్తరక్షణమందున * నొకయగాధ, జలధిలోఁ బడి జలచర * సముదయంబు
పట్టి బాధించుచుండంగఁ*బ్రాఁకికొనుచుఁ, దిరిగి యెటు వోవుటకుదారి*తెన్ను లేక
తీర మెం దున్నదో కాంచు * తెలివి లేక, జలధిలో నీఁదులాడెడు * శక్తి లేక
మీఁద నేమున్నదో చూచు*మెలవు లేక, మునుక లిడుచును గ్రిందికిఁ*బోవుచుంటి
మనస!మఱవకనాకొక్క*మాటచెప్పు,మెందుసుఖమున్నదో,దుఃఖ*మెందుఁగలదో
అరయఁ బరిణామమున దుఃఖ*మగున దేదొ, సుఖ మగునదేదొ, సుఖదుఃఖ * సూ
[త్ర మగుచుఁ
ద్రిప్పలను బెట్టునది యేదొ*చెప్పఁగదవె?—మింటిమబ్బుచాయలనుండి*మెఱపుతీవ
సోయగముమీఱ నిటుతొంగి*చూచువేళ,వాయుసంరంభమున మహా*వార్ధిపొంగి
రంగదుత్తుంగభంగాను*షంగ యయ్యె, నుదరి ఘనతరు లౌదల*లూఁచనయ్యెఁ
గొమ్మ లదిగాంచలేక సం*కోచ మెడలి, యొడలు తెలియనికంపంబు*నొందనయ్యెఁ
గటకటా ! యిట్టివింతల*గాలివాన, రేఁగి యుప్పొంగుచుండ నా*రేగుతలపు
నఖిలలోకములను ముంచు*నట్టి వరదఁ, గానఁబడని సంకల్పసో*పానములను
జరణములనానకుండంగఁ*దిరుగు తెగువ, యేమిటజనించెనో యది*యెందుఁబోఱకో?
పరువులెత్తుటమాని లోఁ*గరుణనూని, మనస ! నవ్వక నాకొక్క*మాఱుచెపుమ.

రమ్యతరమార్గములను ని*రంతరంబు, నీసుఖావాప్తి కేవేళ*నేఁ జరింతుఁ
బ్రకృతిలోఁ గానఁబడుచున్న* వస్తువులను, నీవు సంతోషపడుటకై * నేను గాంతు
ఫలరసాదికసదమల * భక్ష్యములను, నీవు సంతృప్తి గనుటకై * నేభుజింతు
ఘనముదాహావమోహన * గానరవము, నీవు హాయినిజెందంగ * నేను విందు
నెప్పు డెయ్యది చేయ నీ*కిష్ట మగునొ, యప్పు డాపని చేయుదు * నట్టినన్ను
నిన్ను వీడినఁగొయ్యయా*చున్ననన్ను, నిన్నుఁ బ్రాణంబుగాఁ జూచు*చున్ననన్ను
మొఱఁగి యెచటికిఁ బరువునఁ*బోవుచుంటి? వాకసంబున నిలువ కే* యరుగుచుంటి?
పుడమిఁగాలూన కే పాఱి * పోవుచుంటి? దశదిశలయందు మెల్లగాఁ * దారుచుంటి?
వంతరాళంబులోఁ జేరి * యాడుచుంటి, వేపదార్థంబుకొఱకు నీ * వింతగాఁగ
వెదకులాడుచునుంటి వీ * విశ్వమందుఁ? బరువులెత్తుటమాని లోఁ * గరుణనూని
మనస! మఱవక నాకొక్క*మాటచెపుమ! లీలమెయిగాలినాడఁ దూ*లికవుగావు
కాని, చిటికలోఁ గృతకప*క్షముల విప్పి, పక్షివలె నాకసంబునఁ * బాఱుచుంటి
వేగుచుండెడిస ద్దొక * యింత లేక, కనుఁగొనుట కైనఁ గన్నులఁ * గానరాక
మించి ముల్లోకముల సంచ*రించుచుంటి, వెట్లు పోవుచునుంటివో*యెఱుఁగకునికి
నెచటి కేగుచునుంటివో*యెఱుఁగకునికి, నెందులకుఁ బోవుచుంటివో* యెఱుఁగకునికి
నీదురూపిట్టి దని కాంచ * నేరకునికి, నీదుసంకల్ప మెఱుఁగంగ * నేరకునికి
నచ్చెరువునందియొకమాట*యడుగుచుంటిఁ, బరువులెత్తుటమానిలోఁ*గరుణపూని
మనస! నవ్వక నాకొక్క*మాటచెపుమ! సతతమును నీదుసంకల్ప * జగములోన
ధనము ధాన్యంబు వస్తువా*హనచయంబు, నెచ్చెలులు, సేవకులు, రమ*ణీజనంబు
రమ్యమందిరవితతులా * రామములును, గేళికాసరోవరములుఁ * గృతకనగము
లాకసంబును, సూర్యచం*ద్రాదితార, కాగణంబును, దిక్కులు, * క్ష్మాతలంబు
సకలము బహిర్జగంబున*జరగునట్లె, యగపడుచునుండె నిది యేమి*యద్భుతంబొ?
నీజగమునకు మాతృక * యీజగంబొ? యీజగమునకు మాతృక * నీజగంబొ?
రెంటికిని భేదమును గాంచ*కుంటిమహహా, నీజగము సత్యమో? కాక*యీజగంబు
సత్యమో? కాక రెండును * సత్యమగునొ? అట్లుకాక రెండును నస*త్యంబులగునొ?
కనులువిప్పి యోజించినఁ*గానఁబడెడు,నొకటి, కనుమూసి యోజింప*నొకటిదోఁచు
నట్టిఘనశక్తి యీరెంటి*యందె గలదొ, కాకనీయందెగలదొ ని*క్కంబుదెలియఁ
బరువులెత్తుటమాని లోఁ*గరుణనూని, మనస! మఱవక నాకొక్క*మాటచెపుమ!

బాలాంత్రపు వేంకటరావు.

యసంబు రామునకు దశరథనృపాలునకు నమస్కరించి యమ్మహావీరుని వీక్షించి నిజపదవంబున కరిగె. అట్లు నానిమిత్తంబున నొక్క కాకమాత్రంబునందు బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించితివి. అట్టినీ వోరాజేంద్రా! నన్నపహరించిన రావణు నేమిటికి క్షమియించి యున్నవాఁడవు. ఓ పురుషపుంగవా! నీ వుత్సాహసంపన్నుండ వగుచు నన్నుఁ గరుణింపుము. నీవంటి వల్లభుం డుండియు నే ననాథ తెఱంగున నున్నదాన. భూతకారుణ్యంబు పరమధర్మంబని పూర్వంబున నీవలన నే వినియుందుదు. నీవు మహావీర్యుండ వనియు మహోత్సాహుండ వనియు మహాబలసమన్వితుండ వనియు నెవ్వనికిం గానికార్యంబు నీకు శక్యంబనియు గాంభీర్యగుణంబున సాగరంబుం బోలియు నక్షోభ్యుండ వనియు దివంబునకు వాసవుని విధంబునఁ జతుస్సముద్ర ముద్రితయైన మేదిని నేలుకొనఁ జాలిన ప్రభుండ వనియు నిన్ను నెఱుంగుదు......మహాబలుండవయ్యును రఘుపుంగవా! యీరాక్షసుల యం దొక్కయస్త్రం బేమిటికిఁ బ్రయోగింపవు. నాగగంధర్వాసురమరుద్గణంబులును సమరంబునం దంజనానందనా! రాముని శరవేగంబు సహింపఁజాలవు. అంత శౌర్యసమగ్రుం డగుమహాబాహుండు నన్ను మఱచినవాఁ డయ్యె నేని శితశరంబుల నీ రాక్షసుల నేమిటికి సంహరింపఁడు?"

విష్ణుపురాణము:—"కలియుగంబునందు వర్ణాశ్రమధర్మంబు లర్థకామప్రధానంబులై యాచరింపంబడుం గాని ఋగ్యజుస్సామవేదమార్గంబునం బ్రవర్తిల్లవు. న్యాయప్రాప్తంబు లగువివాహంబులును ధర్మమర్యాదాకలితంబు లగు గురుశిష్యభావంబులును దాంపత్యధర్మంబులును, నగ్నిసంతర్పణంబులును దేవపూజావిధానంబులును గలియుగంబునం గలుగ నేరవు. మఱియు నయ్యుగంబునం దెట్టికులంబున జనియించినవాఁడైనను బలవంతుం డయ్యెనేని జనేశ్వరుం డగు. సకలవర్ణంబులందును ధనవంతుం డైనవాఁడె కన్యాప్రదానంబునకు యోగ్యుండు. ఎట్టినిషిద్ధద్రవ్యంబు లైనను బ్రతిగ్రహించి బ్రాహ్మణులు యాగదీక్ష వహింతురు. మనంబున నెయ్యది సరిపోయె నదియె ప్రాయశ్చిత్తంబు. ఎవ్వం డేపదంబు పల్కె నదియె శాస్త్రంబు. చతుర్వర్ణజనంబుల కుపాసనాయోగ్యంబు గాని దేవతయును బొందఁగూడని యాశ్రమంబును లేదు. శాస్త్రోక్తవిధులం బరిత్యజించి యథేచ్ఛావిధానంబున నుపవాసంబు లాచరించుట తపం బనం బరఁగు. ఎవ్వని కెవ్విధంబునం దోఁచె నదియె ధర్మం బగు. స్వల్పధనంబు గలిగిన యంతనె పురుషుండు ధనాఢ్యుం డనం బరఁగు. స్త్రీజనులు ...... జీవులగుదురు.

కలియుగంబున రత్నకాంచనమయంబు లగు భూషణంబులును మనోజ్ఞంబు లగు వస్త్రంబులును లేవు గావున వనితాజనంబులకుఁ గేశంబులు దువ్వి ముడిచికొను టయె యలంకారంబగు. అగ్నిసాక్షికంబుగఁ బాణిగ్రహణం బొనర్చిన భర్త ధన హీనుం డయ్యె నేని వానిం బరిత్యజించి ధనవంతుని భర్తగా వరింపుదురు. ఎవ్వండు బహుప్రదుం డగు నతండ యఖిలజనంబులకును స్వామియనంబరఁగు... శూద్రాదులు బ్రాహ్మణుల మనుష్యసాధారణులుగాఁ దలంతురు."

భారతము :—"మయుండు తనకుఁ బార్థుం డొనరించిన మేలు దలంచుచు నంజలి గావించి యం...యుండె. వాసుదేవుని...కిరీటిం గనుంగొని, వీరాగ్రేసరా! ఖాండవవనం బనలుండు జ్వాలామాలికాభీలుం డగుచుఁ జుట్టినప్పుడు కృష్ణదేవుండు రక్షింపవల దని వారించినను గృపాయత్తచిత్తుండనై నాప్రాణం బులు గాచిన నీకు నేనేమి ప్రత్యుపకారంబు సేయువాఁడ? ఐనను దానవవిశ్వకర్మ నగు నే నితరుల కసాధ్యంబును విస్మయకరంబును బ్రియంబును నగు నొక్కసభ నిర్మించి తెచ్చెదనని తలంచినవాఁడ" ననిన సవ్యసాచి కొంతతడవు విచారించి మాయావిదుం డగుమయుని నాలోకించి మందస్మితాననుం డగుచు ... "(ఉపకారంబు) చేసి యతనివలనం బ్రత్యుపకారంబు గైకొనమి నావ్రతంబు. నీవు సకలంబు నొసంగినవాఁడవ. మనకు నన్యోన్యంబు సౌహార్దంబు గల ... మేలగుంగాక. నీ నిజేచ్ఛం జను" మనిన నమ్మయుండు "పురుషశ్రేష్ఠా! నీవుపలికిన యీవాక్యం బు నీకతగు..."

## (54) బ్రహ్మోత్తరఖండము.

ఇది తొమ్మిది యాశ్వాసములు గలది. ఇది పట్టమెట్ట సోమనాథసోమయాజి పుస్తకముకంటెను ముద్రితప్రతికంటెను భిన్నమైనది. కవి ప్రాఁతకోట పుల్లయ్య. ఇతనికులగోత్రనామము లీ క్రిందిగద్యమువలనఁ దెలియఁబడును.

"ఇది శ్రీవీరభద్రకృపాలబ్ధ సరసకవితాచమత్కార ప్రచండానుమతకోదండ (అనుమకొండ) ప్రథమశాఖాగ్రగణ్య పుణ్యాచారిత్ర కాశ్యపగోత్ర వాత్స్యాయనసూత్రపవిత్ర వీరనారాయణపురాఖ్యవిఖ్యాత ప్రాఁతకోట పోతరాజ పెదవీరమరాజపౌత్ర రేఖయామాత్యపుత్ర పరమేశ్వరారాధనవిధేయ పుల్లయనామధేయ ప్రణీతంబైన శివప్రభావాభిరామం బగు బ్రహ్మోత్తరఖండంబు"

ఈ ప్రాఁతకోట శ్రీశైలమునకుఁ బశ్చిమభాగమున నున్నట్లు ప్రథమాశ్వా

ములోఁ గవి తెల్పియున్నాఁడు. సంస్కృతకవులను, దెనుఁగుకవులను బ్రసిద్ధులను బొగడియున్నాఁడు. తనకృతిని శ్రీశైలమల్లేశ్వరున కర్పించియున్నాఁడు.

పురాణనామచంద్రికలో నీ పుల్లయ్యనుగుఱించి వ్రాయుచు "ఒకానొక ఆంధ్రకవి, ఇతఁడు బ్రహ్మోత్తరఖండమును దెనిఁగించెను. ఇందు, తెనుఁగుమ ఱుఁగు పదములు కొన్ని ఉన్నవికాని లక్షణ విరుద్ధములు అగు ప్రయోగములు అనేకములు కానఁబడుచున్నవి." అని వ్రాయఁబడినది.

శైలికై కొన్ని పద్యములు చూపఁబడును.

గీ. వరుస షడ్జన్మమందు నావర్తనృపతి, నగుదు నీవు యయాతికన్యాలలామ
వగుచు మత్ప్రాణవల్లభవై ధరిత్రిఁ, గీర్తిఁ బాటింపఁగలవు సద్వర్తనమున.

క. ఆరాజు నిఖిలభోగము, లారమణీమణినిగూడి యనుభవియగుచుం
జేరెను శివలోకమునకుఁ, జారుయశోధనుఁడు సప్తజన్మాంతమునన్.

మ. విని యారాజకులావతంసము మహావేగంబున న్వచ్చి కాం
చననానామణి సంఘసంఘటితభాస్వద్భూరిదేవాలయం
బున శుంభద్ఘనరత్న లింగరుచిరంబున్ గోపికామందిరం
బునఁ దద్బాలకు సత్ప్రభావవిభవంబుం జూచి విభ్రాంతుఁడై.

ఇందు.—గీతములు, కందములు సీసములు మెండు. వృత్తములు తక్కువ. పరిషత్పుస్తకభాండాగారమున నీ గ్రంధమునకు రెండుప్రతులు గలవు.

(55) పాండవాశ్వమేధవృత్తాంతము.

ఇది యొకవచనకావ్యము. మొదటి 16 పత్రములు లేవు. చివర బభ్రువాహనుఁడు తనతండ్రియగు నర్జునుం జంపితినిగానఁ బ్రాయశ్చిత్తమేమికలదా? యని విచారించువఱకు జైమినిభారతముకథ వ్రాయఁబడినది. సంస్కృతమునకు భాషాంతరమువలె నున్నది. సముఖము వేంకటకృష్ణప్పనాయకప్రణీత గ్రంథముకంటె నన్యమైనది. మొదలు తుదయు లేనికారణమునను, బ్రకరణములతుదను గద్యలు లేనికారణమునను గవిపేరు తెలియవచ్చుటలేదు. భాషచాలభాగము స్వచ్ఛముగాలేదు. ఏడుప్రకరణములు 250 పత్రములు గలది.

(56) వచనరామాయణము.

ఈవచనకావ్యములో నారణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలు నాల్గుమాత్రమే దొరకినవి. ఈ సద్గ్రంథమును రచించిన కవి వేంకటసుబ్బయ్య.

"ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద ద్వంద్వ కందళితస్యందమాన సాంద్రతరధారాసారమకరందరసాపూరస్పందనతుందిలాయమాన మానసేందిందిర నిరుపమకవితాధురంధర భారద్వాజగోత్రపవిత్ర విమలాపస్తంబసూత్ర ఘనగిరి వేంకటగిరిభట్టపౌత్ర అహోబలసూరిపుత్ర సకలవిబుధ సుకవిజనారాధనకరణ విలసచ్ఛవి రామకవి ప్రణీతంబైన యథావాల్మీకం బనునాంధ్రరామాయణంబున నయోధ్యాకాండ యందలి...ఆశ్వాసము."

ఈకవీంద్రుని వంశాదికమును బూర్తిగాఁ దెలిసికొనుటకుఁ దగిన కృత్యాది పద్యములు కొన్ని పత్రములు లేనికారణమున నారాయణామాత్యుఁడు, తిమ్మప్పయ మంత్రి మొదలగునీతని వంశస్థుల నీకవిపేర్కొనినవారిని వరుసగా నీయఁజాలమైతిమి. ఈతని పితామహుని కైదుగురుకొడుకు లనియు నందుఁ దనతండ్రి యొకఁడనియు నీ క్రిందిపద్యము తెల్పుచున్నది.

క. ఆభూసురసంతానక, శోభనపంచకమువెలయు సుభగమతిమహా
   ప్రాభవమునసందలి శక్రాభుఁ డహోబలసమాఖ్య రంజిలుధృతిమై.

ఈ యహోబలునికి మంగాంబయందిద్దఱు సుతులు గల్గిరఁట, వారిలో నీతఁ డగ్రజుఁడు.

శా. శ్రీలక్ష్మీనరసింహశాస్త్రులకు నేశిష్యుండఁ దద్బోధనా
   మూలస్ఫారవిశేషనిశ్చయశిరాభూయిష్ఠసంసేవనా
   శీలుం డౌటఁ దదీయసత్కృపను నిశ్చింతుండ సద్భక్తి స
   ర్వాలంకారకృతిన్ రచించితి యథావాల్మీకముం గావ్యతన్.

అనుపద్యములో నెవ్వరో లక్ష్మీనృసింహశాస్త్రు లొకరీతని గురువుగాఁ దెల్పఁబడినారు. ఈ కవీంద్రుఁడు వాల్మీకిరామాయణములో మొదటవ్రాయఁబడియుండు, శుక్లాంబరధరం, కూజంతంరామరామేతి, గోష్పదీకృతవారాశిం మొదలగు ధ్యానశ్లోకములన్నియు మొదలుకొని తెనిఁగించినాఁడు. అన్నియు యథావాల్మీకముగానే కనఁబడుచున్నవి గాని ప్రతికాండమున నధ్యాయనిరూపణము చాలక యాశ్వాసములనుబెట్టి కొంతనియమభంగము చేసినాఁడు. ఈకృతిని శ్రీవేంకటేశున కంకితముచేసినాఁడు. శైలికై కొన్నిపద్యము లిచ్చుచున్నారము.

ఆరణ్యకాండము ౨౦ సర్గము.

ఉ. వారలఁ గూడి శూర్పణఖ వావిరి రాఘవునాశ్రమాంతముం
   జేరుచ రామలక్ష్మణుల సీతను గన్పడఁజేసె వారల

వీరుని పర్ణశాల నుపవిష్టు సభార్యుని సానుజన్మునిం
జామదృశుం గనుంగొనిరి సత్వరయుక్తిఁ బ్రమోహితాత్మలై.

మత్తకోకిల. ఆనిశాచరి యట్లు రాఁ గని యా రఘూద్వహుఁ డిట్లనున్
భానుదీప్తుని లక్ష్మణుంగని భ్రాత శూర్పణఖాఖ్య యీ
కానలోన సహాయసంపద గల్గి వచ్చెను గాన నీ
జానకిం బరిరక్షసేయుము చక్క నొక్కముహూర్తమున్.

క. సీతాసంరక్షణమును, నాతతమతి రాముఁ డనిన యప్పలుకులచే
భ్రాతి శిరసావహించుచుఁ, బ్రీతిం జేకొనియె నత్తఱిన్ లక్ష్మణుఁడున్.

క. రాముఁడు సుమహచ్చాపముఁ, జామీకరభూషితంబు సద్గుణయుక్తం
బై మెఱయఁ బూని యిట్లను, నామనుజాశనులఁ జూచి యవ్వని నంతన్.

చ. దశరథపుత్రు లేము వనిఁ దాపసరూపులు రామలక్ష్మణుల్
శశిముఖి సీతఁ గూడి కృతసంచరణన్ ఫలమూలజాలకం
బశనము గాఁగ నీయటవియందలి తాపసధర్మయుక్తిచేఁ
బ్రశమితదోషు లన్మము నభంగురబాధలఁ గూర్ప నోర్తునే.

చ. మునులకు విప్రకారముల మున్నొనరించినఁ దన్నియోగతన్
ధనువును బాణముల్ గొని యుదగ్రత మిమ్ము వధింప వచ్చితిన్
వినుఁ డిపు డిందు నిల్వుఁడు భువిం బరిసర్పణ నొంద నర్హులే
వనిని నిశాచరాధములు వధ్యులుగాక మనంగ నేర్తురే.

సీ. మించుతోడ రమించుమేఘంబు కైవడి బ్రేలుకొం ప్వాకనీటు గీలుకొలుప
మరుపతాక వహించుమకరచిహ్నము రేఖ సోఁగకన్గవ బెళుకు సొగసుచూపఁ
బంగుగురే దాల్చు నింపుజాబిలిరీతి మొగము లేనగవుతో ముద్దుగులుక
నెలదీవఁ దళుకొత్తు నలరుగుత్తులక్రివి బటువుగుబ్బలు నేత్రపర్వ మొసఁగ
గీ. మహికి దిగివచ్చి తనయాశ్రమంబు కెలన, మెలఁగ నావేల్పుజవరాలివలకుఁ దగిలి
యలఘుకళలకు నిధిగాన నతనుశాస్త్ర, దేశికుం డయ్యె నప్పుడు కౌశికుండు. 43
మ. నునుఁగెమ్మోవి జపానుబంధ మణఁపన్ నూగారు సామీరణా
దనచర్య న్మఱపింపఁ గౌను హరిచింతం బోనిడం గోకపా
లనదృష్టిం జనుదోయి మాన్పఁ జిరకాలం బీఘనుం డావిలా
సినితోఁ గూడి మెలంగి యంతట నుదీచి న్యోగియై యున్నెడన్. 44
సీ. వేలుపుదొరవీటివేశవాటిమిటారిమిన్నల కిదిగదా మేలుబంతి
హయమేధముఖయాగయజనశీలురఫలాకలనల కిదిగదా కల్పలతిక
పవిచేత వసపోనిదివిజేంద్రరిపుతపోవితతికి నిదిగదా వేఱువిత్తు
జగమెల్ల గెలువఁ గెంజిగురుటాకుజిరావజీరున కిదిగదా జీవగఱ్ఱ
గీ. యనక కినుక శిఖాకృతి దనుకఁ దిట్టె, నమరపతి పంపఁ దనదుడెందము గలంప
వచ్చురుచిరోరురంభ యౌవనవిజృంభ, మానసంరంభ రంభ నిమ్మౌని వరుఁడు.
క. తదనంతర మీతఁడు పూ,ర్వదిగంతరమున నిరంతరశ్వాసనిరో
ధదురంతతపోవిభవ్య, త్రిదివుం డయి విలయతరణితెఱఁగున మెఱయన్. 46
శా. బ్రాహ్మీవల్లభుఁడు న్వసిష్ఠుఁడు నిలింపశ్రేణియు న్నీవపో
బ్రహ్మర్షిప్రవరుండ వంచుఁ దను సంభావింప లోకోత్తర
బ్రాహ్మణ్యైకశరణ్యమంత్రజుషియన్ ప్రఖ్యాతి వర్తిల్లె నీ
బ్రహ్మజ్ఞానధురీణుఁ డంచు గణుతింపన్ మౌని సంప్రీతుఁడై. 47
క. రాతిరి యచ్చట నుండి వి,భాతం బగుటయు నొసంగెఁ బ్రామినుకులప్రో
గై తమ్ముల కనుఁ గైతగు, జోతికి నర్ఘ్యంబు దర్భసుమగర్భముగన్. 48
క. శ్రీరామలక్ష్మణులు సం,ధ్యారచితప్రణతులై నిజానుగతిన్ రా
వారికి జనకపురాలం, కారము వివరింపఁ దొడఁగెఁ గౌశికుఁ డెలమిన్. 49

— * శ్రీరామునకు విశ్వామిత్రుఁడు మిథిలాపురవృత్తాంతము జెప్పుట. * —

మ. కిరిధారేయునికోఱ హీరఖచితక్రీడాద్రి, మున్నీరు చ
ల్వ రహింబాయనిచీర, మేరుగిరి జాళ్వాపీఁట, మిన్నేఱు బి

త్తరపున్ హారము గాఁ జెలంగుధర సీతారత్నముం గాంచఁ దాఁ
బురుటి ల్లైనపురీమతల్లి మిథిలం బోలంగఁ బ్రో లున్నదే ! 50

మ. శివకోదండవిఖండనంబు సలుపన్ సీతానురక్తిన్ విదే
హావిభుం డున్నపురంబు డాయఁగల నీయత్నంబు చింతించి తా
భవచాపం బగుభీతి నిన్ను నతిచేఁ బ్రార్థింప నున్నట్టి మే
రుపురీతిం గనుపట్టె వప్ర మిచటన్ రోధోఽంతరవ్యాప్తమై 51

చ. జగతికిఁ గూఁతు రై కలిమిజవ్వని జానకి యన్సమాఖ్య ని
న్నగర వసించి యున్నకతనం బెడఁబాయనికూర్మి కాశయం
బగపడఁ జుట్టఁబెట్టు కలశాంబుధి కైవడిఁ జూడ నొప్పె నిం
దగడిత పుండరీకకుముదావలిధాళధళీయుతాంబు వై. 52

చ. ఇవ్విరి గొప్పయుప్పరిగ లిక్కువ టెక్కువహించు మించులై
యొప్పులకుప్ప లుండ విడనొల్లని నల్లని మబ్బులోయనం
దెప్పలఁదేలుఁ దన్ముఖవ నేరుహసౌరభ వారిరాశి నె
ల్లప్పుడు దూర*ఖేచరవనాగతసాంద్రమదాళిమాలికల్. 53

మ. మినుకుంబైఁడిమెఱుంగుమేడ లిచట న్నిన్నంది యుండం గనుం
గొని యాదిత్యులు రత్నసానువులు పెక్కుల్ దోఁచె నౌరయ్య ! ప్రా
క్కనకక్షోణిధరంబు శంకరుఁడు విల్గా వంచిన న్వంచుఁగా
క నికేతంబులు మాకు లేవె యనుచుం గర్వింతు రత్యున్నతిన్. 54

చ. హరిహయనీలకీలితమహత్తరగోపురకాంతిధోరణిన్
దరణి భ్రమించి నీకుఁ దగునా యమునా వడిసుళ్లఁ జెంద సా
గరుఁ బెడఁబాసి వచ్చుటకుఁ గారణ మేమి యనం దదీయమహా
ఖరికి నగు న్సురీతతి పతాపక నిప్పరిమింటిచాయలన్. 55

క. పరిమిళితాగరుధూప, స్ఫురణం బై యిచట ధరణిసుత రతనపుటు
ప్పరిగ గగనారవిందము, సురభియనుట నిజ మొనర్చు సురతతిమదికిన్. 56

శా. ఋగ్వేదార్ణవకర్ణధారులు, యజుశ్శ్రీవల్లభుల్, సామస
మ్యగ్వేదుష్యనిధుల్, భృతద్వివిధమీమాంసారిరంసుల్, శ్రవో
దృగ్వాణీ పరిణేత, లక్షుచరణోక్తివ్యాపకుల్, సాహితీ
భృగ్వంశంబులు, జాణ లన్నికళలం దీప్రోలి విప్రోత్తముల్. 57

* ఖేచరవనము = నందనవనము.

ఉ. ఈవికిఁ జాల దర్ణవమహీస్థలి, * పోరికిఁ జాల దీర్త్రిలో
కీవరవీరలోక, మురుకీర్తి వసించుట కిమ్ము కాదు రా
జీవభవాండ, మిన్నగరిఁ జెన్నగు రాచకొమాళ్ల కన్నచో
నావశమా గణింప రఘునందన వారిగుణప్రభావముల్. 58

గీ. ఒకరొకరి యింటిముందటి యుదిరిపసిఁడి, మేరువం తేసి రాసులై మెఱయుననఁగఁ
దెల్ల బేగడకొండ యాస్తి యగునలకు, బేరుఁ డెనయాని యీవీటిబేరులకును.

ఉ. ఏరులసంఖ్యఁ జెప్పటకు నెవ్వరికి న్వసపోనిదారిఁ గా
క్షీరధరిత్రిఁ బైరులు సమృద్ధి వహింపఁగజేసి గోగణా
ధారత రాజశేఖరవతంసములై సయిదోడు గంగకు
న్వీరికిఁ బోల్కి చెల్లు నన విష్ణుపదోద్భవు లుందు రిచ్చటన్. 60

మ. వినువీథిం జనునప్పు డిప్పురములో వేతండతండంబు చె
క్కున నెక్కొన్నమదంబు లంబుజవిపక్షుం జెంది పెంపొంది కం
దనుపేరం దనరారుఁ గాని భువనఖ్యాతావదాతాంశుసాం
ద్రునకుం జంద్రునకుం గళంక మను టెందుం జెప్పఁగా నొప్పునే. 61

మ. చరణాబ్జంబులు సాది కుర్విఁ గదియం జాఁగు న్రయప్రౌఢిఁ జి
త్తరుతేజీలను మించుఁ దిన్ననినడన్ ధాటిం బరీక్షించు చో
శరధుల్ దాఁటి చివుక్కున న్మరలు నాజానేయరత్నంబు లి
ప్పురి నారట్ట కరూశ బాహ్లిక శక ప్రోద్భూతభావోన్నతిన్. 62

మ. కొలుతం జెందనిచందురుం డసుగునం గూర్మాకృతిం జొప్పడం
దరిత్రా డై తొలుకారుమించు లమరన్ సౌందర్యమాధాద్రిచేఁ
జెఱకున్నింగిణిజోదు చైత్రయుతుఁ డై శృంగారసారాంబుధిం
దరువం గల్గిన వేల్పుచెల్వ లిచట న్వర్తిల్లువారాంగనల్. 63

ఉ. చిత్తరుచిత్తరుల్ నడభజించి రసన్ జిగినీలి కాసె ద
ళ్కొత్తెడు పాత్రకత్తియల కొజ్జతికంబు వహించి కోహళుం
దత్తిలు నైనఁ గా దనెడునైపుణి మార్గవిధంబు దేశియుం
బెత్తము కేలఁ బూని వినిపింపఁగ నోపుదు రిందు నట్టువల్. 64

ఉ. సంగరభోజి కాస్తి యగు జంత్రము, గాత్రమునందు రక్తిచూ
పం గొలగాఁడు, చాలఁ డలపావని రాగము విస్తరింప, నెం

* పోరికినాలమియా—అని మూ,

చంగొదుకుంబరాశ్వతరసంజ్ఞలకున్ శ్రుతిదప్పనంచు వీఁ
కం గయికోరు ముజ్జగముగాణల నిచ్చటి గాయకోత్తముల్. 65

క. ఉఱు ముఱిమినట్లు భరముం, దరితీపునిటారిపలుకుదారి నయంబు
న్మెఱయింపనేర్తు రిప్పురి, నెఱమద్దెలకాండ్రు వాద్యనినదప్రౌఢిన్. 66

ఉ. చక్కెరమోవికాటు, దమసానులచీరలవల్లెవాటు, లేఁ
జెక్కుల గోటిసీటు, మెయిఁ జెల్వగు కీల్జడవాటు, నార్జపుం
జెక్కుఘటింపఁ గుంకుమపటీరకురంగమదాదివాసనల్
సొక్కులిడ న్నడ న్విటులు సోలుదు రిచ్చటివేశవాటులన్. 67

చ. పలుతెలినిగ్గు మొల్లగమి, బాహులు చంపకమాలిక, ల్మొగం
బులు వికచారవిందములు, పొన్నలు నాభులు, వాలుఁగన్ను లు
త్పలములు నై చెలంగ బహుతం గనుపట్టు వసంతలక్ష్ము ల
ట్లలరుల జట్టిగొందరు విటాశయ మిచ్చటిపుష్పలావికల్. 68

చ. మొగముల తమ్మివాసనకు మూఁగెడుతేఁటులఁదోలు కేలి కై
చిగురులమేపరు ల్గదియఁ, జిల్కెడు పల్కులఁ జేరఁ గీరముల్
బెగడఁగ, మించు నందె రవలిం గలహంసలు రా, ససైన్యమై
తగుమరుమించుఁబోణి కెనదాలుతు రిచ్చటిశాలిపాలికల్. 69

క. జనకుఁడు నిమివంశయశో, జనకుఁడు నిజకీర్తివిజితశారదఘనతే
జనకుఁడు పటుబోధనిరం, జనకుఁడు పాలించు దీని సరసాస్థానిన్. 70

మ. మొగలిం గేదఁగి రేకు, వంశకుహళి న్మత్యంబు, చట్రాతిలో
* మొగఱాత, శ్కనఁటిన్ మిటారి కపురంపుంబల్కు, గారాకుఁదీ
వగమి న్లేఁజిగు రుద్భవిల్లునటు లీవై దేహయోగక్రియా
జగతిం బాల యొకర్తు సీత యనుసంజ్ఞం గల్గి వర్ధిల్లఁగన్. 71

మ. కటి దొడ్డై కననౌటఁ, గన్గవకటాక్షశ్రీలగర్వంబు చూ
పులఁ జన్నుల్ మొనసేసి యుంట, బగడంబుం దార్కొన న్మోవి పూ
నుటఁ, దారుణ్యపు బందుక ట్టగుట మేనుందీవకుం జెప్ప కె
చ్చటికో పోయె మిటారి బాల్య మసమాస్త్రప్రాప్త దార్బల్య మై. 72

* మగఱా యనుటకు మొగఱాయని ప్రయోగించెను.

చ. గొనబులొయారినెన్నొసలు కొప్పున కందుట చూచి హానికి
న్ననలకుఁ దాము రాఁగలుగునంటు గణించి నిజోపమానమో
జన మొనగూర్పఁ వేఁడుటయుఁ జంపక మిందుకు సమ్మతింపమిం
గనకలతాంతవాటిపయిఁ గంటు వహింపఁగఁబోలుఁ దుమ్మెదల్. 73

క. విరితేనెమేపరులకున్, హరినీలపుసరుల కిరుల కబ్జాక్షికుఁ గల్
గురులై వెడవిలుతుని బెడ, గుఱులై తగ నెమ్మిపురుల కొక దాఁపరులై. 74

ఉ. నీ విఁకఁ బాల ముంచినను నీళ్లను ముంచిన మే లటంచు మీ
లావిరిఁబోఁడికన్నుఁగవ కాశ్రితవృత్తి వహించి తత్కటా
క్షావళికాంతిపూర మమరాపగ యై యమునాస్రవంతి యై
తావుకొన న్సృజించె నమృతప్రభవానిమిషత్వసంపదన్. 74

క. శ్రీలగుపీనులసంగతి, నాళీకత బెళుకు కలికినయనమ్ములపై
వ్రాలినమదాళిమాలిక, పోలికఁ దారకల సొలపుపొలుపు వహించెన్. 75

శా. ఆ వామేక్షణనాసఁ బోలుట కనర్హం బౌటనో మిక్కిలి
న్నూవుంబుష్పఘనంబు దాళనిగతిం దోఁచె, న్మహీమండలిం
దావయ్యె న్నరసాళి గర్హ్యరుచికి న్సంపంగి, వంశంబు ము
క్తావాసం బగుచున్ విరక్తయతిచిహ్నం బయ్యె నూహింపఁగన్. 76

గీ. నెలనెలకు భానుమండలిఁ గలయుఁ జంద్ర
బింబ మందురుగా కిందుబింబమందు
నరుణబింబంబు గలయునే యరు దనంగ
మొగమున కొసంగు నొకశీవి ముదితమోవి. 77

చ. హరమకుటావతంస మగునర్ధసుధాకరుఁ డష్టమీనిశా
కరుఁ డెదిరించి లొచ్చగుట గానఁబడంగ నపాంగమాలికా
పరిచితకాళిమ న్నిటలపాలికపై నిడి మోయఁబోలు నీ
సరణి నన న్బొమ ల్మెఱయు జవ్వనికి న్నెలవంక బాగునన్. 78

క. చిత్తజుఁ డను దొమ్మరి లా, గెత్తి వడిం దూఁటి చనఁగ నిడినకడానీ *
బెత్తపువలయములో యన, బిత్తరితాటంకయుగము బెడఁగై తోఁచెన్. 79

గీ. చిగురువిలుతుపగతుఁ డగునుగ్రునకు శేఖ, రత్వ మొందు తనకొఱంత దీఱ
నర్ధచంద్రుఁ డలికమై తోఁచెనేమొ యీ, మదనజనని యైనమానవతికి. 80

* "కడానీ" యని దీర్ఘమెట్లు వచ్చెనో.

మ. కలువ ల్మంకెన కుందచంపకములుం గందోయి కెమ్మోవియుం
బలుచా ల్నాసయు నౌటఁ దమ్మి తలఁచుం బద్మాస్యమో మెల్ల నా
బలఁగం బంచు; మృగాంకుఁ డట్ల పొగడుం బల్కు ల్సుధల్ చిన్నివె
న్నెల లేనవ్వు కపోలముల్ కళలు నై నిచ్చల్ ప్రకాశించుటన్. 81

మ. సహజశ్రీహరిణాంకపంకరుహముల్ సౌందర్యదాయాహృతి
స్పృహచే దర్పణబింబదంభమునఁ దన్ జేరం గృపం గారవిం
చి హసాక్షిద్యుతిఁ బంపకం బిడి భృతజ్యేష్ఠత్వముం దమ్ముల
గ్రహియుం బూన్పఁగఁబోలు బాలమొగ మారాజారవిందంబులన్. 82

క. సంకుమదంబు వహించియు, సంకుమదం బణఁచు నౌర సతికంధర మీ
నాంకావహజయకాహళ, శంకావహమృదు నినాదచతురిమయుతమై. 83

మ కులుకుల్ నేర్పెడు పైఁట మీటుకొని రేఁగుంబండ్లు పూగీఫలం
బులు మాలూరశలాటువు ల్లికుచము ల్పూబంతులుం దమ్మిమొ
గ్గలు తాళంబులు నారికేళములు చక్రంబుల్ నునుం బైఁడికుం
డలునుం గొండలు నై చెలంగెఁ గుచము ల్నానాఁటికిన్ బోఁటికిన్. 84

చ. జనకునిపట్టిగట్టిజిగిచన్గవ సామజకుంభదంభనో
దనగరిమ గ్రహించు టరుదా ? కరిదారణకారియైనయా
కనకగిరీంద్రధన్వివరకార్ముకముం దునియించుప్రాయపుం
ఘనతవహించి యున్న దనఁగా నిఁక భానుకులాధినాయకా. 85

చ. నడు మతిసూక్ష్మ మైనకతనన్ రతినర్మసఖుండు సిబ్బెపుం
బొడ నునుగబ్బిగుబ్బకవఁ బుట్టెడు రాయిడి కావలగ్నముం
జడియఁగనీక యానికయొనంగిన నీలశలాక పోలికం
బడఁతుకరోమరాజి కనుపండువు నిచ్చు జనంబు చూడ్కికిన్. 86

చ. ఘనుఁడు గదా విధాత సతికౌ నణుమాత్రమునన్ ఘటించినాఁ
డని చరణాబ్జరేణుపరమాణువుచే మునిసార్వభౌమ గే
హినితనువల్లి యెల్లసృజియించిన నీమెదుటన్నుతింపఁ బో
యినభవదీయచిత్తమున కేగతి వింతయగున్ రఘూద్వహా. 87

గీ. కౌనుసోయగంబు గగనంబు నుతియింప, ననుచుఁ గన్న విన్నజనులు దలఁపఁ
దనకుఁ దానె తోఁచె వనితపొక్కిలికి మృహాబిలప్రసిద్ధి యద్భుతముగ. 88

చ. గురుకుచబాహువల్లరులకుం దమపాలిటిపుణ్యవాసన
స్సరులుగ నోచినార మని చంపకమాలిక లుండఁ బంకసం
కరములు తమ్మితూఁడు లురుకాండబలంబువహించి బల్మొనన్
సిరిఁ బచరింపఁ దత్తనువు చిల్లులు వోవఁగ నాడరే జనుల్. 89

సీ. వేణిబంధమయూరవిందబంధుకుమారికాసమాకలితసైకత మనంగఁ
దారుణ్యహిమకరార్ధకిరీటశుద్ధాంతవిహరణోచితమణిద్వీప మనఁగ
రతిమన్మథవివాహరచనామహోత్సవప్రకటితకనకవేదిక యనంగ
హరిశరాసదురాసదాధిరోపణపణగ్రహమనోరథరథాంగం బనఁగ

గీ. భృతస్మృదాకారమేదినీకృతి జుగుప్సి, తాశయకుశేశయభవప్రయత్నగౌర
వస్ఫురత్తైజసక్షోణివలయ మనఁగ, బాలిక పిఱుందు కన్నులపండు వయ్యె. 90

చ. అతిశయరూపరీతి కరభాలికిఁ జొప్పడఁబోదు హస్తినీ
పతులకరంబులు న్మలినభావము దోఁచు ననంటి కంబముల్
గతమృదులేతరాకృతులు గాన మనోజ్ఞతయు న్సువర్ణజి
ద్ద్యుతియు మృదుత్వముం గలతలోదరియూరుల కెవ్వి పోలికల్ 91

చ. తలిరుకటారికాని బలుదంటదొనల్ వెనువెంట నంటు ను
జ్జ్వలశరశాలిసార మొదవ న్మకరాంకము లూని హేమకా
హళగరిమన్ జగత్త్రయజయంబు వహింపఁగఁ జేయునట్టి యి
జ్జలరుహపత్రనేత్రమృదుజంఘికల న్నుతియింప శక్యమే. 92

క. కంజనయనాశిరోమణి, కిం జరణయుగంబు సొబగు కెంజిగు రగుటన్
సంజాతకోరకంబు ల, నం జితతారకములైన నఖములు మెఱయున్. 93

సీ. రాజీవచర్యధుర్యకుఁ బొల్పడినఁ గాక ఘనకూర్మరేఖ చేకొనినఁ గాక
వసుమతీభరణలాలసత కోపినఁ గాక మతకరిహరిదారి మనినఁ గాక
దళితారి విక్రమోద్ధతిఁ జెలంగినఁ గాక రాజహారితకు నేర్పడినఁ గాక
మణివితానాయోధ్యమహిమఁ జెందినఁ గాక కోటేరుటెక్కు నెక్కొనినఁ గాక

గీ. శ్రీఘనోన్నతి కలికిమై చెలువు నెఱపి, కాక చెలి పాదయుగళి మీఁగాళ్లు పిఱుఁదు
నెన్నడుము చన్నుఁగవ మోము చిన్నిమోవి, నాస వేనలి యొకని కెన్నంగఁదరమె.

క. ఈపగిది న్నవయౌవన, యైపరఁగఁ దనూజపెండ్లి కాజనకుఁడు ధా
త్రీపమదాక్షేపణముగు, చాపారోపణము పణము సలిపెఁ గుమారా. 95

క. అని యీగతి మునితిలకుఁడు, ననవిలుతుని చిలుకుటమ్ము నాటెనచందం
బున డెందంబున సీతా, వనితామణి గెలుకొనఁగ వర్ణించుటయున్. 96

క. ధరణికుమారికుచభర, పరిరంభముగోరు రామభద్రుని మదికిన్
మరువిల్లు మేరువయ్యెన్, హరువిల్లు నమేరు వయ్యె నతివైచిత్రిన్. 97

వ. ఇత్తెఱుఁగునం దత్తపస్వికీర్తితం బగునమ్మత్తకాశినీరత్నంబు శంభుచాపాధిరో పణప్రయత్నంబు చిత్తంబున హత్తింప నక్షత్రవర్తనాయత్తతల నత్తమిలు వృత్తంబుల నిమిత్తంబువలన సత్రపోదాత్తులై యుత్తమక్షత్రియకుమారు లగు విభాకరనిశాకరుల ఠీవి, దేవతావిగ్రహపరిగ్రహాభావ భావనావిలకుమారీలతో రరికాముఖరపామరధరామరానీకనుర్వివేకం బపాకరించుటకు భూచరులలో చనంబులకు గోచరించిన యనింద్యసౌందర్యసాంద్రులగు నింద్రోపేంద్రులచం దంబున, నిజాపకారకారణశుచిస్ఫురణ కయనం బగుభవత్ప్రతీయనయనంబు లీలఁ, గలహవేళాకుపిత శైలాధిపదుహితృ చరణకిసలయ విలసితాలక్తరసవ్య తికరానువేలముకుళితం బొనర్చియుఁ జెచ్చుపెరుఁగుమచ్చరంబు లిచ్చలం బా యక తదీయకోదండదండంబు ధరణీమండలంబునం దుండుట యెఱింగి ఖండిం చుటకుఁ బంతగించుకొని యేతెంచిన లతాంతశరవసంతులకరణిఁ, దెఱగంటి కలువకంటు లెటువంటి యొప్పులకుప్పలైన జెప్పపాటు వాటిల్లక చూపుటూర పులం దరిది ద్రోఁప దని తత్పరీవారపారిప్లవేక్షణాకటాక్ష వీక్షణప్రేక్షణీయు లగుట నైజగతి నవతరించిన జయంతనలకూబరులహావణిక, మహీంభర తృణ గ్రాహీకృతమహానీలశకలబృందంబు లగు చికురబంధంబులును, సౌగంధికవనీ బాంధవస్తనంధయకుటిలతాచపేటీపాటవనిరాఘాటంబు లగులలాటంబులును, జాంబూనదరనవిలిఖితశ్రీలకు సవర్ణంబు లగుకర్ణంబులును, ధనుర్లతల వంపు దింపులకుఁ దెచ్చుకోమరుగల కనుబొమలును, గమలదళవిదళనావహచరిత్రంబు లగునేత్రంబులును, నపత్రాకృతిభరితచాంపేయకళిక లగునాళికలును, ముకుర నికరాపిధానకరవైశద్యవిశాలంబు లగుకపోలంబులును, బింబఫలకదంబకమ దంబున నతనుఘోటఘాటినుద్ఘాటించు కావులకుఁ దావు లగుమోవులును, నవీనకుందకోరకతపశ్చారకారకోదంతంబు లగుదంతంబులును, ననౌపమ్యావా హనానుకూలహిబుకంబు లగు చిబుకంబులును, పర్వదినశర్వరీమాత్రపరిపా లితాఖండమండలపయోరుహాభియాతిస్మయావలోకనస్మితోన్ముఖంబు లగుము ఖంబులును, శంఖసంఘాధికదరత్వ సంపాదన ధురంధరంబు లగుకంధరంబు

# బద్దిగ దేవరాజు.

బద్దెన యను బద్దిగదేవరాజు రచించిన నీతిశాస్త్రముక్తావళి యను గ్రంథమును బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 1910 సంవత్సరములోఁ బ్రకటించి యాంధ్రలోకమున కుపకార మొనర్చినారు. ఆగ్రంథము పీఠికలోఁ గవి కాలనిర్ణయము చేయఁ దలఁచి యాతఁడు 1070 వ క్రైస్తవాబ్దప్రాంతమువాఁడని యొక్కచోటను, 1130 సంవత్సరమునకు ముందువాఁడని యొకచోటను వ్రాసి, చిట్టచివరకు "నిక్కవిదేశకాలాదికవిషయ మనిశ్చితపదార్థ" మని విరమించినారు. ఈయర్థమును నిర్ణయించుట కాధారము లగుశాసనములు రెండు నాకీనడుమ లభించినవి. వాని నిందుఁ బ్రకటించుచున్నాఁడను.

ఈ శాసనములవలన బద్దెన రామకృష్ణకవిగా రనుకొనినంత ప్రాచీనుఁడు గాఁ డనియుఁ, గ్రీ. శ. 1261 వ సంవత్సరప్రాంతమువాఁ డగుటచే నించుమించు గాఁ దిక్కనసోమయాజినాఁటివాఁ డనియుఁ దేలుచున్నది. ఈ శాసనములు పుట్టిన కాలమందు కాకతీయరాజ్యము రుద్రమదేవి పాలించుచుండెను. ఆమెక్రింద సామంతుఁడుగా నుండి బద్దెన కృష్ణాతీరమం దొక చిన్నరాజ్యమును బాలించుచుండినట్లు కనుపట్టుచున్నది. నన్నెచోడకవినిగూర్చి రామకృష్ణకవిగారు చేసినకాలనిర్ణయముకూడ నిలిచినదికాదు. పూర్వకవులయొక్కయుఁ బూర్వరాజులయొక్కయుఁ గాలనిర్ణయము బలవత్ప్రమాణైకసాధ్య మని దీనివలనఁ దేలుచున్నది.

శాసనములయందును, గ్రంథమందును రాజుపేరు బద్ది, బద్దె, బద్దిగ, బద్దెన యీప్రకార ముండఁగా రామకృష్ణకవిగారు భద్రయని సంస్కృతరూపముగ దాని నెందుకు మార్చినారో తెలియదు.

కొంతకాలము క్రిందటఁ బరిషత్పత్రికలోఁ బ్రకటించిన "రాయవాచకము" నం దీనీతిశాస్త్రముక్తావళిలోనిపద్యములు కొన్ని యచ్చట నచ్చట "పద్య" నీతిలోనివిగా నుదాహరింపఁబడినవి. "బద్దె" కు బదులుగా "పద్య" యని లేఖకులు వ్రాసియుందు.

నేను బ్రకటింపఁబోవు శాసనములు కృష్ణామండలమునందు గన్నవరము తాలూకాలో కొండనాయనివర మనుగ్రామమునందు బ్రహ్మేశ్వరస్వామి యాలయములో నొకరాతిపలకమీఁదఁ జెక్కఁబడి యున్నవి. నాప్రేరణముపై శాసన సంపాదకులగు మ॥ కృష్ణమాచార్యులుగా రీనడుమ నాగ్రామమునకు వెళ్లి శాసన ప్రతిబింబములఁ దీసి నా కొసంగిరి. ఇందుకు వారి కెంతయుఁ గృతజ్ఞుఁడ నైతిని.

శాసనప్రతిబింబములయం దున్నది యున్నట్టులు మూల మీాక్రిందఁ బొందుపఱుచు చున్నాఁడను. మొదటిశాసన మసంపూర్తిగా నున్నది.

జయంతి రామయ్య.

౧

1. స్వస్తి సమస్త ప్రశస్తిస
2. హితం శ్రీమన్మహామం
3. డ్డలేశ్వర వీరనారాయ
4. ణచోడ బద్దిగదేవరాజు
5. లు శకవరుషంబులు
6. ౧౧౮౩ డ్డగు నేంట్టి క
7. ర్క్కాటుక సంక్రాంత్తినాంఁ్డు.

... ... ... .

(అసంపూర్తి)

౨

(ఉత్తరపువైపు)

1. శ్రీనాధనాభినీరేజసంభూత
2. బ్రహ్మణఃపురా । జాతా వి (శ్వ) గుణా
3. క్షీణలక్ష్మీరాజపరంపరా । త
4. స్యాం బద్దిగభూపోభూ ద్వీరనారా
5. యణాంకితః । (చో) డదోరయ
6. (భూపో) స్యపుత్రో భూదస్యనంద్ద
7. నః । శ్రీశాకాబ్దే పురాష్టాదశశశి
8. గణతే కర్క్కట సంక్రాంత్తికాలే స్వప్రాదా
9. ద్దీప మిష్టప్రద మనవరతం చో

(పడమటివైపు)

10. డబద్దిక్షితీశః । శ్రీమద్బ్రి
11. హ్మేశ్వరాయాశశిరవివి
12. శదం గోకనాంకస్య (వే!) తేస్త
13. ద్దీపార్థంచ వేలేటిజనప
14. దమహీం వింశతిద్రోణ
15. సంఖ్యాం॥

# విషయసూచిక

# వి ష య సూ చి క

మొగమెఱుంగనిలేమ మోమోటమెడలి
నాకు నీపనిచెప్ప టన్యాయ మగునె ?
తనకు నాకంతరంబును గనఁగవలదె ?
యనుచు నన్యథా భావింపఁ జనదు నీకు,
ధరణిపతి ప్రజకెల్లను దండ్రిగాన
నేను నీ ప్రజయందలిదానఁ గాన
నామరూపంబు లఱినయనాథఁ గాన
నామొ ఱాలించుటయె నీకు న్యాయ మగును,
నన్ను మన్నించుటయె నీకు న్యాయ మగును,
నాదుమదికోర్కి తీర్చుటే న్యాయ మగును ;
ధరణిప్రజలకు నీకంటె దైవమెవరు ?
దైవమే దీనులను బ్రోవఁదలఁపకున్న
నక్కటా ! వారి కిఁక శరణ్యంబు గలదె ?—
కానఁబడకుండఁ జనినయీకాంతకొఱకు
నేను శ్రమపడవలసిననియతి యేమి ?
యెన్నియో రాజకార్యంబు లున్న నేను
కన్నుపెట్టంగఁగలనె యీచిన్నిపనికి ?
నిదియె జ్ఞాపకముగ నుండు టెట్టు లనుచు
భూతలేశ ! యుదాసీనబుద్ధి దాల్చి
నాదువిన్నప మఱసేయఁగాదు నీకు ;
ఒకయనాథ జగతి వీడియున్న యబల
దయితునిపవిత్రపాదపద్మములయందుఁ
జిత్తమిడి చన్నక్రొత్తడి, జీవనములు
విభునిప్రేమాంజలికి ధారవిడిచి చనిన
యట్టియిల్లాలు, కోరినయట్టి కోర్కి
చిన్నికోరిక నీవంటిక్షితిపునకును
దీర్పకుండుట ధర్మంబు నేర్పె యనుచు,
నహరహంబును నీయంతరాత్మ నిన్ను
నోర్మితోడఁ బ్రబోధించుచుండుఁ గాన

నాదువిన్నపమును దీర్పఁగా దటంచు
నీ వుపేక్షింతువనుచు నే నెంచఁబోను—
*　　*　　*　　*　　*　　*
లోకపాలక ! నా మొఱ నాకళించి
నీ జగత్పాలకత్వసన్నియతి నెంచి
పుణ్యతత్పర మగుధర్మబుద్ధి నించి
చిరతరైశ్వర్య భోగసంసిద్ధిఁ గాంచి
శాశ్వతంబగుకీర్తి నెసంగుమయ్య ! ”—

## ప్రే మాం జ లి.

(మంజరి)

“నామనోనాయక ! నాప్రాణధనమ !
నాజీవితేశ్వర ! నాతపఃఫలమ !
మగువల కుండుసామాన్యపులజ్జ
యనయంబు నామీఁద నధికారవృత్తి
నెఱపుచునుండంగ నృపశిఖామణికి
నామనోనాయక ! నాప్రాణధనమ !
నీయున్కి, నీమన్కి, నీ స్వరూపంబు,
నీ నామవృత్తులు, నీ విలాసములు,
చిడిముడిపాటునఁ జెప్పలే నైతి ;
అటు చెప్పకుండినయంత నే మాయె
ప్రాణనాయక ! నీదుపావననామ
మనయంబు నాహృదయాంబుజమందు
శతసహస్రాధికసమదాళులట్లు
విరతినెఱుంగక విహరించుచుండె,
నీయున్కి, నీమన్కి, నీ స్వరూపమున
నీ నామవృత్తుల నీ విలాసముల
నైక్యానుభావంబు నందిననేను
విరహతాపమునకు విస్మృతి నొసఁగి

యతులితానందరసాంబుధిలోన
నీఁదులాడుచునుందు నేమియుఁ గనక—
అది మనోకల్పన మగు నంతె గాని
నిజముగా ననుఁగూడి నీ వుండలేదు
నను విడనాడితే నానాథ యనుచు
నంతరంగసమాధి నవ్వలఁ బెట్టి
కనుదోయి విచ్చి నేఁగనుఁగొనునంత
హృదయంబునకు సత్య మేర్పడఁదోఁచు,
నది తోఁచినంతనే యక్కటా! నాథ!
వివరింపఁగారాని విరహార్తి గుంది
నీకయి వెదకుదు, నిన్నుఁ గన్గొనక
చెలువల కుండినసిగ్గును వీడి
హానాథ! హానాథ! హానాథ యనుచు,
నను వీడిపోయితే నానాథయనుచుఁ
"ప్రాణనాయక నన్నుఁ బాసిన నేను
నిమిషార్ధమైనను నిలువంగఁగలనె?
నానాథ వేగమే నామొఱాలించి
నాప్రాణవాయువుల్ ననుఁ బాయువేళ
దగ్గఱఁ గావునఁ దడయుంగఁబోక
తలఁపులు మాని చింతాసముద్రమున
మునుఁగక మున్నె నామ్రోలను నిలిచి
నీప్రాణములలోన నిలుపుము వీని
కడసారి యిదె నిన్నుఁ గాంక్షించుచుంటి"
నని తలపోయుదు నావేళలందు—
ఒకమొగంబునఁ గన్ను లున్నపోలికను
నొకగుత్తిలోఁ బూవు లున్నపోలికను
నంటువాయక తిరుగాడెడుమనల
నేవిధి యీవిధి నెడఁబాపనోపె?
యక్కటా! యిది యేమి యనుతాప మయ్యెఁ

గంటికిఁ గంటికిఁ గడుదూర మయ్యెఁ
బూవులు గడు వాడిపోవఁగ నయ్యెఁ
జిత్తానుసంధులు చెదరఁగనయ్యె
భావాబ్ధి యీగాలివానకుఁ బొంగి
యధికసంక్షోభంబు నందఁగ నయ్యె
భూనభోంతరములఁ బొలుపైన తేజ
మాకస్మికంబుగా నడఁగంగనయ్యె
నక్షులుండియును గాఢాంధకారమున
దిక్కేది యూరక తిరుగంగనయ్యె
హృదయేశ ! హృదయేశ ! యిరువురిమధ్య
నీచిమ్మచీఁకటి యెం దుండి వచ్చె ?
నీ మహాంభోనిధి యెందుండి వచ్చె
నీ ప్రభంజనవేగ మెందుండి వచ్చె
నంధకారాంబుధి నాపెనుగాలి
నది యేమొ యొకబడబాగ్ని జనించె
నీ బడబానలం బెందుండి వచ్చె ?
హానాథ ! నాగుండె లదరుచునుండె
నిదియేమి ప్రళయమో యెఱుఁగంగనేర
నేమి గానుంటినో యెఱుఁగంగనేర
నీవెందు డాఁగితో యెఱుఁగంగనేర
నీ ప్రళయానల మే మైన నేమి ?
యీజగమంతయు నే మైన నేమి ?
యీజన్మమందు నే నేమైన నేమి ?
నాజీవితేశ్వర ! నాప్రాణధనమ !
నిశ్చలమూర్తి వై నీ వుండఁగోరి
నిఖిలదైవములకు నే మ్రొక్కుదాన ;
అక్కటా ! యిది యేమి యన్యాయ మయ్యె
హృదయేశ ! నీకంటె నీ జగమందు
దైవము నా కొండు తా నేమి గలదు ?

చిత్తవిక్షోభంబుఁ జెందిననాకు
భ్రాంతియై నీరీతిఁ బలుకుటగాక—
అడుగుఁదమ్ములక్రింది యవనీతలమ్ము
సకలేశ! యిది యేమొ! జాఱిన ట్లుండె,
నంతరాళములోని యమృతసరస్సు
హృదయేశ! యిదియేమొ యింకిన ట్లుండె,
నాహ్లాదకర మైన యతులతేజ
మాత్మేశ యిదియేమొ యడఁగిన ట్లుండె,
ముకుపుటంబుల నున్న మునిమునియూర్పు
లధిప! యి దేమొ! నేడాఁగున ట్లుండె,
నాదలపై నున్నయామిన్ను కూలి
ప్రాణేశ! నామీఁదఁ బడినట్టు లుండె,
నఖిల మీయెడ నేక మైనట్టు లుండె,
నఖిలము హరియించునట్లుగా నుండె
నట్టి యీవేళ నిన్నర్థించునేను
నవసానకాలంబు నందిననేను
నాథ! నావిలయంబునకు విచారింపఁ
గాని యవ్వల నేమి గలదో యటంచుఁ
దోఁచక యీరీతి దుఃఖించుచుంటి,
నెచటఁ బుట్టిననేమి? యె ట్లున్ననేమి?
భవదీయపాదసేవాభాగ్య మున్న
విభువరా! యదె పదివే లగు నాకు;
అట్టిసౌభాగ్యంబు నందుటకొఱకు
ఈ మహానుజ్ఞ నీ విచ్చుటకొఱకు
నంజలిపట్టి ని న్నర్థించుచుంటి
నామనోనాయక! నాతపఃఫలమ!
యట్టిదీవనల నా కమరంగ నిమ్ము,
కడసారి సెలవును గైకొనుదాన—"

---

శాంతిగీతము.

---

"కాంత ! నీ వేన్నృపాలశేఖరున కిపుడు
కమ్మ లిఖియించితో యట్టిక్ష్మాతలేశుఁ
డట్టినీప్రియుఁ డొకస్థాణువట్టు లిపుడు
విజనవనసీమ విజ్ఞానవికలుఁ డగుచుఁ
బడి కదలకుండెఁ దా నొకజడునిభంగి,
నక్కటా ! శక్తిఁబాసిన యట్టివాఁడు
చెలువ ! యేకాకి తా నేమిసేయఁగలఁడు ?
ప్రాణనాయిక ! నిను విడనాడినపుడె
నీవు నాకంటఁ బడకుండ నిలిచినపుడె
మామకమహాధికారసంపదల కెల్లఁ
జిటికలోనవె యిటు స్వస్తిచెప్ప టయ్యె
అస్మదీయమహాలక్ష్మి వైననిన్ను
నస్మదీయరాజ్యేందిర వైననిన్ను
నస్మదీయమహాశక్తి వైననిన్ను
నస్మదీయమనోభీష్ట మైననిన్ను
నస్మదీయమనోధన మైననిన్ను,
నస్మదీయైకజీవన వైననిన్ను
వీడినప్పుడె లోకంబు వీడుటయ్యె
నట్టియవతారమును వీడినట్టి నేను
అట్టియుత్సాహమును వీడినట్టి నేను
అట్టిక్రీడలవిడనాడినట్టి నేను
అట్టిభాగ్యంబు పోయినయట్టి నేను
ప్రేయసీ ! లోకపాలకబిరుదమునకు
నెట్టు లర్హతగలవాఁడ నింకమీఁద ?—
అతివ ! నీదు ప్రేమాంజలి యందుకతన
నంతరాళంబు కరఁగి నీ రైనకతన
నకట ! యొకభావ మీహ్లాదయాంబుజమునఁ

బుట్టి సాగరమట్టు లుప్పొంగుచుండె—
కాంత ! చెదరిన నామనశ్శాంతికొఱకు
దృఢతరం బైనయట్టి నీప్రేమకొఱకు
వేఱుపడి కానఁబడకున్న విశ్వరూప
మోహనం బగునీదివ్యమూర్తికొఱకు
సర్వమయి యగునామహాశక్తికొఱకు
దృఢతరం బగుసంకల్పదృష్టితోడ
జరగిపోవుచునున్న యోజనలతోడ
నీవు నేనుగ మఱి నేను నీవుగాఁగ
నద్వయానందసుఖముల నందుదాఁక
చిత్తమున నిట్లు కోరియాశీర్వదింతు—
“రమ్యతర మైనశుభ్రాంబరంబుఁ దాల్చి
పొలుపుమీఱెడు సూర్యచంద్రులను దాల్చి
ప్రవిమలములైన తారహారములఁ దాల్చి
సౌరభంబుల నొసఁగుపుష్పములఁ దాల్చి
భువనవిఖ్యాతకంకణములను గాల్చి
కడువిమోహన మగునలంకార మెసఁగ
మానితం బైన నునుమించుమేనితోడఁ
గలుము లీనెడునవ్వువెన్నెలలతోడ
రాజితం బైనకలకంఠరవముతోడ
నాదరంబున నెప్పటియట్ల వచ్చి
భవదనుపమానప్రకృతిప్రభావకలన
భవదనంతకృపాపాంగపాశములను
నన్ను బంధించి సామేన నన్నుఁ జేర్చి
జన్మజన్మంబు నిట్లె నాసకియవగుచు
మదవతీ ! శాంతిసుఖము నందెదవుగాక !”

బాలాంత్రపు వేంకటరావు.

---

లును, సమదవేతండశుండావితానచాంచల్య దానసన్నాహము లగుబాహువులును, జగదభయవితరణశరాసనాకర్షణపురస్సరణసంజనిత కీర్తిపుంజమంజిమపిశంకాకారి హీరకంకణాలంకృతప్రశస్తంబు లగుహస్తంబులును, విపులతరకవాటవిఘటనాతిదక్షంబు లగువక్షంబులును, సింహసంహననత్వయాథార్థ్య బోధావధాను లగుకౌనులును, జలభ్రమీవిభ్రమప్రదాయిగంభీరిమాభిశోభు లగునాభులును, నంతరీపంబుల నకూపారంబుల ముంపఁజాలు నతివర్తులాకృతిఘనంబు లగుజఘనంబులను, సకలభువనజలజనయనామానవప్రవిర్భేదనప్రోద్యమాన శిలికేలినీరమణపాణికీలితగదాయుధానుకారచారువు లగునూరువులును, సంతతస్పర్ధాధురీణతూణీరజాతానీతశరసంఘు లగుజంఘలును, నభినవప్రవాళమ్ముల నధ్యుషితసాలమ్ములుగావించు చంచదారుణ్యశరణమ్ము లగుచరణమ్ములును, మెఱియ సరయగమనంబులతో యాగభాగంబులకుఁగా మున్ననుశ్రుతచ్యవనజటిలధారేయు లగునాశ్వినేయు లన గాధేయు వెంబడి నడచు నభిరామలక్ష్మణు లగురామలక్ష్మణు లాత్మీయరామణీయకనిరీక్షణక్షణత్వరాసమారుహ్యమాణకాంచనప్రాసాదమంచోపరిప్రవేశ పౌరశాతోదరీనిశాతదృక్కోణరుచిగణవిసార్యమాణదరవికసదుత్పలపలాశవర్గం బగురాజమార్గంబు నంఘ్రితలకలితహలకులిశకలశతామరసచామరపతాకాతపత్రాది రేఖాంకంబుల నలంకరించునవసరంబున. 98

— * రాముఁడు శివునివిల్లు విఱుచుట * —

సీ. ఘనరేఖతో ఘనాఘనరేఖ చెలిగాఁగ మెఱుఁగుఁజామనిచాయమేనివాని
రాజీవపత్రేందిరాజీవదాయిగ దోయి నాఁ జనుకన్నుదోయివాని
రాకారమాసోదరాకారసౌందర్య మోముచక్కనిముద్దుమోమువాని
యుగలీల నిభహస్తయుగలీలలితరీతి కేలికయగు కేళికేలివాని
గీ. దరముచెలువంబుఁ దఱుముకంధరమువాని, నరరి నురరీకరించు పేరురమువాని
రాము సౌమిత్రిమైత్ర్యభిరాముఁ జూచి, పౌరులు భజించి రక్షిసాఫల్య మపుడు.

మ. పాలయుల్క న్మడిగొన్నభూమిజనతద్భ్రూవల్లిచే మారచా
పలతాటంకృతి దోఁప రాముఁ డది సైఁపం జాలియో శూలిబ
ల్విలు మోపెట్టి తదీయ భంగసమయావిర్భూతనాదార్తి దై
త్యులఁ దార్ప న్మునివెంట నేగె నిమివంశోత్తంసునాస్థానికిన్. 100

గీ. ఏగి తనరాక విని మున్న యెదురుకొన్న, జనకునిసపర్య గన్న యామునులమిన్న
కన్నుసన్నఁ దదానీతకార్ముకం బు, తండు గీలించె డాకేల బెండులీల. 101

మ. (1) ధనువంశం బది విష్ణునంశ మగునాధానుష్కధౌరేయుచే
మనువంశంబుగలిగెన్ గుణోన్నతి వహింప న్నోఁచి యంత న్విదే
హనరేంద్రాత్మజమానసంబుక్రియ వేగాకృష్ట మై లేఖలో
కనికాయారిమదంబు కైవడి విభగ్నం బయ్యెఁ జిత్రంబుగన్. 102

సీ. ప్రతిపక్షవిక్షోభశితపక్షవిక్షోభకరుణాంబుదకదంబగర్జ యనఁగ
భుజమందిరాసాది విజయేందిరాదాన సమయపుణ్యాహఘోషం బనంగ
మహికుమారీకరగ్రహణసంఘటిత మాంగళికసంగీతమాఖరి యనంగ
నాసురాన్వయజిగీషాసముద్యతమహాప్రస్థాన భేరికార్భటి యనంగఁ
గీ. జండకరవంశమండనోద్దండబాహు, దండకృతమండలీకార ఖండితేందు
ఖండకోటీరకోదండకాండరవ మ,జాండభాండంబు గుమ్మని నిండికొనియె. 103

క. జనకుం డంతట రఘుపతి,కిని సీతకుఁ బెండ్లి సలుపఁ గృతనిశ్చయుఁ డై
తనుఁ బిల్వఁబంప మిథిలకుఁ, జనుదెంచెం బఙ్క్తిరథుఁడు సమనోరథుఁ డై. 104

సీ. కననోఁచుతిలక మెవ్వనికీర్తి నప్సర స్తోమసంగీతగోష్ఠీముఖంబు
తలిదండ్రు లనుబంధములకుఁ బాలయ్యె నెవ్వానిచేఁ బరతత్త్వ మైనవేల్పు
మనియె రాజన్వతి యనఁగ నెవ్వనివంక మున్నీటిమొలనూలి ముద్దరాలు
దురమునం దరిజాతదుర్దశ విడుచు నెవ్వని కేతుదశచూచి వజ్రపాణి
గీ. అట్టియజుపట్టి కెదురుగా నరిగి పురికిఁ, దోడుకొని తెచ్చి రతనపుదొడ్డనగ రొ
కటి విడిది చేసి తలఁప శక్యంబు గాని, యులుప వట్టించి నిమివంశతిలకుఁ డంత,

మ. అనుజుం డైనకుశధ్వజున్ జితసుధన్వావాప్తి సాంకాశ్యప
ట్టనరాజుం బిలిపించి యాఘనుఁడు తోడన్ రా నయోధ్యాధినే
తనికేతంబున కేగి యున్నయెడ మార్తాండాన్వయాచార్యుఁ డి
ట్లను బాంధవ్యకథానుబంధమధురవ్యాహారధౌరంధరిన్. 106

మ మను విక్ష్వాకు భగీరథుండు రఘువు న్మాంధాతయు న్మున్నుగాఁ
గ ననేకు ల్గలరే కదా రవికులఖ్యాతుల్ నృపుల్ తత్ప్రసి
ద్ధి నవీనోన్నతిఁ దాల్చు పఙ్క్తిరథుఁ డిద్దివ్యోపకృద్ధన్యక
న్ననతిశ్లాఘ్యులు రాముఁడున్ భరతుఁడున్ సౌమిత్రులున్ భూవరా. 107

---

(1) ధనుర్వంశ మనుట కిది యపప్రయోగము.

ఉ. ఈవనజాతబంధుకులుఁ డీనిమివంశ్యునితోడి బాంధవ
శ్రీవచరింపఁ జూచుట శచీధవుఁ డీశుఁడు వీయమందిన
ట్లై వెలయించు నింకఁ గన నానగభేదనశక్తి రామునం
దావహిలు న్మహీదుహితయం దగు నింద్రజయానుకూల్యముల్. 108

ఉ. వింట గుణంబు గూర్చి రఘువీరుఁడు పంటవలంతి గన్నవా
ల్గంటిఁ బరిగ్రహించుక్రియ లక్ష్మణుఁడు న్నిజకీర్తిసంపద
న్వింటికి సద్గుణాప్తి యొదవించుటఁ జేసి వరించుఁగాక నీ
యింటనుమించుమించుహసియించు నిభోర్మిళ నూర్మిళ న్నృపా. 109

క. భరతుఁడు శత్రుఘ్నుండును, వరియింతురు భవదనుజభవల మృదులవచ
స్సురభిలకాండవి మాండవి, ధరణీశ్రుతకీర్తి యనఁగఁ దగుశ్రుతకీర్తిన్. 110

— * శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులవివాహసన్నాహము. * —

గీ. అని వసిష్ఠుఁడు తనయోపయామలగ్న, నిర్ణయ మొనర్ప సాకేతనేతవిడిది
వెడలి నిజగేహమున కేగి వీడలంక, రింప మిథిలేశ్వరుండు సాటింప నపుడు. 111

చ. అలికిరి కస్తురిన్ గృహము లన్నియుఁ గుడ్యము లెల్లఁ గుంకుమం
బులు గొని పూసి రెల్లకడ మ్రుగ్గులు వెట్టిరి క్రొత్తముత్తియం
బుల మఱి వీథివీథులను బూన్చిరి పచ్చలతోరణంబు లి
చ్చెలువునఁ బట్టనంబుఁ గయిసేసిరి పౌరు లనేకవైఖరిన్. 112

చ. తొగచెలిజాతిజోతి హిమతోయముఁజిల్కఁ గిరీటిపచ్చతా
నిగనిగ లల్క ముత్తియపునిగ్గులు మ్రుగ్గులు వెట్ట దట్టపుం
బగడపుఁజాయ జాజు నినుపం గనుపట్టు విదేహరాజు హా
న్నగరునకుం బరిష్కరణనాటిక లేటికి మాటిమాటికిన్. 113

— * మంగళస్నానవర్ణనము. * —

వ. అనంతరం బంతరంగసంగతానందుం డగుశతానందుండు పరిణయోచితా
భ్యుదయకాలికకరణీయంబు లాచరించి పంచశరవీరసంచాలిత సువర్ణపాంచా
లికల పోలికల మేలికలం గీలుకొను జనకజాదిబాలికలం గైసేయుం డనినఁ
దదీయాలిక లగువిధుకలాలికలు లాలికలగుచుఁ దోలుదోలుత జగతీకుమారిం
గూరిమిం జేరి రయ్యెడ. 114

సీ. సిరసంటె జవ్వాజిచే నొక్క మృదుపాణి జలకమార్చె నొక్క జలదవేణి
తడియొత్తె జిలుగుపావడచే నొకమిటారి కట్టె నంశుక మొక్క కంబుకంఠి
ననదండ నిడుకీల్జడను జుట్టె నొకబోటి దిద్దెఁ జిత్రక మొక్క ముద్దుగుమ్మ
యలఁదె గంధము నొక్క హరిచందనామోద తొడిగెఁ గంచుళి నొక్క పడఁతిమిన్న
గీ. తీర్చెఁ గాటుక నొక్క యిందీవరాక్షి
మెత్తె లత్తుక యొక్క చాంపేయగంధి
పూన్చె మణిభూషణము లొక్క పువ్వుఁబోఁడి
చూపె ముకురంబు సతి కొక్క సొబగులాఁడి. 115

క. సతు లట్లూర్మిళ మొదలగు, లతకూనల కతులమంగళస్నానాలం
కృతు లొనరిచి హిమభూభృ, త్పతిసుతకడ నిలిపి రంత దశరథునగరన్. 116

మ. అలివేణు ల్రఘుసూను మాంగళికపీఠాసీనుఁ గావించి ము
న్నలికంబందు శుభాక్షతంబు లిడి కల్యాణీజను ల్శోభనం
బులు వాడ న్నిగఁ జుట్టియున్న తళుకుంబొందాయెతు ల్వీడ్చి కుం
తలము ల్దువ్వి తలంటి రింపుగులుక న్సంపంగితైలంబునన్. 117

గీ. మలయజోద్వర్తన మొనర్చి మరకతంపుఁ, గొప్పెరల వాసనజలంబుఁ గుందనంపు
బిందియలఁగొందఱందీయనిందుముఖులు, జలకమార్చిరి మనువంశతిలకమునకు.

సీ. కలువరాజిగిమిన్న చలువ దువ్వలువచేఁ దడి యొత్తి రధికసౌందర్యనిధికి
వలిపె హొన్నంచుదోవతియు సౌవర్ణాంబరముఁ గట్ట నొసఁగిరి రాఘవునకు
పరువంపుపిరవాదివిరిసరు ల్చికురబంధమునిండఁ జుట్టిరి దాశరథికి
ఘనసారహిమవారికలితకుంకుమపంక మలఁదిరి తరణివంశాబ్ధిమణికి
గీ. మకరకుండలకేయూరమకుటహార, కాంచికాదామకటకోర్మికానికాయ
గండపెండార*ముఖపరిష్కారనివహ, మువిదలు ఘటించి రఖిలదేవోత్తమునకు.

మ. కలకంఠీమణు లీగతి న్రఘుపతిం గైసేసి యాళీవి మాం
గలికాభ్యంజనమజ్జనాచరణలం గైసేయఁ బాటీరపం
కలతాంతాభరణానుకారితచలత్కల్పావనీజాతరీ
తులఁ గావించిరి లక్ష్మణున్ భరతు శత్రుఘ్నున్ బ్రమోదంబునన్. 120

చ. పరికరచారులీలఁ గనుపట్టెడు పెండ్లికొమాళ్ల కంబుధీ
శ్వరుసతి యింద్రురాణియు నివాళికి నెత్తు పసిండివెండిప

---

* గండపెండారము. ఈ తెనుఁగుపదము సంస్కృతసమాసమధ్యమున నిముడ్పఁబడినది. దీని సాధుత్వము చింత్యము.

ళ్లేరముల రేఖఁ దత్సమయ శేఖవిరోధివిదారిదోర్యుగ
స్ఫురదరిపాంచజన్యముల పోల్కి రవీందులు దోఁచి రంతటన్. 121

సీ. పంచధానిరవద్యభద్రవాద్యవితాన మానందముఖరాబ్ధి ననుకరింపఁ
గరదీపికాకోటి ఘనతరతారకావటలీవిలాసమ్ము పరిఢవింపఁ
బాదచారినరాధిపకిరీటసందోహ మబ్జకోరకభావ మభినయింప
మౌక్తికచ్ఛత్రచామరదామరచ్ఛాయ కౌముదీరేఖ వైఖరిఘటింప

గీ. గురుకవిబుధానుసరణి సోదరులు దెలుప, నెక్కి నగజంబు గగనంబు నెక్కఁ గొలువ
నయనపర్వదరుచిసాంద్రుఁడయిన రామ, చంద్రుఁడేగె విచ్చైజనకుమహాజారమునకు.

చ. ఇనకులుఁ డాహజారమున నేనుఁగు డిగ్గి యనుంగు మంత్రిసూ
నుని కయిదండ గైకొని తను న్నిమివంశవరుం డెదుర్కొనన్
మినుకుటొయారిపాదుకలు మెట్టి నివాళి మిటారు లెత్త శో
భనపువితర్దిఁ జెంది మధుపర్కము నంది వసించు నయ్యెడన్. 123

ఉ. మేను తళుక్కు రంచుఁ దొలుమించునడం జనుదోయి రాయిడిం
గా నసియాడ నందియలు గల్లనఁ గేల్జడ పార్శ్వరంగసీ
మానటియై రహింపఁ దెరమాటునకున్ మరుదంతి నీటునన్
జానకి వచ్చె నెచ్చెలులు సందడిఁ గ్రమ్మ నొయారి నెన్నడన్. 124

క. శతపత్రహితాన్వయవి, శ్రుతునకు "నారాయణస్వరూపవరాయ
ప్రతిపాదయామి తే" యని, సుత జనకుఁడు దారవోసె సూనృతసూక్తిన్. 125

గీ. రతియు మదనుండుఁ బ్రణయవిగ్రహముఁ బూని
యుత్పలపయోజశరము లొండొకరిమీఁద
నేయుక్రియ జానకీరాఘవేశు లప్పు
డిరువు రొనరించి రన్యోన్య వీక్షణములు. 126

మ. తనక్రేఁగంట, రహించు తుంటవిలుతున్ దండించె నేయుగ్రుఁ, డా
యనవిల్ ద్రుంచితి వెంత జోద వనుచున్ హర్షించి వైదేహి రా
మున కచ్చోఁ దలఁబ్రా ల్నెపంబు దొలఁక న్ముక్తాభిషేకం బొన
ర్చె నుదంచధ్వనిఁ గంకణంబులు ప్రశంసింపం గృతజ్ఞత్వమున్. 127

క. అంగజశంఖజయశ్రీ, కిం గట్టుదుఁ బట్ట మనెడు క్రియ నాసీతా
శృంగారిణికంఠంబున, మంగళసూత్రంబు గట్టె మనుకులుఁ డెలమిన్. 128

గీ. కడలిగట్టుపనికి గరిడిసాదనవీరి, కిది యటంచుఁ దజ్ఞు లెంచుకొనఁగ
జనకరాజకన్యయును రామభద్రుండుఁ, గట్టి రధికమైత్రిఁ గంకణములు. 129

చ. తెలిగనుదోయి చెందొగలతీరుగఁ దాంతవతంసితాసితో
త్పల యగుహైమధామ్య పయిఁ బర్వ ఘనంబున నత్తమిల్లు న
త్తొలుకరిమించు మించునలతొయ్యలి దోయిట నుంచి నించులా
జలు వడగండ్లు గాఁగ శిఖిచాలె శిఖావళితో నటింపఁగన్. 130

చ. తనకులకర్తమిత్ర మగుతామరచెల్వు హరించుకొన్న ప్రము
చ్చున కతిరోహితత్వ మిటు చొప్పడునే యని పట్టుకొన్నపో
ల్కిని మిథిలాధినాథసుతకేల్నిజపాణిఁ బరిగ్రహించె న
య్యినకులసార్వభౌముఁడు సమృద్ధతరప్రణయాభిరాముఁడై. 131

మ. నగము న్మన్నుగఁ దన్ని క్రొన్ననలు వ్రానం జేయునీయంఘ్రి డా
య గరీయం బగుఠాయి తా నలరుటే యాశ్చర్య మంచు న్సఖుల్
పొగడ న్సిగ్గు వహించుభూమిజపదంబు న్రాఘవుం డంటి గో
ళ్లగుమిం బువ్వగమిన్ భజింప సనెకల్మటించె హస్తంబునన్. 132

క. మింటం దోఁచునరుంధతి, యింటన్మెలఁగెడు పురోధ కిల్లాలఁట క
న్గొంటిమి తత్సతి నున్నతి, గంటి మనుట యెంత వింత కాకుత్స్థులకున్. 133

గీ. అమరనగకోటి యైనఁ బర్యాప్త మాధ, నాంబర వితీర్ణికా వివాహంబునం ద
నంతకళ్యాణగుణహేతు వైనరాము, సన్నిధిమహోత్సవం బట్లు సాగెఁ గాక.

ఆ. లక్ష్మణు లగునూర్మిలాలక్ష్మణులలోభ,రతులు మాండవీభరతులు నఘవి
జఘ్నులు శ్రుతకీర్తిశత్రుఘ్నులునునట్లు, పరిణయార్హకృతులు జరపిరంత. 135

మ. ననఁబోణుల్ రతనంపుఁ బళ్లెరముల న్శాల్యోదనం బొల్పుఁ బ
ప్పును శాకంబులుఁ బిండివంటలు ఘృతంబుం బాయసం బానవా
లును బచ్చళ్లు రసావళుల్ దధి మొదల్బువ్వం బమర్పంగ భో
జనము ల్బంధుజనంబుతోఁ జలిపి రైక్ష్వాకు ల్సభార్యాకులై. 136

చ. హరిహయవిస్మయావహరమాధికుఁ డాజనకుండు ముద్దుఁ గూఁ
*తురుల వివాహము ల్జనతతు ల్గొనియాడఁగ నిట్లొనర్చి య
ల్లుర కరణం బొసంగె హరులుం గరులు న్రథము ల్ధనమ్ము లా
భరణము లంగనామణులు పట్టుపరీమళవస్తు లాదిగన్. 137

* తఱచిక్కవి యిట్లు ప్రయోగించుచున్నాఁడు.

గీ. ఈగతి విదేహపతియింటఁ గృతవివాహు, లైనతనయులతోఁ గూడ నతనివీడు
కొని దశస్యందనుం డంతఁ దనదుపురికి, నడచునెడ నొక్కనాఁటి పైనంబునందు.

సీ. తను వెల్ల నిండి యాదలకు నెక్కిన రౌద్రరసము కైవడి జటారాగ మమరఁ
జేఁజిక్కి కృశియించు రాజన్యయశము వైఖరి జపస్ఫటికాక్షసరము దనర
నగభేది యనెడు చిహ్నంబుఁ దెల్పెడి జాడ గండగొడ్డలి భుజాగ్రమున మెఱయ
మరు గెల్చి యావీరవరు విల్లఱుత వైచికొనినట్లు జందెంబు కొమరు నెఱప
గీ. హరకుధరశృంగతుంగవంశాగ్రరంగ, నానటత్కీర్తినర్తకీనటనపటిమ
వర్ణనోదీర్ణతద్గృహద్వార్గవుండు, మార్గమున కడ్డమై తోఁచె భార్గవుండు. 139

గీ. తోఁచుటయు గుండె కడుఁ బాచుపాచుమనఁగ
భృగుసుతుఁ డమందగతిధుర్యుఁ డగుట గనియు
వినియు నెక్కడి సడివచ్చె వీఁ డటంచు
దిగులుపడి పఙ్క్తిరథుఁడు చింతింపఁ దొడఁగె. 140

శా. ఈడో యేమి లలాటనేత్రుఁడు నహా యీధన్వితోడన్ గుహ
వ్రీడాదాయి భుజాబలుం డితఁడు ముక్ త్రిస్సప్తకృత్వోరణ
క్రీడాకృత్తరిపుక్షమాధిపవపుఃకీలాలవారాశి నీ
రేడాఱొక్కతరాలవారలకుఁ దా నీఁడా నివాపాంజలుల్. 141

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నిపు డీముంగోపి కేనుంగుతోఁ
జెల్లాడం జనుబాలులీల నితనిం జేష్టించినం గీడు వా
టిల్లుం గా దని వేఁడుకొన్న మదిఁ జండించుం గదా వీనికిం
దల్లిం జంపిన దుండగీనికి దయాదాక్షిణ్యము ల్గల్గునే. 142

శా. ఐన ట్లయ్యెడుఁగాక వేఁడుటయ కార్యం బంచు నర్ఘ్యాదిపూ
జానిర్మాణ మొనర్చుపఙ్క్తిరథభూజానిం గటాక్షింప కో
హో నారి స్మదనారిధర్మమునకు న్యోజించినాఁ డెవ్వఁడో
వానిం జూతముగాక యిప్పు డని గర్వగ్రంథియై ముందటన్. 143

చ. నిలిచిన భార్గవుం గని మునిప్రవరుం డని తేరు డిగ్గి యం
జలియొనరించు రాఘవు నిశాటకులద్విపఝాటకూటపా
కలశరబాణలాఘవుని గన్గొనని గ్గరుణాబ్జపత్రబా
హ్వాళిఁబచరింపఁ జూచి తలయూఁచి యతం డతిచండిమోద్ధతిన్. 144

శా. నీవా రామసమాహ్వయుండవు ? జను ల్నిన్నేకదా మన్మ్యర
జ్ఞావై చక్షణి భీరువుం చురములో ఖండించినాఁ డందు రో
రీ విశ్వాధికధర్మనిర్మథనపారీణప్రచారుండవై
నా పై వెక్కడి రాచబిడ్డఁడవురా నారీతనుత్రాన్వయా! 145

చ. శివు దృఢముష్టిచే నొగిలి శ్రీహరికోపరసాబ్ధిమగ్నతం
జవికినప్రాఁతవి ల్లొకటి సద్మమునం దిడికొన్న మీావిదే
హవిభుఁడు దాని నెక్కిడుట యాత్మజఁ గోరి యొనర్ప నిప్పుడా
చివుకుచిదారపుంధనువుఁ జీల్చుట కింత మదింప నేటికిన్. 146

శా. నీలా విందునఁ గాననయ్యెడు మదానీతోగ్రచాపంబుఁ గెం
గేలం గైకొని మండలీకరణశక్తిం జూపెదే యంచు వీ
రాలాపంబు వచింప నారఘువరుం డావిర్భవన్మందహా
సాలోకంబున సన్నసేయుడు సుమిత్రానందనుం డి ట్లనున్. 147

మ. జననీకంఠవిలుంఠనాచరణమో శస్త్రాస్త్రభృద్బాహ్వావ
ర్తనమో మత్తనిశాచరీవధ మఘత్రాణంబు లుగ్రస్ఫుర
ద్ధనురాకర్షణనైపుణంబును మహత్త్వం బై విజృంభింప ని
మ్మనువంశప్రభవాగ్రగామి యగురామస్వామికిన్ భార్గవా ! 148

శా. ధానుష్కోన్నతి చెప్పఁదీరునె మునీంద్రా మేరువో మందరం
బో నీచాపము దాని బైసియు నిఁక న్మోపెట్టఁగాఁ గాననో
నే నింతే మది కింతలోఁ బదటమా యీావట్టి యాద్ధత్యమే
లా ని న్విప్రత చూచి కాచితి దురాలాపంబు చాలింపుమా. 149

చ. అనుఁడుఁ బరశ్వధాయుధుఁ డహంకృతిఁ జేతికి నిచ్చినట్టి వి
ల్లనకడకంటిచాయ మణిధన్వత గన్పడ నెక్కు వెట్టి సం
జనితగుణధ్వనిస్తనితసంగతి నొప్పె ఘనాఘనంబు పో
ల్కి ని నరపుంగవుండు నరలేఖశిఖావళకోటి రంజిలన్. 150

క. భజియించిరి నమ్రత్వం, బజతనయ తనూజ భుజసమర్పితగుణులై
త్రిజగన్నుతి గలభృగువం, శజనిం దగు చాపదండ జమదగ్నిభవుల్. 151

క. ఋజు వగుచాపము వక్రత, భజియించుట వక్రుఁ డైన భార్గవుఁ డెంతే
ఋజుతం గనుటయు భరతా, గ్రజయుగపత్పాప్త గుణతశతమునఁ గాదే.152

గీ. మునితిలకుఁ డంతట నమోఘ మనుకులీన, మార్గణ నిరుద్ధ సౌవర్గమార్గుఁడయ్యెఁ
దద్గతిక్షణవిఘ్నకృత్యమునఁ దోఁచు, ఫలము చేసేత ననుభూతి సలిపె ననఁగ.

వ. అంత సంక్రాంతం బైనజామదగ్న్యశక్తి సంపత్తిచే సంపన్నుండును పన్నగ పరిబృఢ భోగసాభోగ భుజాభిరాముండు నగు రాము నాలింగనంబు సేసి మూర్ధంబు నాఘ్రాణించి దశరథుండు కరితురగపురస్సరరథుం డై పరిఘయుం బలెఁ బరిసరంబున ప్రవహించు సరయూతరంగిణిచేఁ బరీతం బగు సాకేతంబును సదారు లైనదారకుల సాదరంబుగా నవలోకించు పౌరపురంధ్రుల నీరంధ్రిత గవాక్షంబు లగుకటాక్షంబులచేఁ బింఛాతపత్రాయమాణ ధవళాతపత్రుం డగుచుం బ్రవేశించె. 154

ఉ. సారతరత్రపాభరవశంబున గూఢమనోజవిక్రియా
భారవిశేషలా జనకపార్థివకన్యలఁ గూడి సంతత
స్ఫారసుఖానుభూతి గను పఙ్క్తిరథాత్మజులన్ భజించె శృం
గారము యౌవనస్ఫురదగారము ధీరనుతప్రచార మై. 155

మ. కుటిలారిద్విరదావళీవిదళనక్రూరాసి*పారీంద్ర కై
యటకౌమారిలకాపిలాది బహుశాస్త్రాభిజ్ఞ ఋగ్వేదివేం
కటనారాయణసత్కవిప్రముఖసంఖ్యావత్స్వరాళిచ్ఛటా
పటువాగారభటీవిభాసురసభాపద్మాకరాహస్కరా! 156

క. అనుదినసురభిస్రక్ఛం, దనఫలదానక్రియాభినందితనానా
జనపదవసుధానిర్ఝర, వినుతకళాభోజరాజ విభవబిడౌజా! 157

మాలిని. మదనజనకరూపా మంజుధర్మానులాపా!
వదనవిజితచంద్రా వైభవశ్రీమహేంద్రా!
పదనతరిపురక్షా పండితోద్యత్కటాక్షా!
కదనజయధురీణా గానవిద్యాప్రవీణా! 158

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాద సమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకర సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతంబైన చంపూరామాయణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ఇది బాలకాండము.

---

* పారీంద్రము = పాము-సింహము.

శ్రీరస్తు.

# చంపూరామాయణము.



## చతుర్థాశ్వాసము.

— • అయోధ్యాకాండము. • —

క. శ్రీవెల్లంటికులాధిప, సౌవస్తిక విప్రభక్తిసంపన్నమనీ
షావిర్భావ నిషేవిత, కావేరీన్నపాలచంద్ర కసవనరేంద్రా. 1

చ. పరదురవాపబాహుబలభాస్వరుఁ డుత్తరకోసలావనీ
శ్వరుఁడు శచీశ్వరుం డెగడువైభవ మొప్ప ధరిత్రి యేలుచున్
భరతుని లక్ష్మణావరజుఁ బంచె ముదంబునఁ గైకయీతలో
దరికి సహోదరుం డగుయుధాజిదిలాధిపురాజధానికిన్. 2

— • దశరథుఁడు రాముసకుఁ బట్టాభిషేకము చేయఁ దలఁచుట. • —

శా. అంత న్విశ్వభరస్వయంవహభుజోదంతు న్విదేహాత్మజా
కాంతుం గోసలమాత్రధాత్రికిఁ బతిం గావింప రా జాత్మలోఁ
జింతించెన్ జగమెల్లఁ దాల్పఁగల శేషేగట్టువజ్రీని నై
కాంతస్తంభధురంధరత్వ మొనయించంబూనుచందంబునన్. 3

క. చింతించి తనదుకోరికి, మంతుల కెఱిఁగించి గురుసమానసయశ్రీ
మంతు లగునాగరకధీ, మంతులఁ బిలిపించి పలికె మధురతరోక్తిన్. 4

సీ. ఆచక్రవాళక్షమాచక్రధౌరేయు లాజన్మశుద్ధవృత్తానపాయు
లాచండకిరణాజహదఖండభుజశౌర్యు లామనుస్థిరతరన్యాయధుర్యు
లాపురందరగోపకోపపాదితవార్తు లాబ్రహ్మభువనవిఖ్యాతకీర్తు
లాస్థాణునారాయణాస్థానమృతదాను లాకకుత్స్థపరిస్ఫుటాపదాను

గీ. లైనమాపెద్దలచరిత్ర మతివిచిత్ర, మనుచుఁ గొనియాడుకొనఁ జెల్ల దందు కెల్ల
షష్టిసాహస్రకములు మజ్జనకు వెనుక, రక్షణముగన్న మీరెపో సాక్షు లెన్న. 5

క. వేదము మీయంగీకృత, వాదము లోకత్రయాని వారితనిజమ
ర్యాదము గావున నది యాఁ, గాదనరు గదా నిజంబు గాఁ దనరుఁ గదా. 6

సీ. దోషాచరీహారదూరీకృతిఘటించు నతిరథత్వమునను నాఁప రాక
ఖలనృపాలకళత్ర ఘనసారచర్చఁ బోనిడు హేతివాడిమి నడఁగఁబోక

వైరివీరముఖేందువైవర్ణ్యరచనానిదానోగ్రసేనకు లోనుగాక
యాచకశ్రేణిదైన్యంబు వెల్వెలఁబాటు హరియించు ధనముచే హానిలేక
గీ. తేఁటి లేబోఁటిగమికిఁ బూఁదేనెసోన, విందు సవరించువికచారవిందవాటి
నింపుపున్నమనాఁటివెన్నెల యనంగ, నెరసె జర మేన సిరసును నరసె మాకు. 7
ఉ. కాన భవన్మతం బగునొకానొకపల్కు వచింతుఁ బార్థివో
ద్యానవినాశకృత్పరశుధారు జయించినవీరు సజ్జనా
ధీనవిహారు మేరుగిరిధీరు మదగ్రకుమారు నే నిఁకన్
భానుకులాధిరాజ్యమునఁ బట్టముగట్టి వహింతు నూఱటన్. 8
మ. అనుసీతాదయితాభిషేచనకరవ్యాహార మారాజసిం
హునివంకన్ విని నాగరోత్కరము వర్షోద్యోగజాగ్రద్ఘనా
ఘనఘోషశ్రవణక్షణాకలితకేకానిక్వణోత్సేకకే
కినికాయంబుగతిం బ్రమోదనినదాకీర్ణాఖిలాశాంత మై. 9
క. వనజోద్ధతమధునిభవ, క్త్రి నటన్మోదాశ్రు వయ్యె రఘుపతినభిషే
చనబహుగుణితద్యుతి గనుఁ, గొనుటకుఁ గనుదోయి గడుగుకొనియెడుభంగిన్.
మ. మనువంశాగ్రణి జాగ్రదగ్రసులసత్సామ్రాజ్యగమప్రాజ్యమ
జ్జనసంమర్దజ భూరజఃపరిజిహీర్షాచుంచురోమాంచకా
యనికాయప్రకృతివ్రజద్విగుణజాతానందమున్ డెందమం
ద నిగూహించుచుఁ బల్కె నాప్తసచివోత్తంసాళితో నత్తఱిన్. 11
ఉ. నే మవనప్రసక్తి నవనిన్ భరియింప నిదే మొకో జన
స్తోమము శైలజారమణజూటవిటంకసుధాంశుధాము శ్రీ
రాము నఖండ మండలధురంధరుఁగా గణియించి నించెఁ గా
మామది కద్భుతం బనుచు మంత్రులు పల్కి రుదారచాతురిన్. 12
ఉ. ధారుణి నావరించి యవదాతయశోనిధు లైనమీర లు
న్నారె కదా జనౌఘమయి నారఘునాథు శరణ్యుగా మదిన్
గోరకయున్నె యూరక చకోరక మాఁకలిగొన్నచో విధుం
జేరక చేరునే యమృతసింధువుఁ దజ్జనకత్వబంధువున్. 13
క. అనియెడు మంత్రులుఁ దారు, జ్జనులపుడు వసిష్ఠశాసనంబున నభిషే
చన సంభారాహరణం,బునకుం దర్వపడఁగ నృపతిపుంగవుఁ డంతన్. 14

గీ. రాము వినయాభిరాము సుత్రామసదృశ, ధాము రావించి యోవత్స తావకీన
మౌళిమకుటంబుఘటియింపమామనసు య,తిష్యమాణంబు రేపటితిష్యమందు.

చ. అని నియమించి పంచినయజాత్మజుయత్నము కోసలేంద్రనం
దన కెఱిఁగించి యాత్మసదంబునకుం జనుదెంచి యున్న య
జ్జనకసుతాసహాయుకరసారసమున్ భృతికౌతుకంబుగా
నొనరిచెఁ దత్పురీజనులయుల్లమురీతి వసిష్ఠుఁ డంతటన్. 16

మ. రఘురామోదయవార్తఁ దోఁచు జనహర్షశ్రీలకున్ గేహగే
హఘనానద్ధముఖానవద్యబహువాద్యశ్రేణు లాశాంతరా
లఘుదంతావళకర్ణతాళపరిఖేలం గాంచు నా దావహి
ల్ల ఘటించెన్ భువనత్రయీమకుటిపై లాగెత్తునౌద్ధత్యమున్. 17

— * కైక రెండు వరము లడుగుట. * —

చ. హరిహయకంటకాన్వయలయావహవైఖరి కెల్లమైన క
ల్లరి మదిరీతి మేను కుటిలమ్ముగఁ ద్రిమ్మరు మాయదారి మం
దర యనుజంత శాంతభరితం బగుకైకమనంబు దివ్యపు
ష్కరిణి విశుద్ధవారి వనకాసరి వోలెఁ గలంచె నత్తఱిన్. 18

మ. పటుఝంఝానిలవేష దోష ముదయింపన్ శీతలాంభోధర
చ్ఛటదంభోళిజనించినట్లు జనతాసౌఖ్యాపహృన్మందరా
కటువాక్యార్భటి నుద్భవించె భరతుం గన్నట్టికైకేయియం
తటిసీమంతవతీశిఖామణిమతిన్ దౌర్జన్య మత్యున్నతిన్. 19

శా. ఆశాతోదరి మందరారమణి దయ్యంబో యనం జిత్తమా
వేశింపన్ మును వైజయంతనగరోర్విన్ శంబరానీతబా
ధాశాంతిం బతివంకఁ గాంచినవరద్వంద్వంబు నావేళ యం
దాశించెన్ భరతాభిషేకరఘువర్యారణ్యచర్యాకృతిన్. 20

ఉ. కైకయి వేఁడుతద్వరయుగంబు నిశాతశరాకృతిం జెవుల్
సోఁకి తపింపఁజేయ మదిలో నిలఁజాలక దావపావకా
లోకము చుట్టుకొన్న వనిలోపల నుండి బహిర్వినిర్గమ
స్వీకృతి గాంచు నేణిగతిఁ జేతన వోఁ దలిమోపరిస్థలిన్. 21

గీ. వ్రాలి తెప్పిఱి నరపాలమౌళి దా న, సత్యభయశీలి గావున జాలిగొలుపు
నాలి నీలితనాన కొనసఁగఁజాలి, సోలి సుతుమాలిమికి నాగయాలిఁ జూచి,

గీ. జాయమానస్థిరాకీర్తి జాయ మాన, వేమి నీసుతుఁడా రాజ్య మేలు మేలు
కౌతుకముఁ బన్నితిలకు నకౌతుకముగఁ, గౌతుకము*రాము వెడలని కౌతుకంబు.

క. అపరీతరామ మగుతఱి, విపరీతము గాకపోదు విధికృత మగునీ
యుపయమవైభవ మిపుడా, యుపయమవైభవ మొనర్పనున్నది యనుచున్.

చ. అతివ నిరర్గళస్మితవదానన యై కితవాత్మనీన వాం
ఛితవరపూర్తికిం బతివశీకృతిఁ బూన్చుచు నమ్మచెల్ల యా
శ్రితము నిరాకరించుటకుఁ జూచెద వేమనవచ్చు నింక ని
శ్రితము వివేకపాకమును సూనృతమున్ మనువంశవల్లభా. 25

మ. తనమే మాంసము గోసియిచ్చిన కపోతత్రాణశీలిన్ శిబిన్
వినవో యాశ్రితవిప్రశేఖరునకున్ నేత్రప్రయుం డైనథ
న్యు నలర్కాహ్వయు నాలకింపవొ వదాన్యుల్ దప్పిరే బాస ద
ప్పినఁ బాథోలిపిఁ జేసె దుక్తికృతమున్ బృథ్వీశు లూహింతురే. 26

మ. అకటా యాడినమాట చెల్లుబడి సేయంజూడు మారీతిఁ జ
ల్పక కౌసల్యమనోరథంబె ఘటియింపం బూనినం డాళుకో
నె కదా నేనిఁక దారుణాగ్నిశిఖఁ గానీ నీటఁ గానీ కృపా
ణికఁ గానీ గరళంబుచే నయినఁ గానీ ప్రాణ మొప్పించెదన్. 27

ఉ. నావిని యీవినాదయవు నాదయితామణివా భవాదృశ
గ్రావకఠోర యేకరణి గణ్య యగున్ సతులందు రాముఁ డే
కైవడి నోఁచుఁ దండ్రి గలుగన్ సుతవంతులపోఁడి మింక మా
కేవిధి నబ్బు నీతనయుఁ డిచ్చు నివాపనివాపమున్ గొనన్. 28

సీ. మణిమయప్రాసాదమహీ మెలంగుపదంబు లడవుల నడచిన నడచుఁగాక
మడుఁగు దువ్వలువఁ బూనెడుకటీరంబు వల్కలశాటిఁ గట్టినఁ గట్టుఁగాక
కుంకుమవాసనాలంకృతం బగుఱొమ్ము బూది పైఁబూసినఁ బూయుఁగాక
పసిఁడితాయెతుకుఁ బొల్పడువహాళిబంధంబు జడలుగాఁ జాలినఁ జాలుఁగాక

గీ. కైక యేమీఁకఁ బవళించు లేకలేక
కలిగిన కకుత్స్థవంశశేఖరునిమృదుల
తను వయో యీసు నెనయు నీమనసుకంటె
గడుసుఁదనమొందు నుపలసంఘములయందు. 29

---

* రాము వెడలిన కౌతుకంబు—అని యుండఁదగును.

గీ. అనెడు పతిజంకెనఁ గరంగదయ్యె నకట, మందరాక్రాంత మగు కైకమానసంబు
పూర్ణచంద్రోదయంబయ్యు భూరివీచు, దావరణ మొందుశశికాంతమనఁగనంత.

మ. పతి యాకుర్మతికిం బరాఙ్ముఖత దోఁపం గొంతసే పూరకుం
డి తనుంబిల్వ సుమంతు నంప నటకు న్సీతేశుఁ డేతెంచి యా
నతుఁడై ముందట నిల్చి రా జపుడు దీనస్వాంతుఁడై వర్తిలం
గత మేమీ యని భీతినొందఁ బలికెం గైకేయి నిర్లజ్జయై. 30

— కైక రామునకుఁ దనవరములం జెప్పుట. —

మ. తనయాసక్తియు సత్యసూక్తియు విరోధంబొందఁ జింతాంబుధి౯
మునుఁగం జొచ్చె నరేంద్రుఁ డీదొర నని౯ మున్నొకప్డు గాచి కై
కొనియుందు౯ వరయుగ్మ మే నదియు నీకు౯ మాండవీజానికి౯
వనచారావనిభారహేతు వన నైత్యాకుం డనుం బ్రీతుఁడై. 31

మ. భరతుం డేమి తలంకునో మహిభరింప౯ రాముఁ డుగ్రాటవి౯
జరియింప౯ మదిఁగొంకునో సగరవంశస్వామికి౯ దండ్రి కీ
సరణిం జింతిలనేటికిం దనప్రతిజ్ఞాపూర్తి మావంక దు
ష్కరమై తోఁపఁగ వానవోపకృతియో గంగాసమానీతియో. 32

చ. నను వని గాత్రమాత్రభరణంబునకు౯ నియమించి యాచతు
ర్వననిధిమేదినీభరణరాజ్యరమాగరిమంబుఁ దమ్ముగు
జ్జనితల కెత్తినావు సుకరత్వము దీన గణింప నాపయిం
గనఁబడుఁ బక్షపాత మధికంబయి నీమది కంబుజేక్షణా. 33

గీ. జనకుఁ డనుజాభిషేచననోత్సవశుభంబు, వీనులకు విందుగాఁ దానెయానతిచ్చి
మామకీనాంజలియుతప్రణామపూర్ణ, పాత్రి మున కేల కాఁడమ్మ పాత్రమనఁగ. 34

చ. కులిశనిపాతభీత మగుకొండవిధాన దవానలావళిం
దలఁకువనీవనస్పతివిధంబు దివస్పతిరాజధానికి౯
దొలఁగు యయాతితండ్రిగతి దోఁపఁగ భూపతి నేలవ్రాలపి
హ్వాలపడఁబోక కైకగురునానతిఁ జేకొనుమయ్య రాఘవా. 35

క. అన దండమిడి తదాజ్ఞ౯, ననదండగతి౯ శిరంబునం దాల్చి ధరా
వనమునకై రఘువీరుఁడు, వనమునకై చనుకడంక వర్తిలె నంత౯. 36

క. మనుజేశునగరు వెలువడి, జననిగృహంబునకు నరిగి సవినయనతుఁడై
పినతల్లి చేతఁ దెలిపిన, విని యాకౌసల్య శోకవిహ్వలమతి యై. 37

— * రాముఁ డడవికిఁ బైనమగుట. * —

చ. ధర జలజాదిచిహ్నములు దావుకొనంగ జగత్త్రయీశివం
కర మగునీకరంబునకుఁ గంకణ మార్తినిదానకాననాం
తరతరుమూల కందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో
గురుఁ డగుశక్తితండ్రి రఘుకుంజర చిన్నటియుత్సవోన్నతిన్. 38

వ. అని యిట్టులుంగున నమ్మత్తకాశినీరత్నంబు చిత్తంబు శోకాయత్తంబుగా వర్తిల్ల నత్తఱి సుమిత్రానందనుం డమిత్రానందకుధరబృంద సంక్రందనుం డగుదశస్యందనాగ్రనందనుని తాలిమి యనెడు తూలంబున రవుల్కొనిన కోపశిఖి యాటోపంబు సూప ని ట్లనియె. 39

చ. కలితవివేకపాక యగుకైక నయేతరవావదూకయై
తలఁచిన లోకనింద్యతకుఁ దా నవ్వుఁ గా దనలేక యాకె మం
దులు తల కెక్కి బుద్ధిచలితుం డగువృద్ధుఁడు పెక్కుసేయు మొ
క్కలివగఁ బైన మయ్యెదవు కానకు భానుకులీనశేఖరా. 40

చ. ముది మది దప్పియున్న యతిమూర్ఖునకు న్నిజ మేది? నిన్ననే
కద నినుఁ బట్ట మొర్వరకుఁ గట్టెద నన్నది యందు కింతి దగ
గదిమికొనం దలంకినది కన్నది విన్నది గాని దేమి చె
ప్పదు నిది నీతిగాఁ దలఁచుపూనిక నీది గణింపఁ జెల్లదే. 41

చ. అడుగకమున్న నీకు నిఖిలావని తండ్రి యొసంగి యుండఁ ద్రో
క్కడపడనేటి కుర్వరకుఁగా దొర కాశ్రమవర్ణరక్షలం
బడయుపదంబు లెంతటితపంబున లే వటుగాన దైవ మొ
క్కడ వసియించుఁ బౌరుషము గల్గినచోఁ బురుషార్థసిద్ధికిన్ 42

మ. అరుణత్వంబు వహింప నేమిటికి నీ యంఘ్రుల్ వనాటాట్య మ
త్కరయుగ్మంబు భజించుఁగావుత గుణాకర్షంబుచే రక్తిమన్
వరభీతుం డగుతండ్రి యానతి నతిన్వర్తింప నీ కేటికి
న్బరియింపం జనుఁగాక నాథను వికన్ నమ్రత్వ మోరాఘవా. 43

వ. అని పలుకు ననుజు నలుకయుం గలంకయుం దొలంగ సాంత్వవాదమాధురీరచితసీధుసాధురీతిలాఘవుం డగుచు రాఘవుం డి ట్లనియె. 44

మ. జనకాదేశము భానువంశజుల కాచార్యం బగుం దండ్రివం
పున ము న్కండమఁడు రేణుకాతనయుఁడుం బూరుండు గోహత్యకున్

జననీహత్యకుఁ బ్రాయ మిచ్చుజరకుం డా రొప్పియర్థుఁ డ్సాధువ
ర్తనులై నా రటుగానఁ గాన కిపు డేఁ దాతాజ్ఞఁ బోకుందునే. 45

గీ. అనియుఁ దమ్ముఁడు వెంటరా జననితోడఁ, గైకయీవాక్యనిశమనగ్లపితనృపతి
వపురవనభవ్యకర్తవ్య మపుడు దెలిపి, తత్కృతాశీర్వచోరక్షఁ దాల్చి యంత.

చ. జనశుభవాదమోదభరసంగత సీతవసించుమేడకుం
జని ఘనగర్జనంబు విని శాఖినటించు మయూరికిఁ ధను
ర్ధ్వని చెవిఁ దార్చు నాటవికువైఖరిఁ గాననవాసవార్తఁ దె
ల్పిన వెనుకోఁదలంచు నలప్రేయసిమాటకు విహ్వలాత్ముఁడై. 47

క. ఆననము *దగనులివమే, రాన నముచిదమనురమణి కధికపు నీవా
కాననము మృగాస్రోగ్రవ్య, కాననము భజించుదాన వంభోజాక్షీ. 48

గీ. అనెడు విభువారణోక్తుల వెనుకదీయ,
దయ్యె మహికన్య సింహమధ్యాగ్రగణ్య
వనికిఁ దాదృక్ప్రియత్నుఁ డయ్యెను సుమిత్ర
యనుఁగుఁబట్టియు హరిశౌర్యుఁ డగుట నంత. 49

చ. ధనదంతావళధోరణీమణిగవాద్యం బైన యీావి న్సుయ
జ్ఞ నగస్త్యాహ్వయుఁ గౌశికుం ద్రిజటు రక్షోజైత్రయాత్రాచితిం
దనిపె న్రాముఁడు మేదినీసుతయుఁ దద్వాసిష్ఠునిల్లాలికి
చ్చె ననేకాంబరభూషణంబులు వనీశ్రేయఃప్రయాణార్హతన్. 50

సీ. దండకావిపినవాస్తవ్య మానివితానసంకటం బెడలించు కంకటంబు
శౌర్పణఖోరునాసన్ మాక్తికతుషారకణఖరజ్యోతి గాఁగలుగుహేతి
యచిరభావ్యబ్ధిమధ్యపురానిలింపసంపద్వ్యయం బైనచాపద్వయంబు
వలభిదాదిమతపఃఫలకాండకలనాతిశయకల్పనగ మైనశరధియుగముఁ

గీ. దెచ్చుట కనుజ్ఞ వడసి యాత్మీయపిత్త, రాశి కోసలజాశ్రితాగ్రజున కొసఁగి
వెంట సౌమిత్రిరా రామవిభుఁడు నగరు, వెడలి సతిదానుఁ బురవీథినడుచునపుడు.

మ. అజరాదు ల్పొడగాంచఁగూడని యసూర్యంపశ్య నారాముదే
వి జనానీకవిలోకభాజనము గావింపన్ మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నాగరకలోకశ్రేణికిం జూడ్కి బా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతక్షాత్రాభిమానోన్నతిన్. 52

* దగునువిదమేనాన - అని యుండవచ్చును.

(59) అనంతవ్రతకథ—ద్విపద.

ఇకాావ్యము ప్రతి మాయొద్ద నొక్కటియే కలదు. ప్రథమాశ్వాసము మొదట నాల్గు పుటలు లేవు. ౫ వ పుటలో

"కలరెడువాసన లబ్బినట్లయ్యె, నలవడ నీకృతి కధిపతి చిన్న
రంగరాయకుమారరాయఁ డౌటనుచుఁ, బొంగుచు సత్కళా పూర్ణసోమునకు
భాసురసంగ్రామ (పరశురామునకు), శాసిత శత్రురాజన్య వారునకు
ఘనతరోన్నతకులగ్రావధీరునకు, ననుపమ కీర్తిముక్తాగ్రహారునకుఁ
బంకజహితవంశపావనమణికి, నంకితం బొనరించునట్టి మత్కృతికిఁ
బ్రణుతపేశలశబ్దపటుచమత్కృతికి, గణుతింపఁగాఁ గథాక్రమమెట్టిదనిన"

అనునది మొదలు గలదు.

ఆశ్వాసాంతములందుఁ గృతిపతిని—

"అని రంగరాయభూపాత్మజుపేర, వనజబాంధవవంశవర్ధనుపేరఁ
గలితపయోరాశిగంభీరుపేరఁ, గులధరాధరధైర్యగుణనిధిపేర
సురుచిరవైభవసుత్రాముపేరఁ, బరరాజదోర్గర్వభంజనుపేర
భూరివిద్యాభోజభూపాలుపేర, ధారణి సుకవిమందారునిపేర
నంగనాజనమోహనాంగునిపేర, రంగుగాఁ జినరంగరాయనిపేర."

అని ప్రథమాశ్వాసాంతముననుఁ దక్కిన యాశ్వాసాంతములయందును వెవ్వేఱు పదములతోఁ గలదు. చతుర్థాశ్వాసము చివరఁ "అని కృష్ణమాంబా సుతాగ్రణిపేర" నని చినరంగరాయని తల్లి పేరుగ్గడింపఁబడినది.

అయిదవయాశ్వాసము పూర్తిగాలేదు.

ఇఁకఁ గవివిషయము :—

"ఇదిపుష్పవంశాబ్ధి హిమకరాత్యంత, సదయనూరాంబికాజాతతంజేశ్వ
రానందవల్లీపదాంభోజసరస, మానసగౌతమ మహనీయగోత్ర
ప్రణుతచారిత్ర యాపస్తంబసూత్ర, గుణనిధి పేరేంద్ర గోపాలయార్య
రచిత అనంతవ్రతరాజంబునందు—

ఇట్లని ప్రత్యాశ్వాసాంతగద్యమునఁ గలదు. దీనింబట్టి కవి తంజావూరు మండలములోనివాఁడని తేటపడుచున్నది.

ఇందలికథ—అనంతవ్రతకల్పమునందుఁ జెప్పఁబడిన కథయే యని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. శైలియుఁ జక్కనిదియే.

"సకలంబుఁ దెలిసిన సరసమానసుఁడ, వకట! పామరులీల నడలంగనేటి
కనుచు నూఱడఁ బల్కనాసుమంతుండు, తనమదిఁ దెలివొంది తనకూర్మిసతికిఁ
దెఱఁగొప్ప నవినాశతీరంబునందుఁ, గగమర్థి నగ్నిసంస్కారాది విధులు
ఘనభక్తియుక్తి సాంగం బగునట్లు, మునుకొని యాదినంబులు కడతేర్చి
యుండెడిచో నంతనుచితజ్ఞులగుచు, నుండెడు ధర్మవుంసోర్వీసురాది
బంధులార్యులు నీతిపరులు గంభీర, సింధులాయనగృహసీమ కేతెంచి
యుచితవాక్యంబుల నూఱడఁబల్కి, యచలితభక్తితోనప్పు డిట్లనిరి......
పావనమూర్తివి పరమపుణ్యుఁడవు, నీవెఱుంగని యట్టి నీతులు లేవు
అనపత్యుఁ డగుమర్త్యుఁ డం దిందుసుఖము, గననేరఁ డనుట నిక్కముగాదె [తెలియఁ
జెలువంబుఁ బ్రాయంబుఁ జెల్లినమేను, తలఁపంగమూలముల్ దప్పినమ్రాను
చెలఁగి సజ్జనులు వసింపని ప్రోలు, ఎలమి వేఁడినచోట నీయని కేలు
నీతి దప్పిన ధరణీశునినాడు, నాతిమెలంగకున్నట్టి యాపీడు
పాడగుం గావునఁ బరికించి పెండ్లి, యాడంగఁ దగు నన్న నంగీకరించి."

నాటకములను బ్రబంధ మార్గమునకు దింపఁ దలఁచిన కొందఱు పూర్వ కవులవలె నీకవి వ్రతకథల దింపఁ జూచినాఁడు.

(60) నలచరిత్రము—ద్విపద.

ఇది పూర్వభాగము నుత్తరభాగము నని రెండుగా భాగింపఁబడినది. కవి వంశాదికముం దెల్పుభాగ మీక్రిందఁ జూపఁబడినది.

"... అనుచు వాధూలగోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తివంతుఁ డాశ్రితహితోదయుఁడు, కరుణాపయోనిధి కందాళదొడ్డ
యాచార్యునకు శిష్యుఁ డైనట్టిఘనుఁడు, వైష్ణవాచారుండు వరదయాపరుఁడు
పొలుపు మీఱిన చక్రపురి దొడ్డ ఘనుఁడు, వలనొప్పనతనికి వరకూర్మి తనయుఁ
డకలంక మానసుఁ డతిపుణ్యధనుఁడు, సకలవైష్ణవపాద సంసేవకుండు
రంగనామాత్యుండు రాజపూజితుఁడు, సంగీతసాహిత్య చతురమానసుఁడు

సరసతసత్కవీశ్వరకులాధీశుఁ, డరయంగ నాతని కనుఁగుసోదరుఁడు
తనరిన సకల విద్యాప్రవీణుండు, ... ...
తిరువేంగళాచార్య ధీరాగ్రగణ్యుఁ, డరయనాతనిపుత్రుఁ డబ్ధిగంభీరుఁ
డమలమానసుఁడు విద్యావిశారదుఁడు, రమణతో వరకవి రాఘవాన్వయుఁడు
నరహరి ఘటికాద్రినాథుని పేరఁ, బరువడి నేనాంధ్రభాషను వెలయ.

ఇం దీతనివంశమంతయుఁ గలదు. ఈరాఘవకవి దీనిని జాలభాగము పెంచి వ్రాసినాఁడు. వర్ణనములు సాధారణముగానున్నవి. కవిత్వము సామాన్యముగా నున్నది. వ్రాఁతతప్పులు మెండుగాఁ గలవు. దీనిప్రతులు పరిషద్భాండాగారమునఁ జెక్కులు కలవు. శైలిం దిలకింపుఁడు.

"ఆపాము గొని వచ్చి యావలవిడువ, భూపాలుఁ గనుఁగొని భుజగ మిట్లనియె
మనుజేశ యిటువంటి మంటలోఁ జొచ్చి, ననుఁగాచి రక్షించినాఁడ వీమేలు
మఱవను నేనొక్కమాట చెప్పెదను, సరస ముందఱ నొక్క సరసిజాకరము
ఉన్నది యటకు నన్నొరఁగొంపోయి, మన్నించి విడువుము మఱినీకు నొక్క
మేలు చేసెదనీవు మేదినీనాథ, పాలింపు మనవుడు బాముఁ గొంపోయి
కరిమర్థిఁ బంకజాకరము లోపలను, గరుణతో విడిచినఁ గర్కోటకుండు
ధరణీతలేశుపాదము నర్థిఁగఱచె, ...
కుఱచ చేతులు మఱిగుజ్జురూపంబుఁ, బరుసు వెండ్రుకలను బవిరిగడ్డంబు
కఱకునల్లనిరూపు ఘనమైన కడుపు, కుఱుచపాదములును గుఱుచైనవ్రేళ్లు
కలిగినఁ జూచి భూకాంతుఁ డిట్లనియె.

(61) కుబ్జాకృష్ణవిలాసము.

ఇదియొక శృంగారప్రబంధము. కవి పేరు పిచ్చయ్య, హరిదాసుఁ డని భక్తుఁడగుటచే నొకవాడుక పేరు కలిగినది. ఈతనితండ్రి యక్కెనప్రెగడ రాయన మంత్రి. తల్లి సీతమ్మ. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. రామభక్తుఁడు. కావున భద్రాద్రిరామున కీకావ్యమునంకిత మొనర్చెను. నాలుగాశ్వాసములు సంపూర్ణముగా నున్నవి. చిట్టచివర "శ్రీభాగవత కథాంతర్గంబైన యేతద్వృత్తాంతంబుఁ దెనుఁగున విన్నపించితి నవధరింపు" మనుటచే సంస్కృతభాగవతము నుండియే మూలకథ గ్రహించినట్లు విదితము. శైలి యతిమృదువుగానున్నది.

గీ. ధాతయైనఁ దొల్లి తాను జేసినసృష్టి, మరల ద్రిప్పఁజాలఁ డరయ నిలను
హరి సమర్థుఁ డయ్యె నటుగాన నీతఁడ, య్యజునిగన్నతండ్రి యనుట నిజము,

చ. అటువలెఁ బోయి పోయి వడి యంతయునుం జెడి సొక్కి సోలి య
క్కుటిల నిశాచరుండు ధరఁ గూలె మహీధరమో యనంగ ను
త్కట పతనోద్భవోగ్ర నినదంబున దిక్కులయొందునెల్ల నా
క్కట నెగసెం బ్రతిధ్వనులు కంజభవాండమునిండ మెండుగన్.

(62) జ్యోతిషరత్నాకరము.

ఇదియొక పద్యకావ్యము. కవి చటిగొండ హరన్నయామాత్యుఁడు. జాతకముహూర్త సిద్ధాంతములను మూఁడుభాగములు నిందుఁ బద్యరూపమున సులభముగ వ్రాయఁబడినవి. రంగరాజతనయుఁడగు సింహాద్రిమంత్రికిఁ గృతి యీఁబడినది. ఈ సింహాద్రిమంత్రి యెక్కడివాఁడో తెలిసికొనుట కాధారమిందు లేదు. మొదటఁ గొన్నియాకులు లేవు ప్రతిపద్యాంతమున "మంత్రి సింహాద్రివర్య, సింహాద్రి మంత్రివర్య, సింహాద్రివర్య, రంగరాజు సింహాద్రివరా" యని సంబోధనలు కనఁబడుచున్నవి. అయిదాశ్వాసములు. ఆశ్వాసాద్యంతగద్యపద్యములలోఁ బొగడ్తయేకాని కులగోత్రాదులఁ దెల్పుమాటలు లేవు. ఒక్కపద్యమున "వైష్ణవ పుణ్యశ్లోకా" యనియు వేఱొకపద్యమున "శ్రీరామానుజ జనితోద్ధార మహోదార" యనియు నింకొకతావున "నరవరకులదీపా నవ్యకీర్తిప్రదీపా" యనియుఁ గలవు. వీనివలన నేమి తేలినది? కవి తన్నుఁగూర్చి గద్యములో "ఇతి శ్రీ శుభకవితావిశేష మాహేశ్వర వరలబ్ధ సారస్వత భారద్వాజగోత్రపవిత్ర చటికొండ రామయామాత్యపుత్ర హరన్నయనామధేయప్రణీతం బైన జ్యోతిషశాస్త్రం బను మహాంభోనిధానంబునకు సుధాకరుం బోలి యొప్పుచున్న జ్యోతిషరత్నాకరం బను మహాకావ్యంబునందు ..." అని చెప్పుకొన్నాఁడు. ఆ మూలాగ్రముగ జ్యోతిషమంతయు నిందుఁ దేటఁ తెల్లముగ నిమిడ్చిన యిక్కవి స్తోత్రార్హుఁడు. నడుమనడుమఁ గొన్ని పద్యములు లోపించినవి. వ్యాకరణాదిదోషము లక్కడక్కడఁ గలవు. వ్రాసినవారి లోపములు మిక్కుటము. ఆశ్వాసాదులను గార్గ్యునకు వసిష్ఠుం డీజ్యోతిషము చెప్పుచున్నట్లున్నది. ఇందలి కొన్నివిషయములు.

పగలుప్రొద్దుగట్టుటకు.

గీ. ఎన్నిపదములైన నన్నిటి ద్విగుణించి, రుద్రసంఖ్యచేత రూఢిగలిపి
యున్నూటపది వెట్టి యిరువుగాఁ బాల్గొన్న, గడియ విగడియలు గానవచ్చు.

రాత్రిపొద్దు చూచులక్షణము.

గీ. అర్కుఁ డున్నట్టి నక్షత్రమాదిగాఁగ, నున్నమధ్యాహ్నతారకు నెన్నియగును
అందుమునిసంఖ్యఁ బుచ్చంగనధికమైన, నిమ్మడివి గడియలు రాత్రి కెఱుఁగవలయు.

నక్షత్రత్యాజ్యములు.

సీ. నిత్యనక్షత్రముల్ నెలకొనుత్యాజ్యంబు పరఁగ నశ్వినికి నేఁబదిటిమీఁద
భరణికిర్వదినాల్గు పైని కృత్తికకును ముప్పతిగడియల నొప్పమీఁద
రోహిణికొప్పు నారూఢి నిర్వదిమీఁద మృగశిరపద్నాల్గు మీఁదనగును
ఇలనార్ద్రకొప్పును నిరువదొక్కటిమీఁద సరిఁబునర్వసు ద్రిదశకముమీఁద
ఎలమిఁబుష్యమికిని నిరువదిమీఁద నాశ్లేషకు ముప్పదిరెంటిమీఁద
కడు మఘముప్పదిగడియలమీఁదను నిలఁబుబ్బకిరువదియింటిమీఁదఁ
బరికింపనుత్తర పదునెన్మిదిటి మీఁద నొసరహస్తకు నిర్వదొకటి మీఁద
నిరువదిగడియల నేపారుచిత్తకు స్వాతికిఁబదునాల్గు . . . తలగును
పదునాల్గుగడియలపైని విశాఖకు ననురాధ పదిగడియలకుమీఁదఁ
బరువడి జ్యేష్ఠకుఁ బదునాలుగిటి మీఁద సలమూలకేఁబదియాఱుమీఁద
వడిఁ బూర్వషాఢ కిర్వదినాలుగిటిమీఁదఁ జనునిర్వదుత్తరాషాఢమీఁద
శ్రవణధనిష్ఠవర్జంబులు పదిపైనఁ జనుఁబదునెనిమిది శతభిషముకుఁ
బదియాఱుపైఁ బూర్వభాద్రకు నుత్తరాభాద్రకు నయ్యె నిర్వదియునాల్గు
గడఁగి రేవతిముప్పదిగడియలందు, వచ్చుచుండును త్యాజ్యంబు వరుసతోడ
నెలమినక్షత్రమునకు నాల్గేసిగడియ, లందువర్జ్యంబు పనులు సింహాద్రివర్య.

నిర్గమము పెట్టుటకు.

సీ. భూపాలకుఁడు తల్లిపోయెడునావేళఁ బోఁగూడకుండెనా పొందుగాను
గొడుగు శస్త్రంబులు గుఱ్ఱపుఁబల్లంబుఁ గట్టుఁగొళలును నిర్గమమునెట్టి
వెలయనింటికి నూఱు విండ్లపెట్టును నొండె నేఁబది విండ్ల పెట్టెనినొండెఁ
బది విండ్ల పెట్టెనఁ బరఁగ గొల్లెన వేసి యచట నిర్గము పెట్టియరుగ మితము

గీ. సప్తదినముల యీసంపు జనపతులకుఁ, బంచదివసంబులే సందుబ్రాహ్మణులకు
సకజనములకును దివసత్రయమున, నరుగఁగావచ్చు మంత్రి సింహాద్రివర్య.

(63) శివయోగసారము. (ఉత్తరభాగము)

దీనికవి గణపతిదేవుఁడు. తండ్రి కొలనియమాది మూలన్న. చెన్నసదా

శివయోగివంశజుఁడైన యిదూరి నూకనారాధ్యునకుఁ గృతియిచ్చినాఁడు. ఈ భాగము నాలుగాశ్వాసములు గలది. పూర్ణముగ నున్నది. ప్రారంభపద్యములు—

క. శ్రీగురు చెన్నసదాశివ, యోగీంద్రకులాబ్ధిచంద్ర యోగివినుతశై
వాగమసారార్థజ్ఞా,నాగారయిదూరి నూకనారాధ్యవరా.

గీ. శైవయోగశాస్త్ర సారసముచ్చయ, ప్రకరణములయర్థభావమెల్లఁ
దెనుఁగుఁగవితఁ దేటతెలివిగానేభవ, దాజ్ఞ విన్నవింతు నవధరింపు

చ. గణపతి దేవనామమును గల్గిన యే శివయోగసారముం
బ్రణుతమహాప్రబంధమును బల్కితి నీ క్రియఁ బూర్వభాగముం
ద్రిణయునభక్తులౌనన గదింతు సదాశివయోగనాథధీ
మణి యన రూఢికెక్కి గరిమంబున నుత్తరభాగ మేర్పడన్.

శా. విశ్వేశస్థిరభక్తి వర్ధిలఁగ నుర్విం బూర్వభాగాప్త సం
ఖ్యాశ్వాసంబులు గర్మయజ్ఞము తపోయజ్ఞప్రకారంబున
త్రైశ్వర్యప్రదమైతనర్చు జపయజ్ఞాచారముం గూర్చఁగా
విశ్వస్తుత్యగతిం బ్రబంధ మమరెన్ విద్వత్పరిగ్రాహ్యమై.

క. ఈ యుత్తరభాగంబున, నాయతిరచియింతు నాలుగాశ్వాసములం
బాయకధ్యానజ్ఞాన మ,హాయజ్ఞద్వయము యమిజనానందముగాన్.

ఈ పద్యములవలనఁ బ్రతిజ్ఞ తేటపడినది. నూకనారాధ్యుని చరిత్రము పూర్వభాగమునం జెప్పియుండునని తోఁచెడిని. కవింగూర్చి గద్యములో నిట్లున్నది.

"ఇది శ్రీగురుచెన్న సదాశివయోగీంద్ర పదారవింద మధుకరాయమాన నిరంతర శివభక్తసమాధాన కొలనియమాది మూలనామాత్యపుత్ర, అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతిసుముఖ కవిజనమిత్ర సరసకవిత్వ రచితప్రభావ గణపతిదేవప్రణీతంబు ..." అని. కవిత్వము ధారాళముగానున్నది. శైలి.

చ. పదతలముల్ ధరాతలముపైఁ గదుడగ్గఱనిల్పి లోఁదొడ
ల్గదిసిన జంఘలు న్నతి లలాటము మోసిన జానుయుగ్మముం
బ్రిదులక యుండ హస్తపరిపీడితజానులుగల్గి యుండెనే
నిది యగునర్భకాసన మహీనసుఖాస్పద మండ్రు సంయముల్.

సీ. మోహాంధకారంబు ముక్తిత్రోవకు మఱుఁగై యుండు నని చెప్పి రాదిమునులు
మోహంబు సాహసంబున విడిచినయుత్తములు ఘోరమగు భవాంబునిధిఁ జొరరు
పడఁతులుఁ బుత్రులు బంధులు మిత్రులు పశువులు మొదలైన బహుధనముల
యెడలఁ గూరిమి జనియింపంగ నవిఘటియింపంగ నవిచెడు నెడల మనము

గీ. లందునుసుగని దుఃఖాగ్నులందునుడఁకఁ, జేయునురుతరపుణ్యంబుఁ జేయుమోహ
మదియకాదె యోగీంద్రులనైనఁ జెఱచు, మతులధనదుఃఖ సంయోగమరిగెనేని.

క. నెట్టన విధాత నేర్పునఁ, గట్టిన యాయింటనుండఁ గలుగదనినఁ దా
గట్టినయింటను మానవుఁ, డెట్టాకొ తనకుండఁ గలుగు నిమ్మహిలోనన్.

(64) వేంకటేశ్వర మాహాత్మ్యము.

ములుపాక బుచ్చయ్యకవి రచించి శ్రీరామునకుఁ గృతి యిచ్చెను. ఈకవి గురువు శంకరశాస్త్రి. భార్గవగోత్రము. తండ్రి కోదండరామయ్య. అయిదాశ్వాసములు గలవు. తానీగ్రంథమును రామాజ్ఞపై భవిష్యోత్తర బ్రహ్మాండాది పురాణములనుండి యెత్తివ్రాసితినని చెప్పుచున్నాఁడు. గద్యము—

ఇది శ్రీకాశీవిశ్వేశ్వర కరుణాకటాక్ష వీక్షాసమాసాదితాంధ్రగీర్వాణ కవిత్వనిర్మాణప్రవీణ ములుపాకవంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాయమాన భార్గవగోత్రపవిత్ర కోదండరామయపుత్ర విద్వజ్జనవిధేయ బుచ్చయనామధేయ ప్రణీతంబైన భవిష్యోత్తరపురాణంబునందు వేంకటేశ్వరమాహాత్మ్యంబున" నని చెప్పుకొని యందే తదాశ్వాసములోని కథాభాగము "ఆకాశరాజు విహారార్థంబు వేంకటేశ్వరు సమీపంబునకు శుకయోగీంద్రు నంపించుటయు బ్రహ్మాదేవశంకరులఁ బిలిపించుటయు లక్ష్మీసమాగంబును వైవాహికనివేదనంబును ... ఆకాశరాజు మరణంబును నౌర్ధ్వదైహికంబును, వసుదాన తొండమాన్ చక్రవర్తుల రాజ్యార్థంబు యుద్ధంబు చేయుటయు, హరి వారలకు రాజ్యంబు పంచి యిచ్చుటయుఁ దొండమాన్‌చక్రవర్తి శేషాచలంబున దేవాలయంబు గట్టించుటయు, హరి ప్రయాణంబును బ్రహ్మోత్సవంబును నన్నది పంచమాశ్వాసము." నిట్లని వివరించియున్నాఁడు. శైలికై కొన్నిపద్యములు.

మ. వినుతింపం బ్రతిపాదమంగును రసావిర్భూతిగావించి య
య్యినచంద్రేంద్రగణంబుల న్విరతితో నింపొందఁగాఁ బ్రాసయు
క్తిని గాఁపుంచి విరుద్ధభావులు కుయుక్తిం దీయకుండంగ ము
న్ననిచె న్వాగనుశాసనుండు (మహి) మం గావ్యార్థకోశంబిలన్.

మ. హరి వైకుంఠపురంబుఁ బాసి పరమాహ్లాదంబుతో వచ్చి య
గ్గిరిపై భార్గవితో మునిప్రతితో గీర్వాణసంఘంబుతో
నిరవందన్వసియింపఁ గారణము మున్నే మో యెఱింగింపుమా
సురమౌనీంద్ర యటంచు వేఁడిన దయన్ శుద్ధాత్ముఁడై వేడుకన్.

మ. అనినం బక్కననవ్వి రావణుఁడు నీవావాలి పుత్త్రుండవా !
చనునీకిట్టి విశేషవాక్యములు నీసాటైన బల్మేటికిం
దనుఁ డింక న్మహిఁబుట్టఁబోఁడు జనకధ్వంసిం దగంగోల్చి జీ
వనముం జేసెద వెంతవాఁడ విఁకని న్వర్ణింపఁగా శక్యమే.

"అని చింతించుచు నున్నయంజనకు నయ్యాకాశవాణిట్లు టంచని వాక్రుచ్చె"
"నీగర్భంబిది కాఁగలర్థము న జన్మించెఁ." అనురీతిని గొన్ని ప్రయోగములు గలవు.

(65) కపిలచరిత్రము.

ఇది యొక చిన్న ద్విపదకావ్యము. కవి చిన్నయ్య. శూద్రకులజుఁడు. పాటూరుపురవాసి. ముష్టిపాలగోత్రోద్భవుఁడు. తండ్రి యనంతయ్య, తల్లి తిమ్మాంబ, తమ్ముఁడు వెంగన. సూర్యునకంకితముగా నీగ్రంధమును వ్రాసినాఁడు. తప్పులు మెండుగాఁగలవు. శైలికై కొన్ని బంతులు చూపెదము.

"శ్రీవిష్ణుపదిగంగస్థిరతీరమందు, పావనశ్రీహరిభక్తిమానసుఁడు
విదురుఁడు మైత్రేయ వీరమునిగాంచి, సదమల భక్తితో సాష్టాంగ మెరఁగి
ముకుళితహస్తుఁడై ముందటనిల్చి, యకలంక చిత్తుఁడై యతనిఁ బ్రార్థించె
దేవకర్దమముని దేవహూతికిని, భావింపఁ గపిలుండు ప్రభవించి దయను
మాతకు సద్యోగమార్గంబు లెల్ల, నే తీరుగాఁ జెప్పె నేర్పడనదియు
నాకెఱుంగఁగఁ జెప్పి నన్నురక్షింపు, నీకు మ్రొక్కెదనయ్య నిర్మలగాత్ర."

(66) రుక్మిణీకల్యాణము.

ఇదియునొక్క చిన్న ద్విపదకావ్యమే. ఒక్క పుస్తకములోనే యుండుట యుఁ గవిత్వ మొకవిధముగానే యుండుటయు సూర్యస్తోత్రమే ప్రారంభమున నుంటయుఁ గాంచినఁ బై చిన్నయ్యయే దీనికిని గవికావచ్చును. ఆంధ్రభాగవత ములోని రుక్మిణీకల్యాణమును బట్టియే యీద్విపద బైలుదేఱినట్లు పెక్కునిదర్శన ములు గలవు. కనుండు.

వరుసబొమ్మలపెండ్లి వనితచేయించు, కొమరొప్ప గుజ్జనగూళ్లువండించి
సమత చెలులకుఁబెట్టు సకియ వేర్వేఱ, రమణీయ మందిరారామ దేశముల...
సదమలమణిమయ సౌధభాగముల ......

కథపూర్తిగా నున్నదిగాని కవిపేరు తెలిసికొనుట కొక్కబంతి కొంత విఱిగిపోయినది.

# అలంకారతత్త్వవిచారము.



ఆంధ్రకవితావిమర్శన గ్రంథమాలిక రెండవసంపుట మగు కురుగంటి సీతారామయ్యగారిచే వ్రాయఁబడిన యలంకారతత్త్వవిచార మనుగ్రంథము, కావ్యములయం దలంకారముల యావశ్యకతను స్థిరపఱచుచున్నది. వీరి యీగ్రంథమును సాంతముగాఁ జదువువారికిఁ గావ్యములం దలంకారము లనావశ్యకము లని యాధునికు లెవ్వరో నిరసించి రనియు నయ్యది యసమంజస మని స్థిరపఱచుటకై యీగ్రంథము వ్రాయఁబడిన దనియు స్ఫురింపకపోదు. ఎవ్వరో యాధునికు లననేల. కట్టమంచి రామలింగారెడ్డిగా రట్టివారిలో ముఖ్యులుగ లక్షింపఁబడి రని యీక్రింది యుదాహరణములఁబట్టి నిశ్చయింపవచ్చును.

"ఆకొఱఁతఁ దీర్చుటకై శ్రీరామలింగారెడ్డి మొదలగువారు చేతనగువిధములఁ బ్రయత్నము లొనర్చుచున్నారు. కాని యాప్రయత్నములు కూడ చాల మట్టుకు పై నుదహరించినవాక్యములకు (బండుబూతులప్రోవులు, దబ్బరలు, నవలాపములు) లక్షీభూతము లగును." అని 'సంపాదకీయభూమిక'లో సంపాదకులు వ్రాసియున్నారు.

"తుట్టతుదకు విమర్శనాగ్రంథ మయిన శ్రీయుత రామలింగారెడ్డిగారి 'కవిత్వ తత్త్వవిచారము'నఁ గూడ పుటకు మూఁడునాలుగు వంతున నలంకారముల నుపయోగించియున్నాఁడు. (ఈ వాక్యమున నన్వయ మగపడదు) ఆయన యెవ్వ రెవ్వరి నెక్కడెక్కడఁ దూషింప సమకట్టెనో యక్కడక్కడ నెల్ల యలంకారయుక్తముగ దూషించెను. ఐనను ఆయనకావ్యముల నలంకారముల వద్దను వాదమువాడే" అని గ్రంథకర్తగారును వ్రాసియున్నారు.

శ్రీరామలింగారెడ్డిగారు, కవిత్వతత్త్వవిచార మనునొకగ్రంథమును జేసిరి. వీరిగ్రంథములో నాకుఁ గొన్ని స్థలములయం దభిప్రాయభేదము లున్నను మొత్తముమీఁద వీరి విమర్శనము నిష్పక్షపాతముగ నున్న దని చెప్పఁగలను. అం దాంధ్రవాఙ్మయమునఁ గల గుణదోషములు సరిగఁ జూపఁబడినవి. అదియొక తప్పిదము కా దని నాయభిప్రాయము. మనపూర్వుల లోపములును గుణములే యని గౌర

వాతిశయమునఁ గృత్రిమముగాఁ బలుకుట విమర్శకతాలక్షణము కాదు గదా. 'మీఁదుమిక్కిలి' యది నిపుణు లగువారికి జహాత్స్వార్థను స్ఫురింపఁజేయును. శ్రీరామలింగారెడ్డిగా రలంకారము లనావశ్యకము లని యవతారిక వ్రాసి రని వివదించిన నేఁజెప్పఁజాలను గాని వారియలంకార విమర్శనమును జదివినచో నది యంతగా స్వమత విరుద్ధ మని గ్రంథకర్తగారును దలఁప రని నానమ్మకము. "అలంకారములను గూర్చిన ముఖ్యపద్ధతు లెవ్వి యన, అవి ప్రయత్నము లేకయ వచ్చినంత సహజముగా నుండుట, కథలోని స్త్రీపురుషులు మాటలాడునపుడు పాత్రోచితము లయిన కొన్నింటి మాత్ర ముపయోగించుట, కవియే వర్ణించు నపు డొకింత యెక్కువగ నలంకారము లుండినను దోషములేదు" అని యిట్లు (కవిత్వతత్త్వవిచారము 22 పుట) శ్రీరామలింగారెడ్డిగారు తమయభిప్రాయమును జెప్పియున్నారు. ఇది విరుద్ధ మనుట నిష్పక్షపాతు లగువిమర్శకుల కుచితమా! అలంకారముల నుపయోగించువిషయమున ధ్వన్యాలోకమున నీయభిప్రాయములె పేర్కొనఁబడినవి.

"రసాక్షిప్తతయా యస్యబంధ శ్శక్యక్రియోభవేత్ ।
అపృథగ్యత్ననిర్వర్త్య స్సోలంకారో ధ్వనౌ మతః"॥—
"అలంకృతీనాం శక్తావ, ప్యానురూప్యేణ యోజనః ।
ప్రబంధస్య రసాదీనాం, వ్యంజకత్వే నిబంధనం"॥

"ప్రబంధవిశేషస్య నాటకాదేః రసవ్యక్తినిమిత్త మిదంచా వగంతవ్యం య దలంకృతీనాం శక్తావ ప్యానురూప్యేణ యోజనం । శక్తోహి కవిః కదాచి దలంకారనిబంధనే తదాక్షిప్తతయై వానపేక్షితరసబంధః ప్రబంధమారభతే తదుపదేశార్థ మిద ముక్తం । దృశ్యంతేచ కవయోఽలంకార నిబంధనైకరసా అనపేక్షిత రసాః ప్రబంధేషు."

అలంకారములు లేకున్నను రసస్ఫూర్తికి భంగములేదు. రసము లేకున్నను నలంకారము లుండవచ్చును. ఇట్టి యన్వయ వ్యతిరేక వ్యభిచారముచే నలంకారములు రసస్ఫూర్తి కనావశ్యకము లని శ్రీరామలింగారెడ్డిగా రభిప్రాయపడి యున్నారు. మఱియు నలంకార ఘటనాప్రయత్నము రసవ్యక్తికి భంగమును గలిగించుచుండును. రసవ్యక్తికి భంగములేక మఱియు రసోపకారకములయి యుండు నలంకారము లుండఁగూడ దని వారు చెప్పలేదు. సహజము లగు నలంకారముల నంగీకరించియే యున్నారు. జపమువిడిచి 'లొట్ట'లలోఁ బడినట్లు కథను రసమును

విడిచి యలంకార పూర్ణవర్ణనాసముద్రమునఁ బడి యీఁదులాడుచుఁ బారముం గనకుండుట సహృదయసమ్మత మయి యుండునా ?

ఆరయ నరయ మనగ్రంథకర్తగారికి నసహజము లగున లంకారములయం దేవ, లేకపోలేదు. ఏదో కారణాంతమును మనసున నిడి రామలింగారెడ్డిగారు మొద లగువారిమతములను విమర్శించిరి గాని వీరును సహజములు కానియలం కారములను నుపయోగింపరా దనియే యభిప్రాయపడినట్లు వీరిధోరణి తెలుపు చున్నది. "చదువుట కోపికలేక గ్రంథములం టట్టినఁ బ్రయోజన మేమి, అది మనబుద్ధిహీనతను తెలియఁజేయును, అందు వేయియలంకారముల నుండనిండు. అవి యన్నియు కావ్యముల నుపయోగించి తీరవలయు ననిరా ? ఏసందర్భమున నేయలంకారము నుపయోగించిన రస ముత్పత్తిఁ జెందునో విషయమున మనసిడి యాలోచించి యట్టివానినే యుపయోగించిన బాగు. అనవసరము లగుతావుల నుపయోగింపు మని యెవ రనిరి. ఆలంకారికులు బలవంతముచేసిరా?" "కావున నొక నారీమణికి భూషణము లెట్లువన్నెఁ దెచ్చునో కావ్యమున కలంకారము లట్లు వన్నె నే తెచ్చును. స్త్రీకి యలంకారము లావశ్యకములా ? అట్లే కావ్యమునకుఁ గూడ యలంకారము లనావశ్యము లనవచ్చును, నిజముగా నావశ్యకములే యయిన సొమ్ములు లేనిస్త్రీల మన మెందఱఁ జూచుటలేదు. సొమ్ములు అనుపేరు గలవస్తువు లన్నియు భూషణములును వన్నెఁదెచ్చునవియే యైనను అన్నియు నావశ్యకములు కాకపోవచ్చును. ఇంత యనుమానమేమి ? అన్నియు నావశ్యక ములు కావు. కొన్నిమాత్ర మనావశ్యకములు కావు, అనిన కొంతవఱ కావశ్యక ములే, భగవంతు డెట్లు సృజించెనో యట్లె యాజన్మాంతము నుండుస్త్రీని మన మెచ్చటనైనఁ జూచితిమా ?"

"కావున నలంకారముల నుపయోగింపవలయు నని మనపూర్వలాక్షణి కులు చెప్పినప్పుడు సందర్భోచితముగ నని మనమర్థము చేసికొనవలసియున్నది... కావ్యంబునకుఁ గూడ ప్రతివాక్యమున నలంకారము నిండియున్న నదికూడ నస హ్యముగనే యుండును. స్వభావోక్తి సమగ్రముగా నుండి యచ్చటచ్చట నవ సరము లగుస్థలముల రత్నముల ట్లలంకారములు వరలుచుండవలయును" అని యిట్లు గ్రంథకర్తగా రగు శ్రీ సీతారామయ్యగారు వ్రాసియున్నారు. ఈ యభి ప్రాయము లించుమించుగ శ్రీరామలింగారెడ్డిగారి యభిప్రాయముల ననువదించు చున్న వని చదువరులు గ్రహింపకపోరు. మఱియుఁ బైవానిలోని తుదివాక్యము

సరయఁగా వీరును స్వభావోక్తి తక్కిన యలంకారములవంటి రత్నము కాదని యొప్పికొనియే యున్నారు. కావున "స్వభావోక్తివిషయమై యిదివరకే యొక ప్రశ్నము వచ్చినది. అదికూడ నలంకారములలోఁ జేర్పవలయునా యని, నా మతము తప్పక దానిఁగూడఁ జేర్పవలయు ననియే" అనుమొద లగువేఱొక సందర్భమున నున్న, శ్రీ సీతారామయ్యగారి సూక్తుల కంతగా విచారింప నక్కఱ లేదు.

ఇఁక శ్రీరామలింగారెడ్డిగారు వ్రాసిన "అందు శబ్దాలంకారము లంతగా ముఖ్యములు గా వనుట కంద ఱొప్పుకొందురు" అనువాక్యమునకు సరియగు "శబ్దాలంకారము లంతముఖ్యములు కావని యందఱొప్పుకొందురు" అనువాక్యము నొకయాధునికాంధ్ర విమర్శకుని వాక్యముగా నుదాహరించి, శ్రీ సీతారామయ్యగారు దానిని ఖండించి యున్నారు. శబ్దాలంకారముల నన్నిటిని నావశ్యకములుగా నంగీకరించుచు వీరు పద్మబంధాది చిత్రాలంకారములను మాత్ర మావశ్యకములుగ గ్రహింపకుందురా? ఇఁక "ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టిర్నవిద్యతే" అనునభియుక్తోక్తి యేమికావలయునో?

శ్రీరామలింగారెడ్డిగారు, శబ్దాలంకారపూర్ణము లగుటచే భావశూన్యములై యున్నపద్యములఁ గొన్నింటి నుదాహరించియున్నారు. అవి ప్రశస్తములని యెవ్వరును జెప్పలేరు గదా. ఇఁక శ్రీ సీతారామయ్యగారు బమ్మెర పోతనార్యుని పద్యములఁ గొన్నిటి నుదాహరించి శబ్దాలంకారముల సారస్యమును జూపుచున్నారు. కాని వీ రుదాహరించిన యాంధ్రభాగవత పద్యము లత్యధిక శబ్దాలంకారమండితములు కామింజేసియె కావలయును నవి సరసములై యున్నవి, రసప్రతిబంధకములుగాక రసోపకారకములయి కావ్యశోభాకరములై యుండు శబ్దాలంకారము లుండఁగూడ దని యెవ్వరును జెప్పియుండలేదు. భాగవతమునందే శబ్దాలంకార బహుళపద్యములకన్నఁ దదన్యము లెంతసరసములుగా నున్నవో చదువరులె గ్రహింతురుగాక.

మ. "కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగా నంపె స
త్వరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రముం బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రమున్ జక్రమున్ (భాగవతము

ఇందుఁ జక్రమునందలి 'క్ర' అనుదాని కావృత్తి ప్రతివిశేషణాంతమునం దును గలుగునట్లు యత్నించుటచేఁ గొన్నివిశేషణములకు స్వారస్యము లేకపోయెను. విస్ఫులింగచ్ఛటలచే నంబరగతశుక్రుఁ డొక్కఁడె పరిభూతుఁ డయ్యెనఁట. నక్షత్రవాచకపదములలో 'క్ర' అనునది యంతమున వచ్చుపదము స్ఫురింపకుండుటచేఁ గావలయు రిక్కల కాపరిభూతి లేకపోయెను. మఱియు జ్యోతిశ్శాస్త్రము చొప్పున శుక్రుఁ డెట్టునిచాయగలవాఁడు కామింజేసి స్ఫులింగసామ్యము సరిపడదు. "బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాంతరనిర్వక్రము" అనువిశేషణము నంతగాఁ బ్రకరణావశ్యస్థితి నొంది యుండలేదు.

శా. "పూరించెన్ హరి పాంచజన్యము సుధాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్
సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్." (భాగవతము)

ఇందు 'న్య' అనుదానియావృత్తికై ప్రయోగింపఁబడిన పదములలో 'సౌజన్యమున్' అనుదానికిఁ బ్రకృతోపయుక్తార్థశక్తి గలదా? "సారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్" అనువిశేషణమున కేమైన స్వారస్యము గలదా! మఱియుఁ బర్జన్యాదులు రాజన్యు లనుట యుచితమా?

ఇట్లు వ్రాయుటచేఁ బోతనార్యుఁ డసమర్థుఁ డని నాయభిప్రాయము కాదు. శబ్దాలంకారాపేక్ష కొన్నిచోట్లు నామహాత్ముని కవితాసారస్యమునకుఁ బ్రతిబంధమగుచు వచ్చె ననుట మాత్ర నిజము. శబ్దాలంకారబాహుళ్యము లేనిపద్యములు శబ్దాలంకారబహుళపద్యములకన్న మనోహరములుగా నుండుటయే యిందుకు నిదర్శనము.

శా. "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర, కావవే వరద, సంరక్షింపు భద్రాత్మకా." (భాగవతము)

మ. "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహి యై." (భాగవతము)

పై పద్యములందు శబ్దాలంకారప్రతిబంధము లేకుండుటచే నవి యెంత సరసములుగా నున్నవో చదువరులే గ్రహింతురుగాక.

ఇఁకఁ బోతనార్యునిపై నుండు గౌరవాతిశయమునం గావలయు శ్రీ సీతారామయ్యగా రనుభవవిరోధమును బాటింపక యొకచిత్ర మగుస్వారస్యమును జెప్పియున్నారు. "నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతి నిర్వక్రమై" ఇచ్చటి 'క్ర' అనుదానిలోని క్రావడి యాకారముచే నక్రమును బోలి గజపాదాక్రాంతిని సూచించుచున్న దని స్వారస్యమును వ్రాసి "ఇట్లుపయోగించు శబ్దాలంకారము లనవసరము లని చెప్పుట కెవ్వని కయినను నోరుచెల్లునా ?" అని వ్రాసియున్నారు. అనుప్రాసాది శబ్దాలంకారముల కలంకారత శ్రుతిచమత్కృతినిబట్టి వచ్చుచున్నది గాని లిపిని బట్టి రాలేదు. మఱియు నీ యభిప్రాయము స్ఫురణరూప మగుటచే శబ్దాలంకార మనిపించుకొనదు ఇంతియకాక, నక్రాకారము గలక్రావడి నక్రమునే చుట్టికొనుటలో స్వారస్యము లేదు. మఱియు నొక్కనక్రశబ్దములోని క్రావడిమాత్రమె పయి యభిప్రాయమునకు గమకమై యుండనోపును. కాఁగాఁ దక్కిన రేఫసంయుక్తకకారావృత్తు లీస్ఫురణమున కనావశ్యకములు. అట్టియావృత్తులు లేక శబ్దాలంకారము సిద్ధింపదు గదా. పయి యంశముల నరయఁగా శ్రీ సీతారామయ్యగారు వ్రాసినస్వారస్యము స్థూలదృష్టికి సరసముగా నున్న ట్లగపడినను విమర్శనమున విపరీతముగా నగపడును.

క. "గిరులం దరులం జరులన్, మరులన్ గురుతరుల సరుల మరలన్ నెమకున్
విరివిరిపొదలన్ రొదలన్, బోరిబోరిఁ గను సీను వియుక్తిఁ బొరలున్ దొరలున్."

"ఈ పద్యముఁ జదివిన ప్రతిమానవునికిని రాముఁడు బడినకష్టము లన్నియుఁ గన్నులఁ గట్టిన ట్లుండును. లఘుస్వరములు వరుస వెంబడి వచ్చుటతో నారస ముప్పతిల్లినది. సందర్భోచితముగ ధ్వన్యనుకరణము కూడ రసోత్పత్తికిఁ గారణంబగును" అని శ్రీ సీతారామయ్యగారు వ్రాసియున్నారు. పయి యుదాహరణము శబ్దాలంకారములు రసస్ఫూర్తిని జేయు ననుట కిచ్చిన యుదాహరణములలో నొకటి. పయిపద్యమునందలి లఘుస్వరములు వరుసవెంబడి వచ్చుట శబ్దాలంకారము కాదు, అది విప్రలంభశృంగారనియత మాధుర్యగుణమునకు వ్యంజకమగు వర్ణసంఘటన యని యాలంకారికులు చెప్పుదురు. ఇందుఁ గేవల హ్రస్వస్వరములె గాక యట్టిస్వరములచే నంతరితము లగు రేఫప్రయోగములును, వ్యస్తపదరచనయు, మాధుర్యగుణాభివ్యంజకము లయి యున్నవి.

"వర్ణాః సమాసో రచనా తేషాం వ్యంజకతా మితాః
మూర్ధ్ని వర్గాంత్యగాః స్పర్శా అటవర్గా రణౌ లఘూ
అవృత్తిర్మధ్యవృత్తిర్వా మాధుర్యే రచనా తథా"

అని కావ్యప్రకాశమున మమ్మటునిచేఁ జెప్పఁబడినది. ఇందు "రణౌ లఘూ" అనుదానికి "లఘూ హ్రస్వస్వరాంతరితౌ రణౌ రేఫణకారౌ" అని వ్యాఖ్యానము చేయఁబడెను. ఈ మాధుర్యగుణము "చిత్తద్రవీభావమయో, హ్లాదో మాధుర్యముచ్యతే, సంభోగే కరుణే విప్రలంభే శాంతే౽ధికం క్రమాత్" అను విశ్వనాథసూక్తిఁ జొప్పున నిచటి విప్రలంభశృంగారమునకు నియతమగుగుణమయి యున్నది.

మఱియుఁ బైనుదాహరింపఁబడిన శ్రీ సీతారామయ్యగారి వాక్యములందు, "లఘుస్వరములు వరుసవెంబడి వచ్చుటచే రసముత్పత్తి యయ్యె ననియు, 'సందర్భోచితముగ ధ్వన్యనుకరణము కూడ రసోత్పత్తికిఁ గారణం బగు ననియు" జెప్పఁబడియున్నది. వేఱొకచోట నిట్లు "అలంకారము రసమును పుట్టించును" అని వ్రాసియున్నారు. గుణములు గాని యలంకారములు గాని రసోత్పత్తికిఁ గారణములు కానేరవు. రసములకును గుణాలంకారములకును గార్యకారణభావమును జెప్పుట సర్వాలంకారిక సమయవిరుద్ధము.

శ్రీ సీతారామయ్యగా రేకారణముననో వ్రాయలేదు గాని పయిరామాభ్యుదయములోని పద్యమునందు రేఫావృత్తిరూప మగు ననుప్రాసాలంకారము లేకపోలేదు. అనుప్రాసము రసోపకారకమె యయ్యు నది రసోపకారవిషయమున గుణములవంటి నియతధర్మము కాదు. అనుప్రాసము శబ్దార్థ శోభాకరమై తద్ద్వారమున రసమున కుత్కర్షమును గూర్చును. గుణములు స్వయముగనె రసోపకారకము లగును. రస మున్నచోటుల గుణము లుండును. రసము లేక గుణము లుండవు. అలంకారము లన్ననో యట్లుకాదు. రసము లేనిచోటులందును నలంకారము లుండును. రస ముండుచోటుల నలంకారములు లేకపోవచ్చును. అందు శబ్దాలంకారములు బొత్తిగా లేకపోవచ్చును. కాఁబట్టి పై పద్యమునందలి యనుప్రాసము రసోపకారకమయి యున్నను రసోపకారవిషయమున శబ్దాలంకారమగు నది నియతము కాదని చెప్పియున్నాను. పయియభిప్రాయములె శ్రీ సీతారామయ్యగారు సమ్మతించిన మమ్మటుఁడును స్పష్టముగా వివరించియున్నాఁడు—అయ్యవి చదువరులకు విశదపడుటకై యుదాహరించెదను.

"యే రస స్యాంగినో ధర్మా, శ్శౌర్యాదయ ఇవాత్మనః।
ఉత్కర్ష హేతవ స్తేస్యు రచలస్థితయో గుణాః" ॥

అని కావ్యప్రకాశమున నున్నది. ఇందలి "అచలస్థితయః" అనుదానికి "అచలా స్థితి ర్యేషాం తే ఇతి విగ్రహః...నియతస్థితయ ఇతి యావత్ ...అవ్యభిచారేణ రసోపకారకత్వం...అలంకారాణాంతు రసవ్యభిచారిస్థితిత్వేన నియమేన రసోపకారకత్వాభావేన తేషు నాతిప్రసంగః" అని వ్యాఖ్యానము చేయఁబడెను.

"ఉపకుర్వంతి తం సంతం, యేంగద్వారేణ జాతుచిత్ ।
హారాదివ దలంకారా, స్తేనుప్రాసోపమాదయః"॥

"యేచ వాచక వాచ్య లక్షణాంగాతిశయముఖేన ముఖ్యం రసం సంభవినముపకుర్వంతి తే కంఠాద్యంగానా ముత్కర్షాధానద్వారేణ శరీరిణోపి ఉపకారకాః హారాదయ ఇవాలంకారాః" అని కావ్యప్రకాశమున వ్రాయఁబడియున్నది. పయియంశములను బరిశీలింపఁగా నలంకారము లనావశ్యకము లను శ్రీ రామలింగారెడ్డిగారి సిద్ధాంతము సమంజస మని స్ఫురింపకపోదు.

అనుప్రాసాదిశబ్దాలంకారము లనియతములగు రసోపకారకశబ్దధర్మములు. అవి కూర్చుటలో లోపములు లేకున్నచో నవియుఁ గావ్యశోభాకరములె యగును. పై రామాభ్యుదయపద్యమున రేఫల కసకృదావృత్తికై "మరులఁ" "విరి విరి" మొదలగుస్వారస్యము లేనిపదములు ప్రయోగింపఁబడెను, 'పొరలుఁ' 'దొరలుఁ' అనునవి పర్యాయపదములయ్యు విభిన్నములగఁ బ్రయోగింపఁబడెను. మఱియు రేఫసామ్యమునకుఁ గావలయు శ్రీ సీతారామయ్యగారు గ్రాంథికభాషను వ్రాయఁగోరువారయ్యు "చఱులఁ" అనుదానిలోని శకటరేఫమునకుఁ బ్రతిగ రేఫమును వ్రాసిరి—

"కమలాక్షునర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ" అనుదాని నుదాహరించి "ఇందు శబ్దాలంకార (లాటానుప్రాసము) మెంత యర్థము కలిగి రసపోషణమున కెంతతోడ్పడెనో బుద్ధిమంతు లూహించుకొందురు గాక." అని శ్రీ సీతారామయ్యగారు వ్రాసియున్నారు. అర్థాలంకారములె గాక శబ్దాలంకారములును రసస్ఫూర్తి జనకములే యని స్థిరపఱచుటకై వీరు పై యుదాహరణము నిచ్చిరి. కాని యిందు వీరు చూపిన రమణీయత యర్థాలంకారమగు నసన్వయమువల్లనే కలుగవలసియున్నది. ఇట్టిచోటులందలి శబ్దైక్య మన

నన్వయమున కానుషంగిక మగుధర్మ మని యాలంకారికు లభిప్రాయపడియున్నారు. "అనన్వయేచ శబ్దైక్య మౌచిత్యా దానుషంగికం" అని విశ్వనాథుఁ డుదాహరించి యున్నాఁడు. లాటానుప్రాసము లేక యనన్వయ ముండనే యుండదు.

"ధ్వన్యర్థము సామాన్యార్థమునకుఁ దోడై కథాసందర్భంబును మనంబుల నెక్కుడు స్ఫుటముగ చిత్రింపఁగలిగినచో నాశ్లేష సార్థకము" అని శ్లేషాలంకారమును గుఱించి చెప్పుచు శ్రీ సీతారామయ్యగారు, శ్లేష ధ్వనుల కైక్యమును బ్రతిపాదించుచున్నారు. ఆలంకారికు లెవ్వరును—వీరలంకారతత్త్వవిచారమున గ్రహించిన యాలంకారికు లెవ్వరును శ్లేషధ్వనుల కైక్యము నంగీకరించి యుండ లేదు. వీ రంగీకరించిన మమ్మటుఁడును, శ్లేషను ధ్వనిని విభిన్నములు గానే చెప్పి యున్నాఁడు. కావున ధ్వనియును శ్లేషయు నభిన్నము లనుట యాలంకారికసమయ విరుద్ధము.

మొత్తముమీఁద శ్రీ సీతారామయ్యగారి యభిప్రాయములను బరిశీలింపఁగా వీరును బ్రాచీనాలంకారిక సిద్ధాంతములను బ్రమాణములుగ సంగ్రహించిన ట్లగపడదు.

"ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ" అనుదండిలక్షణములోని పదావళీశబ్దమును బట్టి వీరు "కావ్య మన నొకగ్రంథము కా దని (దండిలక్షణముచొప్పున) స్పష్టమగుచున్నది." అని వ్రాసిరి. కాని గ్రంథమును బదావళీరూపమే యగుటచే వీరు చేసినయర్థము సరి కా దని చెప్పవచ్చును. మఱియుఁ బదావళీశబ్దమునకు వాక్య మనునర్థము వాచ్యార్థ మనియు, వాక్యసముదాయ మనునర్థము లక్ష్యార్థ మనియు వీ రభిప్రాయపడియున్నారు. ఇదియు నాలంకారికమతవిరుద్ధమే యని చెప్పనగును.

"స్వార్థబోధసమాప్తానా, మంగాంగిత్వవ్యపేక్షయా ।
వాక్యానా మేకవాక్యత్వం, పునస్సంహృత్యజాయతే" ॥

అను నభియుక్తోక్తిచే వాక్యసముదాయమునకును నేకవాక్యత సిద్ధించుచున్నది. కావుననే విశ్వనాథుఁడు "ఇత్థం వాక్యం ద్విధామతం" అని వాక్యమును ద్వివిధముగాఁ జెప్పియున్నాఁడు.

"శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ, జీవితం వ్యంగ్యవైభవం" అను విద్యానాథసూక్తి నాధారముగాఁ జేసికొని "విద్యానాథుఁడు కూడ ధ్వని కావ్యమున కంగ

మని చెప్పెను" అని శ్రీ సీతారామయ్యగారు వ్రాసియున్నారు. పయికారిక లోని వ్యంగ్యవైభవశబ్దమునకు ధ్వనియని యర్థము చేయవలసియున్నది. కావున ధ్వని కావ్యజీవిత మని విద్యానాధుఁడు చెప్పియుండఁగా ధ్వని కావ్యమున కంగ మని విద్యానాధుఁడు చెప్పినట్లు వ్రాయుట మిక్కిలి వింతగా నున్నది.

"ధ్వని కావ్యమునకు ఖండితముగ నుండవలసిన లక్షణ మని చెప్పుటకు నోరాడక పోయినను అనవసరము కా దనియు నుపయోగించిన రసపోషణమునకుఁ దోడ్పడు ననియు గట్టిగఁ జెప్పవచ్చును. కావ్యగుణములలో ముఖ్యమయినదాని గ్రహింపవచ్చును." అని శ్రీ సీతారామయ్యగారు వ్రాసియున్నారు. రసము ధ్వని భేదములలో నొకటి యనుట సర్వాలంకారిక సమ్మతము. కాఁగా రసాత్మకకావ్య మునకు ధ్వనిసామాన్యము, 'ఖండితముఁగ నుండవలసిన లక్షణ మని చెప్పుటకు నోరాడక' పోవు టెట్లో తెలియకున్నది. ధ్వన్యవాంతరభేద మగురసమె కావ్య మునకు జీవిత మయియుండఁగా ధ్వని రసపోషక మని గాని కావ్యగుణ మని గాని చెప్పుట శాస్త్రీయ మగునా? ధ్వనికావ్య ముత్తమ మని శ్రీ సీతారామయ్యగా రంగీకరించిన మమ్మటుఁడే చెప్పియున్నాఁడు. "తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునఃక్వాపి, ఇదముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః." (కావ్యప్రకాశము)—

ధ్వని 'రసపోషణమునకుఁ దోడ్పడు' ననియు నది 'కావ్యమునకు ఖండిత ముగ నుండవలసినది' కా దనియు మీరు పలుకుటకు ధ్వనిశ్లేషల కభేదము నంగీక రించుటయే కారణమై యుండును. ఇది మీ రుదాహరించిన యాలంకారికుల కంద ఱకు నసమ్మతమె యని యింతకు ముందె వ్రాసియున్నాను.

"జగత్సంహారోన్ముఖుఁ డైనరుద్రుక్రియ రౌద్రప్రక్రియం బొల్చినన్" అను దానియందలి యలంకారమును వర్ణించుచు "నాల్గవపాదంబున నుపయోగించిన యలంకారమును జూడుఁడు. అది రౌద్రబీభత్సరసప్రతిపాదకము" అని వ్రాసిరి. "జుగుప్సాస్థాయిభావస్తు బీభత్సః కథ్యతే రసః . . . . . . దుర్గంధమాంసపిశితమే దాం స్యాలంబనం మతం, తత్రైవ కృమిపాదాద్య ముద్దీపన ముదాహృతం" అను మొదలగు లక్షణములు గలబీభత్సరస మీపాదార్థమున నేరీతిని సంఘటించునో తెలియకున్నది.

మీ రలంకారశాస్త్ర విషయముననే గాక వ్యాకరణశాస్త్ర విషయమునను

నిట్లే లోకమునకు వెలిచి గ్రాంథికభాషానుసరణమున కంగీకరించిన ట్లగపడచు న్నది. పాపము! అమాయకు లగు గ్రాంథికభాషావాదులను సంతోషపెట్టుట కే పుటఁజూచినను వలసినన్ని యథార్థానుస్వారములు, శకటరేఫములు, సరళాదేశ ములు నగపడునట్లు వెదచల్లిరి. గ్రాంధికవాదులకు వాంఛిత మింతేగదా. గ్రంథ కర్తగారు శతాధికముగ వ్యావహారికపదములను బ్రయోగించినను నవి యెల్ల నచ్చుతప్పులనియు బొత్తిగాఁ గుదురనపుడు గ్రంథకర్తగారి ప్రమాదములనియు ననుట కవకాశ ముండును. ఒకపక్షమున వీరు కేవలవ్యావహారికపదములను బర శ్శతముగఁ బ్రయోగించుటచే వ్యావహారికభాషానుసారులే యనుట కవకాశ ము న్నను నట్లు బహిరంగముగఁ జెప్పుటకు వీలు పడదు. ఏమన:—ఏతద్గ్రంథమాలి కాసంపాదకులు "భాషను గ్రాంథికముగా వ్రాయవలయు ననియే మాప్రయ త్నము" అని వ్రాసియున్నారు 'ఇంతలేసి' పండితులును బ్రవేశపరీక్షాబాలురు చేయవలసినపనికై యంతప్రయత్నింపవలయునా? నిజముగా నిట్టివారు ప్రయ త్నించినపు డది దుస్సాధ మగునా? శ్రీ సీతారామయ్యగారును దొలిపలుకులో "తప్పులు మెండుగ గలవు. గాన పాఠకులు క్షమియింపవలయును" అని గ్రాంథిక వాదులను సంతోషపెట్టుటకే కావలయును వ్రాసియున్నారు. ఇట్లే శుద్ధపత్రము నందును వీరు "కొన్నితప్పుల నిట దిద్దుచున్నాను" అని యపూర్వముగ వ్రాసిరి. మిగిలిన తప్పుల నేలదిద్దకుండిరో? అరయనరయ నీ వ్రాఁతలు వ్యావహారికవాదు లకును గొంచె మాశ చూపుచున్నవా యని తోఁచుచున్నది.

పైయంశములు చదువరులకు విశదపడుటకై 'యలంకారతత్త్వవిచారము' లోని వ్యావహారికప్రయోగములను నర్థానుస్వార శకటరేఫసరళాదేశ విషయక నియమాభావమును నిట నుదాహరించెదను. అర్థానుస్వార శకటరేఫ సరళాదేశ ముల నియమాభావాదికము సామాన్యముగా నంతటను నగపడచుండుటచే వానికి దిఙ్మాత్రముగ నుదాహరణముల నిచ్చుచున్నాను.

అర్థానుసారవ్యత్యాసము:—పెరిగి (1 పుట). తోఁచుచున్నది (5 పుట) చే బూని (3 పుట). ఏఁటిలో (60 పు).

శకటరేఫవ్యత్యాసము:—ఎల్లఱకు (57 పుట). దగ్గర (82 పుట) వరలు (44 పుట) జారు (50 పుట). చరులక్ష (23 పుట).

సరళాదేశవ్యభిచారమునకు:—ప్రథమమున కావ్య మన, మొదట తీసికొం

దము, లక్షణమును చూచిన, రమణీయార్థమును ప్రతిపాదించిన (1 పుట). రాముఁడు బడిన (23 పుట).

అక్షరవ్యత్యాసములు :—శ్రృతి (47, 48 పుట). కొంచము. (66 పుట). అవిశవృక్షము (64 పుట).

వ్యావహారికార్థప్రయోగములు :—ఖండితముగ (6 పు). అవసరలక్షణమో (13 పు). అభ్యంతరము (64 పు).

ధర్మధర్మిభావవ్యత్యాసము :—సానుభూతి కలిగి యుండవలయును (3, 4 పుటలు). జ్ఞాపకముండదు (10 పుట). అసహ్యకరము (44 పుట).

## వ్యావహారికపదప్రయోగములు.

పుట.

1. లక్షణయా
4. ఉదహరించి (పెక్కులు గలవు)
5. కనపట్టుచున్నవి లక్షణమునందుకంటె
6. కనిపెట్టెను
7. చాలమంది (పెక్కులు) అంతిరయే ( „ )
11. స్ఫురించుచున్నఁగూడ (పెక్కులు)
14. పొరబాటు, పుస్తకము. మధ్యత్రోవ,
16. అందఱిచేత (పెక్కులు)
19. వ్రాతును (పెక్కులు) ఇది వ్యాకరణములచే సాధువుకాదు.

పుట.

21. ఇదివఱకు (పెక్కులు)
36. వేసుకొని (పెక్కులు)
49. కనపడకుండ
53. గెలచు ప్రతివ్రాతగాడు (పెక్కులు)
39. ప్రతియంశము (పెక్కులు)
85. ఇయ్యమని
97. శ్రీనాథునియందుకంటె, దగ్గిరికి

వీనిలోఁ బెక్కులని వ్రాసిన జాతిపదములు గ్రంథమున ననేకములుగలవని చదువరులు గ్రహింపవలెను.

## కళాద్రుతప్రకృతికతావ్యత్యాసము.

పుట.

4. ఎవనినో నొకని
6. చాలయద్భుతము
8. తప్పక నుపయోగించు
14. ఎల్లయిూయన
43. కూడ యలంకారములు
66. తప్పయాస్పర్శనము
73 ఈ విధముగ యావశ్యకములు.

పుట.

76 దానికి యుండవు
81. ఇచ్చట యూయన
96. గానయూయన

గ్రంథవిస్తరభీతిచే కొన్నిజాతులు చూపి విరమించితిని గాని పైపట్టికలలోని ప్రయోగములవంటివి పెక్కులు గలవు.

## కొన్నివాక్యములలో నన్వయ మగపడదు.

59. "తుట్టతుదకు విమర్శనాగ్రంథ మయిన శ్రీయుత రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారమునఁ గూడ పుటకు మూఁడునాలుగువంతున నలంకారముల నుపయోగించియున్నాఁడు."

46. "ఆభేదములను నేను చెప్పుటకంటె మఱియొకరి పుస్తకమునుండి యను వదించెద."

49. "సహజసౌందర్యము కనఁబడుచు మధ్యమధ్యభూషణముల ధరించిన నాభూషణములు వన్నెఁదెచ్చును."

"విషయ ముచ్చరింపఁబడవలయు ననియే మాయాశయము" అని సంపాదకులు వ్రాయుటఁబట్టి యీవిషయమున నాకుఁగల యభిప్రాయములను వ్యక్తపఱచితిని. కావున శ్రీ సీతారామయ్యగారు నన్ను మన్నింతు రనియే నమ్ముకొనుచున్నాను.

వఝుల చిన సీతారామస్వామిశాస్త్రి,

విజయనగరము.

బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి కవిరాజప్రణీతం బయిన శ్రీకృష్ణభారతమం దలి యాదిసభాపర్వములు గల పుస్తకము కృతజ్ఞతాపూర్వకముగా నందికొని, గ్రంధ మచ్చటచ్చటఁ గుతూహలాయత్తచిత్తముతోఁ జదివి యానందించినా రము. కవితాధార యనర్గళ మైనది. శైలి సుప్రసన్నమయి, మనోహరముగా నున్నది. మొత్తముమీఁదఁ గవిత్వము చదువుటకేమి, వినుటకేమి యింపయి, మృదువై, బహుభంగులఁ బ్రాచీనకవిత్వమును బోలి యున్నది.

సుప్రసిద్ధ మగు కవిత్రయకృతాంధ్రభారత ముండ నీ గ్రంథమేల రచింప వలయు నని యనేకులకుఁ దోఁపకమానదు. కాని—

"కలికల్మషహార మనియుం, గలకాలపుఁగోర్కి యనియుఁ గడఁగితి దీనిం, దెలిఁగింప" నని యాశంకకు సమాధానము కవి కృత్యాదియందె యొసంగెను.

ఈ భారతము గూడ రాజమహేంద్రపురముననే వెలువడుట విశేషము. అచిరకాలమున నిర్విఘ్నముగా గ్రంథపరిసమాప్తి యగున ట్లీశ్వరుఁడు ప్రసాదించుఁ గావుత. ఆదిభారతముం బోలి యిదియు నాంధ్రలోకమం దెల్లెడల నాచంద్రా ర్కముగాఁ బ్రకాశించుఁగాత.

ఇట్టిమహారంభమునకుఁ దోడ్పడిన శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారిపుణ్య మనల్పము.

జ. రా.

---

# విజ్ఞాపనము.

ఆర్యవర్యులార !

మే మీపత్రికయందుఁ బ్రకటించుచున్న ఋగ్వేదికవి వేంకటాచలపతి కవి ప్రణీతంబైన చంపూరామాయణము ప్రతి మాయొద్ద నొక్కటియే యున్నది. ప్రత్యంతరము లేనికారణమున సంస్కృతము చూచినను దీనిని సందేహములు పెక్కులు కలుగుచున్నవి. దయచేసి యెవ్వరి యొద్దనైన వేఱొక ప్రతియున్నచో నొక్కసారి పంపించెదరని వేఁడుచున్నారము. పని తీఱిన వెంటనే ముద్రిత ప్రతితోఁగూడ వారిప్రతిని వారికి వందనపూర్వకముగఁ బంపి వైచుచున్నారము.

ఇట్లు : బుధవిధేయుఁడు,

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాసంపాదకుఁడు.

చందా సం॥ కు రూ. 3—0—0.    విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 4. | రాక్షసనామసంవత్సరము కార్తిక, మార్గశిర, పుష్యమాసములు | సంచికలు 9-10-11





# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.

# విషయసూచిక

# అర్థశాస్త్రచరిత్ర.

అర్థశాస్త్రచరిత్ర వ్రాయుటకుఁ గలయల్పసామగ్రిలో నాకుఁ దెలిసినది యత్యల్పాంశము. విపులతరములగు ప్రయత్నములకుఁ బ్రోత్సాహకముగా నుండు నని యింతమాత్రము వ్రాయుచున్నాఁడను.

ఆదినుండియు మనవారు పురుషార్థముల నాల్గువిభాగములుగా నొనర్చిరి. తదనుసారముగాఁ దమశాస్త్రములను ధర్మశాస్త్రములు, అర్థశాస్త్రములు, కామ శాస్త్రములు, మోక్షశాస్త్రములు నని నాల్గువిధములుగా విభజించిరి.

మఱియొక విభాగమును గలదు. శ్రుతి, స్మృతి, ఆగమము, పురాణము నిత్యాది. వేదములు, వేదాంగములు, నుపవేదములు, నుపాంగములు, శాస్త్రములు మొదలయినవి మఱియొక విభాగము.

శుక్రనీతియందలి "విద్యాకలానిరూపణ" మను నధ్యాయముంబట్టి చూడఁగా స్మృతి యన—

"వర్ణాది ధర్మస్మరణం యత్ర వేదాఽవిరోధకమ్ ।
కీర్తనం చార్థశాస్త్రాణాం స్మృతి స్సాచ ప్రకీర్తితా"॥

అని వ్రాయఁబడియున్నది. ఈ శ్లోకముచే నర్థశాస్త్రము స్మృతియం దొక భాగ మైనట్టు దెలియుచున్నది. అట్లుండియు ముప్పదిరెండువిద్యలలో స్మృతి యని యొకటి యర్థశాస్త్ర మని మఱియొకటియు వ్రాసియున్నాఁడు. అర్థశాస్త్రమునకుఁ దక్కినవిద్యలతో సమము ప్రత్యేకముగా నిర్వచనము నిచ్చియున్నాఁడు. ఎట్లన—

శ్రుతిస్మృత్యవిరోధేన, రాజవృత్తాదిశాసనమ్ ।
సుయుక్త్యార్థార్జనం యత్ర అర్థశాస్త్రం త దుచ్యతే॥

అని యిట్లుండుటచేఁ గొంత సందియమున కెడము గలుగవచ్చును. 'కీర్తనం చార్థశాస్త్రాణాం' అనుటచేతఁ జాతుర్వర్ణ్యముం గూర్చి వ్రాయు స్మృతికారుఁడు రాజులు చేయవలసిన కృత్యములు, ముఖ్యముగా, ధర్మవిచారణ యధికరణములు (కోర్టులు) మొదలగు విషయములు స్మృతులయందు విపులముగ వ్రాయును. రాజనీతిబోధకము లగునర్థశాస్త్రములందు ధర్మస్థాపన విషయము మిక్కిలి ప్రభా

న్యమైనపని గనుక శాస్త్రగ్రంథములయందు గొప్పగొప్ప యధ్యాయములు ధర్మమును బోధించునవి గలవు. అందుచేత అర్థశాస్త్రము స్మృతిలో నొకభాగమును, స్మృతి యర్థశాస్త్రములో నొకభాగమును నగుచున్నవి. అర్థశాస్త్రకారులు తమశాస్త్రమునందలి 'ధర్మస్థీయము' లందు స్మృతినంతయు వ్రాయుచుండిరి. స్మృతికారులు ధర్మవిషయములకు సంబంధించి రాజనీతియంతయు వ్రాయుచుండిరి. ఈకారణముచేతనే యాజ్ఞవల్క్యులనాఁటికే కొన్నిచిక్కులు గలిగి యామహర్షి తన స్మృతియందు—

'అర్థశాస్త్రాత్తు బలవాన్ ధర్మశాస్త్ర మితి స్థితిః'

అని ధర్మశాస్త్రమున కాధిక్యము నాసించెను. స్మృతికి నర్థశాస్త్రమునకును గల సంబంధ మింతయే గాని వేఱుగా దని నాయభిప్రాయము.

అర్థశాస్త్రముయొక్క యుత్పత్తింగూర్చి శ్రీమన్మహాభారతమున నిట్లు చెప్పఁబడియున్నది. ఇప్పటివారివలెనే పూర్వులును బ్రజలయందలి జన్మముచేఁ గల సమత్వమును బ్రపంచమునందు జీవమునందును స్థితియందును గల తారతమ్యమును గూర్చి యనేకప్రశ్నలు చేయుచుండిరి. జనులందఱు నొక్కతీరుననే జన్మించుచుండఁగా హెచ్చు తగ్గు లేల కలుగవలయును. ఒకటిపై మఱియొకరి యధికారమేల ? ఒకరిస్వాచ్ఛంద్యమును మఱియొక రేల నిరోధింపవలయును ? ఈసందేహము న్యుల యధికారముక్రింద నలఁగు సామాన్యజనులకుం గాక, రాజులనందఱను జయించి రారాజుగనున్న ధర్మరాజునకే కలిగెను. అతఁడు భీష్ముని సమీపించి ప్రశ్నించుచున్నాఁడు. [హిందువుల మతమున 'అరిజిన్ ఆఫ్ స్టేట్' ఎట్లో తెలియఁగలదు.]

"య ఏష రాజన్ రాజేతి శబ్దశ్చరతి భారత ।
కథ మేష సముత్పన్నః తన్మేబ్రూహి పరంతప"॥

సీ. "రాజనామమునకు భాజనం బై మహాద్భుతచరిత్రుం డగుపురుషుఁ డొకఁడు
గలిమికి మూలంబు ఘనవి శేషము గల్గనోపుఁ గౌరవకులదీపజనన
యది యెఱిఁగింప వే యవయవంబులుఁ బ్రాణ మానసంబులు జన్మమరణములు శ
రీరయాత్రలు నెల్లవారికి నెట్లట్ల కాని విభేదంబు గాన మిట్టి

గీ. రాజొకండు శూర తేజస్విబుద్ధిమ, జ్జనుల నెల్లుదనవశంబు సేయ
నిలుపఁజెరుప నెల్లయిలయును నేలదై, వనిభుఁడగుచు మ్రొక్కఁగొనఁగఁజాలె?
అమ్మనుజపతి కమ్మహాత్ముం డిట్లనియె.

క. విను తొల్లి కృతయుగంబున, మనుజులయెడ దండనీతిమంతుం డై రా
జన నొకఁడు గలిగి యరయుట, మనుజేశ్వర లేదు ధర్మమతి మంత్రపు దగన్.

క. ఒండొరులకు రక్షకులై, యుండుదురట్లుండ దైన్య మొదవిన లోభం
బొండొండ పెరిఁగి ధర్మము, ఖండితమై మొదలుకొని రకార్యంబులకున్.

క. క్రమమునఁ గామము రాగము, దమమన ముల నొదవఁగా మదం బెక్కిన వి
భ్రమ మొందుచు విచ్చలవిడి, విమార్గచరితముల వేదవిధ్వంసకు లై.

క. మనుజులు ధర్మము బొడవడఁ, చిన వేదము గర్మములును జెడుటకు భయమం
దినయింద్రాదులు గమలా,సనుఁ గానఁగ మునులుఁ దారుఁ జనిరి నరేంద్రా.

చని ..రక్షింపు మని పలికిన వెఱవవల దని పలికి స్వామ్యమాత్యరాష్ట్ర దుర్గకోశసుహృద్బలంబులు, నాన్వీక్షకీత్రయీ వార్తాదండనీతులును, నరమిత్రోదాసీనాదికద్వాదశరాజమండలంబులును, సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులును మొదలుగా వలయువానికిం బ్రబోధకంబు లగునానావయవంబులు గలిగి ధర్మార్థకామమోక్షంబులకు సాధకంబై యుండునట్లుగా నూఱువేల యధ్యాయంబుల నఖిలలోకహితం బగునీతిశాస్త్రంబు రచియించి యనుగ్రహించె.

"తతోఽధ్యాయసహస్రాణాం శతం చక్రే స్వబుద్ధిజం
యత్రధర్మ స్తథైవార్థః కామ శ్చైవాభి వర్ణితః
త్రివర్గ ఇతి విఖ్యాతో గణ ఏష స్వయంభువా
త్రయీ చాన్వీక్షకీ చైవ వార్తాచ భరతర్షభ
దండనీతిశ్చ విపులా విద్యా స్తత్ర నిదర్శితాః"

అంతట "అనాదినిధనుండును విశ్వజగత్కర్తయు ...... నగువిరూపాక్షుండు విశాలాక్షుం డనునామంబున నావిర్భవించి యాగ్రంథం బధిగమించి దానినభ్యసించుటకు మర్త్యుల కాయుర్వృద్ధులు సాల వని యుమ్మలించి యమ్మహనీయతంత్రంబు సంక్షేపరూపంబునం బదివేలధ్యాయంబుల వైశాలాక్షం బన నిర్మించె.

"హరుని వలనఁబడసి యాశాస్త్ర మమరేంద్రుఁ డయిదువేలు సేసె నమరగురుఁడు
దేట పడ నొనర్చెఁ ద్రిసహస్రకాధ్యాయ రూపసమ్మితముగ భూపవర్య.

దాని శుక్రుండు సహస్రాధ్యాయపరిమితంబు గావించె మఱియు మనుష్యులశక్తి యెఱింగి మునులు సంక్షిప్తరూపంబులుగా గ్రంథంబులు గావించిరి.

పాసన్యృతమునఁ గొంచెము విపులతరముగాఁ గానంబడుచున్నది.

[తత స్తాం భగవా న్నీతిం పూర్వం జగ్రాహ శంకరః
బహురూపో విశాలాక్షః శివ స్థాణు రుమాపతిః
ప్రజానా మాయుషో హ్రాసం విజ్ఞాయ భగవా ఞ్ఛివః
సంచిక్షేప తతః శాస్త్రం మహార్థం బ్రహ్మణా కృతం
వైశాలాక్షమితి ప్రోక్తం తదింద్రః ప్రత్యపద్యత
దశాధ్యాయసహస్రాణి సుబ్రహ్మణ్యో మహాతపాః
భగవా నపి తచ్ఛాస్త్రం సంచిక్షేప పురందరః
సహస్రైః పంచభిః స్తాత యదుక్తం బాహుదంతకం
అధ్యాయానాం సహస్రై స్తు త్రిభి రేవ బృహస్పతిః
సంచిక్షే పేశ్వరో బుద్ధ్యా బార్హస్పత్యం తదుచ్యతే
అధ్యాయానాం సహస్రేణ కావ్యః సంక్షేప మబ్రవీత్
తచ్ఛాస్త్ర మమితప్రజ్ఞో యోగాచార్యో మహాయశాః
ఏవం లోకానురోధేన శాస్త్ర మే తన్మహర్షిభిః
సంక్షిప్త మాయుర్విజ్ఞాయ మర్త్యానాం హ్రాస మేవచ]

రాజ్యోత్పత్తి శాస్త్రమునకును (థియొరీ అఫ్ స్టేట్) హిందువుల పూర్వు లెట్లు రాజ్యోత్పత్తిని గుఱించి విచారించిరో యెట్లు వారిహృదయములు తృప్తి జేసికొనిరో యెఱుంగుటయు మంచిది. దండమును గుఱించి దండనీతియు మహా భారతమున నన్యత్ర యిట్లు వర్ణింపంబడియున్నది. తెనుఁగున శాంతిపర్వతృతీయా శ్వాసము 116–121 చూడుఁడు.

" . . . . దండాభావంబున జగంబు గలంగు టెఱిఁగించిన నవ్విరించి పలు పలు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండ నీతి కాశ్రయుం డై పరంగుచుండె.

సీ. "వినుము ఋగ్వేదాదివేదముల్ నాలుగుఁ గల్పాదు లైనయంగంబు లాఱుఁ
గూరసి విద్యలు పది పేర్చు పురాణంబు లనియును నొకవిద్య యధిప ధర్మ
విదులు సెప్పెడు శాస్త్రవితతి యంతయు నొకవిద్య సర్వన్యాయవిస్తరంబు
నొకటి మీమాంస దానొకటి యిట్టులు వివరింపఁ బదునాల్గు విద్య లయ్యె
వైద్య కోదండ గాంధర్వవిద్య లర్థశాస్త్ర మను నీతివిద్య తత్సహితవృత్తి"

[తిక్కనమతమున నర్థశాస్త్రమన్న నీతివిద్య మూలమున 'అర్థశాస్త్రం చతు

ర్థంతు' అని మాత్రమున్నను దాను స్వతంత్రించి యిట్లు [వ్రాసెను.] వెలయఁగాఁ బదునెనిమిదివిద్య లభవుఁ డేర్పరించె జగత్త్రయహితము పొంచె ... ... ... ... దండనీతిప్రపంచంబు లయిన యవ్విద్యలను విష్ణువశగతింబులు సేసె ...... విష్ణుండు దండనీతిశాస్త్రంబు సకలంబు నాంగిరసునకు నిచ్చె నాంగిరసుఁ డింద్ర మరీచులకు, మరీచి భృగునకు, భృగుం డనేకమునులకు నిచ్చె."

సంస్కృతిభారతమునఁ బాలనబాధ మానవులకే గాక సర్వభూతములకుం గలిగినట్లును—వసుహోమ ఉవాచ—

శృణు రాజన్ యథాదండః సంభూతో లోకసంగ్రహః।
ప్రజావినయరక్షార్థం ధర్మస్యాత్మా సనాతనః॥
... ... ... ...
.. ... ... ...
పరస్పరం విలుంపంతి సారమేయా యథామిషం
అబలాన్ బలినో ఘ్నంతి నిర్మర్యాద మవర్తత
తతః పితామహో విష్ణుం భగవంతం సనాతనం
సంపూజ్య వరదం దేవం మహాదేవ మథాబ్రవీత్
అత్ర త్వమనుకంపాం వై కర్తు మర్హసి కేశవ
సంకరో నభవే దత్ర యథా తద్వై విధీయతాం
తతః సభగవాన్ ధ్యాత్వా చిరం శూలవరాయుధః
ఆత్మాన మాత్మనా దండం ససృజే దేవసత్తమః
తస్మాచ్చ ధర్మాచరణాత్ నీతి ర్దేవీ సరస్వతీ
ససృజే దండనీతిం సా త్రిషు లోకేషు విశ్రుతా
భూయ స్స భగవాన్ ధ్యాత్వా చిరం శూలవరాయుధః
తస్య తస్య నికాయస్య చకారైకైక మీశ్వరం
దేవానా మీశ్వరం చక్రే దేవం దశశతేక్షణం
యమం వైవస్వతం చాపి పితౄణా మకరోత్ ప్రభుం
ధనానాం రాక్షసానాంచ కుబేర మపి చేశ్వరం
పర్వతానాం పతిం మేరుం సరితాంచ మహోదధిం
అపాంరాజ్యే సురాణాంచ విదధే వరుణం ప్రభుం
మృత్యుం ప్రాణేశ్వర మథో తేజసాంచ హుతాశనం

రుద్రాణా మపి చేశా నాం గోప్తారం విదధే ప్రభుం
మహాత్మానం మహాదేవం విశాలాక్షం సనాతనం
వసిష్ఠమీశం విప్రాణాం వసూనాం జాతవేదసం
తేజసాం భాస్కరం చక్రే నక్షత్రాణాం నిశాకరం
వీరుధా మంశుమంతంచ భూతానాంచ ప్రభుం వరం
కుమారం ద్వాదశభుజం స్కంధం రాజానమాదిశత్
కాలం సర్వేశ మకరోత్ సంహార వినయాత్మకం
మృత్యో శ్చతుర్విభాగస్య దుఃఖస్యచ సుఖస్యచ
ఈశ్వర స్సర్వదేవస్తు రాజరాజో నరాధిపః.

భారతమునందలి రెం డితిహాసములను జేర్చి చూచినఁ గొన్నియంశము లేర్పడుచున్నవి. వాని యాథార్థ్యము వెనుక నారయుదము.

(1) దండనీతి యనుగొప్పశాస్త్రమును నూఱు వేల యధ్యాయముల పరిమితి గలదానిని బ్రహ్మ రచించెను.

(2) దానియం దుండువిషయములు :—

| | |
|---|---|
| భీష్మని కథనము | వసుహోముని కథనము. |
| ఆన్వీక్షికి | నాలుగు వేదములు. |
| త్రయి | ఆఱంగములు. |
| వార్త | వైద్యము. |
| దండనీతి | ధనుర్వేదము. |
| స్వామ్యమాత్యాదులు | గాంధర్వము. |
| షాడ్గుణ్యము | అర్థశాస్త్రము. |
| ద్వాదశరాజమండలములు | పురాణము. |
| మొదలైనవి | ధర్మశాస్త్రము. |
| | తర్కశాస్త్రము, మీమాంసము. |

(3) ఈ గ్రంథము రాజులకొఱకై రచింపఁబడెను.

(4) జనులను దమతమ ధర్మములు చేయునట్లును రాజునకు లోఁబడునట్లును జేయుట దీనియుద్దేశము.

(5) ఈ గ్రంథ మనేకులచే సంక్షేపింపఁబడెను. ఎట్లన :—

| భీష్ముని కథనము | వసుహోముని కథనము. |
|---|---|
| బ్రహ్మ | బ్రహ్మ. |
| విశాలాక్షుఁడు | అంగిరసుఁడు. |
| సుబ్రహ్మణ్యుఁడు | ఇంద్రుఁడు. |
| ఇంద్రుఁడు | మరీచి. |
| బాహుదంతుఁడు | భృగువు. |
| బృహస్పతి | మనువు. |
| శుక్రుఁడు | ఇతరమునులు. |
| ఇతరమునులు | |

పై యంశముల యాథార్థ్యము సమగ్రముగ నిర్ణయించుటకుం దగిన సామగ్రి ప్రస్తుతము నాకు లభించినదిగాదు.

కర్తృపరంపర—అన్నిస్మృతులును శాస్త్రములును బ్రహ్మనుండి పుట్టినట్లు గాథ యుండుటచే బ్రహ్మను విడిచిపెట్టవచ్చును. శాస్త్రి మనాదిగా నుండినట్టుమాత్ర మూహింపవచ్చును. విశాలాక్షుఁడు మనవంటి మానవుఁడే. అతఁడుండి గ్రంథముల వ్రాసినట్లు చాణక్యుని యర్థశాస్త్రమున నుండువచనముల వలన స్పష్టము. ఈతఁడు సాక్షాత్ శివుఁడు గాక యొకఋషి యని మన మెన్నుకొనవలయును. ఏలయన: చాణక్యుఁ డెక్కడఁగాని శివుఁడను నర్థము వచ్చు పదాంతరము వాడక 'విశాలాక్షః' అనియే వాడుచున్నాఁడు. సుబ్రహ్మణ్యుఁడు, ఇంద్రుఁడు, మరీచి, అంగిరసుఁడు, భృగువు, వీరిపేరులు గానవచ్చుటలేదు [భృగువు మనుస్మృతియందుఁ బ్రోక్తగ నున్నాఁడు. అర్థశాస్త్రములం దీతనిపేరు నాకుఁ గానంబడినది గాదు.] మనువు, బాహుదంతుఁడు. [బాహుదంతీపుత్రుఁడనుమఱియొకనివచనములు చాణక్యునిగ్రంథమునం దున్నవి.] బృహస్పతి శుక్రుఁడు. ఈ నలుగురు గ్రంథకర్తలుగ నుండినఋషులు. వీరివచనములు నేఁటికిని నిల్చియున్నవి. వీరియందు మనువు మొదటివాఁడు, తక్కినవారు వెనుకటివారు. వారి క్రమము బాహుదంతుఁడు, బృహస్పతి, శుక్రుఁడు నని.

నీతిప్రకాశికం బట్టిచూడఁగా వేదవ్యాసుఁడును, శుక్రనీతివలన వసిష్ఠుఁడును గ్రంథములు వ్రాసినట్టు తెలియుచున్నది. వైశంపాయనుఁ డొక గ్రంథమును వైశంపాయననీతి యనుపేర వ్రాసియున్నాఁడు. ఇతరమునులనిచెప్పఁబడిన వారిలోఁ జాణక్యుని గ్రంథముంబట్టి చూడఁగా, భారద్వాజుఁడు, పరాశరుఁడు,

యము. భాషకు సంపద హెచ్చును. పరిభాషయు వన్నె గల దగును. ప్రస్తుతము క్రొత్తగ్రంథములం దుండు పరిభాషాలోపములను బత్రికలవారు పరిభాషకై పడు కష్టమును దొలఁగును.

బృహస్పతి సూత్రము లిప్పటికిని గలవు. వ్రాఁతప్రతులయందు మాత్రము దొరకుచున్నవి.

శుక్రవిరచిత మగుగ్రంథమునందలి ముఖ్యాంశములు శుక్రనీతిసార మను పేరం దొరకుచున్నవి. శ్లోకరూపముగా నీ గ్రంథమున్నది. దీనిం జదివినఁ బూర్వ నాగరకత విశేషముగఁ దెలియవచ్చును. సర్వశాస్త్రముల యారంభములు దండ నీతియం దున్నవి యని శుక్రునిమతము. శుక్రునిబోధలఁ గొన్నింటిం జూతము.

<u>పౌరుషమే ప్రధానము.</u>—దైవము రెండవది, చూడుఁడు.

ధీమంతో వంద్యచరితాః మన్యంతే పౌరుషం మహత్ ।
అశక్తాః పౌరుషం కర్తుం క్లీబా దైవ ముపాసతే॥

ప్రభువు మొదటఁ దన్నుఁ దాను బాగుచేసికొనవలయును. వెనుక నితరులఁ జేయవలయును.

ఆత్మానం ప్రథమం రాజా వినయే నోపపాదయేత్ ।
తతః పుత్రాన్ తతోఽమాత్యాన్ తతో భృత్యాన్ తతః ప్రజాః॥

రా జెవనిని గాని యప్రయోజకునిఁగా నెంచఁగూడదు.

అమంత్ర మక్షరం నాస్తి నాస్తి మూల మనౌషధం ।
అయోగ్యః పురుషో నాస్తి యోజక స్తత్ర దుర్లభః॥

రాజు హితాహితములు చెప్పు మంత్రులమాట వినవలయును. పనిచేసి చాలించుకొన్నవారికి భృతి (పెన్షన్) నీయవలయును. శాస్త్రములను గళలను బాగుగఁ బోషింపవలయును.

రాజసభయందుఁ బ్రకృతులు.

| | | |
|---|---|---|
| పురోహితుఁడు | ... | Priest. |
| ప్రతినిధి | ... | Viceregent, |
| ప్రధానః | ... | Chief Secretary. |
| సచివుఁడు | ... | Minister of War. |
| మంత్రి | ... | Deplomat. |

| | | |
|---|---|---|
| ప్రాడ్వివాకుడు | ... | Chief Justice. |
| పండితుఁడు | ... | Legislator. |
| సుమంత్రకుఁడు | ... | Financier. |
| అమాత్యుఁడు | . | Minister of Revenue. |

ఇవి యన్నియుఁ బారిభాషికపదములు.

రాజీమంత్రులం జూచి భయము గలవాఁడై నడచుకొనవలయును.

నబిభ్యతి నృపో యేభ్యః తైస్స్యాత్ కిం రాజ్యవర్ధనం.

శుక్రునిమతమున రాజ్యముకొఱకు రాజుగాని రాజుకొఱకు రాజ్యముం డుట గాదు. ముఖ్య మగునధికారముగా నుండినయెడల నొక్కనినే నియోగింపఁ గూడదు. ముగ్గురను నియమింపవలయును.

ఏకస్మి న్నధికారేతు పురుషాణాం త్రయం సదా ।
నియుంజీత ప్రాజ్ఞతమం ముఖ్య మేకంతు తేష్వవై ॥

ఒకనిని 'సీనియర్' గాఁ జేయవలయును.

ఎవనినో యొకని నధికారమున నుంచుట కూడదు. యోగ్యునిమాత్రమే యుంపవలయును.

నాధికారం చిరం దద్యాత్ యస్మైకస్మై సదానృపః
అధికారే క్షమాంల్ దృష్ట్వా హ్యధికారే నియోజయేత్
అధికారమదం పీత్వా కో నముహ్యేత్ పున శ్చిరం.

రాజునకు వచ్చు నాదాయము రెండువిధములు.

(1) పార్థివము = భూమిసిస్తు.

(2) అపార్థివము = ఇతరాదాయము.

అధికరణములు (Courts) ఆలేఖ్యములు (Documents) విపులముగా వర్ణించి యున్నాఁడు. ఇంకను సామాన్యులు సైతము తెలిసికొనఁదగిన విషయము లనేకములు శుక్రనీతియందుఁ గలవు. ఈ గ్రంథప్రాశస్త్యమును బండితకోటి వేయి నోళ్లఁ గొనియాడుచున్నది. ఈ గ్రంథమును జదివినవెనుక నెవఁడుగాని రెండింతలు బుద్ధిమంతుఁ డగు ననుట నిస్సంశయము. శుక్రునివాక్యములు కొన్ని కొన్ని యాశ్చర్యమును గలిగించును.

శత్రుపులం జంపఁజూచురాజు దృఢాభినివేశము గలవాఁడై దీర్ఘదర్శియై ప్రయత్నము చేయవలయును.

శతసంవత్సరాంతేపి కరిష్యామ్యత్ర సాదిపుం ।
ఇతి సంచింత్య మనసా రిపోశ్ఛిద్రాణి లక్షయేత్ ॥

శత్రురాజ్యమును యుక్తిగాఁ బ్రవేశింపవలయునెట్లు? ఎట్లో చూడుఁడు.

సేవయా వా వణిగ్వృత్త్యా రిపురాష్ట్రం విమృశ్య చ
దత్తాభయం సావధానో వ్యసనాసక్తచేతసం
మార్జాలలుబ్ధకవత్ సంతిష్ఠన్ నాశయే దరిం
సేనాం యుద్ధే నియుంజీత ప్రత్యనీకవినాశినీం
నయుజ్యాద్రిపురాష్ట్రస్థాం మిత్రేష్వపి చ దూషిణీం నచ
ననాశయేత్ స్వసేనాంతు సహసా యుద్ధకాముకః
దానమానైర్వియుక్తోపి నభృత్యోన్య భూపతిం త్యజేత్
...   ...   ...   ...   ...
దర్శయన్ మార్దవం నిత్యం మహావీర్యబలోఽపి చ
రిపురాష్ట్రే ప్రవిశ్యాదౌ తత్కార్యసాధకో భవేత్
సంజాతబద్ధమూలస్తు తద్రాజ్యమఖిలం హరేత్.

మన దేశమున, ఫ్రాంసువారు, పోర్చుగలువారు, ఒలాందులు ఇంగ్లీషువారు మొదలగు పాశ్చాత్యులీ విధమునఁ బ్రవేశించి తమతమ రాజ్యములు నెలకొల్పినది యెల్లరకుం దెలిసిన చరిత్రాంశమై యున్నది. శుక్రుని బుద్ధి మహిమఁ జూడుఁడు.

జపానువారు రష్యాసేనాపతుల నెనిమిదిసంవత్సరములనాఁడు మోసపుచ్చిరి గాని యీయుక్తి శుక్రునకు మున్నె తెలిసియుండెను. ఎట్లన:—

“వేశ్యాభిశ్చ నటైర్మద్యైః గాయకై ర్మోహయే దరిం”

వైశంపాయననీతి యనుగ్రంథ మొండు గలదు. విశేషించి యుద్ధమును గుఱించియు నిరువదినాలుగు విధము లగునాయుధములను గుఱించియు వ్రాయుచున్నది. ఈగ్రంథమునకు నీతిప్రకాశిక యనునామాంతరము గలదు దీని కాలము తెలియదు.

## చాణక్యుని ప్రాశస్త్యము.

విశాఖదత్త విరచిత మగు ముద్రారాక్షసము నొకపరి చదివినఁ జాణక్యుని మహిమ బోధపడును. ఇతఁడు “బ్రాహ్మణవటు” వయ్యును దనకాలపు రా

జుల తలలను దనబొటనవ్రేలిక్రింద నుంచికొన్నవాఁడు. భూచక్రమును ద్రిప్పిన మేధావంతుఁడు. అర్థశాస్త్రికారులలో సగ్రగణ్యుఁడు. సకలశాస్త్ర విచక్షణుఁడు.* చాణక్యుఁడు క్రీ పూ. నాలవశతాబ్దమువాఁడు.

"చాణక్యుని యర్థశాస్త్రము"

ఇది యాఱువేలసంఖ్య గల గ్రంథము. పదునై దధికరణములు నూట యేఁబది యధ్యాయములుఁ గలది. అర్థశాస్త్రముం గూర్చి యనేకుల కుండు భ్రమలు సంపూర్ణముగఁ దొలఁగుటకై యీగ్రంథమునందలి విషయముల నించుక వివరించుచున్నాను.

ప్రథమాధికరణము. వినయాధికారికము. ఇందుండు విషయములు. విద్యాసముద్దేశము, వృద్ధసంయోగము. అమాత్యోత్పత్తి, మంత్రి పురోహితోత్పత్తి, దూతప్రణిధి మొదలగు ప్రణిధులు, ఆత్మరక్షితకము ననునవి.

రెండవది:—అధ్యక్షప్రచారము. ఇందు జనపదనివేశము, దుర్గవిధానము, దుర్గనివేశము, సీతాధ్యక్షుఁడు (సెక్రెటరీ ఫార్ అగ్రి కల్చర్) పణ్యాధ్యక్షుఁడు, (సెక్రెటరీ ఫార్ కామర్స్) శుల్కాధ్యక్షుఁడు (డైరెక్టర్ అఫ్ కస్టంస్) మొదలగు నధ్యక్షుల విషయములు. పాలనవిషయములు విశేషముగ నిందుఁ గలవు.

మూఁడవది :-ధర్మస్థీయము, వ్యవహారము.

నాల్గవది :—కంటకశోధనము.

అయిదవది :—యోగవృత్తము. ఇంకఁ గోశమునకు నాదాయము సంపాదించుపద్ధతులు భృత్యులను భరించుట మొదలైనవి.

ఆఱవది :—మండలయోని; ఇందరి మిత్రోదాసీనాది ద్వాదశరాజమండలములు, ప్రకృతిసంపద; అనఁగా :—నానావిధము లగు రాజ్యాంగముల యుత్తమస్థితి, శమవ్యాయామికము, పౌరుషము, దైవసహాయము మొదలగువానిం గూర్చినది.

ఏడవది :—షాడ్గుణ్యము సంధివిగ్రహయానదైవ్ధీభావాసన సమాశ్రయములు.

ఎనిమిదవది :—వ్యసనాధికారికము. రాజునకు మంత్రులకుఁ బ్రజలకుం గల వ్యసనములు; అనఁగా శ్రేయస్సును జెడఁగొట్టునట్టి కారణములు. తన్నివారణోపాయములు.

---

* విద్యానందపరమహంసకృత చంద్రగుప్తచక్రవర్తిచరిత్రము చూడుఁడు.

తొమ్మిదవది :—అభియాస్యత్ కర్మ, దండయాత్రల విషయము.

పదియవది :—సాంగ్రామికము, యుద్ధవిషయములు

పదునొకండవది :—సంఘవృత్తము భేదోపాయమును నుపయోగించుట మొదలగువిషయములు.

పండ్రెండవది :—ఆబలీయసము. బలవంతునిమొద గమనింపవలయు నంశములు.

పదుమూఁడవది :—దుర్గాలంభోపాయము.

పదునాల్గవది :—ఔపనిషదికము, స్వబలోపఘాతప్రతీకారము, వంచనము మొదలగునవి.

పదునైదవది :—తంత్రయుక్తులు. (Definition, &c.)

ఈ పదునైదధ్యాయములందును బార్హస్పత్యహిందువుల రాజనీతి సమగ్రముగా వర్ణింపఁబడియున్నది. వార్తాశాస్త్రము (ఎకానమీ) ఇందులో నొక యంశము గాదు. రాజు నేర్చికొనవలసిన విషయములలో నొకశాస్త్రముగాఁ జెప్పఁబడి యున్నది.

చాణక్యుని యభిప్రాయములఁ గొన్నింటిని జూపెదను. రా జెట్టివాఁడుగ నుండవలయును ?

ప్రజా సుఖే సుఖం రాజ్ఞః ప్రజానాంచ హితే హితమ్ ।
నాత్మప్రియం సుఖం రాజ్ఞః ప్రజానాంతు ప్రియం హితమ్॥

మఱియు—“ స్వామీ, మహాకులీనః, దైవబుద్ధిః సత్వసంపన్నః, వృద్ధదర్శీ, ధార్మికః, సత్యవాక్, అవిసంవాదీ, కృతజ్ఞః, స్థూలలక్షః, మహోత్సాహః, అదీర్ఘసూత్రః, శక్యసామంతః, దృఢబుద్ధిః, అక్షుద్రపరిషత్కః, వినయకామః”—యిట్టివాఁడుగను మఱియు శుశ్రూష, శ్రవణ, గ్రహణ, ధారణ, విజ్ఞాన, ఊహ, పోహ, తత్వాభినివేశములు మొదలగు గుణములు గలవాఁడును శౌర్యము, అమర్షము, శీఘ్రత, దాక్ష్యము, నీ గుణములు గలవాఁడుగ నుండవలయు నఁట. ఇంకను గోరఁదగినగుణము లెట్టివిగలవో ? మనయూహకు మించినవిషయము. ఇట్లె సప్తాంగములకును నాదర్శములు చూపియున్నవాఁడు. జనపదసంపద వర్ణించియున్నాఁడు. చూడుఁడు.

“ స్థానవాన్, ఆత్మధారణః, పరధారణశ్చాపది, స్వారక్షః, స్వాజీవః, శత్రుద్వేషీ (కాకున్నఁ బ్రయోజనము లేదు) శక్య, సామంతః ; పంక పాషాణ ఊషర,

విషమకంటకశ్రేణీవ్యాళమృగాటవిహీనః; కాంతః, సీతాఖనిద్రవ్యహస్తివనవాన్, గవ్యః, పౌరుషేయః, గుప్తగోచరః, పశుమాన్, అదేవమాతృకో (ముఖ్యముగా గమనింపవలయు విషయము) వారి స్థలపథాభ్యా ముపేతః, సారచిత్ర బహు పణ్యః, దండకరసహః, కర్మశీలకర్షకః, బాలిశస్వామ్యవరవర్ణప్రాయః, "భక్త (loyal) శుచిమనుష్యః" ఇట్లుండవలయు నంట. తన మంత్రిత్వమున నకు లోఁబడిన దేశము నిట్లు చేయుట కెంతయత్నించెనో!

మంత్రు లెంద ఉండవలయును?

.. ... ...

"మంత్రిపరిషద (క్యాబినెట్) ద్వాదశామాత్యాన్ కుర్వీత" ఇతి మానవాః. "షోడశేతి" బార్హస్పత్యాః.

"వింశతిం" ఇత్యౌశనసాః. "యథాసామర్థ్యం" ఇతి కౌటిల్యః.

[ఆసన్నైః సహ కార్యాణి పశ్యేత్ అనాసన్నైస్సహ పత్రసంప్రేషణేన మంత్రయేత]

"ఇంద్రస్యహి మంత్రిపరిషత్ ఋషీణాం సహస్రం. తచ్చక్షుః. తస్మా దిమం ద్వ్యక్షం సహస్రాక్ష మాహుః"

చాణక్యుఁడు శాస్త్రరచనయందు మిక్కిలి నిపుణుఁడు. సమస్తవిషయముల నాయాస్థానములయందు సంపూర్ణజ్ఞానముతోడను స్ఫుట మగుశాస్త్రదృష్టితోడను జర్చించియున్నాఁడు ఏ విషయమును గాని పైపై తాఁకి విడిచినవాఁడు గాఁడు. "శాసనాధికారః" అనునధ్యాయమున రాజు జాబులు వ్రాయువిషయ ముం జర్చించుచు నెట్లు వ్రాసియున్నాఁడో సంగ్రహముగ వ్రాయుచున్నాఁడను. తా నెవనికి వ్రాయుచున్నాఁడో గుర్తెఱింగి తనయంతస్తునకు వానియంతస్తునకుఁ దగినట్లు లారంభింపవలయును. లేఖవిషయమున గమనింపఁదగు విషయములు.

అర్థక్రమము, సంబంధము, పరిపూర్ణత, మాధుర్యము, ఔదార్యము, స్పష్టత్వము. ఇది లేఖసంపద.

అర్థక్రమము—ఆనుపూర్విగ నాయాక్రియాప్రధానము లగునర్థములను ముందుముందుగఁ గ్రమము తప్పక లిఖించుట.

సంబంధము—జాబు కొనవఱకును ముందు చెప్పినదానికిని వెనుకఁ జెప్పిన దానికి విరోధము లేకుండ నుండుట.

పరిపూర్ణత—అర్థముయొక్కయుఁ బదములయొక్కయు, నక్షరములయొక్కయు నన్యూనత, యనతిరిక్తత; హేతూదాహరణ దృష్టాంతములచే నర్థమును సమగ్రముగ వర్ణించుట.

మాధుర్యము—"సుఖోపనీత చార్వర్థాభిధానం మాధుర్యమ్."

ఔదార్యము—"అగ్రామ్యశబ్దాభిధాన మౌదార్యమ్."

[ఇది గ్రామ్యవాదులకుం జూపవలయును.]

స్పష్టత్వము—ప్రతీతశబ్దప్రయోగము స్పష్టత్వము జాబునం దుండఁదగిన యంశములు. పదుమూఁడు :—

"నిందా ప్రశంసా పృచ్ఛాచ, తథాఽఖ్యాన మధార్థనా
ప్రత్యాఖ్యాన ముపాలంభః ప్రతిషేధోఽథ చోదనా
సాంత్వ మభ్యవపత్తిశ్చ, భర్త్సనానునయా తథా
ఏతే ష్వర్థాః ప్రవర్తంతే త్రయోదశ సులేఖజాః.

ఇందు నింద యనఁగా 'అభిజన, శరీరకర్మణాం దోషవచనం' ఇట్లే తక్కిన గుణములను గాంతి వ్యాఘాతాది లేఖదోషములను వర్ణించి యున్నాఁడు. చాణక్యుని శాస్త్రశక్తిఁ దెలియఁజేయుటకై వ్రాసినాఁడను.

చాణక్యుని గ్రంథముపై వ్యాఖ్యానము లనేకములు వ్రాయఁబడిన వనుట నిస్సంశయము. కొన్ని టీకలు వ్యాఖ్యలు నున్నట్లు శ్రీశ్యామాశాస్త్రిగారి గ్రంథమువలనఁ దెలియుచున్నది. భట్టస్వామికృత మగుగొప్పవ్యాఖ్యానము వ్రాఁతప్రతి "ఓరియంటల్" గ్రంథాలయమున నున్నది. ఇది యెనిమిదవ యధ్యాయము నుండి యారంభింపఁబడి యున్నది. ఇం దెవ్విగాని యింకను బ్రచురింపఁబడినవి గావు. చాణక్యనిశాస్త్రము, చాణక్యనీతి చాణక్యసూత్రము నను సంక్షిప్తరూపములఁ గానంబడుచున్నది. కామందకీయము చాణక్యు ననుసరించియే వ్రాయఁబడినది. "చాణక్యనీతిటీకా" అని యొకవ్యాఖ్యానము చాణక్యనీతిపై నున్నట్లు తెలియుచున్నది.

చాణక్యుఁడు తనగ్రంథమును దనశాస్త్రమును మిక్కిలి యభిమానముతోఁ జూచినవాఁడు. తనగ్రంథమునందలి శ్లోకసంఖ్య యధ్యాయసంఖ్య తానే చెప్పి యున్నాఁడు. తాను గేవల సూత్రము మాత్రము వ్రాసినయెడల 'వార్తా' అన్న జనశ్రుతి యనియు, "నీ గ్రంథ మర్థశాస్త్రమయ్యును దీనియం దర్థతత్త్వవిచా

రము నున్న. ఇది పనికిమాలినగ్రంథ మనియు" వ్యాఖ్యానములు సేయుమహానుభావు లనేకు లుందు రని యెఱింగి [చాణక్యుని యర్థశాస్త్రమును జూచిన బంగాళదేశపు విద్వాంసులు శ్రీశచంద్రవాసు, ఎం. ఏ., జయస్వాల్ ఎం. ఏ., నరేంద్రనాథలా ఎం.ఏ., మొదలగువారేమి జర్మనువిద్వాంసులు, దక్షిణదేశపు విద్వాంసులు మహాదేవశాస్త్రిగారు శ్యామాశాస్త్రిగారు, మొదలగువారు నీ గ్రంథమున 'నర్థతత్త్వవిచారము' లే దని గాని, దాని దేశకాలములంబట్టి యం దుండఁదగిన యేవిషయములు గాని లే వని గాని చెప్పినవారు గారు. మీఁదు మిక్కిలి దాని యొక్క పరిపూర్ణతకు సమగ్రత్వమునకు నుప్పొంగుచున్నారు] తనసూత్రములపైఁ దానే భాష్యము వ్రాసెను.

"దృష్ట్వా విప్రతిపత్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణాం।
స్వయమేవ విష్ణుగుప్త శ్చకార సూత్రంచ భాష్యంచ"॥

అని గ్రంథాంతమున వ్రాసియున్నాఁడు. చాణక్యునిగ్రంథము హిందూరాజులయొద్ద మిక్కిలి గౌరవాస్పదముగ నెన్నఁబడి యందలిపద్ధతు లవలంబింపఁబడుచుండెడివి. బసవేంద్రదక్షితేంద్రకృత మగు "శివతత్త్వరత్నాకరమందు" 'జాణక్యుని యధ్యక్షప్రచారమునందు లేని సుధాధ్యక్షుఁ డను నొక యుద్యోగిని వర్ణించియున్నాఁడు. ఈతఁడు మజ్జిగ పెరుఁగు పాలు వీనిపై పరీక్షకుఁ డఁట. అర్థశాస్త్రమున గోధ్యక్షుఁ డనువాఁడు మాత్రము గలఁడు. పరిభాషయు గమనింపఁదగి యున్నది. బసవేంద్రుఁడు నాలుగువందలయేండ్ల నాఁటివాఁడు.

చాణక్యునికి వెనుక నతనిశిష్యుఁడు కామందకుఁడు ముఖ్యుఁడు. తన నీతిశాస్త్రమును జాణక్యుని ఛాయను శ్లోకరూపముగ రచించెను. "అస్మాకం గురోః కౌటిల్యస్య" అని స్పష్టముగాఁ జెప్పికొనియున్నాఁడు. అర్థశాస్త్రగురు వగు చాణక్యుని గ్రంథము నేకార్యముకొఱకుఁ దాను సంక్షేపించెనో యిట్లు చెప్పియున్నాఁడు.

"దర్శనాత్ తస్యసదృశో విద్యానాం పారదృశ్వనః
రాజవిద్యాప్రియతయా సంక్షిప్తగ్రంథ మర్థవత్
ఉపార్జనే పాలనేచ భూమే ర్భూమీశ్వరం ప్రతి
యత్కించి దుపదేక్ష్యామో రాజవిద్యావిదాం మతమ్.

అర్థశాస్త్రముయొక్క తత్త్వము దీనివలన నైనను దెలియఁగాక. కామందకుని గ్రంథము పురాతనమైన దయి మనదేశమున మిక్కిలి గౌరవము గాంచినది. కామందకుఁ డెచటివాఁడో తెలియదు. 'రాజవిద్యాప్రియతయా' అని చెప్పికొనియుండుటచే నీతఁడు తనశాస్త్రమునం దెంతయభిమానము గలవాఁడో తెలియుచున్నది. అంతటి రాజవిద్యాప్రవీణుఁడు గొప్పరాజులయొద్ద నుండి సన్మానపాత్రుఁడై మంత్రిత్వాది యున్నతపదవులం దుండి యుండు ననుట నిస్సంశయము. కామందకుఁడు చాణక్యునివెనుక నూఱుసంవత్సరములకు లోపలివాఁడై యుండునని యూహింపఁదగియున్నది. ఆతనియొద్ద నే చదువుకొన్నవాఁ డైనయెడల నతని వార్ధక్యమున నీతఁడు పసివాఁడై యుండి యుండవలయును. కామందకుని గ్రంథముపై వ్యాఖ్యానము లనేకము లున్నట్లు తెలియుచున్నది. కొన్ని ప్రకటింపఁబడినవి. మఱికొన్ని మూలల దాఁగియున్నవి. శంకరార్యునిచే రచియింపఁబడిన దొకటియు వరదరాజభట్టారకయజ్వకృతము మఱియొకటియుఁ బ్రచురింపఁబడి యున్నవి.

కామందకుని వెనుక నీతిశాస్త్రమును రచించినవాఁడు మహాయోగి భర్తృహరి. ఈతఁడు రాజనీతియం దత్యల్పగౌరవము గలవాఁడు. రాజులను వారి చేష్టలను నీతిని గఠినముగా దూషించియున్నవాఁడు.

"సత్యా నృతాచ పరుషా ప్రియవాదినీ చ
హింస్రా దయాళు రపి చార్థపరా వదాన్యా
భూరివ్యయా ప్రచురవిత్త సమాగమా చ
వేశ్యాంగ నేవ నృపనీతి రనేకరూపా" అని వ్రాసెను.

అయినను గొన్నికొన్ని స్థూలాంశములను సుందరము లగుశ్లోకములుగా రచియించియున్నవాఁడు. భర్తృహరి రెండవశతాబ్దములో జీవించియుండినట్లు తెలియుచున్నది—

కామందకీయమునకు వెనుక నైదువందలసంవత్సరములకుఁ బైన రచింపఁబడినది పంచతంత్ర మను మనోహర మగుగ్రంథము. ఈ గ్రంథచరిత్ర మత్యాశ్చర్యకరము. ఇది మూఁడులోకములు జయించిన దని చెప్పనగు. మనదేశము నుండి కొలఁదికాలములోఁ బూర్వశాస్త్రము లెన్నియో పోయిన మార్గముననే పెర్షియా, అరేబియాలకుఁ బోయి యచటనుండి యూరపుఁజేరి "పిల్పెకథలు"

అనుపేరఁ బ్రసిద్ధిఁ గాంచినది. అనేకరాజులకు నీతిబోధకముగా నుండినది. ఇది అర్థశాస్త్రిము. చూడుఁడు విష్ణుశర్మ, గ్రంథాదిని :—

“ మనవే వాచస్పతయే, శుక్రాయ పరాశరాయ ససుతాయ ।
చాణక్యాయ చ విదుషే నమోస్తు నయశాస్త్రికర్తృభ్యః.”

[పరాశరనీతియు వ్యాసుని యర్థశాస్త్రిమును విష్ణుశర్మదినముల కుండెను. విష్ణుశర్మ దాదాపు నాల్గవశతాబ్దమున నుండినట్లు తెలియుచున్నది. ఈతఁడు జైనుఁ డని విద్వాంసుల యభిప్రాయము.]

మఱియు—.

సకలార్థశాస్త్రిసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదం ।
తంత్రైః పంచభి రేతత్ చకార సుమనోహరం శాస్త్రిమ్॥

అని యున్నది. మఱియు రాజు, అమరశక్తి విష్ణుశర్మంగూర్చి యేమని పల్కెనో చూడుఁడు.

“ సరాజా విష్ణుశర్మాణ మాహూయ ప్రోవాచ “భో భగవన్, మదనుగ్రహార్థం ఏతాన్ (తనకుమారులను) అర్థశాస్త్రింప్రతి ద్రా గ్యథానన్యసదృశాన్ విదధాసి తథా కురు ”

ఇందుకు విష్ణుశర్మ “దేవ శ్రూయతాం మే తథ్యవచనం, ... ... ... పున రేతాన్ తవపుత్రాన్, మాసషట్కేన నీతిశాస్త్రిజ్ఞాన్ నకరోమి యది స్వనామత్యాగం కరోమి.”

ఇందుచేఁ బంచతంత్ర మర్థశాస్త్రి మనియు, నర్థశాస్త్రిమన్నను నీతిశాస్త్రి మన్నను నొకటియే యనియుఁ బ్రత్యక్ష మగుచున్నది.

వట్టి నీతివాక్యములుగా నుండక పంచతంత్రము మనోహరము లగు కథల రూపముగా నున్నది. గ్రంథకర్తయే దీనిని “ సుమనోహరం శాస్త్రిం” అని గదా వర్ణించెను. అమరశక్తి కుమారులు నీతికుశలు లైనదాదిగ బాలుర కీ గ్రంథము మహోపకారిగ నుండినది. “తతః ప్రభృత్యేతత్ పంచతంత్రకం నామ నీతిశాస్త్రిం బాలావబోధనార్థం భూతలే ప్రవృత్తం.” ఇందలిశ్లోకము లనేకము లన్యగ్రంథములనుండి స్వీకరింపఁబడినవి. మహాభారతము భర్తృహరి మనువు మొదలగు నవి—విష్ణుశర్మ తా నేయేగ్రంథములనుండి స్వీకరించెనో చెప్పియుండిన నెంతయో

బాగుగ నుండియుండును. పూర్వ మేయేగ్రంథము లుండెనో తెలియును. మన దౌర్భాగ్యవశమున నట్లు చేసినవాఁడు కాఁడు.

పంచతంత్రచ్ఛాయ ననుసరించి రచింపఁబడిన గ్రంథము హితోపదేశము. ఇది నారాయణపండితునిచే వ్రాయఁబడినది. పంచతంత్రమున కన్న దీనికే ప్రశస్తి హెచ్చుగా బంగాళమున నుత్తరహిందూస్థానమున నున్నట్లు హెర్టెల్‌గారి వ్యాసమువలనఁ దెలియుచున్నది.

తెనుఁగున ననేకనీతిగ్రంథములు గానంబడుచున్నవి. మఱియొకపరి చర్చింతము.

ఈనాఁటివఱకు నర్థశాస్త్ర మనిన నీతిశాస్త్రము రాజనీతియే గాని [వార్తాశాస్త్రము] "ఎకనామిక్సు" కాదు. ఇపుడు క్రొత్తయర్థము గల్పించుట న్యాయము గాదని నాయాశయము. వార్తాశాస్త్ర మను ప్రత్యేకనామ ముండుట చేతను నట్టిశాస్త్రము పూర్వహిందువులచేఁ గృషి సేయఁబడిన దగుటచేతను దాని నుద్ధరించుట పూర్వులవలన నెన్నియోలాభములు పొందు మనకుఁ గర్తవ్యము. అర్థశాస్త్ర మన్న "ఎకనామిక్సు" అని యెచ్చటను లేదు. కౌండంతశాస్త్రమే యర్థశాస్త్ర మున్నది. అర్థశాస్త్ర మేమైనదియుఁ గనుఁగొనుట కాగ్రంథమే పరమ ప్రమాణము గాని యన్యములు కావు. అట్టిపండితులవారి యభిప్రాయమునకుఁ గారణము మృగ్యము. ఇఁక నే నిఘంటువునందును "ఎకనామిక్సు" అని లేదు. నాకు దొరకినప్రమాణములకు అప్టీగారి యభిప్రాయము విరుద్ధముగ నున్నది. దాని కనుకూలము లగుప్రమాణములు చూపుభారము విమర్శకుల వారిపై నున్నది. వార్తాశాస్త్ర మనుమాట అప్టిగారి నిఘంటువునందు లేకున్నఁ గొఱఁత లేదు. అది చిన్ననిఘంటువే గాని పెద్దది గాదు. సమస్తపదములు దానిలో నుండు ననుకొనుట పొరపాటు. వార్తావిద్య యనువిద్య వేఱుగ నుండఁగా 'ఎకనామిక్సు' అను దానికి 'అర్థశాస్త్ర" మను నామము సరిపోవుట యసంభవము. వార్తాశాస్త్ర ముండియుండె ననునూహకు బలవత్తర మగువాద మొకటి యున్నది. మనపూర్వులు జనుల నెల్ల నాలుగువర్ణములుగా భాగించి నాలుగు వర్ణములకుఁ బ్రత్యేకముగ నాలుగువిద్యల నేర్పఱచిరి. బ్రాహ్మణులకు త్రయీ, క్షత్రియులకు (దండనీతి) అర్థశాస్త్రము. వైశ్యులకు వార్తావిద్య, శూద్రుల కాన్వీక్షకీ విద్య. ఈయంశము కామందకీయ వ్యాఖ్యానమున స్పష్టముగఁ జెప్పం

బడియున్నది. కొన్నికొన్నికారణములచేత వార్తావిద్య నశించినది. తక్కిన మూఁడువిద్యలు నిప్పటికిని గలవు.

"ఏకనామిక్సు" నందలి యుత్పత్తి, వినిమయము కేవలము వైశ్యులచేతి లోనివి. జనసమూహమునకుం గావలయు వస్తువుల నెల్ల నుత్పత్తిచేయుట విక్ర యించుట వారిపని. వినియోగము (కఁసంప్షన్) వారు తెలియఁదగినది. ఏల యనఁ దమసరకులు వినియోగపడుమార్గములు తెలియక సుకరముగా నమ్ముకొనఁ జాలరు గనుక. ఈ వార్తాశాస్త్రము కృష్యాదిశాస్త్రములకుఁ బునాది వంటిది.

నాలుగువర్ణములకు నాలుగువిద్య లనువిషయము కౌటిల్యుఁడు స్పష్ట ముగాఁ జెప్పినవాఁడుగాఁడు. శుక్రుఁడును జెప్పలేదు. అదియునుఁగాక విద్యలు రెండా మూఁడా యొకటియా యనువాదము శుక్ర బృహస్పతి మనువుల శిష్యు లకు జరుగుచుండె నను నీ వాదము పూర్వము వారి కున్నజ్ఞానముయొక్క విభాగ మును గుఱించియే యని యెఱుంగవలయును. అనఁగా నీనాలుగు స్వతంత్రవిద్య లా? లేక యొకదానియందు మరియొకటి లీనము లగుచున్నవా? లేక యాధార పడియున్నవా? అని మాత్రమే. ఏలయన మానవులు (మనుశిష్యులు) ఆన్వీక్షకిని లేదన్నవారు గారు. మఱి వేదములో నొకభాగముగా గ్రహించిరి. బార్హస్ప త్యులు వార్తాదండనీతులు రెండే ప్రధానవిద్యలు లోకయాత్రకుం గావలయునవి యనిరి. త్రయి (యను అందలి యంశ మగు నాన్వీక్షకియును) వీరు లే వన్నవారు గారు. మఱి వానిని 'సంవరణమాత్రము'గా గ్రహించిరి. ఏలయన 'లోకస్య అర్థప్రధానత్వాత్' కావున వీరి మతములయందు విద్యలస్థితికిఁ గాని పృథక్త్వ మునకుఁ గాని బాధలేదు. కామందకుఁడు మాత్రము నాలుగు వర్ణములకు నా లుగువిద్య లని స్ఫుటముగా వచించెను.

> వర్ణాః సర్వాశ్రమాశ్చైవ విద్యాస్వాసు ప్రతిష్ఠితాః ।
> ఈక్షణాత్ రక్షణాత్ తాసాం తద్ధర్మస్యాంశభాక్ నృపః॥

మఱియు—

> "పాశుపాల్యం కృషిః పణ్యం వార్తా వార్తానుజీవినాం"

అనియు—

> "పాశుపాల్యం కృషిః పణ్యం వైశ్యస్యాజీవనం స్మృతం"

అనియు వ్రాసియున్నాఁడు. వ్యాఖ్యానము మున్నె చూపియున్నవాఁడను,

అర్థశాస్త్రమునందు వార్త యొకభాగ మనుకొనుట తప్పు. బ్రహ్మదండనీతి యందు వార్త యొకభాగముగ నర్థశాస్త్ర మొకభాగముగ నుండినవి. [తిక్కన పద్యముఁ జూడుఁడు] వార్తయుఁ దక్కినవిద్యలును దొలఁగిపోఁగా దండనీతి యను నామ మర్థశాస్త్రమునకు శేషించినది. తదాదిగ దండనీతియు నర్థశాస్త్రమును నొకటియై వార్తాదివిద్యలు వేరైనవి. ఏనాఁడు గాని వార్త యర్థశాస్త్రమున భాగముగా నుండినది లేదు. ఇందుకుఁ బ్రమాణము లేదు.

బ్రహ్మదండనీతి (ఇపు డర్థశాస్త్రము కాదు.)




కావున వార్త యర్థశాస్త్రమున భాగ మనుట తప్పు. అది ప్రత్యేక శాస్త్రము. వార్త యధ్యక్షులవలన నేర్చికొనఁదగినది ... కావున "నధ్యక్షప్రచారము"నఁ దత్సంబంధము లగువిషయము లనేకము లుండును. "వార్తామధ్యక్షేభ్యః (అధీయీత)" అని చాణక్యుఁడు. "తం (అర్థం, అనఁగా వార్తావిషయము లగునర్థానర్థములలో మొదటిది) అధ్యక్షప్రచారాత్, వార్తాసమయవిద్భ్యశ్చ వణిగ్భ్యశ్చ" అని వాత్స్యాయనుఁడు. [వ్యాఖ్యా ... ... వార్తా శాస్త్రం ... ... వార్తాసమయవిద్భ్యః కృషిపాశుపాల్యవాణి జ్యాదితత్త్వవిద్భ్యః." అని.] ఇంతకంటె నర్థశాస్త్రమునకును వార్తాశాస్త్రమునకును సంబంధము లేదు.

కొండూరు కుమారస్వామి.

# కృతి విమర్శనము.



మాపత్రికాకార్యాలయంబున కభిప్రాయంబునకై వచ్చియున్న యాయా గ్రంథములఁ దత్తత్కాలంబున విమర్శింప నవకాశము లేక యిపు డొక్కమా ఱుగా నిందు విమర్శించుచున్నారము. గ్రంథప్రేషకులు జా గొనరించినందులకు వేఱుగాఁ దలంపకుందురుగాక. అందు—

1. ప్రభుభక్తిరత్నావళి:—ఇది బళ్లారి నివాసులగు వై. హనుమంతరావు గారిచే రచియింపఁబడి బళ్లారిలోని కామేశ్వరియంత్రాలయమునఁ బ్రకటింపఁ బడినది. ఇందుఁ బ్రకృత సార్వభౌము లగు శ్రీజార్జిచక్రవర్తియెడ భక్తి బోధింపఁ బడినది. ఈచిన్ని పొత్తమున 64 చిన్నపద్యములు గలవు. భాష సులభశైలిని నిర్దుష్టముగా నున్నది. కావున నిది ప్రారంభదశలోనున్న విద్యార్థుల కత్యంత ముపయోగించు నని మాయభిప్రాయము.

2. శ్రీమన్నిశ్శంకవంశము:—ఇది తనికెళ్ల ప్రకాశశాస్త్రిగారు రచియించిన రెండాశ్వాసముల ప్రబంధము. ఇందు విశాఖపట్టణమండలములోని సంగమవలస జమీందారు లగుశ్రీరాజా విశ్వేశ్వర మహీపాలుర వంశ మభివర్ణింపఁబడినది.

ప్రాచీనకవులు తమకృతులయందుఁ దమపోషకు లగునాంధ్రదేశరాజుల వంశమును సంగ్రహించి వర్ణించుట గలదు గాని యంతమాత్రమున నాయాసం స్థానముల చరితము సంపూర్ణముగాఁ దెలిసికొనుట కవకాశము గలుగకపోయినది. ఇది యట్లు గాక కేవల మొకసంస్థానమును గూర్చి రచియింపఁబడుటచేఁ దత్సంస్థాన పాలకుల క్రమము విశద మగుచున్నది. ఇట్లే స్వదేశసంస్థానముల చరిత్రములు వెలసినచో న వన్నియుఁ గలిసి ప్రకృతకాలమునకుఁ దగినట్లు గా నొకయాంధ్ర దేశచరిత్రము గాఁగలదు. ఇట్టి చరిత్రములు వచనకావ్యములుగా నుండుట యుత్తమ మని పెక్కండ్రు తలంతురు గాని పద్యకావ్యములుగా నుండుటయందుఁ గూడ విశేషగుణము లేకపో లేదు. తాత్కాలికప్రభువు నాశ్రయమున జీవించు కవులు రచియించిన యాస్థానచరిత్రములయందు దోషములు మఱుఁగుపడుటయు

గుణములు హెచ్చుగుటయుఁ గలుగు నని తలంచుట నైజమే కాని యిందట్టి వ్యత్యాస మేమియుఁ గానరాదు.

ఈప్రబంధమున శ్రీరామచంద్రనృపతి మొదలుగాఁ బ్రకృతప్రభువు లగు విశ్వేశ్వరనృపాలురవఱకును గలప్రభువుల క్రమము వర్ణింపఁబడినది. గ్రంథశైలి ప్రౌఢమై సహృదయరంజకముగా నున్నది. అందందుఁ గొన్నియన్యదేశ్యపదము లుపయోగింపఁబడినవి గాని భాష నిర్దుష్టముగానే యున్నది. యథార్థచరిత్రమే యిందుఁ బ్రబంధోచితరీతి నలంకరింపఁబడి వర్ణింపఁబడినది. ఇట్లు కవితాపోషణంబున స్వసంస్థానచరిత్రపోషణము గావించిన శ్రీప్రకృతప్రభువులు చిరాయువు లయ్యెదరుగాక.

3. శ్రీమన్నిశ్శంకచరిత్రము :—ఇది పై సంగమువలన జమీఁందారుల యనుగ్రహంబుననే నేమాన సూర్యప్రకాశముగారు రచియించినది. ఇందును బైదాని యందువలెనే తదాస్థానాధీశుల క్రమము వర్ణింపఁబడినది. సర్వవిధముల నిదియుఁ బైదానిని బోలియుండుటచే నిందు విశేషించి విమర్శింపనక్కఱలేదు.

4. ఆంధ్రభాషావిలాసము :— } ఇవి రెండును మున్నంగి లక్ష్మీనరసింహశర్మ
5. ఉపగుప్త :— } గారిచే రచియింపఁబడినవి. ఇందు మొదటిది

ప్రదర్శనయోగ్య మగునాటక మని వారు వ్రాసిరి. కాని యిది భాణ మనుటకుఁ గొన్నిలక్షణములను బట్టి తగియున్నది. ఈ చిన్నపుస్తకమున నాంధ్రభాషయొక్క ప్రకృతస్థితి వర్ణింపఁబడినది. గ్రామ్యభాషానిందయు గ్రాంథికభాషాస్తుతియు నిందలి ప్రధానవిషయములు. పద్యములు హృదయాహ్లాదకరముగా నున్నవి. ఇది యేలూరునఁ బ్రబుద్ధాంధ్రలోకగ్రంథమాల యందుఁ బ్రకటింపఁబడినది.

రెండవది రవీంద్రనాథటాగూరుగారిచే రచియింపఁబడిన బుద్ధశిష్యుఁ డగు నుపగుప్త జీవితచరితమున కాంధ్రీకరణము. ఇందును మొదటిదానియందువలెనే యించుమించు 50 సరసము లగుపద్యములు గలవు. ఇది యొకమహాపురుషుని పవిత్ర జీవిత మగుటచేఁ జదువఁదగి యున్నది.

6. శ్రీశైలయాత్ర :—ఇదియును బైకవిరచియించిన యొకగద్యకావ్యము. నవనాగరకుల సంఘసంస్కరణాభిమానముఁ దెలుపుచున్నది. పాత్రముల వాక్యోపవాక్యములు వ్యావహారిక భాషయందుఁ గూర్పఁబడినవి. ఇతరరచన సలక్షణముగానే యున్నది గాని యచ్చటచ్చటఁ దప్పులు గలవు. ఇఁక నిందలి కథ

చదువరులే చదివి యానదింపఁ దగియుండుటచే నిందు దానిని విమర్శించుట యప్రస్తుతము.

7. ఆపదుద్ధారకశతకము:—ఇది బళ్లారిమండలములోని హరపనహళ్లి యాంగ్ల పాఠశాలలోని యాంధ్రపండితు లగుపాలపూడి నరసింహశాస్త్రిగారిచే రచియింపఁ బడినది. ఇది శ్రీరామచంద్రునియందలి భక్తిని దెల్పునది యగుటచేఁ బవిత్ర మైన దని యే చెప్పవచ్చును గాని ఛందోవ్యాకరణవిరుద్ధంబు లగుప్రయోగము లనేకము లిందుఁ గలవు. ఇందలి కొన్నియపప్రయోగములు:—రేఫశకటరేఫలకు యతిప్రాసములు విధించుట యటుండఁగా—

"తెగటార్చిప్రచురంబుగా నలువకుం దెచ్చిస్థితిం జేర్పవే" అనుమత్తేభ పాదమందు వ్యస్తపదములయందలి సంయుక్తవర్ణములకుఁ బూర్వవర్ణముల గురువులఁ జేయుట కేవలముతప్పు. సంస్కృతమందు వలెనే యాంధ్రమందును నిట్లు గురుత్వము గలుగు నని వీరుభ్రమపడియుందురు. "నన్నుఁ గావిపుడుకృష్ణా, మాచకమ్మరయునే" ఇత్యాది యపసంధులు గూడఁ గలవు. "పవమానప్రభ వుండు లంకకును నిప్పంటించి" ఇత్యాదులఖండయతులఖండముగాఁ గలవు. ఇది ప్రథమప్రయత్న మగుట చే నిట్టిదోషములు గలుగుట సహజము గావున నింత టితో శాస్త్రిగారు నిరుత్సాహులు నాగ్రహావిష్టులును గాక నిర్దోషముగ భాషా పోషణము చేయ యత్నింతురుగాక.

8. శ్రీనీతిపద్యరత్నావళి:—ఈపేర నొకచిన్నపద్యకావ్యమును పిఠాపుర సమీపమునందలి చిత్రాడ గ్రామవాసులు చెలికాని లచ్చారావుగారు రచియిం చిరి. ఇందు రెండువందలు చిన్నపద్యములు గలవు. శైలి మిక్కిలి సులభము. ఇది బాలికల కుపయోగించు నీతికావ్య మనుట నిక్కము.

"ఉభయభాషాకవులును బాలసరస్వతీ బిరుదాంకితులు నగుద్వివేదినారా యణశాస్త్రిగారీ హస్తమునం గలప్రమాదముల నెల్ల శ్రద్ధతో సవరణచేసిరి" యని పీఠికలో వ్రాయఁబడి యున్నది గాని దాసీలు, కల్వకంఠి, దేహసాధకమును జేయు, కలికి "కష్టేఫలే" యన, పూజ్యవతులను జూచి యపూజ్యవతులు, ప్రబలముకీర్తి భాజనవతి, సతులేసహ ధర్మవతులు, పాపిష్టిపేరును, ముక్కోపి తోడ, శ్రుతులు ఘోషింప విన నొకో లోలనేత్ర" అను నివిమొదలుగా నిరర్థ కంబులు వ్యాకరణవిరుద్ధంబులు ఛందోదూరంబులు నైన యనేకప్రయోగంబు

లాబాలసరస్వతులకుఁ దప్పులుగాఁ దోఁపలేదు గాఁబోలును ? శ్రీలచ్చారావుగారి కిది ప్రథమప్రయత్న మగుటచే నిం దిట్టిప్రయోగము లుండుట సహజ మగును గాని శ్రద్ధతోఁ దప్పులు దిద్దిన యుభయభాషాకవులు వీని నేల దిద్దకపోవలయు నో. గ్రంథమాలను స్థాపించి భాషాభివృద్ధి సేయఁదలంచినవారు గావున గ్రంథ ములయం దిట్టిదుష్టప్రయోగముల నిఁక ముందుఁ జొరనీకుందురుగాక.

9. బాలనీతి :— ఇది సికిందరాబాదులోని మహబూబుకాలేజిలోఁ దెలుఁగు పండితులు గా నున్న చివుకుల అప్పయ్యశాస్త్రిగారు రచియించినది. ఇందు భక్తి, ధైర్యము, భూతదయ, వివేకము, పరోపకారము, మొద లగు 30 విషయ ములను గూర్చి వ్యాసములు గలవు.

వచనశైలి సులభముగానే యున్నది. ఇందలి విషయములం దెల్ల భారత భాగవతములలోని యుత్తమపురుషుల చరితము లుదాహరింపఁబడినవి. ముద్ర ణము మాత్రము నిర్దుష్టముగా లేదు. ఇది బాలురు చదివికొనఁదగిన నీతి యగును.

10. హిందూదేశరాజ్యాంగపద్ధతి :—

11. శారీరశాస్త్రము :—

అను నీ రెండును చెన్నపురి క్రీస్టియన్ కాలేజిలో నుపాధ్యాయులగు కే. సీతారామయ్య బి. ఏ., గారు రచియించినవి. ఈరెండును గూడ నాంగ్లేయ భాష రాని వారికిని, ప్రథమపాఠశాలలలోని విద్యార్థులకును బహువిధముల నుపయోగించు గ్రంథములు. ఇందు మొదటిదానివలన లోకజ్ఞానము చక్కఁగఁ గుదురును. రెండవదానివలనఁ దమశరీరస్థితి యెంతయు సులభముగాఁ దెలియును. ఈగ్రంథములయం దన్యదేశ్యములు ప్రయోగింపఁబడినవి. లక్షణవిరుద్ధము లగు ప్రయోగము లున్నవి. వానిని దప్పించికొనిన గ్రంథములకు మెఱుఁగు వెట్టిన ట్లుండి యుండును.

12. సకలానందము. 13. నవగ్రహస్తవము. 14. రాఘవశతకము. 15. ము ద్దుగుమ్మ సీతారామశతకము. 16. ఇంగ్లీషుప్రభుత్వము.

అనెడు నీ యైదుగ్రంథములను గోదావరిమండలములోని కిర్లమపూఁడి నివాసు లగు ముత్యసూర్య నారాయణమూర్తిశర్మగారు రచియించిరి. ఇవి యన్నియుఁ బద్యకావ్యములు. అందందు వ్యాకరణవిరుద్ధము లగుప్రయోగములు తఱచుగాఁ గానవచ్చును. ఇందు సకలానందము మతాచారాది విమర్శన

గ్రంథము. ఇందలి యభిప్రాయములు గొన్ని నవ్వుపుట్టించును. కవిత్వము కొంత వఱకు రసవంతముగనే యున్నది.

2, 3, 4 గ్రంథములు భక్తిరసప్రధానములు 5 వ గ్రంథము ప్రకృతప్రభుత్వమువలని లాభములను దెల్పునది. శర్మగారు కేవలము బహుగ్రంథ కర్తృత్వమున కాసపడక సరసశైలిని నిర్దుష్టంబుగాఁ దమకవిత్వము సర్వజనరంజక మగుటకుఁ బ్రయత్నింతురుగాక !

17. స్వప్నవాసవదత్తము. } సంస్కృతమున భాసమహాకవిచే రచియింపఁ
18. మధ్యమవ్యాయోగము. } బడిన యీరెండురూపకములును చిలకమర్తి లక్ష్మీనృసింహముగారిచే నాంధ్రీకరింపఁబడినవి. ఈ యాంధ్రీకరణము సులభశైలి నున్నది గాని యిందలి కొన్ని కొన్ని పద్యములు మాత్రము సంస్కృతశ్లోకములకు సరియయినవి గా వని చెప్పవచ్చును. పెక్కు-చోట్లఁ జిన్నవృత్తములకు సీసపద్యము లుపయోగించుటయే కాక కొన్నికొన్నిశ్లోకముల తెలుఁగును బైయభిప్రాయమును స్థిరపఱచుచున్నది.

శ్లో. శ్లాఘ్యా మవంతినృపతే స్సదృశీం తనూజాం
కాలక్రమేణ పునరాగతదారభావః
లావాణకే హుతవహేన హృతాంగయష్టిం
తాం పద్మినీం హిమహతా మివ చింతయామి.

మ. "మనమం దిప్పుడు సైతముం దలఁచెదన్ బల్మారు కాలక్రమం
బున నే వెండియు భార్యఁ జేకొని సుఖంబుం గాంచి యున్ మంచు చే
హననం బొందిన పద్మినిం బలెనె యయ్యావంతిభూపాలనం
దన లావాణకదగ్ధదేహ జనవంద్యన్ నాదుప్రాణప్రియన్.

ఈపద్యమందు వాక్యక్రమము వ్యత్యస్తమగుటచే దూరాన్వయము కలిగినది. సంస్కృతమునం దెట్లయినను దెలుఁగుకవిత్వమందు దూరాన్వయము గుణము కానేరదు. 'ఆవంతిభూపాలనందన' యనుచో నాదివృద్ధి యే ప్రత్యయమును బట్టి యేయర్థమున వచ్చినదో కాని యిది యసమంజసము.

శ్లో. రూపశ్రియా సముదితాం గుణతశ్చయుక్తాం
లబ్ధ్వా ప్రియాం మమతు మంద ఇవాద్యశోకః
పూర్వాభిఘాతసరుజోఽప్యనుభూతదుఃఖః
పద్మావతీ మపి తథైవ సమర్థయామి.

మ. వరరూపంబు గుణంబులుం గలప్రియన్ బద్మావతిం జేకొనన్
చిరకాలాగత మైనశోకము శమించెన్ గొంత నాకిత్తఱిన్
గరమున్ దుఃఖమువడ్డప్రాణి నగుటన్ జాడ్యం బొకింతైన నీ
తరుణిన్ వాసవదత్తనుం బలెనె నేఁ దర్కింతుఁ జిత్తంబునన్.

భాషాంతరీకరణమందలి కష్టము తెలుపుట కివి యుదాహరింపఁబడినవి గాని కొన్నికొన్ని పద్యములు చక్కఁగా మూలభావమును దెల్పుచు సరసముగా నున్నవి.

మధ్యమవ్యాయోగమున భీమసేనుఁడు శోకబ్రాహ్మణుని సంరక్షించుట యనుకథ చమత్కారముగాఁ గల్పింపఁబడినది. దీని తెలుఁగును సులభశైలి నున్నది. మొత్తము మీఁద లక్ష్మీనరసింహముగారి కవితాధార యనర్గళము. పద్యరచన సరసము, మృదువు.

19. సుధాశరచ్చంద్రము :—ఇదియు లక్ష్మీనరసింహముగారు రచియించినదే. ఇది శ్రీరమేశచంద్రదత్తుగారిచే నాంగ్లభాషలో రచియింపఁబడిన "లేక్ ఆఫ్ పాంసు" అనెడి యాఖ్యాయికకు భాషాంతరీకరణము.

ఇందలికథ మిక్కిలి చదువ నింపుగా నున్నది. ఆంధ్రీకరణమును సులభశైలి నున్నది. కాని యందందు వ్యాకరణ విరుద్ధము లగుప్రయోగము లున్నవి. ఇవిప్రమాద జనితములయి యుండును. ముద్రణ సమయమం దట్టివి సవరింపవలసి యుండెను. అట్లొనర్పమి సమంజసము గాదు. భాషాభివృద్ధికి మూలమును గాదు. అయినను నవల లను పేర బయలు వెడలెడి యిప్పటివచనకావ్యములలో నిట్లు గ్రామ్యము లన్యదేశ్యములును యథేచ్ఛముగాఁ బ్రయోగింపఁబడుట యెల్లరకును దెల్లమే కావున నిట్టియాఖ్యాయికలు కథయొక్క రంజకత్వమును బట్టి యొకసారి చదివి యానందింపఁదగినవిమాత్ర మగును గాని భాషాపోషణమునకుఁ గావని చెప్పవచ్చును.

20. ప్రభాతము :—ఇదియు నొకనూతనాఖ్యాయిక. దీనిని శ్రీచెలికాని లచ్చారావుగారు సంపాదకులుగా నున్న శ్రీరామవిలాస గ్రంథమాలకై వంగూరి సుబ్బారావుగారు రచియించిరి. ఇది శ్రీకృష్ణదేవరాయల రాజ్యవైభవమును దత్కాలమందలి సంస్థానమర్యాదలను దెల్పు చరిత్రాత్మక మగువచనము. భాష సర్వజనసాధారణముగా సులభశైలి నున్నది గాని యలాక్షణికప్రయోగములు మాత్ర మనేకములు గలవు.

21. అరవింద :—ఇది మఱియొకయాఖ్యాయిక. దీనిని గరికిపాటి సేతుమాధవరావుగారు సంపాదకులుగా నున్నసమ్మోదినీగ్రంథమాలకై వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావుగారు రచియించిరి. కథాంశముగాక మిగిలిన యంశములం జాలవఱకిదియుఁ బైవానినిఁ బోలియున్నది. కథాభాగములఁ జర్చించుట కవకాశములేక యిందు వానిని విమర్శింప లేను. కాని యిపుడు సముద్రతరంగములవలె విరామములేక దినదినము బయలువెడలుచున్న యీనవలలనుగూర్చి యొక మాట మాత్రము వ్రాయఁదగియున్నది. ఏమన? ఏకథ యయిన నేయంశమందైనఁ జదువరులకు నిజమైన విశ్వాసము గలిగించుచు వారిమనస్సులను వశపఱచు కొనుటకుఁ దగినట్లుగా నుండవలయును గాని గ్రంథకర్తల నూతనమతాచారముల కెట్లో సందిచ్చుచు సార్వజనీనములు గాని యభిప్రాయముల కవకాశము గల్పించుచుఁ దృతీయపథము ద్రొక్కునట్లుగా నుండరాదు. మఱియు నొక్కసారి చూచి విడువఁదగినట్లుగా నుండక యెన్నిమాఱులైనఁ జదువఁదగిన కథాచమత్కారము గలిగి, యిట్టికావ్యముల సారస్యము భాషలోఁ గొంతపరిశ్రమచేసిన వారికే కాక విద్యాభ్యాసదశలో నుండుబాలురకుఁ గాని బాలికలకుఁ గాని పామరులకుఁ గాని తెలియరా దనుట స్పష్టమగుటచేఁ గేవలము పేలపిండివలె నుండక, పట్టుమన్న గ్రంథమంతయు వెదకిన విజాతీయములైన పదములు నూఱయిన లేకుండునట్లుండక క్రమక్రమముగా భాషాజ్ఞాన మభివృద్ధిఁ జెందఁదగినట్లుగా నిర్దుష్టమగు రచనాశైలి నభివృద్ధిఁ జెందుచు నాఖ్యాయికలానందదాయకములు గాఁ దగును.

22. వాసిరెడ్డివంశచరిత్రము :—ఇది యైదాశ్వాసముల పద్యకావ్యము. దీనిని వాసిరెడ్డి వేంకటసుబ్బదాసుగారు రచియించిరి. తమవంశచరిత్రము నన్యకవులు వర్ణింప విని యానందింప నక్కఱలేకుండఁ దామే స్వయముగాఁ గర్తలై యానందించిన యీదాసుగారి యుద్యమ మెంతయు శ్లాఘ్యము. ఇది కేవలము వంశచరిత్రవలె నుండక యొకప్రబంధమువలె నొప్పుచున్నది. కవితాధోరణియు మొత్తముమీఁద సరసముగా నున్నది. ఇట్టిచరిత్రలు వచనాత్మకములుగా నుండవలయు ననెడివారుకూడ దీనినిఁ జూచినచోఁ దమయభిప్రాయమును దప్పక మార్చి కొందురు.

---

# విజ్ఞాపనము.

ఆర్యవర్యులారా !

మేమీపత్రికయందుఁ బ్రకటించుచున్న ఋగ్వేదికవి వేంకటాచలపతి కవి ప్రణీతంబైన చంపూరామాయణము ప్రతి మాయొద్ద నొక్కటియే యున్నది. ప్రత్యంతరము లేని కారణమున సంస్కృతము చూచినను దీనిని సందేహములు పెక్కులు గలుగుచున్నవి. దయచేసి యెవ్వరియొద్దనైన వేఱొక ప్రతి యున్నచో నొక్కసారి పంపించెదరని వేఁడుచున్నారము. పని తీరిన వెంటనే ముద్రిత ప్రతితోఁ గూడ వారి ప్రతిని వారికి వందనపూర్వకముగఁ బంపివైచుచున్నారము.

ఇట్లు :

బుధవిధేయుఁడు,

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికా సంపాదకుఁడు.

విషయ

ఆంధ్రవాఙ్మయమున

# నాచనసోమనాథున కీయఁదగినస్థానము.

## భూమిక.

ఎన్నియో విమర్శనగ్రంథముల వ్రాయించి గ్రంథకర్తల సమ్మానించి భాషకుఁ బరమోపకారముఁ జేయుచుండు "ఆంధ్రభాషాభివర్ధనీ" సమాజపు బహుమానస్పర్ధచేఁ బ్రేరితుఁడనై యీచిన్నవ్యాసమును వినోదార్థము వ్రాసితిని. కడ కిదియే బహుమాననీయముగాఁ బరిగణింపఁబడుట నాయదృష్టవిశేషము. దీనికై సమాజమువారికిఁ గృతజ్ఞతావందనములు దప్ప ను తేమియు బదు లీఁ జాలను.

విషయ మాంధ్రులకుఁ గాకపోయినను నాకుఁ గ్రొత్తది. అదియు విమర్శనమాత్రసాధ్యము. విమర్శనీయుఁడు మహాకవి. విమర్శనమార్గమును బలుపోకలఁ బోవునది. సర్వసమ్మతముగా విమర్శింపఁజాలుట యొకనితలలో వ్రాయఁబడిన యదృష్టముగాదు; అందును నాయట్టి యవిమర్శకునకు—అట్లైనను నిందుఁ జేయివేయుటకుఁ గారణ "మీనెపముననైనఁ గొంతవఱకుఁ బ్రాచీనగ్రంథసౌందర్య మనుభూతము గాఁగల" దనునాశయ.

నా కిందు మార్గదర్శకము మన్మిత్రులు సుగృహీతనాము లగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము. దీనిని వ్రాయునపుడు దానిని జూడకున్నను నంతకుముందు పలుమాఱుచూచియుండుటచే నాకుఁ దెలియకయే, దీనికిని దానికిని గలచుట్టఱికమును స్పష్టపఱుచు మాటలు కొన్ని యిందుఁ బడినవి. కావునఁ జాలవఱకును వారియెడ వట్టికృతజ్ఞత్వ మప్పవడియున్నాఁడను.

ఇందు నావలనఁ గలిగిన యెల్లతప్పులకును, జదువరుల క్షమాపణమును, బ్రీతిపూర్వకసంస్కరణమును వేఁడుచున్నాఁడను.

నే నీవ్యాసమును వ్రాసి నేఁటికిరమారమి మూఁడేండ్లు గడచినవి. ఇంతవఱకును బ్రకటింపఁ బడమికిఁ గల కారణముల గొడవ యిందనావశ్యకము. కాలము గడచుకొలఁది ననుభవమును నభిప్రాయములును బరిణతిఁ జెందక తీరవు. ఇపుడు నేను వ్రాసియుండిన నింకను గొంత విపులముగఁ జర్చించి యుందునేమో? ప్రకృతము నాచనసోమనాథుఁడు ఎఱ్ఱనకన్నఁ బ్రాచీనుఁడను సిద్ధాంతమొకటి బయలువెడలుచు నీ వ్యాసమును దలక్రిందుగాఁ జేయుచున్నది. సత్యమే కాఁ

బోలు! చారిత్రవిషయములందితరులనే నమ్మిన వాఁడనగుటచే నే నీవిషయమునం దేమియుఁ బ్రత్యుత్తర మీయఁ దలఁపలేదు; ఈఁ జాలనేమో! పైసిద్ధాంత చర్చకు నాయభిప్రాయము లేమైనఁ దోఁచ్చుడునేని యంతకన్నఁ గృతార్థత వానికి వేఱులేదు.

ఈ సిద్ధాంతముప్రకారము నాచనసోముఁ డెఱ్ఱనకన్నఁ బ్రాచీనుఁ డైనను సోముఁ డెఱ్ఱనకన్న నుత్తమకవి యనుసిద్ధాంతమున కేమియు బాధలేదు; సరిగదా ప్రాచీనునికన్న నర్వాచీనుని గవిత్రయములో నొక్కనిగా మనవారు పరిగణించి యుండుటయే యాసిద్ధాంతమును బలపఱచుచున్నది.

గ్రంథకర్త.

"ఆంధ్రవాఙ్మయమున నాచనసోమనాథున కీయఁదగినస్థానము."

మనయాంధ్రభాషావధూటికి లేఁబ్రాయంబుఁ దప్పించి, సరివారిలోఁ దల యెత్తఁజేసిన మహనీయులు కవిత్రయమువా రనుట యెవ రెఱుంగరు? వారికిఁ దరువాతఁ గూడ నేఁటివఱకు వారిత్రోవయే త్రొక్కి యట్టిపనికిఁ బ్రయత్నించిన కవు లనేకులు గల రనుట సర్వవిదితము. అట్టిమహాకవులలో నెల్ల నుత్తముఁ డయి, చాలఁగాల మెందో మూల నడఁగియుండి, శ్రీకందుకూరి వీరేశలింగము పంతులు గారి పరిశ్రమముచే బయలువెడలి వెలయుచుండు నాచనసోమనాథుఁ డను సర్వజ్ఞకవియు మనకుఁ బ్రాఁతవాఁడే. ఇతఁడు, ప్రబంధపరమేశ్వర బిరుదాంకితుఁ డును గవిత్రయమువారిలో మూఁడవవాఁడు నగు నెఱ్ఱాప్రెగ్గడకు నించుమించు సమకాలికుఁడు. తక్కిన యితని చరిత్రాంశములనెల్లఁ జాలవఱకు శ్రీవీరేశలిం గము పంతులుగారును, శ్రీచిలుకూరి వీరభద్రరావుగారును స్థలాంతరమున సప్ర మాణముగ నిర్ణయించియే యున్నారు కావున నంతకన్న నెక్కువగ నే నిందు వ్రాయ నెఱుఁగను. ఇపుడు విమర్శనీయ మగువిషయము, 'ఆంధ్రవాఙ్మయమున నాచనసోమనాథున కీయఁదగు స్థాన మెయ్యది' యనుటయు కావున యోగ్యతా నిర్ణయమునకుఁ గాలనిర్ణయ మత్యావశ్యకము గాదు.

ఒకవస్తువు విలువను నిర్ణయింపవలయు నన్న నూరక దానినే పదిమా ఱులు త్రిప్పిచూచి నిర్ణయించుట కష్టసాధ్యము. అసాధ్యమే యనవచ్చును. వే ఱొక సజాతీయవస్తు వున్నయెడల రెంటిలోఁ గలయెక్కువదక్కువల నరయవచ్చుఁ గదా! అట్లే ప్రకృతము సోముని యోగ్యతను నిర్ణయించుటకు నతనివంటివాఁ డొకఁడు మనకుఁ గావలయును. ఆంధ్రమండలములోని భూతవర్తమాన కవు లతోనెల్ల సోముని దూఁపవలయునన్న నగునా? కావున నిందఱకుఁ బ్రతినిధి

యగువాని నొకని వెదకవలయును. అట్టివాఁ డెవఁడు? కవికుల మూర్ధన్యు లని సర్వాంగీకృతు లగు కవిత్రయమువారిలో మూఁడవవాఁడును, సోమునకు సమాన కాలికుఁడును, సోముని యుత్తరహరివంశమునకు మూలమగు హరివంశమును రచించినవాఁడు నగు ప్రబంధ పరమేశ్వరుఁ డుండ మనము వేఱొకని వెదకఁబో నేల? ప్రకృతము సోముని విలువను దూఁచుట కతఁడే తూనికఱాయి.

ప్రబంధ పరమేశ్వరుఁడు హరివంశమును రచించిన పిదప నేకారణము వలననో యితఁడును హరివంశమును రచించియున్నాఁడు. అతని హరివంశము బాగుగ నుండలే దను తాత్పర్యమున నితఁడు దీనిని వ్రాసియుండు నని కొందఱు చెప్పుచున్నారు. ఒకవేళ నీకారణమే నిజమైయుండిన నుండవచ్చును. ఐన నితఁడు హరివంశమును సంపూర్ణముగ రచించినవాఁడు కాఁడు. ఎఱ్ఱన హరివంశములోని పూర్వభాగపుఁ గథ నెల్ల నించుకయుఁ దడవక మునుముట్ట వదలిపెట్టినాఁడు. ఉత్తరభాగములోఁ గూడ, జరాసంధునికథను, రుక్మిణీకల్యాణచరితంబును విడిచి, యందలి నాలవయాశ్వాసములోఁ గల నరకాసురచరిత్రము మొదల్కొని బాణాసురవిజయము వఱకును గల కథలను మాత్రము వ్రాసెను. ఇట్లే యందలితుద రెండాశ్వాసములకథ నెత్తుకొననే లేదు. సంస్కృతహరివంశమునఁ గలిగి, తెనుఁగున లేని హంసడిభకుల యుపాఖ్యానములు నెక్కువగా నాలవయాశ్వాసమునఁ దెలిపినాఁడు. అనఁగా, ఎఱ్ఱనహరివంశమున నుత్తరభాగమున నాల్గవయాశ్వాసముకథను సోముఁడు నైదాశ్వాసములుగ మార్చినాఁడు. *ఇందును పారిజాతాపహరణము మొద లగు నొకటి రెండు చిన్నవిషయములఁ దడవలేదు. ఏకాగ్రపెగ్గడ కవిత్వము నీరస మనియే యితఁ డీగ్రంథము నుపక్రమించి యుండున యేని, విషయము నిట్లు తునకతునకలుగ వ్రాయ నేమిహేతువో యని మనము సందియపడవలసియున్నది. పూర్వభాగమునకన్న నుత్తరభాగములోని కథ యెక్కుడురసవంతమైన దని చెప్పను వలనుగాదు. మనలోఁ గవులచరిత్రాదులను దెలిసికొన ముఖ్యాధారము లగుకృత్యాదిపద్యము లీగ్రంథమున దొరకమిచే నీవిషయమం దేమియుఁ జెప్పఁజాలము. ఏది యెట్లున్నను సోమనాథుని యుత్తరహరివంశమునకుఁ జాలవఱకు నెఱ్ఱన హరివంశమే మూల మని చెప్పినఁ దప్పుగాదు. అనేక స్థలములలో నందు గలమాటలే మార్చి యిందు వ్రాయఁబడియున్నవి.

---

* ప్రకటితమైన గ్రంథమును గూర్చిన యభిప్రాయ మిది. కాని యతని సంపూర్ణగ్రంథమే లభింపలేదనియుఁ, బ్రకటితమైనది భాగము మాత్రమే యనియుఁ బరిశోధకుల యభిప్రాయము.

ఒకటి రెం డుదాహరణములఁ జూపెద :—

ఎఱ్ఱన హరివంశమున మునులతోడ నరకాసురుఁ డాడుమాట.—

చ. "యముఁడు కుబేరుఁ డర్థపతి యాదిగఁ గల్గిన దేవకోటితో
నమరవరేణ్యు నూర్జితభుజాతిశయంబున భగ్నుఁ జేసి, త
త్సమధికరాజ్యవైభవము సర్వముఁ జేకొని యున్నవాఁడ, వి
శ్వమునకు నేనకాక పెఱవాఁ డొడయండు గలండె యెప్పుడున్."

సోముని యుత్తరహరివంశమున.—

శా. "పాశం బాఱఁగఁదోలి, యంతకు దశాపట్టంబు గావించి, ప్రా
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని, ధనాధ్యక్షున్ విభాళించి, కే
ళీశస్త్రాస్త్రవిహారుఁ డైన నచటన్ లేకుండ నిర్మించితిన్
మీశాస్త్రంబుల నింక నెవ్వరి కగున్ మేలైన యజ్ఞంబులున్ ?"

నరకాసుర యుద్ధమునఁ గుబేరుఁడు పాఱిపోవుట.—

హరివంశము.—

చ. "ఉరమున మూఁడున స్నుదుట నొక్కటఁ గన్నులఁ గప్పుచుం బరం
పరలయి తత్ప్రయుక్త పటుబాణచయంబులు బిట్టు నాటినన్
దిరిగి కలంగి యెంతయును దీనత నర్థవిభుండు వోయె, ము
న్నరిగిన యాత్మభృత్యనివహంబులజాడన రాజతాద్రికిన్."

ఉత్తరహరివంశము.—

చ. "చనుమఱలందు వక్షమునఁ జక్కురుపాంతమునందు తెప్పలన్
మునిఁగిన బాణజాలమున ముప్పిరిగొన్న భయంబు ఖేదమున్
మనమున నిండఁగాఁ దొడఁగి మార్కొనలేక కుబేరుఁ డేగె, న
ద్దనుజుల నింతచేసిన విధాతకు గోడనఁబోవుచాడ్పునన్."

ఇందు విషయానుకరణము స్పష్టము. విషయ మొక్కటి యగుచోటుల నిట్టిపోలిక లుండకపోవు. ఇంతియుఁ కాదు. హరివంశమున నేయేవీరు లెవరెవరిపై నేయే యస్త్రశస్త్రముల నెట్లెట్లు ప్రయోగించిన ట్లున్నదో, యదియంతయు నించుమించుగ నట్లే సోముని యుత్తరహరివంశమునందును గలదు. ఇంద్రనరకాసుర యుద్ధములోని యాపద్యము లందున కుదాహరణ మగు.—

హరివంశము.—

సీ. "అఖిలగాత్రములు రక్తాక్తములై నొవ్వ దనికినఁ గినిసి శతక్రతుండు
విశిఖాష్టకంబున విద్వేషి నొంచి డెబ్బది బాణముల రథబంధనంబు
నెడలించి కేతువు నేకాస్త్రమునఁ ద్రుంచి సారథిఁ దొమ్మిదిసాయకముల
సమయించి హయములఁ జతురంబకంబులఁ గూల్చి పిల్లోక్కటఁ గూలనఱకె

గీ. విరథుఁడు హతాయుధుండు నై సురవిరోధి
యుగ్రఖడ్గంబుఁ గొని వీఁక నుఱికి యుఱక
వ్రేసె నైరావతంబును వెస బలారి
యురము నుద్దామహతి వ్రచ్చి యుబ్బి యార్చె."

ఉత్తరహరివంశము.—

సీ. "అంతలోనన తేఱియమరేంద్రుఁ డెనిమిదిబాణంబు లతనిప్పైఁ బఱపి మఱియు
రథము డెబ్బదిట సారథిఁ బదింటను నేసెఁ బడగ శాతక్షురప్రమున నఱికె
సూతు నంతటి శితాశుగపరంపరచేత జముఁగూడ ననిచి రథ్యముల నాల్గు
శరములఁ జంపి తచ్చాపంబుఁ గ్రూరభల్లమున ఖండించిన నమరవైరి

గీ. విరథుఁడై చేతఁ గరవాలు వెలుఁగుచుండ,దాఁటిగజకుంభములఁ గాలఁదన్ని వజ్రి
వక్షమదరంట వ్రేసినవ్రాలెనతఁడు, మీఁదుమీఁదునఁబాణంబుమిడుకమిడుక."

అనేకస్థలములలో నిరువురు కవులును సంస్కృతమూలానుసారులు గావున నిట్టి సాదృశ్యముల కవకాశము గలిగె. ముఖ్యముగఁ బ్రత్యేకముగ సోముఁడు వ్రాయు పెద్దవచనములందప్పు, యుద్ధవర్ణనములలో నీయిరువురకు బింబప్రతి బింబ భావము స్పష్ట మగు. అందందు సోముఁడు వీరులుప్రయోగించు బాణముల లెక్కను బెంచును, లేక దించునేమో! ఇంతియ కాదు. వర్ణనాంశములయందుఁ గూడ నేయేస్థలములలో నెఱ్ఱన యించుక విపులముగ వర్ణించినాఁడో యాస్థలముల నెల్లఁ బ్రాయికముగ సోముఁడు చల్లఁగ దాఁటును. అతఁ డుదాసీనముగ విడిచిన స్థలములలోనెల్లఁ దా నించుక చేయి వేయును. సూక్ష్మదృష్టిఁ బరీక్షించినచో గ్రంథ మంతయు దీని కుదాహరణ మగు. మఱియు నొక విశేషము. ఎఱ్ఱన యెం దైన మిగుల మనోహరముగ వర్ణించియుండెనేని దానును నాచోటనే యా తని మాటలకే రంగు మార్చి వ్రాయఁ బ్రయత్నించును. తపసు చేయుచుండు శ్రీకృష్ణునిచెంతకు శివుఁడు ప్రత్యక్షమై రాఁగా, వారి నిద్దఱను జూచిన మునీశ్వ రులు నుతించినట్లు శంభుదాసుఁడు వ్రాసిన,

సీ. “ యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియు నై లోకనుతులఁ బెంపారువారు
కందర్పజనకుండు కందర్పదర్పైకదమనుండును నై లీలఁ దనరువారు
భువనసంభర్త్రయు భువనసంహర్త్రయు నన నాప్తగుణకృత్యు లైనవారు
భూధరోద్ధారియు భూధరావాసియు నగుట నిత్యప్రీతి నెగడువారు

గీ. విషధిజాతంబు లగురత్నవిషము లురముఁ, గప్పుకంఠంబు గై సేయ నొప్పువారు
భుజగశయనుండుభుజగవిభూషణుండు, నెపుడుఁగరుణాతో వరదులయ్యెదరుమాకు.”

అను పద్యమును జూచి యామాటలనే మార్చి సోముఁడా చోటనే,

సీ. “ అభ్రంకషం బైన యాలపోతు నితండు త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు గాచినాఁ డీతండు త్రోచినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు

గీ. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ, జూపఁజెప్పంగఁ జెప్పంగఁ జూపఁగలిగె
ననుచుఁగొనియాడుసంయమిజనులకొదవె,రజతగిరిమీఁదహరిహరారాధనంబు.”

అనుపద్యమును వ్రాసెను. మఱియు శివ్వరుని జయింప మన్మథుఁడు వచ్చు
శీవి, నెజ్జన వర్ణించుచు వ్రాసిన,

సీ. “ ముందట నెలమావిమొక్కల నలరింపఁ గర్తదా నగుచెలికాఁడు నడువ
నిరువంకలందును విరులతేనియఁగ్రోలు దొరలు మోదంబునఁ ద్రుళ్ళియాడ
నునుఁగుత్తుకల తీపుఁగన గూయుపులుఁగుల చాగునాదములు గై వారములుగఁ
జందనగిరినుండి చనుదెంచి చల్లని బం శ్లిల్లపనులనుఁ బరువువెట్టఁ

గీ. జిలుకమావులు గట్టిన చిగురుతేరి, పసిఁడి బలుమీనుపడగ యెద్దెసల మెఱవఁ
జెఱకువిల్లు పూవమ్ము లేర్తైజి ధరించి, గట్టిబిగిసి యేతెంచె నక్కడిమి మగఁడు.”

అను లోకోత్తరమైన సీసమునే, సోముఁడు మార్చి మఱియింత యర్థము
గూఢముగఁ జేసి, మన్మథుఁడు దేవేంద్రసభకు వచ్చు సంవిధానమునఁ బొదిగినాఁడు—

సీ. “ మకరందమాని మైమఱచిన గొనయంబు వెడమ్రోయఁ గడివోని వింటితోడ
జలజకేసరరాజి జల్లెడమూఁకగా దాఁటు వశారి రథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గకనకంపుగుబ్బగాఁ గోయిలనోరూరు గొడుగుతోడ
రతికన్నుగవ మచ్చరముసేయుపెక్కెంబు పడఁక వీతెంచు సేవకులతోడ

గీ. వలపుఁదూపులు కరసాన వాఁడిసేసి, మందునెలతోడఁ దనమేనమామయైన
నిందునెలతోడ వలరాజు నిర్జరేంద్రు, సభకు నేతెంచె భుజబలోత్సాహమెసఁగ."

మఱియుఁ బ్రాసముపై నాసతో శంభుదాసుఁడు వ్రాసిన—

మ. "కనియెం గ్రీడదమర్త్యదంపతిమిథోగంభీరహాసంబు, ని
త్యనిరుద్ధేంద్రియసిద్ధసంయమిగణైకావాసముక్, వాసవా
ద్యనఘారాధనరమ్యరుద్రచరణన్యాసంబు, నానన్నవే
లనలోలాద్రిసుతామనోజ్ఞగిరిశోల్లాసంబుఁ గైలాసముక్."

అనుకైలాసమును వర్ణించు మత్తేభమే, యదేప్రకరణమున,

ఉ. "వాసుకిహారసంతతనివాసము, వాసరవల్లభప్రభా
న్యాసము, నాసముద్రరశనక్షితిహాసము, నాత్మకీర్త్యను
ప్రాసము, దత్తదిక్కటనిరాసముఁ, గంసవిరోధి గాంచెఁ గై
లాసము, నభ్రవిభ్రమకిలాసము, మేరుతటీవిలాసముక్."

అను నుత్పలమాలయై సోముని నోట వెడలినది. ఇట్లు సోముని హరివంశమునకు నెఱ్ఱనహరివంశమే మూల మని స్థాపించు నిదర్శనము లింకను బెక్కులు గలవు. భేదములును గొన్ని యున్నవి. శ్రీకృష్ణుని సభకు నెఱ్ఱన 'సుధర్మ' యని పే రిడఁగా, సోముఁడు 'దాశార్హి' యని పే రిడెను. నరకాసురరాజధానికి నెఱ్ఱన 'ప్రాగ్జ్యోతిష' మని ప్రసిద్ధనామమున వ్యవహరింపఁగా సోముఁడు 'మాహిష్మతి' యని మాఱుపేరుగూడ నుంచెను. కథలలోను గొంచెము వెనుక ముందులు గలవు. ఐన నవి యంతముఖ్యము లని తలఁపఁగాదు.

'సర్వజ్ఞుఁ' డను బిరుదనామము వహించిన యీసోమనాథుఁడు, తనకించుమించు సమకాలీనుఁ డగు శంభుదాసుని కవిత్వమును మెచ్చక యీహరివంశమును వ్రాసియుండిన నుండునేమో కాని, యించుక మనము కన్నువిచ్చి చూచితిమేని యితఁ డిట్లు తలపోయుటకుఁ గారణ మేమియు లే దనియు—నుండఁజాల దనియు—నిశ్చయింప వచ్చు నని నాయభిప్రాయము. మనవారిలో ననేకుల కీమాట రుచింపదు గాఁబోలు! శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమకవుల చరిత్రములో నీతనిగూర్చి యిట్లు వక్కాణించి యున్నారు—

"సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను సర్వవిధముల నెఱ్ఱాప్రెగ్గడ కవనము కంటె మేలైనదిగాను నున్నది. ఒక్క యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వమే

కాదు. భారతము రచించిన కవిత్రయము వారిలో ననేకుల కవిత్వమును గొన్ని విషయములలో సోమునికవనముతో సరిరా దని నాయభిప్రాయము. ఇతనికి కవిత్వపటుత్వసంపదనుబట్టి సర్వజ్ఞుఁ డను బిరుదుపేరు వచ్చినది. ఆపేరున కితఁడు తప్పక తగినవాఁడే."

మఱియు వారే యుత్తరహరివంశపుఁ బీఠికలో నిట్లు వ్రాసియున్నారు—

"సోముని హరివంశము తెలుఁగుభాషలోఁ గల యుత్తమగ్రంథములలో నుత్తమ మైన దని పండితుల యభిప్రాయము."

శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగారు తమశబ్దరత్నాకర పీఠికలో నిట్లు వచించిరి.

"అది (సోముని హరివంశము) మిక్కిలి ప్రౌఢముగాను భారతమునకంటె నెల్లవిధముల విశేషించినదిగను గానంబడుచున్నది. ఇతనిని సర్వజ్ఞుఁ డందురు. అట్లనుటకు సందేహింపఁ బనిలేదు."

మఱియుఁ జిన్నయసూరిగారు సోముని 'అళికంబున యక్షినిడాఁచినట్టి సర్వజ్ఞుని' గాఁ బొగడిరి. ప్రాచీనప్రబంధకవులు గూడ నిట్లే సోమనాథు నెంతయు శ్లాఘించియున్నవారు.

ఇట్లు పండితు లందఱొక్కటిగ నాచనసోమనాథున కున్నతస్థానము నీఁ దలంచినను, నదియేమి గ్రహచారమో, నాయభిప్రాయము మాత్రము దీనికి విరోధించుచున్నది. సోమనాథుని కవన ముత్తమ మైనది గా దని నేను జెప్పను. సర్వవిధముల నితఁడు మధ్యకాలపుఁ గవులకన్న నెంతయు మిన్న యైనవాఁడే. కాని, సర్వజ్ఞశిరోమణు లగుకవిత్రయమువారికన్న విశేషించునంతటి కవితాప్రౌఢిమ నా కిందెంతచూచినను గోచరింపకున్నది. శ్రీవీరేశలింగము పంతులు గారు, ఎఱ్ఱనకవనముకన్న సోమునికవనము మే లైన దని తొల్తఁజెప్పి, పదంపడి యంతతోఁ దనివినక, 'కవిత్రయమువారిలో ననేకుల కవిత్వమును గొన్నివిషయములలో సోమునితో సరిరా' దని యానతిచ్చిరిగదా! అందు నాకుఁ గొంత సందేహము. ఎఱ్ఱన మొదలే నిగ్రహింపఁబడియెనే! ఇఁకఁ గవిత్రయములో 'ననేకు' లెవరు? నన్నయ తిక్కనలే గదా! నన్నయను,—విశేషించి తిక్కనను, సోముఁడు కవనపాటవమున మించినాఁ డనుటకన్న విపరీతము వే ఱొకటి యుండఁబోదు! "తిక్కనసోమయాజివలె వ్రాయుట కెవ్వరికిని సాధ్యముగాదు" అని మఱియొక

చోట వారే వ్రాక్రుచ్చి, యింతలో నింతసాహసవాక్యమునకుఁ దొడంగుట యెం తయుఁ జిత్రము ! "కొన్నివిషయములో" ననిరి. ఏవిషయములో యెఱుఁగము. వివరించి వారు తెలుపరైరి. ఇఁక సీతారామాచార్యులుగా రన్ననో "యెల్ల విషయముల" మేలైన దని నిస్సందేహముగాఁ జెప్ప సాహసించిరి. ఐనను వారు కవులయోగ్యతను నిర్ణయించిన పట్టికలోఁ గవిత్రయమువారికన్న నెక్కువమర్యా దను సోమున కింతయుఁ జూపక సమానముగాఁ బరిగణించుట యతని దౌర్భా గ్యమేగదా !

ఈ సిద్ధాంతమును స్థాపింపఁజాలిన దని వారు సోమునిగ్రంథమునుండి యుదాహరించిన పద్య మిది :—

సీ. "వంకదారకుఁజేరి వాకిటిదడ్డసంబులు సెర్చి కొమ్మల మ్రోకు వైచి
ప్రాఁకి లోపలఁజొచ్చి పలుగాఁడిఁ దెఱచిన పంతకార్లకు మున్న బద్ధపరుల
తోన నిచ్చెనలెక్కి కోటకొత్తడముపైఁ బురణించి చొచ్చినపోటుమగల
వాఁడి మెచ్చక యొండువరిమీఁదఁ బాళెలవారిఁ దాఁకించిన వాసిబిరుదు

గీ. లచ్చెరువులొంద మేడలుసొచ్చియాక్సు, దొద్దకార్లచేఁ బడిపోయెఁదూర్పుదిక్కు
జాలవాటుల నేటుల అంతుమిగిలి, తఱిమి రచ్చటిబలముఁ గొందఱు గడంగి."

ఈపద్యము చక్కనిది గా దని చెప్పవచ్చినవాఁడను గాను. నిజముగ నిది యుత్తమ మైనదే; కాని "భారతమునకంటె నెల్లవిధముల విశేషించుట"ను స్థా పించుటకు దీనికి శక్తి చాలదు. ఏల యందురో. ఈయొక్కపద్యముచేతనే గ్రం థముయొక్క విలువను నిర్ణయింపవచ్చునా ? ఒకవేళ నిట్టివి మఱికొన్ని నాచన సోముఁడు రచించియున్నాఁ డనుకొందము—అనుకొననేల ? రచించియె యు న్నాఁడు. ఆపదిపదునైదుపద్యములు చాలునా గ్రంథకర్తృసర్వాతిశాయిత్వసమ ర్థనమునకు ? కోటఁ బట్టుకొనుట, జూద మాడుట, మొదలగు నల్పవిషయముల నొండు రెండు చేకొని వానిని సర్వాంగసంపూర్ణముగా వర్ణించినమాత్రానఁ గవి కృతార్థుఁ డయ్యె నని తలఁపవచ్చునా ? మఱియు నిట్టిపద్యముల మరల నొక మాఱు సావధానముగాఁ బరీక్షించితిమేని, వీనిని వ్రాయుటలోఁ గవియుద్దేశము స్వభావోక్తి యనుటకన్నఁ, దత్తత్సాంకేతికపదముల నొకచోఁ గూర్చుటయే యను నుట మేలని తోఁచును. సోమునిప్రత్యేకవర్ణనలలో నెల్ల నీయుద్దేశము తాండవ మాడుచుండును. ఇది నిఘంటుకారులకుఁ దగినదికాని కవికిఁ దగినది గాదు. హంసవింశతికారుఁడు మొదలగువారలకుఁ ద్రోవసూపిన దిదియే. నాకుఁ జూడ

శ్రీ వీరేశలింగముపంతులుగారి "కొన్ని విషయముల" లో నిదియ ముఖ్యముగా నుండఁబోలు నని తోఁచెడిని.

అది యట్లుండె. కవిత్రయమువారిలో నన్నయ తిక్కనల విచార మ టుండనిండు. వారికవపకులో సోమునికవనము పోల్చుట సరిగా దని విమర్శించి నిర్ణయింపఁ బ్రకృత మవకాశము చాలదు. విధిలేక కవిత్రయములోఁ జేర్పఁబడి నను, నన్నయతిక్కనలవలెఁ గాక, మనవారిచే నింగంటఁ జూడఁబడు ప్రబంధపర మేశ్వరుతో సోముని బోల్చి చూచినఁ జాలును. పరస్పరతారతమ్య మును బ్రకృత. విషయమును స్పష్ట మగు.

నాకుంజూడఁ గవిత్రయమువారికి న్న నితనియందుండు విశేషము ప్రబంధ మార్గమునకుఁ ద్రోవ సూపుటయే. ప్రబంధమార్గ మనఁగా, నెక్కువ యలంకా రాపేక్ష, సాంస్కృత దీర్ఘసమాసములు, శబ్దాలంకారములు, కథలోనౌచిత్యమును బాటింపకుండుట; యిత్యాదులు. ఇంచుమించు తెనుఁగునఁ గల గ్రంథముల కెల్ల నిది సాధారణధర్మ మనుట యెందు తెలిసిన విషయమే. కవిత్వము వెంట నలం కారము లెప్పుడు నంటియ యుండు ననుట నేను నొప్పుకొందును గాని, కవికి వానియందే దృష్టియుండుట గొప్పప్రమాదము. సహజములైన యుపమాదృ ష్టాంతాద్యలంకారములే కవితకు నిజమైన సొమ్ములు. అట్లుగాక, తాను జెప్పు ప్రతిపద్యమునందు నేదైన నొకక్రొత్తకల్పనము గల విషమాలంకారమో, వక్రో క్తియో, శ్లేషయో, యుత్ప్రేక్షయో, యుండితీరవలయు నని పంతగించి పలు త్రిప్పులం బడి పెనఁగులాడి వ్రాయుచుఁ గవితాలతను గట్టివైచుట న్యాయ్యమా? ఇట్టి కుకల్పనములే ముఖ్యములుగా నెంచినచో,

"అల్పం నిర్మిత మాకాశ మనాలోచ్యైవ వేధసా,
ఇద మేవం విధం భావి భవత్యాః స్తనమణ్డలమ్."

అను పద్యమును వ్రాసిన, కవితావనితాసౌందర్యగంధానభిజ్ఞునినైతము మహాకవి పదమున నభిషేకింపవలసియుండునుగదా! సోమునియందుఁ బ్రబంధ కవులయందుంబలె నీతిక్క యంత యున్నతకముగా నుండలేదు గాని, చాల వఱకు ముదిరిన దని మాత్రము చెప్పవచ్చును. ఈవిషయ మింక ముందు స్పష్ట మగును.

ఇఁక దీర్ఘసమాసము లన్ననో తెనుఁగుకవితకు వికారములే యని నామ తము. కోమలములై మనోహరములైన యచ్చతెలుఁగుపలుకు లుండ వాని

నట్టుఁ ద్రోసి, హనుమంతుని తోఁకవలెఁ బద్యమునిండ నొకమాత్రైన గ్రుక్కదిరుగ నవకాశ మీయని దీర్ఘసమాసముఁ బ్రయోగించినఁ దెనుఁగున కేమిగౌరవము? అసమాసమైన సార్థకముగ నున్నచో నది యొకరీతి. అసమయమున నిరర్థకము లగుపదములు గూర్పఁబడి, చాలిచాలని యొందుకుఁ బనికిరాని యమకాది శబ్దాలంకారముల నిండియుండినచో నది యెంత రోఁతగ నుండునో వేఱుగఁ జెప్పవలయునా? ఈ సోముని పద్యముఁ దిలకింపుఁడు—

స్రగ్ధర. "గాండీవారావఘుంఘాఘుటిలిభయదివౌకఃపురాంతఃపురంధ్రీ
గండాభోగశ్రమాంభఃకణకలుషితగంగాతరంగాభిషంగా
ఖండాస్మత్కాండపాళీకబళితసకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంతగర్వాంతకయమభటసంతానముం గాననైతిన్."

అర్జునుఁడు మృత్యువువాతఁ బడకుండ విప్రకుమారుని రక్షింపఁ బంతములు వల్కి, యచ్చటికిఁ బోయి, తనకుఁ దెలియకయే యాశిశువు మృతినొందఁగా, బ్రాహ్మణున కిచ్చినమాట వమ్మైనదియు, శ్రీకృష్ణునియొద్దఁ దాను బల్కిన బీరములు నిష్ప్రయోజనము లగుటయుఁ దలపోసి, యవమాన మయ్యెనే యని సంకటపడు సంవిధానము సన్నగారితోఁ జెప్పుపద్య మిది! ప్రకరణమునకును శైలికిని నెంతసొగసైన పొత్తు గలసినదో చూచితిరా! గాండీవారావముయొక్క దెబ్బకు దేవతల యంతఃపురస్త్రీలకెల్ల భయము కలిగినది. దానివలన వారిచెక్కిళ్లపైఁ జెమట వొడమినదఁట! ఆచెమట సామాన్యము గాదు సుఁడీ! గంగాతరంగములనెల్లఁ గలుషితములుగాఁ జేయఁజాలినది! ఆ గంగాతరంగములతోఁ జేరి యఖండము లైన యర్జునుని బాణముల సమూహములు! అర్థమేమో! ఆ బాణసమూహముచే సమస్తమగు నాకాశప్రదేశ మను నొకగృహము కబళితంబైనదఁట! ఆగృహమును గూడ నుద్దండముగ నతిక్రమించినారు కుమారుని జంపిన యమభటులు! వారి నర్జునుఁడు కానఁ డయ్యె నఁట! ఆహా! ఏమి యీ సమాసపుఁ బొందిక! ఎత్తిన దేమి దించిన దేమి? ఇందు నిరర్థకవిషయము లెన్ని! నిరర్థకపదము లెన్ని! వీరము, శృంగారము, భయానకము, శోకము, నన్ని రసములను జేర్చి పిసికి పిండివంట చేసిన ట్లున్నదే యీపద్యము! ఈ దీర్ఘసమాసము నింత యనుచితముగ నీచోట నేమిఫలము నాశించి ప్రయోగించినాఁడో యీసోమునికే—కాదు దేవునకే—యెఱుక! సాధారణముగ సోముని

సమాసము లనేకము లిట్టివ. అస్థానపతితములు. అసుందరములు. అనుచితములు. మఱియుఁడు——

మ. "గరుడస్స్యందను త్రైపురాపురరిపు రక్షోర్జితసైన్యంబుతో
సురసంఘావృతజంభశాత్రవసభాశోభాప్సరంభాంగనా
వగముఖ్యామరభీరువారసుమనోవైగర్ధ్యగోభాభోత్సుకో
ద్ధురతాలాలితయోధవిక్రమమహోద్వృద్ధంబు సిద్ధించినన్."

శా. "చూడంబోదు గజాపనీతకటఖర్జూభూర్జఖర్జూరలీ
లాడోలాసుఖలేఖలోకమహిళాలంకారశోభాక్షణ
క్రీడాతారకితాంతరాళతగళ శ్రీకంఠకంఠప్రభా
చూడాచంద్రకళాకిలాసము సతీశుద్ధాంతకైలాసమున్."

శా. "జంభారాతి విజృంభమాణహృదయోత్సాహైకసాహాయ్యుఁడై
యంభోజాసను సంపునఃజని ప్రసూనాస్త్రం దలంచెన్ నటా
రంభ స్తంభనిశుంభ ఖేదవిచరద్రంభావళీ జృంభణ
స్తంభాసంభవగుంభరత్నరచనాస్థానస్థితస్థేముఁడై."

ఇంకను నిట్టి వెన్నియోఁ గలవు. మఱియు నీయమకమును గనుండు!

తే. "అనుచు ననుచారిమై విప్రుఁ డరుగు దేరఁ
దేర గాండీవ మిడి యస్మదీయ మహిమ
మహిమమునంగ మునం గగు మనసు మాయ
మాయ గన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను."

ఇదియును బైయర్జునుఁ డన్నతోఁ దనగోడు చెప్పికొనుపద్యమే! నిజముగఁ గవితాలతకుఁ బ్రాసములు ప్రాసములే! ప్రాసముపైననే దృష్టియుంచి పాండిత్యమును జూపనెంచినవానికి రసముపైఁ గన్నుండదు. ఔచిత్యమును విమర్శింపఁడు. తాను వ్రాయుమాట లనర్థకము లని తలఁపఁడు. సోమునియం దీదుర్గుణము ప్రబలిన దనుటకుఁ బైనిదర్శనములే చాలి యున్నను మఱి యొండు రెండు చూపెదను——

క. "ఫాల్గునమాసము మొదలుగ, ఫల్గునసఖుఁ డతులతర తపశ్చరణమునన్
వల్గదరివర్గహాయఖుర, ఫల్గువు గానీక మనసు పదిలము సేసెన్."

ఎత్తైన నుపక్రమించిన "ల్గ"కారప్రాసమును బూర్తిచేయవలయును. కావు

ననే నిష్ప్రయోజనముగ మూఁడవపాదమున నంతపొడవు సమాసము వేయవలసి వచ్చినది! లేకున్న 'ఫల్గుప్ర' అనుపదమే చాంచల్యమును దెలుపుచుండ 'వల్గదరి వర్గ హయఖుర' యను వాక్యన్యాసమున కేమి ఫలము?

క. "ప్రాగ్జ్యోతిషంబుఁ గదిసి స, దృగ్జ్యాటంకృతులు మీఱ దితిజులమీఁదన్
దృగ్జ్యోత్స్న జేవురింపఁగ, దిగ్జ్యాగగనాంగణంబు దివురఁగ నార్చెన్."

'ప్రాగ్జ్యోతిషంబు" అని యుపక్రమించినాఁడు. కావున నిఁక మూఁడు 'గ్జ్య' లు సంపాదించి వ్రాయకున్న సర్వజ్ఞత్వమునకు లోపము గలుగు నని సోముఁడు తలఁచినాఁడు. పద్యము సాగిపినఁ జాలు నని వ్రాసినాఁడు. కావుననే యౌచిత్యవిమర్శము వెనుకఁబడినది. చూడుఁడు. నరకాసురుని జంప వచ్చి సింహానాదమొనర్చి యుద్ధసన్నద్ధుఁ డగు శ్రీకృష్ణుని మహాక్రూర మగు చూపును జ్యోత్స్నతోఁ బోల్చుట కన్న నేఱ యనుచితము గలదా! ప్రాసలుబ్ధు లైనవారి గతి యంతయు నింతే. ఇట్లు పద్యములలోఁ జెప్పుట చాలక సమయము చిక్కినప్పుడెల్ల నొక్కొక్కపుటకుఁ దక్కువలేక వచనముల నిఱికించి, యందుఁ బ్రాసముల యెడను దీర్ఘసమాసములయెడను దనకుఁ గలతిక్కనంతయుఁ బూర్తిగ విడిపించినాఁడు.

"నందికృతనాందీసంధానితవందనమాలాసంజేహావిహారద్బృందారకసుందరీహారఘటితనటనారంభవిజృంభితరంభాకుచకుంభసందర్శన సంభావనాసుభగంభావుకకుబేరకుమారసంభ్రమావతరణఝణఝణాయమాన మణిమంజీరఝ్ఝాపితసోపానపథోపగమ్యంబై రమ్యంబై" (కైలాసవర్ణనము)

ఎట్టిన గ్రహచారముచాలక తనయుద్ధవర్ణనములో నొండు రెండుచోట్ల,

"సాయకపరంపరల పరుసఁదనంబునఁ వరుసం గెడసియుఁ జక్రపాతంబులం బొలిసియుఁ గదిసి కౌమోదకీఘాతంబుల మడిసియు నందకప్రహారంబుల నమసియు"

ఇత్యాది రీతుల నుభయప్రాసము లొండురెండు చేర్పఁగా, సోముఁడును 'తేలునకుఁ బారుపత్తె మిచ్చినఁ దెల్లవాఱుదాఁకఁ గుట్టె' నన్నట్లు తనవచనములలో నెల్ల నిట్టివియు దీనివంటివియుఁ బ్రాసము లొకపరసహస్రముఁ దూర్చియుంచెను. మఱియు నెట్టినకన్న మిన్నయని తాఁ బేరు వడయఁగోరినవాఁడు గావుననే తన వచనములలో సోముఁడు కొన్నివిచిత్రమార్గముల నవలంబించినాఁడు. అవియేవ

నఁగా, సమానార్థకము లగుమాటల ననేకములఁ గూర్చి వ్రాయుట మొదలగు నవి. చూడుఁడు !

"చలంబుకొని పోరి పోరిలోఁ దునుకలయ్యును మునుఁగయ్యును నింతింత లయ్యును నిసుమంత లయ్యును జిఱుచు గ్గయ్యును జిఁపుఱుప లయ్యును మంచ య్యును మడిమంచయ్యును రూపుచెడినం దిరుగుఁబడి వాహిని చిక్కువడి చిం దఱవఁదఱై మడిసి మల్లామట్టమై యేపుదెగి యెప్పుగుసపట్టయి యునువు దప్పి యదవదయయి యంతంత నిలిచి యప్పరుసప్పరై పాఱఁలేక సలపలనై వెఱఁగుపడి వెల్లవెల్లనై చిమ్ముడిపడి చెల్లాచెదరై పొడవడఁగి ప్రోవున నొక్కండై పోవిడిచి పోయినపోకై పోయినం గని" ... ... ...

ఇంచుమించుగ నిందలి వాక్యము లెల్ల నేకార్థకములు, వినుటకు విచిత్రముగ నుండుట యొకటియ కాక వీనివలన నేమిప్రయోజనము ? ఇట్టి వొకటిరెండు వాడిన లోకోక్తి యనవచ్చును గాని యిన్నియు నీనివియు నొకపరశ్నితము గూర్చిన నేమివ్రాఁత ? రోఁత కాక.

నన్నయతిక్కనలకుంబోలె నెఱ్ఱనకును బ్రౌఢయుక్తముగఁ బిచ్చిపిచ్చి యలం కారంబులందును బ్రాసములందును దీర్ఘసమాసములందు నాశ లేదు. అతని పద్యము లన్నియు సాధారణముగ స్వభావోక్తి మధురములై 'యలఁతియలఁతితుని యలుగఁ' గూర్పఁబడి సుకుమారములై చదువరుల చెవుల కమృతంపుఁ దుంపు రులఁ జిలుకుచుండును. ఇతఁ డపూర్వముగ నెందేని యుపయోగించిన దీర్ఘసమా సములు గూడఁ జాలవఱకు వ్యర్థము లగు కల్పనములును పదములును లేక చదివి నంతన యర్థము మనసున కందిచ్చుచుండును—

శ్రీకృష్ణుఁడు ఋషులతోఁ జెప్పు పద్యము—

మ. "విలయోద్దీప్తపతంగమండలసమావిర్భావదుర్భావ సం
కలనారౌద్రపరిక్రమంబయిన చక్రం బస్మదాభీలదో
ర్వలభీష్మపవిరూపమై నిగిడి గీర్వాణారిఁ గంఠచ్ఛిదా
చలితోద్యగ్రకబంధుఁ జేయు నపహ్నుత్తై న్యంబుగాఁ జెచ్చెరన్."

సమాసానుప్రాసబద్ధము లగు నితని యాశ్వాసాంతపద్యములు నిట్టివి.

పరికించి చూచినఁ బ్రబంధపరమేశ్వరునకును సోమనాథునకును జాల నంత రము గలదు. ఎఱ్ఱనకవితలో నర్థము ననుసరించి పదములు నడుచును. సోముని కవితలో ననేకస్థలములఁ బదముల ననుసరించి యర్థము నడుపవలసియుండును.

ఎఱ్ఱనకవిత్వ మతికఠిన మని కొందఱు వాక్రుచ్చిరి. తిక్కనాదులతోఁ బోల్చితి మేని సంస్కృతప్రయోగముల నొకింత కాఠిన్యము గానవచ్చునేమో కాని, నిరర్థకపదములను గుప్పలుగాఁ గూర్చి చెవులపండువు సేయు సోముని సంస్కృతకవనముకంటె, నాయనకవిత్వము సార్థకపదమాత్రసంఘటిత మగుటచే వేయియంతలు సులభ మని నాయభిప్రాయము. ఇఁక దెనుఁగు పల్కులలోఁ గాఠిన్య మనున దతనియందు వెదకి చూచినను గానరాదు. ఇంతియ కాదు. ఇరువురు రచించు విషయ మొక్కటే. మూలము నొక్కటే. ఐనను వర్ణనము వాక్యసంయోజనము మొదలగు విషయములం దౌచిత్యవిచారము సేసినచో సోమునియెడ ననౌచిత్యమున కుదాహరణము లనేకములు గనుఁగొనవచ్చును.

ప్రథమాశ్వాసమున, నరకాసురుఁడు దేవతలనెల్లఁ బాఱఁదోలి స్వర్గమును బ్రవేశింపఁగా, నందు "కాశ్మీరనికరంబుఁ గస్తూరపుష్పోపహారంబు లేని సౌధాంగణములు" గానవచ్చిన వఁట! సరియే కాని, స్వర్గమునకుఁ గాశ్మీరమునకు నా కాలమున నేమి వ్యాపారము నడుచుచుండెనా యీలోకపుఁ జందన మాలోకమునఁ గానవచ్చుటకు?

విజయ మైనపిదప స్వర్గలోకసింహాసనాసీనుఁడై నరకాసురుఁడు, శృంగారముతో ముగియకున్న వీరమునకు సొంపుగలగదని కాఁబోలు, నూర్వశిని బిలిపించి తన్నుఁ బొందు మని కోరుచున్నాఁడు. మొదట నీకథ సంస్కృతహరివంశమున లేదు. హవిర్భాగముల నిఁక మీఁద నింద్రున కీయక తనకే యీవలయు నని నరకాసురుఁడు మునులను బట్టి పీడింపవలయును. లేకున్న వారు పోయి శ్రీకృష్ణునితో దూఱు చెప్పుటయు నతఁడు నరకుని సంహరించుటయుఁ, గాదు. కావున దీనికి మూలకారణముగా నెఱ్ఱనయో మఱియెవరో యీకథను గల్పించియుందురు. లేక యే పురాణాంతరముననో యుండియుండును. అది యెట్లైన, నెఱ్ఱన యీ యూర్వశీనరకుల సంభాషణమును రెండుపద్యములలో నెంతయు గంభీరముగ మధురముగ ముగించినాఁడు. చూడుఁడు—

మ. "వరుణుం దోలితి నర్థపుం జదిపితిన్ వైవస్వతుం గెల్చితిన్
హరిఁ బోఁజోఁపితి, నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు, మెచ్చుల్మీఱ నీ వింక న
న్నరవిందానన సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్."

చ. "అనుటయు నమ్మృగాక్షి యది యట్టిద యింతటివాఁ డవైన నీ
పెను పసదే తలంప రిపుభేదన సంయమికోటి భక్తితో
నిను నఖిలాధ్వరంబులకు నిత్యసమర్చితుఁ జేసిరేని నే
నును ముదమొప్పఁ గైకొని వినూత్నవిహారరసాబ్ధిఁ దేల్చెదన్."

ఇఁక సోమనాధుఁ డన్ననో యీవిషయమునకై యిరువదియైదుపద్యములను వ్రాసినాఁడు నరకాసురునొద్దకు నూర్వశి యెంతయు మనోహరముగ—

సీ. "తొడవు లూడ్చిననైనఁ దొయ్యలిమేనిలోఁ జిన్నపోయినపట్లు చెన్ను మెఱయ
విరులు పుచ్చిననైనఁ వెలఁదిపేనలిగావిఁ బాయని జవ్వాది బయలువడఁగఁ
బూఁత రాల్చిననైనఁ బొలఁతుకమైచాయ గవుసెనలో నున్నక్రమము దెలుప
మడుఁగుమాసిననైన మగువపిఱుందుపోయగము చూపఱచిత్త మాఁకఁగొలుప

గీ. మురిపముల నుజ్జగించిన ముదురునడపు, చిఱునగవు నోసరించిన చిగురుమోవి
కలికిచూపుల వీక్షించ్న కన్నుఁగవయు, నింతమని భీతి దెలుపలి కెఱుకసేయ"

వచ్చినది. ఆయమనుజూచి నరకాసురుఁడు తటాలున గాళిదాసుని రఘువంశములోని వర్ణనలఁ దలఁచుకొని, 'గేదఁగిరేకు నఖంబునఁ జీఱుట' మొదలగు శృంగారచేష్టలు సేయుచున్నాఁడు. సమయమునకు సరిగ స్వర్గలోకమున 'గేదగిరేకు' దొరకుట చిత్రము! అదిగని యూర్వశి, 'వాఁడు చేతోజాబాయత్తుఁడై తనుబిలువం బుత్తెంచుట యెఱిఁగి' లజ్జతోఁ,

ఉ. "తోరపుఁజన్నుదోయిపయిఁ దొంగలిఱెప్పలు దాఁటి చూపులా
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలుసల్లఁ జొచ్చి య
చ్చేరువ కంబముం గదిసి చిత్తరువో యన, నిల్చి యున్న గం
డారపుబొమ్మవోలె నచటం గదలించుకలేక యుండఁగన్."

ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁడు, తనదిగ్విజయవిచార మంతయుఁ జెప్పి, యింతయున్నను నాసభలో 'నీకనుకోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే?' యని తియ్యనిమాట లాడి, 'నాసర్వస్వమును నీకొప్పింతును నన్ను గవయు' మని వేడికొన్నాఁడు. ఇంతవఱకు నంతయు బాగుగ నున్నది గాని, యిఁకమీఁది వారి సల్లాపములు సౌమనస్యముు గలస్త్రీపురుషులు నిండుసభలోఁ బలుకఁదగినవిగా నుండలేదు. 'ఇంతకు మున్ను నన్నొకనాఁడైనఁ గోరియుంటివా?' యని యూర్వశి బదులుగ నాక్షేపించినది! దానికి నరకాసురుఁ డెంతయు మ్మ

దువున గౌరవముగ 'వేఱుపని లేక వట్టి మిండఱికంబుచేతకై నేను మీయూరికి వచ్చి నిన్నుఁ గోరవచ్చునా ? ఇదియు మగతనమా ? ఇట్టిలంజెమాటలునుగలవా!' యని బదులువల్కినాఁడు ! ఏమిరసికశిఖామణి నరకాసురుఁడు ! ఇఁక నూర్వశి తప్పించికొన నెన్నియో యుక్తులు పన్నినది. 'నేను లంజెనేయైనను నీవు నన్నుఁ జెఱపట్టితెచ్చుటచేఁ జిత్తమెల్లం జెడిపోయినది. రిత్తయొడలం బని చేరునా ?' యన్నది ! 'మవ్వపుఁ దీఁగలం దెగడు స్వర్గములోని మానిను లెందఱో గలరు. నేను నంత నెన్నఁడో జవ్వన మమ్ముకొన్నకడసాని' నని రోఁతపుట్టించినది ! ఏమన్న నేమి ? ఇట్టిమాటలఁ జెప్పుటకు నూర్వశికి సిగ్గులేదు ! ఇఁక నరకాసురునకో యంతకు మున్నే లేదు ! అతఁడు బదులిచ్చు విధము వినుండు !

క. "అంజెదవుగాక ననుఁ జెంతం జేరఁగనీక యెంతతఱిగిన మిరియా
లుం జొన్నలసరిపోవే, లంజెతనమునందుఁ గోమిరెలం గెలువ వశే !"

చూచితిరా ! ఎంతతఱిగినను మిరియాలు జొన్నలకుఁ దీసిపోవఁట ! అట్లే యూర్వశి యెంత ముసలిసానియైనను బ్రాయపుఁగన్నెలను లంజెతనమున గెలువఁ జాలినదఁట ! ఈ సరసపుఁబల్కులు వినఁగానే యావామలోచన 'చిఱుతనగవుల తెప్పల సిగ్గుదేర్చిన' దఁట ! సోముఁడు చూపిన ద్వివిధశృంగార రసములో నిది మొదటిరీతి ! రెండేపద్యములు వ్రాసినను శంభుదాసుఁడు నరకాసురునియొక్కయు నూర్వశియొక్కయు స్వభావముల నెంత గంభీరముగ వివరించినాఁడో, తనశక్తినంతయు నుపయోగించి యింతదీర్ఘముగ వ్రాసినను సోముఁడు వారినెంత నీచాతినీచపాత్రములుగాఁ దోఁపఁజేసినాఁడో పరిశీలింపుఁడు ! నరకాసురుఁ డెంతనీచుఁడగు కిరాతస్వభావుఁ డగురాక్షసుఁడని యొకవేళఁ దలంచినను, ఊర్వశి యెంతసిగ్గుమాలిన ముసలిసాని యని యనుకొన్నను, వారిద్దఱకు నిట్టిరసాభాస మగు సల్లాపము నిండుసభలో నడచియుండదు. ఒకవేళ నడిచియుండవచ్చునుబో, కవిదాని నిట్లు వ్రాయుట ప్రమాదము. ఇందుఁ గల మిండఱికము, లంజెతనము మొదలగు పదములఁ దలఁచుకొన్న నెవ్వరికి రోఁత జనింపదు ? కావ్యము సౌమనస్యప్రధానము. కావున స్వభావోక్తినే వర్ణింపఁదలఁచినవాఁడైనను, కవి యాసౌమనస్యముపై ముఖ్యముగ దృష్టియుంచవలయును. అట్లుగాదేని యుత్తమపాత్రములం దింత నీచస్వభావముఁ జూపిన సోమునికంటె నీచపాత్రములకుఁ దగిన నీచస్వభావము నెంతయో సొగసుగ వర్ణించిన శుకసప్తతికారుఁ డగు కదిరీపతినాయఁడు మహాకవి యని చాటవలసియుండును గదా ! (నిజముగా నతని మహాకవి

త్వమునందు బుద్ధిమంతు లెవరును సంశయింపరు) ఎక్కువచాతుర్యముఁ జూపఁ బూనిన విపరీత మగుననుట కీఘట్టము ప్రథమోదాహరణము.

సోమునకు లోకోక్తులందుఁ గడుఁబ్రీతి. ఎల్లెనను మూఁడునాల్గుపద్యముల కొకమాఱైన నొకసామెతఁ దూర్పకున్న నితనిమనసు నిలువదు. వాస్తవముఁ జూడ కవితకుఁ గల సుభగాలంకారములలో లోకోక్తులును జేరిన వనుట నిజమ కాని, బలవంతముగఁ గావలయు నని పట్టి సందులోఁ జొన్పినచో నది యెంతయు రోఁత. మఱియు నీకవికి హాస్యరసమందు విశ్వాస మెక్కు డని తోఁచెడిని. కొన్ని యెడలఁ జదువరుల నవ్వింపవలయు నని ప్రయత్నపడి వ్రాయును. కాని హాస్యమునకును సౌమనస్యము తోడుపాటు ముఖ్యము. ఈవిషయమునఁ జేమకూర వేంకటపతి, రామకృష్ణుఁడు మొదలగువారు మిన్నలు. ఆగుణము౦ బాటింపక యితఁడు వ్రాసిన హాస్యము౦ జూడుఁడు!

సీ. "ముందటిది క్షుఁడి మొలత్రాటఁ దవిలిన తోఁకగోఁచుల వెంటఁ దూలువారు"

ఇది నరకాసురానుచరపీడితు లగు వసిష్ఠాదిమహర్షుల యవస్థ! ఇది మర్యాదను లజ్జను బాటించువాఁడు వ్రాయుమాట గా దని వేఱ వాకొనవలయునా?

ప్రబంధపరమేశ్వరునకు హాస్యమున౦ దాసక్తి తక్కువ. ఒరులయవస్థలఁ జూచి హాస్యముఁజేయుట నీచలక్షణము గాని మహాపురుషలక్షణము గాదు. ఎం దేని యతఁడు హాస్యమును వ్రాసినను నది యెంతయు గంభీరమై యూహామాత్ర వేద్యముగఁ నుండును. దేవేంద్రుఁడు శ్రీకృష్ణునితో నరకాసురపీడను దెల్ప వచ్చినచోట,

క. "పోరానిచుట్ట మితఁ డనఁ, గూరిమిచెలికాఁ డనంగఁ గోరి వరుస గో
త్రారి హరి బాంధవుల వే, ర్వేరం గుశలంబు లడిగెఁ బ్రియమెలరారన్."

అని యెఱ్ఱన వ్రాసిన పద్యమును సావధానముగఁ జూచినచోఁ గవి యింద్రుని నెట్లు త్రిప్పాడిచినాఁడో స్పష్టమగు. ఇంద్రుఁడు స్వకార్యపరుఁడు. మఱియు 'అందినఁజుట్టు, నందకున్నఁ గాళ్లు" ననులెక్కకుఁ జేరినవాఁడు. తనకొఱకై కన్న కుమారునిఁగూడఁ జంపెడు శ్రీకృష్ణుఁడు, ఆవెనుకఁ గొన్నాళ్లకే పారిజాతంబుఁ దేఁబూనినపుడు వెనుకటి దంతయు మఱచి యతనితో యుద్ధమునకు సన్నద్ధుఁ డగు కృతఘ్నుఁడు! ఈయభిప్రాయము మనమున నుంచికొనియే కవి యితని కిట్టి ధూర్తలక్షణము ద్యోఁతకఁజేసినాఁడు. ఇంతియకాదు. ఎఱ్ఱనయింద్రుఁడు సోముని

యింద్రునివలె వచ్చినవాఁడు తనగోడుమాత్రము పాడవుగఁ జెప్పికొని యూరకుండలేదు. తాను స్వర్గలోకముఁ బోఁగొట్టుకొనుట యంతముఖ్యముగా దఁట! మ ఱేమన్ననో వినుండు——

మ. ... ... ... ... పెక్కేమిచె
ప్ప మహాభంగ మొకండు గల్గె వినుమా భంగంబు నీకున్ సమా
నమొ, యేఁజెప్పఁగఁ జిత్తగింపుము జగన్నాథోల్లసద్విక్రమా!
తే. అనపహార్యంబు లెవ్వాని కదితిదేవి
కుండలమ్ములు సురలోకమండనములు
గొనియె విబుధాళి వంతలఁ గుందుచుండ
నింతయును మాధవా నీవ యెఱుఁగు దింక.

... ... .. ... ...

శా. "నీవాశ్చర్యపరాక్రమంబున మహిన్ విశ్వైకరక్షార్థివై
దేవారాతులఁ గూల్చుచున్కి విని నీతేజంబు సైరింప కు
గ్రావష్టంభరతిన్ నినుం దొడరి నీకాజిం బరీభావముం
గావింపం భవదంతరంబ మది నాకాంక్షించు నెల్లప్పుడున్."

మన తల్లి కుండలంబు లపహరించుట యొకటి, నీకు ద్రోహముఁ దలపెట్టి యుండుట రెండు! ఇందువలన నాకన్న నెక్కువ వైరము వహించి నీవు నరకుని దప్పక సంహరింపవలె ననుచున్నాఁడు! ఔరాధార్ష్ట్యము! వాస్తవముగ నదితి కుండలము లేయేటఁగలసినను నింద్రున కేమియుఁ జింత యుండదు, రాజ్యము పోయె నను సంకటము తప్ప! ఈయింద్రుఁ జూచిన మనకు నవ్వు దప్పదు. సోముని హాస్యమునకన్న నీయెత్తునహాస్య మెంతగంభీరమో కనుఁగొండు!

ఏమో డంబముగ నాయాసమయముల నేమేమియో వ్రాయును గాని సోముఁ డందువలనఁ గలుగు పూర్వోత్తరవిరోధము లంతగాఁ బరిశీలింపఁడు. అపుడు వ్రాయుపద్య మెంతబాగుగ నున్న దని యోజించువాఁడే కాని, వెనుక నేమివ్రాసితి నని విచారించుట యతనికావశ్యకము గాదు. శ్రీకృష్ణుని కైలాస యాత్రాఘట్టమున నీ విషయమును గనుఁగొనవచ్చును.

"శ్రీకృష్ణుఁడు రుక్మిణియు నొకనాఁ డేకాంతగృహమున నున్నపుడు, రుక్మిణి తనకొక కుమారు ననుగ్రహింపు మని వర మడుగఁగా, శ్రీకృష్ణుఁడు

నట్లుకాని మ్మని దానికై శ్రీపరమేశ్వరుఁగూర్చి తపము సేయఁ గైలాసమునకుఁ బోయెను. తపోవసానమునఁ బ్రత్యక్షుఁడై పరమేశ్వరుఁడు 'కృష్ణా! నీవేల తపంబు సేసెదవు? పుత్రార్థ మైనయెడ నీ కిదివఱకే నేను గుమారు నొసఁగియు న్నాఁడను. నానేత్రాగ్నిచే దహింపఁబడిన యనంగుఁడే నీకుఁ బ్రద్యుమ్నుఁ డనఁ గుమారుఁడై యున్నవాఁడు' అని పల్కి తామిరువురు నభిన్నమూర్తు లని యం దలి మునుల కెఱుకపఱుచుటకై, యతఁడు మొదలు తన్ను నుతించుటకు ద్విగుణ ముగఁ దా నతనిని నుతించి యంతర్ధాన మందెను. కృష్ణుఁడును మఱలి వచ్చెను." ఇది సంస్కృతహరివంశమునఁ గలయానుపూర్వి. దీనివలన శ్రీకృష్ణునకుఁ గైలాస యాత్రకన్న మున్నే ప్రద్యుమ్నుఁడు జనించియుండె నని స్పష్ట మగుచున్నది గదా! కావుననే యెఱ్ఱన, రుక్మిణి శ్రీకృష్ణుఁ బ్రార్థించుమాటలలో,

క. "తనయులఁబ్రద్యుమ్నాదులఁ, గనియుఁదనియదాత్మ, కొడుకుగములను నానా
ధనరాసులనుం దనిసిన, జనములు భువిఁగలరె యిది నిజంబు మహాత్మా!"

అని మూలమున లేని యొకమాటను వ్యాఖ్యానము కొఱకై దూర్చి నాఁడు. ఇందు సోమునకు బలమైన సందేహము గలిగినది. మొదలే ప్రద్యుమ్నుఁ డను కుమారుఁ డున్నచో రుక్మిణి మరలఁ గుమారుఁ గోరనేల? కోరెఁబో, శ్రీ కృష్ణుఁడు కైలాసమునకుఁ బోయి, యంతటిఘోరతప మాచరించి, తుదకు నీ కున్నకొడుకే చాలునని శివుఁడు వచింపఁగాఁ జేతులు వెలికిలవైచుకొని మఱలు నా? కాని యీసందేహ మెఱ్ఱనకును గలిగినది. ఐనను నతఁడు మూలమును మార్చు స్వాతంత్ర్యము వహించినవాఁడు కాఁడు గాన మూలముననే యుపోద్బల ముగా శివుఁ డొసంగిన వరమ్ములో "నీవు పూర్వంబునందు నధికతపం బొనర్చితివి. ఇపుడు నధికతపోనిర్వాహకుండ వైతివి. నీదైన యీభవిష్యత్తపోవిభవంబు వెలిఁగి యింతవట్టునకు ఫలరూపంబుగాఁ గొడుకును మున్న యిచ్చుట యిట్లు సువ్య క్తంబు సేయవలసె" ననుక్రొత్తమాట యొకటి యిఱికించి తాను దేరుకొనెను. సోముఁడింతమాత్రమునఁ దృప్తిపడయక విషయమునే మార్చినాఁడు. రుక్మిణి శ్రీ కృష్ణుఁ గోరునపు డాయమకుఁ గొడుకులే లేరు. శ్రీకృష్ణుఁడు శివునివేఁడినపుడు గూడ, 'తొల్లినాకంటిమంటచేఁ గాలి యనంగుఁడై యున్నమన్మథుఁడే యిఁక ముందు ప్రద్యుమ్నుఁడనఁబడు కుమారుఁడై నీకు జనించు' నని శివుని యానతి. పురాణకథలలోఁ బౌర్వాపర్యము నిర్ణయించుట యసాధ్యము గావున నిట్లు విష యమును మార్చినను దోసదరయుండ దని యతఁడు తలఁచెఁ గాఁబోలు! అ

తఁడు తలఁచినట్లే పురాణకథలవలన నేమియుం బ్రమాదము రాలేదు గాని, తన వలననే తనకుఁ బ్రమాదము వాటిలు నని తలఁపఁడయ్యె. చూడుఁడు, శ్రీకృష్ణుఁడు "మురామరారినరకక్రవ్యాదముఖ్యాసుర, ధ్వంసాపాదనవీతకంటకవతి" యగు ద్వారావతిలో సంతఃపురమున రుక్మిణితో వినోదించుచుండఁగా నాయమ తన యుని గోరిన దని వ్రాసినాఁడు. దీనివలనఁ గైలాసయాత్రకుఁ బూర్వమే నరకాసురసంహారము జరిగిన దని యతఁడే మనకుఁ జూపియిచ్చిన ట్లయ్యెఁగదా! అనఁగా, నరకాసురుని జయించినపుడు కృష్ణునకుఁ గుమారులు లేరనుట సోమునిమతము. ఇట్లయ్యును శ్రీకృష్ణుఁడు నరకుఁ జంపి ద్వారకను బ్రవేశించిన సమయమందు "బలభద్రసాత్యకి ప్రముఖసోదరులును బ్రద్యుమ్నానిరుద్ధాది పుత్రపౌత్రవర్గంబును ... ... చతురంగబల సమేతంబుగా నెదుర్కొని" రని పెద్దవచనమున నాడంబరముగ వర్ణించినాఁడు! ఇంతియకాదు. శ్రీకృష్ణుఁడును శివుఁడును గలిసికొన్న వేళ హరిహరాద్వైత సిద్ధాంతమును స్థాపింపఁగోరి శక్తినంతయు వినియోగించి యచటి మునులస్తోత్రవ్యాజమున నితఁడు వ్రాసిన యీసీసముం జూడుఁడు.

సీ. సారసంబున లేవ నీరసంబునఁ జావఁ బద్మాసనుఁడు వీరిపాలఁ గనియె
రూపుగంటఁ జెలంగఁ జూపుమంట నలంగఁ బంచబాణుఁడు వీరిపాలఁ గనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప బాణాసురుఁడు వీరిపాలఁ గనియెఁ

గీ. గనియె చిత్రంబులకువీరుగలసియుండి, మనుపఁజెఱుపంగఁజెఱుపంగమనుపనేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట, హరిహరాత్మక మెఱిఁగితి మనిరి మునులు.

శివుఁ డింకను వరమే యియ్యలేదు. ఇచ్చినపిదపఁ బ్రద్యుమ్నుఁడు జనించి, తన్నపహరించికొనిపోవు శంబరాసురునింటఁ బెరిఁగి పెద్దయై, మాయావతీరూపమున నున్నరతిని బెండ్లాడి, యాయమయం దనిరుద్ధుఁ గాంచి, యాయనిరుద్ధుఁడు ప్రాయమునుబొంది, యనేకస్త్రీలఁబెండ్లాడి,—యింతయు నైనతరువాత నడుచు బాణాసురకథ నింతమొదలుగ ప్రాసములతో వర్ణించు మహర్షులయోగదృష్టికిని, వారితో వర్ణింపఁజేసిన సోముని సర్వజ్ఞత్వమునకును, మన మెంతవిస్మయపడి కొనియాడినను దీరదు గదా! ఇట్లు తనప్రమాదమునే యెఱుఁగలేని కవిని మహానుభావు లగుకవిత్రయమువారికన్న నెక్కువ యని వాదించువారి యభిప్రాయ మేమి యై యుండునో!

ఇంకను సూక్ష్మముగ విచారించిన నౌచిత్యవిషయమున నెన్నియో సోముని పొరపాట్లను గనుఁగొనవచ్చును. విస్తరభీతి వానినెల్ల నుదాహరింపక మనవారెల్ల సోముని హరివంశములో నత్యుత్తమభాగ మని పొగడునట్టి యుషాపరిణయకథలో మాత్ర మీయిరువురతారతమ్యము నిందు విన్నవించెద.

ఇందుధరుం డొకనాఁడు "దైతేయేంద్రకన్యాప్సరోనికురుంబంబులతోఁ" గూడి, పార్వతియుఁ దాను నుద్యానవనమున యథేచ్ఛ విహారములఁ జలుపుచుండెను. ఆసముదాయములోఁ జేరిన యుషాదేవి యాదంపతుల విలాసవైభవము లన్నియుఁ గన్నారఁ జూచి, తనమనసులో నిట్లు తియ్యని యాలోచనఁ జేయుచున్నది.

సీ. "సల్లాపనవసుధాసారంబు చెవిఁగ్రోల్పఁ జెలికత్తెఁ బుచ్చి మెచ్చించువారు
నానందమకరంద మందంద పైఁజిందఁ గడకంటిచూపులఁ గప్పువారు
ఘర్మాంబుబిందుముక్తావిభూషణము లుప్పతిలంగఁ జేచేతఁ బట్టువారు
మఱపుమున్నీటిలో మానసంబులు దేల బిగియారుకౌఁగిట బెరయువారుఁ
గీ. బాలయలుకఁ బాసి తేల్చినఁబొందువారుఁ, జతురతరవిహారంబును సలుపువారుఁ
బ్రథమజన్మంబునం దెంతభాగ్యవతులొ, మగలుమన్నింపఁ బెంపారుమానవతులు!"

ఇంతటితో నూరకున్నదా? చెలికత్తెలతోఁ దనతలంపు వెడల నాడినదఁట! ఎట్లో యీమాటలను బార్వతీదేవి విన్నది. ఎట్లువిన్నదో యెఱుఁగము! తనకు మనుమరా లగు నీకన్నియను 'చెలీ! యని సంబోధించి 'నీతలఁచినయట్లే మనోభవుని పట్టముగట్టికొనంగఁ జాలుజాణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడెదవు. ఇంతవంత యేల?' అని యాయమ్మ యనుగ్రహించినది! ఉద్రేకము తలకెక్కినయుషకు నీమాత్రమున మనసు తృప్తి యగునా? కావున నాకన్నియ మొదటివలెఁ జెలికత్తెల మాధ్యస్థ్యము నైనను గోరక చక్కఁగ నాయవ్వనే 'నాకోరిన మగని పొందెన్నఁడు సమకూఱునో చెప్పుమమ్మా!' యని యడిగినదఁట! ఆతల్లియు నీకన్నియ సిగ్గుమాలిన "వలరాచవేగిర" మునకు రోఁతపడక "చెలంగి నవ్వుచు" "వైశాఖశుక్లద్వాదశినాఁటి సాయంసమయమునఁ గలలో నిన్ను మదనకేళిఁ గలయువాఁడు నీమగఁడగు" నని వర మొసంగిన దఁట. మోమోటమి లజ్జయు లేక యీవలికు నిలిచి నిర్భయముగ మాటాడిన చిన్నికన్నియ పాప మీమాట విన్నవెంటనే యెదురనిలువలేక "తొలఁగం జని సంతసిల్లె" నఁట! ఇది సోమనాథునివ్రాఁత.

ఎఱ్ఱనమాటలఁ దిలకింపుఁడు. ఉద్యానవిహారము నంతయుఁ బ్రమథదంపతులఁగూడి ముగించి, పార్వతీపరమేశ్వరు లేకాంతవిహారమ్మఁ గోరి స్థలాంతరమునకుఁ బోయిరి. అచ్చోట,

సీ. "కంఠకాళిమఁ దనకంఠంబునకు నూత్నకస్తూరికాదీప్తి విస్తరింప
నౌఁదలఁ జందురుఁ డమృతబిందులఁ దనయలకల జీని పువ్వులను దొడుగ
నవతంసనిశ్వాసవ మల్లనఁ దనయవతంసోత్పలమున కుత్కంప మొసఁగ
నంగదమణిదీప్తు లలమి యొప్పగు తన భుజములకాంతికిఁ బ్రోదిసేయఁ

గీ. గడఁకఁ బంమేశ్వరుఁడు తన్నుఁ గౌఁగిలింప, నతనిదోర్మధ్యసరసి నోలాడుచున్న
ఘనతరస్తనచక్రవాకముల నమరు, నంబ ననురేంద్రుకూఁతు రింపారఁ గనియె."

ఉషాదేవి కింకను "గన్నియతనము" అందును "ముగ్ధమానసము" కావుననే నిత్యయౌవను లగునాదంపతు లేకాంతస్థలమున నున్నను బొంచి చూడ సాహసించినది. ముఖ్యముగఁ దానుజూచినది "అంబ"నే యైనను, తలిదండ్రుల శృంగారలీలలఁ జూచిన బిడ్డల మనసు వికృతినొందుట సహజముగాకున్నను, "ముగ్ధమానస" గావున, మనసెంత బిగఁబట్టినను నాకోర్కి లంకురించినవి. ఐనను, సోమునియుషవలె నొక్కమాఱునఁగాక, మనసిజరాగమువలనఁ గలిగినపాగ "రొయ్యన" నెక్కినది! ఆపై "భ్రాంతి తనుఁ బొదివినది!" కావుననే వెనుక ముందులు యోజింపక తటాలున నిట్లాలోచించినది.

క. "తగుమగని బడసి కౌఁగిట, సొగియఁగనుట గాదె యరయ జోటికి నధికం
బగుభాగ్యఫలము, నాకింపుగ నిరికెన్నఁడో కో యిట్టిపోఁడిమి గలుగున్."

మనసిజరాగప్రభావమున నిట్లు చింతించినది గాని, మఱల వెంటనే తాఁ జేయుపని సరిగా దని యెంచి, తీఁగెలువాఱిన రాగబంధముఁ ద్రెంపఁజాలక వివేకవతి గావున వెండియు నెంత గంభీరముగ నాలోచించుచున్నది చూడుఁడు!

చ. "జనకుఁడు మూఁడులోకముల సన్నుతికెక్కిన మేటి, సంపదం
దనరినవాఁడు, మాకుఁ గులదైవము పర్వతకన్య, కన్యనై
యొనసినభక్తిమైఁ గదిసి యేఁ బరమేశ్వరి నాశ్రయించినన్
ననుఁ గృపఁజూడ కంబ కరుణానిధి యూరక యేల యుండెడున్."

పార్వతి సర్వజ్ఞుని యర్ధాంగి గదా! ఆయుమకుఁ దెలియని దే ముండును! వెంటనే తనమనుమరాలిచింతను దనలో నెఱింగినది. చెలికత్తెలతో ఘంటా

ఘోషముగాఁ దనతలఁపును వెడలనాడినప్పుడు, పార్వతి విన్నదనుటయందును, మనసులోఁ గలయాలోచనను పార్వతి యెఱింగినదనుటయందును గల యౌచిత్య ప్రకర్షమును జదువరు లాలోచింతురుగాక! పిదప నాయమ యుషాకన్యను గని కరమువిూఱ మెల్లనఁ జేరఁబిలిచి 'బాలా! నీతలఁపు గన్నియలకుఁ దగినదే. నావలె నీకును వేగంబ ప్రియాశ్లేషంబు చేకుఱును. ఇఁక ముందు వైశాఖశుక్లద్వాదశినాఁటి నిశాసమయమున నీకలలో నిన్నుఁ గలయువాఁడ నీకుఁ బతి యగును బొమ్ము' అని యానతిచ్చినది. చూచితిరా పరస్పరతారతమ్యము!

తనకోర్కి ఫలించుటకు నుష సంతసించి యింటికిఁబోయినది. అందు శంభుదాసునియుష—

ఉ. "అంటినఁ గందుమేను పసనారెడుజవ్వనమున్ రసంబుపె
న్నింటలఁ గూర్చుకామమును నిబ్బర మైనమదంబు నై మనం
బొంటికిఁ బోక భర్తృరతి కువ్విళులూర నిరంతరస్పృహో
త్కంటికితాంగి యై"

యుండినది. పిదప నొకనాఁటిరాత్రిఁ గలలో ననిరుద్ధసమాగమము నడిచెను. ఇందు సోముఁడు, కలలోనివిచారము వర్ణించి ప్రయోజనము లేదనికాఁబోలు, "కలలోఁ గుమారుఁ డొకఁ డేమోచేసె" నని యొకపచ్చిమాట ప్రయోగించి తేల్చివైచి, యిందు వర్ణింపఁదగిన దంతయు నిఁక ముందు సత్యానిరుద్ధసమాగమమున వడ్డితోఁగూడఁ దీర్చినాఁడు. ఎఱ్ఱన మాత్ర మీయెడఁ గొంచె మధికముగ వర్ణించెను. ఐనను జాలవఱకుఁ బచ్చిగా వ్రాయలేదు. చూడుఁడు.

సీ. "కలలోన నయ్యింతిఁ గదిసి మోమున నవ్వుఁ దళుకొత్తఁ దియ్యని పలుకు పలికి
కెంగేలితోఁ గేలు గీలించి నెమ్మేను మేనున బెరయించి మెలపుతోడ
బిగియారుకౌఁగిట సొగయించి మనసులు రెండును గలసి యొక్కండుగాఁగ
నేకోర్కు లేమిటి కెనసిన వానికిఁ జుబ్బనఁ జూఱలై చొప్పడంగఁ

గీ. జతురసంభోగరసములు చవులవెంట, నిద్దఱును గ్రొత్తగాఁ గని యేపుమిగిలి
నట్టిచందంబు గావించి, యాత్మమూర్తి, యబలతలఁపున నచ్చొత్తినట్లు సేసె."

సోమునివర్ణన మిఁకముం దుదాహరింపఁబడును. ఇట్లు గలఁగాంచి, స్పష్టముగఁ దచ్చిహ్నములు గానవచ్చుటచే సత్యమే యని భ్రాంతిఁజెంది, కన్యకాత్వముఁ గోలుపోయితిఁ గదా యని వందురుచున్న యుషకుఁ జిత్రరేఖ పార్వతివరమును

జ్ఞప్తికిఁ దెచ్చి వెలుపవల దసి యూఱడించెను. తనమఱచిపోయిన మనోరథము నాకస్మికముగ ఫలించుట యెఱిఁగిన వెంటనే సోమునియుషకుఁ దిక్కు తలకెక్కినది. ఈయవస్థఁ జూడుఁడు!

మ. "పరవయ్యెం బరిభోగవాంఛ తడవం బాలయ్యె నిద్రారతుల్
పొరవయ్యెం బలుదాల్మి వింతవగపుం బ్రోవయ్యె నాలేపముల్
నెరవయ్యెన్ మదనానలంబు వరుస న్నీరయ్యె నాలేపముల్
సొరవయ్యెం దనువల్లి బాణసుతకున్ సోలింతలం దూలుచున్."

"నిద్రారతుల్ దడవంబాలయ్యె" నఁట! ఈ యింతలో నిద్రవచ్చుట యెట్లు? అందు రతులఁ దడవుటయెట్లు? ఒకవేళఁ జెలికత్తెలతో మాటాడుచున్నట్లే నిద్రవోవు తామసగుణ మీదానవరాజకుమారికిఁ దప్పనిదేమో! కావుననే కాఁబోలు 'దినాంతవేళ నీ కలలోఁ గలయువాఁడు నీమగఁడగు' నని పార్వతి యానతిచ్చుట! ఇట్టి యున్మత్తకమదనోన్మాద యగునుషతో సోముని చిత్రరేఖ,

చ. " ... ... ... ...
నినుఁగలలోనఁ బైపడిన నేర్పరిఁద్రుచ్చు నెఱుంగుదేని న
య్యనువరి రూపుఁ గైవడియు నన్వయముం జరితంబుఁ జెప్పుమా
విని ప్రియుఁ దార్చెదన్."

అని యడిగినదఁట! కలలోఁ గన్నవాని రూపును గైవడియుఁ జెప్పుటయే దుర్ఘటము. అట్లుండ నన్వయమును జరిత్రమును జెప్పు మని యడుగుట చిత్రరేఖ వంటి చతురురాలికిఁ దెలివిమాలినతన మారోపించుట గాక మఱేమి? ఇందు శంభుదాసుని చిత్రరేఖ యేమనుచున్నదో వినుండు!

తే. "ఇట్టివాఁ డని నీవును నెఱుఁగఁజెప్ప, నేర వెమ్మెయి నెఱుఁగంగ నేరవచ్చు
వినకచూడకయెఱిఁగెడువిధముగలదె, కడిఁదియెవ్విధముననిదికమలనయన!"

క. "చాయయు నందము నించుక, యీయును వని నీవు చెప్ప నెఱిఁగెదవేనిన్
వేయేల పుట్టుఁబేరును, శ్రీయును బ్రాయంబుఁ దెలియఁ జేపడును దుదిన్."

అని యూఱడించి, 'జగమ్ములఁ గల తరుణపురుషుల యాకారముల నెల్లఁ బటమున వ్రాసి తెచ్చెదను. అందు నీపతిని గుఱితింపు' మని పల్కి చిత్రరేఖ యింటికిఁ బోయినది. ఎట్లైనయు నాయమవెంటనే వెడలి పోయినాఁడు. సోముఁడన్ననో యుషాదేవిని విడువక గట్టిగఁ బట్టికొనుచున్నాఁడు! ఇదివఱకు వర్ణించిన

యుషాదేవి లాక్షణిక మైన విరహతాపంబునఁ దనివిసనక, యీచోట నెట్టిన సందువదలినాఁడు గదా, నాశక్తినంతయుఁ జూపెద నని తలఁచి, యితఁడు వర్ణించు నదంతయుఁ గేవలప్రబంధమార్గమునను ద్రోఁతగను నున్నది. పాపము, ప్రబంధ మార్గమునకు దారిచూపిన యపవాదము పెద్దన నెత్తిమీఁదను, ప్రబంధపరమేశ్వర బిరుదము శంభుదాసుని నెత్తిమీఁద బడినదిగాని, నిజముగ దానికిఁ దెనుఁగుబా సలోఁ ద్రోవసూపి, వాఙ్మయమునకు దురవస్థఁ దెచ్చినవారు సోమనాథప్రభృ తులే యని నాయభిప్రాయము. ఆయమ్మ నెచ్చెనూర్పుటయు ను,

చ. "కడలఁ దొలంగెఁ దుమ్మెదలు గట్టెదురం బొడసూపనోడి పు
ప్పొడిపొగ లుప్పతిల్లె మొగముం గమలంబును మోచియున్న నీ
యెడ లెటులోర్చెనో! చిగురు లోర్వవు కందె నదేల వెన్నెలల్
వడవడు మందమారుతము? వామవిలోచన వేఁడియూర్పులన్!"

మఱియు నాయమ విరహావస్థ నేమని చెప్పవచ్చును! వినుండు.

క. "నీహారముపేర సఖీ, వ్యాహారము విన్న నలుగు, వారు దనువుగా
నేహార మఱుతఁ బెట్టిన, నాహారముఁ దొఱఁగుఁ దొఱఁగు నాహారంబున్."

ఇది యుషాకన్యకయొక్క కడపటి యార్తప్రలాపము! —

ఉ. "నాదెసఁ గాముదమ్ములకు నాటుట వైళమ సిగ్గుఁ జిత్తమున్
వాదులు వెట్టికొన్నయవి వానికి నెవ్వరికైన ముంగు రా
రో! దయితుం గనుంగొన సరోరుహలోచనలార! యింతకుం
జాదులయిల్లుసొచ్చి సెకఁజల్లెడివెన్నెల వెట్టికొందునే!"

చిత్రరేఖ మఱలివచ్చి చూచుసందర్భమునఁ గన్యాంతఃపురమును సో ముఁడు వర్ణించుట యతివిచిత్రము! తనకు విరహతాపముఁ బరిమార్పవచ్చిన పురంధ్రీమణులను గన్న కన్నచోట నుషాదేవి సైఁపలేక కన్నీరు విడువఁగా, నా కన్నీటిని దుడిచినవెంటనే చెలికత్తెలు "పన్నీటం జేయి గడిగికొనవలసి" యుండు నఁట! ఏల యందురో కామాగ్నిచేఁ గ్రాఁగి క్రాఁగి పొంగివచ్చునవిగాన! ఇం తటి యుష్ణమున కాకోమలాంగి కను లెట్లు నిలిచినవో!

ఎట్టిన, చిత్రరేఖ లిఖించి తెచ్చినవారినెల్ల నుషాదేవితో విరివిగా వర్ణించి చెప్పుచున్నాఁడు. ఈయప్రస్తుతప్రశంస మనకేల యని వారినెల్ల సోముఁ డొక పద్యములో ముగించి, భరతఖండమున నున్నవియు లేనివియుఁ బెక్కు దేశముల

పేళ్ళను సంగ్రహించి యొకసీసము నిండ నొకటే సమాసముగఁ గూర్చి, తనసర్వజ్ఞ బిరుదమును సార్థకపఱచినాఁడు ! ఈ చిత్రపటములం జూచుటలో నుషాకన్య యనిరుద్ధుని గుర్తుపట్టినరీతిని ప్రబంధపరమేశ్వరుఁ డెంత స్వాభావికముగా వర్ణించి యున్నాఁడో కనుండు !

సీ. " దేవతలను బూర్వదేవతలను జూచి దేవయోనులనెల్లఁ దెలియఁజూచి
విహగేశ్వరులఁజూచియహినాయకులఁజూచిమనుజసంఘముఁజూచిమనుజపతులఁ
జూచి యాదవకోటిఁ జూచుచో వారిలోఁ బోఁబోఁ బోలిక తెరువుగాంచి
ప్రద్యుమ్నుఁజూచి సంభ్రాంతయై యల్లన ననిరుద్ధుఁజూచి యత్యాదరమున
గీ. విగతసంశయ మగుచూడ్కి వేఱొకటికిఁ, బోకఁ యాకూతకౌతుకాద్భుతవిలోల
తారకంబయి నిలుకడఁ దలఁగులీల, మనసు దోడ్తోడ మాన్మథోన్మాదమంద."

చూచి యానందపరవశయై యెట్టనయుష తటాలునఁ జెప్పసంకోచించి ప్రేమపూర్వకముగ నిర్నిమేషదృష్టితో మాటాడక చూచుచున్నది. సోముని యుష తటాలున మొగముపైఁ గొట్టినట్లు " మనసు ముచ్చిలి చొచ్చిన మత్తికాఁడు, వీఁడెపో మ్మని" చేసాఁపి చూపినదఁట !

ఎఱ్ఱనయుషాకన్య చాల మానవతి. గంభీరహృదయ, తనమనోభావముఁ దటాలున వెలివెట్టదు. ఆయమ కామాతిరేక మంతయు మనసుననే రగులుచుం డును. బైటికి వచ్చినను గంభీరముగ వచ్చును గాని పచ్చిపచ్చిమాటలతో రాదు. తలంపులును నట్లే. ఎఱ్ఱన యీస్వభావమును దుదవఱకుఁ దునుఁగనీక పోషించి నాఁడు. ఇఁక సోముని యుష యన్ననో సర్వవిధముల విపరీతస్వభావము గలది. చిత్తము చంచలము. కామోద్రేకము బలము. సిగ్గు సున్న, మానముపై దృష్టి లేదు. నోట వాపోవుట మాత్రమె కాక, క్రిందఁబడి పొరలుట, యేడ్చుట మొద లగు వికారాలంకారములు లేకున్న నిలువఁజాలదు. సోముని ప్రతివర్ణనమునందును నీస్వభావము స్పష్టముగ నుండును. ఐన నిందొక చిత్రము ; ఇరువురు కవులును దమతమ నాయికల కనురూపు లగు నాయకులనే సిద్ధముచేసియున్నారు. ఎట్లన—

సోముని యనిరుద్ధుఁడు ' మన్మథమంత్రసిద్ధుఁడు.' 'మిండమేఘము' వంటి వాఁడు ! ఉత్తరకుమారునివలె స్త్రీసమూహము విడిచి బయటికి వచ్చినవాఁడు గాఁడు, సదా కేళీపరాయణుఁడు. అంతఃపురమున స్త్రీసమూహమున నుండఁగా, నతనిగొనితెచ్చెద నని యుషతోఁ జెప్పి చిత్రరేఖ యచటికి వచ్చినది. అందలి యాఁడువారికిఁ దెలియకుండ నామాయలమారి, తామసి యనువిద్యను బ్రయో

గించి యతనిని మైమఱచునట్లు చేసి, గొఱ్ఱెపిల్లనుబోలె రెండుచేతులఁ బొదివి యెత్తుకొని వచ్చినది. ఆతఁడును "ఏమగువ పట్టికొనెనో! ఏమిటికిం దెచ్చెనో! యి దెక్కడిపాటో! యేమియు నెఱుఁగఁడు." ఏమిచిత్రము! అతఁ డీసమయమున నెఱుఁగవలసినది యేమగువ తన్నుఁ బట్టినదో యనువిషయమే యని కవి యెంత సొగసుగ నిర్ణయించినాఁడు! ఆధీరోదాత్తుని మగువయే తప్ప మగవాఁడెవఁడును బట్టికొనఁడు గాఁబోలు! ఇంతియకాదు. ఒకవేళఁ జిత్రరేఖ మాయను బ్రయోగింపకయే యెత్తికొని వచ్చియుండినను, అతని కీవిషయ మెఱుఁగవలయు నను నక్కఱయు నుండ దని నానమ్మిక. ఎట్లును దన్ను బట్టుకొనునది మగువయే కదా! ఏమగువ యైన నేమి? ఈభావము నిఁక ముందు విశద మగును. ఇట్లు చిత్రరేఖ యతని గొనితెచ్చి యుషాదేవికిఁ జూపినది. ఆయమయు నెంతయు సంతసించి యప్పటి కాతని నొక్క యేకాంతమందిరమునఁ బెట్టించె నఁట! మూట యనుకొనెఁ గాఁబోలు! అచట చిత్రరేఖ యాయమతడఁ బాటు గనుంగొని యతనిపైఁ బ్రయోగించిన విద్యను దొలఁగించి యిఁక నీయిష్ట మని చెప్పి వెడలి పోయినది. తరువాత నింకను దెలివిలేని యాయనిరుద్ధుని వట్టిశరీరమునే క్రిందు మీఁదు చూడక మదనోన్మాదముచే నుష కౌఁగిలింప దొరఁకొనఁగా నాస్పర్శమునం జేసి యతఁడు దా నెవతయో యొకమగువకౌఁగిట నున్నట్లు కనులు విప్పకయే తెలిసికొన్నాఁ డఁట! కనులు విచ్చిచూడఁగాఁ దానొక,

ఆ. "మెఱుఁగుఁదీవఁ బోలుమెలఁత కౌఁగిటిలోన, మేలుకట్టుక్రింద మేడమీఁద
రత్నదీపమధ్యరాజితం బగు తల్ప, తలమునందు"

నున్నట్టు దెలిసికొన్నాఁడు! ఆసమయమున నతనియుదార మగుభావముఁ గనుఁగొనుఁడు!—

క. "కలఁగన్నచందమో మది, కలఁగుటయో యైంద్రజాలకవినోదంబో!
తెలియఁగనేర నటంచును, దలఁచును నిజమైన నేన ధన్యుఁడ ననుచున్."

క. "నాకనకప్రాసాదము, నాకొలువు విలాసినులును నాచుట్టములున్
లేకున్న నేమి? కౌఁగిట, నీకామిని యున్నఁ జాలు నెల్లచవులకున్."

పరికించి యిది నిజమే యని నిర్ణయించినాఁడు. మఱి బదులు మాటయే లేదు! తరువాతి విచారము నేఁ జెప్పనేల? కవియే చెప్పుచున్నాఁడు వినుండు!

సీ. "తెమలించి కురులొయ్యఁ దివియలే కటమున్న కదిసినఁ గెమ్మోవి గమిచికమిచి
వెడవెడసోఁకి పైనడరలే కటమున్న యులవడ్డకౌఁగిట నదిమియదిమి

వలునెడలింపఁ జేవాఱలే కటమున్న పైకొన్న జఘనంబుఁ ప్రాఁకిప్రాఁకి
తమకించి కొసరు పంతంబులేఁకటమున్న కరఁగినచిత్తంబుఁ గరఁచికరఁచి

గీ. తుదిమొదలికంటెఁ దుదికంటె మొదలుఁజాలఁ, జవులకనువైనరతులకుఁ జనవులిచ్చి
పూవిలుతుచేతిజంత్రంపుబొమ్మఁ జేసి, మానినీతిలకంబుఁ గుమారవరుఁడు."

ఇట్లు మదనకేళిం దేలిన పిదప నక్కలపాలికారత్నంబుచేతఁ దనవృత్తాంతం బంతయు విన్నాఁడట! చూచితిరా! ఇది సోమునాథుఁడు తనశక్తినంతయు వెచ్చపెట్టి వర్ణించిన రెండవశృంగారరసము! ఆయుషకును నీయనిరుద్ధునకును దాంపత్యము సరిపోయినది! వైరూప్యము లేక తగినదంపతులఁ గూర్చినందుకు సోముఁడు మనకెంతయు వంద్యుఁడు!

ఇఁక నెఱ్ఱనయనిరుద్ధుఁ డన్ననో యాతనికన్న నెంతయో మేలు. ఉష గన్నట్టు తానును మొదలే కలఁగన్నాఁడు. ఇది గౌరీసంఘటనము గావున నసంభావనీయము గాదు. తనమనసు నాకన్యయందుఁ దవిలినది. తనకాంతాసమూహమ్ముపై రోఁత జనించినది. ఐనను దాను గలలోఁ గన్నకన్నె యెవతెయో యెఱుఁగఁడు. గంభీరభావుఁడు గాన తనమనసులోని భావ మొరుల కెఱుకపడనీక మెలంగుచుండెను. అతనిని గొనిపోవ వచ్చినచిత్రరేఖ యతిచతుర గావున, మొగము చూచినవెంటనే యతని యవస్థను గుఱుతించినది. సోముసిచిత్రరేఖవలె నిష్టమున్నను లేకున్నను దగులఁగట్టినఁ జాలు నని యెంచు వైదికదూతి గాదు! ఆయమ యనిరుద్ధుని యవస్థను వర్ణించుపద్యముం జూడుఁడు!

సీ. "బలిమికోలున నవ్వు దళుకొత్తినను మొగంబెల్లఁ దానై యున్న వెల్లఁదనము
ధీరతఁ దెచ్చికోల్ పొందిన(?) పలుకులయందు గద్గదిక వాయంగ లేదు
గరువంపుఁజూపులఁ బురికొని యున్నను రాగ మే తెఱువున రాదు చేరఁ
జేతులు వేడుకచేఁతలకై చక్కఁ బచరించినను నచ్చుపడదు చేష్ట

గీ. యితనిచిత్త మెవ్వతయేని చతురయొకతె, గొన్నయది దైత్యనాథునికూఁతు రితనిఁ
బొందినట్టులయితనికిఁబొందుగలుగఁ, బోలు దైవిక మయ్యునపొల్పాలఁతియందు."

మనపని కితఁడు ప్రతికూలుఁడు కాఁ డని నిర్ణయించి, తక్కినవారిపై సమ్మోహవిద్యఁ బ్రయోగించి, యాతనితోఁ దనవృత్తాంతమును దనచెలిరూపమును,

---

(?) ఇందు యతిభంగము మాత్రమె కాక, స్పష్టముగ నర్థమును గావుటలేదు. ముద్రిత పుస్తకమున నిట్టి వెన్నియోఁ గలవు. ఇవి కవిదోషము లని తలఁపఁగాదు.

సంతాపమును, మనసు గరఁగునట్లు చెప్పినది. మొదలే సిద్ధముగ నున్నయతఁడు నిరాకరించునా!

తే. "మెలఁత యేమని చెప్పుదు మీమృగాక్షి గన్నకలయ యేను నుగనియున్న నొప్పు
గానకున్నాఁడ, వచ్చితి పూని నీవుఁ గాంత కలగన్న చోటికి గంపఁగొనుచు."

క. "నను నీవు వేఁడికొనియెడు, పని నిను నే నిప్పు డతివ ప్రార్థించెదఁ దో
డ్కొనిపొమ్మచటికిఁ గొని పోయిన వచ్చెద మచ్చెకంటి యిచ్చకు దొరయన్."

అని వేఁడికొన్నాఁడు. చిత్రరేఖ యతని చేయి పట్టికొని మాయాబలంబునఁ దోడ్కొని యుషాంతఃపురమునకు వచ్చినదిగదా! అప్పటియుష యేకాంతావస్థను జూడుఁడు!

సీ. "వలవంత సంతాప మొలసియుఁ బెల్లాస చలిమిరిఁ దోడ్తోన శమనమొందఁ
గోర్కులతమకంబు గొదరియుఁ దాలిమిపొందున నందంద క్రిందువడఁగఁ
దలపోఁత తలకు వెగ్గలమయ్యు భావంబు నూఱట పొరిఁబొరి నూరఁబోవఁ
దగులను నురివెట్టఁ దనికియు నలుకని తెలివిఁ బల్మఱుఁ గార్యదృష్టి నడఁగఁ

గీ. గామవికృతులు నైజంపుగారవమునఁ
బరిహరించుచుఁ దనరాక వార్చియున్న
యుషకుఁ బొడసూపెఁ బూర్ణచంద్రోపమానుఁ
డైన యదువీరుతోఁ గూడ నమ్మృగాక్షి."

సోముని గ్రంథమంతయు వెదకిచూచినను నిట్టి సహజభావపోషణమును బ్రతిపాదించు పద్యరత్నము దొరకదు. ఇంత యేల? ఇట్టిపద్యములు తిక్కన దప్ప నితరకవు లెవరును బ్రాయికముగ వ్రాసి యుండరనియు, వ్రాయ లేరనియుఁ జెప్ప సాహసించెద! విరాటపర్వములోని యతని యీక్రిందిపద్యమును జదువరులు రుచిచూచి పైనెత్తిన రెండుపద్యములతోను బోల్తురుగాక—

సీ. "ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ దోఁపంగ వచ్చినఁ ద్రోచిత్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు లడర నుంకించిన నాఁగియాఁగి
సంతసంబున బాలిశము లగుచేష్టల దొడరఁ బూనినఁ జేయ కుడిగియుడిగి
మనసున నుబ్బుమై మాట నాలుకకురాఁ గడఁగిన నాడక కడపికడపి

గీ. ధీరయై యిట్లు సమ్మదపూరమునకు, గరువతన మనుబలితంపుఁ గట్టవెట్టి
వెలఁదియొఱుఁగనియదివోలె వికృతిలేక, యల్ల నెప్పటియట్టులయుఁ గుటయును."

ఇట్లు కాముకులకిరువురకుఁ బరస్పర ప్రథమదర్శనంబు జరిగినది. ఈసమయమునఁ దొలుత నెవరిచే నేమాటఁ జెప్పింపవలయునో తెలియక కవి చాలఁ దొందరపడినాఁడు. నిశ్చయముగ నిట్టిస్థలములయందే కవి ప్రౌఢిమను గుఱితింపవలయును. ఏమియుఁ దోఁపక యాదంపతుల తాత్కాలికస్థితిని వర్ణింప మొదలిడినాఁడు. వర్ణనలతో ముందుకథ నడుచునా? కొంతసేపునకుఁ దటాలు మని యొక్యుక్తి కవికిఁ దోఁచినది. ఇద్దఱకును మధ్యవర్తినిగఁ జిత్రరేఖను దెచ్చిపెట్టెను. ఆయమయు—

క. "పంతముఁ జెల్లించితి నిదె, కాంతుం గైకొనుము శైలకన్యక కృప నీ
కెంతయుఁ గల దేమియు మదిఁ, జింతిలవల దిమ్ము కేలుఁజిగు రీతినికిన్."

అని సమయోచితముగ మాటాడి వారిరువురకు గాంధర్వవిధిఁ బాణిగ్రహణముఁ జేయించినది. అపు డాయిరువురకు రసభంగము గాకుండ సంగతి యొనర్చి వారి ద్దఱ పరస్పరసల్లాపములఁ దాను వివరించి చెప్పలేక తనమాటలతోనే ముగించు కవి దొంగతనముం జూడుఁడు.

సీ. "కలలోన నొండొరుఁ గలసినయప్పటి యానందపూర్ణధన్యత్వములును
బెరసి యొండొరులపైఁ బ్రేముడి నలిపిన సంతాపబహుళదశాంతరములు
నెమ్మి నొండొరులకు నెచ్చెలికతమున నబ్బినయసమభాగ్యాతిశయముఁ
గ్రియల నొండొరులకుఁ గీల్కొన నొదవిన యావనోచితకళావ్యాప్తివిధముఁ
గీ. జెన్నుమిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు
నద్భుతంబులు భయములు నాదరములుఁ
గౌతుకంబులుఁ బొదలాడఁగాఁ బ్రియుంఁడుఁ
బ్రియయుఁ గ్రోలిరి నూతనప్రేమరసము."

సంస్కృతహరివంశమునఁ గూడ నీయిరువురకును స్వప్నమయినట్లే చెప్పఁబడియున్నది. కథకుఁ జాలవఱకు నుచితముగా నుండు నీసంవిధానమును సోముఁ డేల వదలెనో యెఱుఁగరాకున్నది!

ఔచిత్యవిషయమున నిట్టివిఱుపు లింకను గలవు. అందుఁ గొన్ని కేవల మనోవేద్యములుగ నుండును. ఊరక యాతనిగ్రంథమునే చూచువారి కవి తోఁపకపోవచ్చుఁ గాని, యుభయహరివంశములను ముందునిడికొని చూచినచోఁ దప్పక బయల్పడఁ గలవు. ఇంతియకాక యితరవిషయకము లగుప్రమాదములు గూడ నొండు రెం డందుఁ గన్పట్టుచున్నవి.

శివజ్వరము వచ్చి బలరాముని తోఁ బోరునప్పుడు మాత్ర మితఁడు బలరాముని గదుఁ డనుపేర వ్యవహరించుచున్నాఁడు. శ్రీకృష్ణునకు గదుఁ డనుతమ్ముఁ డుండె నని మాత్రము మనము విని యున్నారము. కావుననే 'గదాగ్రజుఁ' డను పే రాతనికిఁ గల్గినది. కాని యచ్యుతాగ్రజునకు గదుఁ డని నామాంతరము గల దని యిం దొకచోఁ దప్ప నాయెఱిఁగినంతవఱకు నెచ్చటి యెందును వినఁబడలేదు. ఇది ప్రమాదమే యని చెప్ప నోరు రాదు గాని సదుత్తరము విచార్యమే.

మఱియుఁ బ్రథమాశ్వాసము—

క. "అమురుఁడు రాక్షసకుల, స్వామి సుకృతి వానిఁ జంపవచ్చుటకుఁ బరం ధామపతి పుట్టె"

ననుపద్యములో 'పరంధామపతి' యని ప్రయోగించెను. సంస్కృతమున పరం + ధామ యని వ్యస్తముగాఁ బ్రయుక్తమైనపదమును సమస్తముగా భ్రమించి యిట్లు వ్రాసె నని తోఁచెడిని. నాయెఱిఁగినంతవఱకును సంస్కృతాంధ్రకవు లెవ్వరును దీని నిట్లు ప్రయోగింపఁ గానను. ఉపపత్తిఁ గల్పించుటయు నసాధ్య మని తోఁచుచున్నది. వేఱుమార్గము పండితుల కేదియు గోచరింపని పక్షమునఁ బృషోదరాది గణములోఁ జేరిన యవ్యుత్పన్నశబ్ద మనియైనఁ జెప్పి మనకవి గౌరవము నిలుపవలసియుండునేమో ! అదియుఁ గాని పనియ. ప్రామాణికప్రయుక్తపదములనే యందుఁ జేర్పవచ్చునుగాని, యన్నియుఁ జేర్పఁగాదు. సోముఁడు తెలుఁగునకుఁ బ్రామాణికుఁ డగును గాని, సంస్కృతభాష కట్లగుట సందిగ్ధము.

నాలవయాశ్వాసమున జనార్దను వాక్యమున "కంటెం గంటె దయానిధిం గుణనిధిం గారుణ్యపాథోనిధిన్" అనుపద్యమునఁ బునరుక్తిదోష మొందు గన్పట్టెడు. ఇది కవిత్వవేగమునఁ గలిగిన ప్రమాద మనియే చెప్పవలయును గదా !

ఇట్టి విఱుపులు గవిత్రయమువారిలోఁ గనుపట్టుట యరుదు. ఇట్లుభయ హరివంశములను జర్చించుటచే నిట్లనేకవిషయముల నెఱ్ఱనకన్న సోముఁడు తక్కువ తరగతివాఁ డని నాకేమో యేర్పడుచున్నది. ప్రత్యేకవర్ణనములయందును నితఁ డతనికన్న మించినవాఁ డని చెప్పవలనుపడదు. రెండిటినుండి యేకవిషయకము లగు పద్యముల నుదాహరించెద—

ఉత్తరహరివంశము. శివునివర్ణనము—

సీ. "తోలుకాఱుమెఱుఁగులతోఁటలో నాడెడురాయంచకోదమతో రాయఁజాలి యిరులబండారంపుటింటికిఁ బెట్టిన బొందుమల్లెలకోటఁ బోరగెలిచి

బలుమంచుఁగొండ బాల బలసిరాఁ బుట్టిన క్రొత్తమంజిడి బాగు గొఱఁతచేసి
పాలవెన్నెరువు గుబ్బలిమీఁద నెలకొన్న నింపువెన్నెలముగ్గు నిగ్గుచెఱిచి
గీ. జడలఁ గ్రొన్నెల మెడఁ బాపసరముతోడఁ, దొడలతో లేని వెలిమిడిపూఁతమించఁ
బొడమి క్రేఁతేని ముందటఁ గొడవ్రుసూపెఁ, బొడవులందెల్లఁ బొడవైనబోటు వేల్పు.”

హరివంశము.—

సీ. “ ఔఁదలఁ జదలేటి తేఁదరఁగలు పొలుఁడగు చందమామ నుయ్యాల లూఁపఁ
దొడవుల తెలులఁ జెన్నడరు నూఁగికములచాయ దిక్కుల నెఱసంజ నెఱపఁ
దొరపు పెటికతోలి యేడ్తెఱకప్పు కుత్తుకతోఁ బ్రీతిఁ బొత్తుసేయ
దట్టంపు బూదిపూఁతల బూసలఱచిన పునుకలు పేరురంబునఁ దలిర్ప
గీ. మూఁడులోకంబులను గావ మొనసినట్లు, చేత ముమ్మొనకైదువు చెన్నుమీఱ
వేల్పుపదువుచూడ్కికిఁగడువింతయొప్ప, నేసెముక్కంటియున్నయాచెలువుపేర్మి.”

ఉత్తరహరివంశము—వనకేళివర్ణనము.

సీ. “కిసలయంబులతోడఁ గెంగేలు తడఁబెట్టి విరులపై నఖకాంతి విజ్జిరాల్చి
లేఁదీఁగలకుఁ దనూలీలఁ గానుకయిచ్చి గుత్తులఁ జాలిండ్లు గొలిచి చూచి
చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి యళిపంక్తిఁ గురులతో నలుకదీర్చి
పుష్పాళ్లు నెలగందములు వియ్యమందించి పూఁదేనె చెమటల బుజ్జగించి
గీ. తొడలు నరఁటికంబంబులు మెడలుఁబోఁక, బోదెలు నెలుంగులును బరపుష్టరుతులు
మాటలును గీరభాషలు మక్కళించి చిగురుఁబోఁడులు వనకేళిఁ జేయఁజేయ.”

సీ. “సుడిగొన్న చిగురాకుజొంపంబుఁ గెంపారఁ దలమీఁద మల్లికాదామ ముడిచి
నిడుదతామరతూఁడు నెట్టెంబు సుట్టి పైఁ బటికంపుఁగడియంపుభాగ మదిమి
తోన యాక్రేవఁ గెందొవరేకు హత్తించి మెడచక్కిఁ గస్తూరి మెదిచి పూసి
పాయగొమ్మల నల్లపట్టుదగిల్చి యక్కొనయాకుపై వెండికోఱ వెట్టి
గీ. ధవళకేతకి ధూళిగాత్రమునఁ జఱచి, మోకమామిడి కొకకొంత మ్రొక్కి నిలిచి
యొడలిలోఁ జక్కసగము నాకొసఁగుమనుము, నద్రికన్యకతలవాంచె హరుఁడు నవ్వె.”

... ... ... ... ...

చ. “ అలఁతితరంగలుం దఱులు నంబురుహంబు మొగంబు షట్పదం
బులు నలకంబులుఁ సుడియుఁ బొక్కిలి నెక్కుడు వేడ్కఁ సేయఁగా
నెలఁతుక సంగడిం గమలి నింగిని చుట్టెడు మిన్ను నీరిపైఁ
గొలిచి భవానిచేర్చెఁ జనుగుబ్బలజోడుగ జోడుజక్కవల్.”

హరివంశమున.—

సీ. "బాలారుణప్రభ పసిమినూనినభంగి నిండఁ గెంజిగిచేల గ్రించుకట్టి
భసితంపు నెఱిపూఁతపై హరిచందన స్థాపకరచన యందముగఁ దాల్చి
మాణిక్యముక్తిక మరకత నిర్మితభూషణము లొయ్యారంపు సరణిఁ బూని
మందారపుష్పదామంబులు జడముడి నఱుతను జదుగుగా నలవరించి
గీ. యభినవాకల్పలీల లి ట్లతిశయిల్ల, నిత్యయౌవనుఁ డభవుఁడు నీలకంఠుఁ
డాదిదేవుఁడు వృషభవాహనము నెక్కి, గౌరి ముందట నిడికొని కౌఁగిలించి."

సీ. "తలమీఁదియేటిక్రొత్తరఁగలతో మించుఁదరఁగలు పొరిఁబొరిఁ దార్కొనంగ
సడలిననిడుదకెంజడలును ముదురఁ బండిన నాచుఁదీగలుఁ బెనఁగొనంగ
నఱచందురునిక్రొత్తమెఱుఁగులు నంచతెక్కలయచ్చతెలుపులుఁ గలయఁబడఁగ
నఱితిక్రొన్నలుపు నింపగు నల్లకలువపూవుల నిండుజిగియును జెలిమిసేయ
గీ. నంగమునభూతిపొలుపుగనంబమూర్తి, మిగులఁ దెలుపెక్కె మొగిచినమీఁదికంటి
తెప్ప పద్మరేణువు లట నొప్పమిగిలె, నభవునకు గాంగసలిలవిహార లీల."

తరువోజ. "అలరుపుప్పొడి పసుపార్చి మృణాల హారం బమర్చి క ల్హారంపు రేకు
లలకల నలికి కర్ణావతంసమున కభినవ కైరవం బర్పించి కేల
నెలదమ్మి కేళికై యిచ్చి లేఁదేఁటి మొసకపుటులివున నింపులువలికి
చెలితనంబునగంగ చెల్వపార్వతికిఁ జేసెసత్కృతులెల్లశ్రీసొంపుమెఱసి."

ఈవర్ణనములలో స్వాభావికమాధుర్యమును గనులకుఁ గట్టునట్టి చిత్రకౌశలమును సోమునియందున్నదో, కాక యెఱ్ఱనయందుఁ గలదో చదువరులు విమర్శింతురుగాక! మఱియు నీయాశ్రమవర్ణనముం జూడుఁడు.

ఉత్తరహరివంశము.—

సీ. "పవనవేగవిశీర్ణపాదపాగ్రంబుల జడియకుండఁగఁ బట్టు సామజములు
పూజార్థనియమిత పుష్పమాలికలపై మధుకరంబులఁ జోఁపు మర్కటములు
నవబృథస్నానపర్యంతనిర్మలతకై కాసారములఁ గాచుగాసరములు
నిజనిజోటజభాగనీవారసీమలఁ జొరక కావలియుండు సూకరములుఁ
గీ. గలిగి కంసవైరి కన్నుల పండువై, చెలువు మిగిలెఁ బూర్ణకలశవిగళ
దాలవాలవారిహారితన్మునిదారి, కాశ్రమంబు బదరికాశ్రమంబు."

ఎందఱుకవులు ఋష్యాశ్రమముల వర్ణించినను నొకటేయచ్చు! అందలి మహర్షు లెంత ముక్కుమీఁదఁ గోపముగల యుగ్రస్వరూపులైనను, వారియాశ్రమమునఁ గల జంతువులు మాత్రము తమ నైసర్గిక స్వభావమును విడిచి శాంతస్వరూపములై యుండును! ఈకవిసమయము దాఁటిన పాపమునఁ బోయిన యొక రిద్దఱుకవులలో నెఱ్ఱనయు నొక్కఁడు. అతనివర్ణనము వినుండు?

సీ. "తరువిటపాసక్తధౌతవల్కలపంక్తి కమనీయతోరణకల్పనముగ
హూయమానంబులై యొండొండ వెలిఁగెడు త్రేతాగ్ను లభినవదీపములుగ
దుగ్ధపానంబులఁ ద్రుళ్ళు పెయ్యలనోరినురువులు సితపుష్పవిరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడి ఖగములవాసితంబులు జయధ్వానములుగఁ
గీ. దనసమాగమోత్సవమునఁ దగినశుభము, లప్రయత్నసిద్ధములుగ నతిశయిల్లు
మునిజనాశ్రమరేఖ నవ్వనజనాభుఁ, డర్థిఁ దరిసి ... ... "

స్వాభావికవర్ణనములను జేయుటలోఁ గవిత్రయమువారు పెట్టినదే భిక్షము. ఆశక్తి సోమునివంటివా రెందఱు తపసుచేసినను రాదు.

ఇఁక శైలివిషయ మించుక విచారింతము. శైలియందలిరుచియు ననేక విధములు. కొందఱు సహజపదగుంభనమధురమై శబ్దాలంకారభూయిష్ఠమై శ్రవణమాత్రముననైన నానందము నొసంగు బమ్మెరపోతనామాత్యునిశైలి మంచిదందురు. మఱికొందఱు గంభీరమును, నారికేళపాకపతితమును, గూఢార్థ మనోహరము నగు కృష్ణదేవరాయలశైలిని బొగడుదురు. మఱికొందఱు గంభీర దీర్ఘసమాసాలంకృతమై డొంకులేక పరుగెత్తు శ్రీనాథునిశైలిని మెత్తురు. ఇంకఁ గొందఱు, కష్టములేక, చేఁజిక్కినవెంటనే నోటవేసికొని రుచిచూడ ననువగు ద్రాక్షపండువలె, విన్నవెంటన యర్థము నందిచ్చునదియు, చిన్నిచిన్నిముద్దుపల్కులచేఁ గూర్పఁబడినదియు నగు తిక్కనామాత్యునిశైలి సర్వోత్తమ మని శ్లాఘింతురు. నేను నీతరగతిఁ జేరినవాఁడనే. విషయము స్పష్టముగఁ జెప్పుటకు వలయుమార్గము నాశ్రయింపవలయుఁ గాని, యామార్గమును శబ్దాలంకారశ్లేషాది కల్పనాకంటకములచే దుష్ప్రవేశముగా నొనరించుట పాడిగాదనియు నట్లు స్వపాండిత్యప్రకటనమందే తాత్పర్యము గలవాఁడు కవియై పుట్టరాదనియు నామతము. ఎవరిమత మెట్లే నుండె, నామతమునే వాకొనుట విధి. కొన్నియెడలఁ దిక్కన ననుకరించుచున్నను, సోమునిశైలి, మొత్తముమీఁద, ప్రాసభూయిష్ఠమై, గూఢార్థమై, దీర్ఘసమాసజటిలమై, పోతనను, రాయలను, శ్రీనాథుని ముగ్గురను సంపూ

ర్ణముగ ననుకరించినది. ఎట్టివారైననెయున్ననో మొదలుకొనుచుచే సర్వవిధములఁ దిక్కనామాత్యశైలినే గతిగా నమ్మియుండుదురు. తనమనోభావమును స్పష్టముగఁ జిన్ని చిన్ని పలుకులతో వ్యక్తముచేయుటయందుఁ దిక్కనను తెనుఁగునాట నింతవఱకు మించినవాఁడు మఱియొకఁడు లేఁడు. ఈవిషయము మొదలుకొని చదువరులకుఁ బ్రత్యక్షమే గావున వేఱ యుదాహరింప నవసరము లేదు.

వేయేల? సర్వవిధములఁ నిరవద్యములగు కవితాలక్షణములకెల్ల నాలవాలభూతులు కవిత్రయమువారే. ఎంత పరికించినను నాఁటికి నేఁటికి వారికి వారే దీటు. అట్లు లేకున్న నాంధ్రప్రపంచ మందఱు వారినే సర్వప్రమాణభూతులనుగా నమ్మియుండుటకుఁ గారణము లేదు.

"వలాహకంబుంబోలెఁ సరకాస్పదంబై, కుంజరంబునుంబోలెఁ గుంభాభిరామంబై, రంగస్థలంబుంబోలె శైలూషశోభరమ్యంబై ... (ఆశ్రమవర్ణనము)"

సీ. "కుజము కుంజరముచేఁ గూలునో కూలదో కూలు కుంజరము నీకుజముగూల్చె
బ్రమాను పేరేటిచే మడఁగునో మడఁగదో మడఁగు పేరేటి నీబ్రమాను మడఁచెఁ
గాలునో యొకనిచేఁ గాలదో సాలంబు గాలు నీసాలంబు గాల్చె నొకనిఁ
దునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు తునియు నీవృక్షంబుతునిమెఁ బరశు"

ఇత్యాది కేవలకల్పనాధారము లగు వాక్యములు పైకెంత మనోహరముగఁ గాన్పించినను, లోనఁ జూచితిమేని నిస్సారములుగ నుండును. మఱియు నిట్టివి వ్రాయుటయు నసాధ్యముకాదు. భాషయందుఁ బదపరిచయ మెంతయుండిన నిట్టివి యంతసులభముగను సొగసుగను వ్రాయవచ్చును. ఇవి కవిశక్తిని జూపునవియే కాని కవితామాధుర్యమును జూపవు. పదములను జోడించినవాఁ డంతయుఁ గవియే యని సనాతనమైన మనయభిప్రాయము. సహజమాధుర్యము నందుఁ బొందించువాఁడు వేయింటికొక్కఁ డుండునో లేదో! కేవలము భాషాపాండిత్యముచేఁ గవుల మనిపించుకొనవలెనను పట్టుదల గలవా రర్థములేక యమరమును గట్టిగ వల్లించి, యాపాండిత్యముచే,

"ఇత్యపులు గూయంగ కోనంగుఁడేయంగ, అప్యేకదంతుండు ఆడంగ"

అని కవిత్వమువ్రాసిన కోమటిసెట్టివలె హాసభాజను లగుదురు. ఇంచుమించు మనప్రబంధకవుల యందెల్ల, నీకోమటికన్న నాలుగాకు లెక్కువ చదువుట తప్ప, విశేష మేముండును! తిక్కనాదులయందుఁ గల కవితాశక్తి సహజమాధురి. వారికిని నితరునకును భేదము నిర్ణయింపవలయునన్న నాసహజమాధుర్య

మునే యాధారముగాఁ గొని యాపనికిఁ బూనవలయు. అట్లుగాక పాండిత్యమును బట్టి నిర్ణయించినచో, వసుచరిత్రాచంద్రికాపరిణయ నలయాదవరాఘవపాండవీయాది గ్రంథకారులు వారికన్న నెన్నియోమడుంగు లధికు లని చెప్పవలయును. తుదకు నాచనసోముఁడును వారికి సాటిరాఁడు! అంతమాత్రమునఁ గవితాప్రపంచమున వారు సామ్రాజ్యపీఠాధిష్ఠితులని చెప్పుట పొసఁగునా? యుక్తమా?

స్వభావమును నిరాకులమగు కథాసంయోజనము, కారణాంతరమునఁ గథాగుంభన మప్రకృతమైనను నావిషయము మనసులో మఱచునట్లు వ్రాయుట, ప్రకృతివర్ణన సహజభావసుందరము లగునలంకారములు, వెగటుగాక చెవుల కింపయి యనతిగూఢార్థ మగుశైలి, సల్లాపసౌమనస్యము, నివియే కవిత్వమునకు ముఖ్యమైన సౌభాగ్యసర్వస్వములు. ఇది కవిత్రయమువారు మొదలగు ననేకాంధ్రకవుల మతము మాత్రమ కాక, సంస్కృతమునఁ బ్రాచీను లగు వాల్మీకి భాస కాళిదాస భవభూత్యాదులయు ముఖ్యమతమై యున్న దనుట నేను క్రొత్తగఁ జెప్పఁ బనిలేదు. ఈ విచారములలో సోముఁడు కవిత్రయమువారికిఁ దగ్గియు, నితరప్రబంధకవులకు మించియు నున్నాఁడు.

ఇతరప్రబంధకవులను మించినాఁ డని యంటిని. ఆవిషయ మిందుఁ గొంత విన్నవింప ననుమతి వేఁడెద. మనఃపూర్వముగ నిందు విచారించి చూచిన నితని యం దెన్నియో మనోహరములును రసపుంజములు నగుపద్యములు గలవు. ప్రబంధమార్గము నాశ్రయించినవాఁడైనను, సోముఁడు, నన్నయ తిక్కనలయందు, ముఖ్యముగఁ దిక్కనయందుఁ, జాలగౌరవముగలిగి పలుమాఱు వారిగ్రంథములఁ బఠించిన ప్రతిభాశాలి యగుటఁ జేసి, వారివలె భావపరిపూర్ణ మగు సల్లాపసౌందర్యము ననేకస్థలములఁ బోషించినాఁడు.

కుమారుఁ డెంతదుష్టుఁడైనను, గన్నతల్లి కతనిపైఁ బ్రేమ తప్ప దను ప్రాపంచికనీతిని బోధించుచు, భూదేవి శ్రీకృష్ణునితోఁ జెప్పికొను వాక్యము లెంతయు దీనమున మనసుగరఁగునట్లు వ్రాసినాఁడు చూడుఁడు.

తే. "అకట! యిచ్చినవాఁడు దయ్యంబ, కొన్నవాఁడు దయ్యంబ దీనికి వగవనేల?
కాలపాకంబుఁ దప్పింపఁ గమలనాభ! *నాభయార్తప్రలాపంబునకుఁ దరంబె!"

---

*ఇట్టి రసపూర్ణఘట్టములఁ గూడఁ నితఁడు సహజ మగుప్రాసలోభమును విడనాఁడు పుణ్యమునఁ బోఁడయ్యె.

మ. "దివిజుల్ దల్లడిలం దదీయజనయిత్రీకుండలద్వంద్వముం
జెవులం బెట్టికొనంగ రావగుచు నూచెంగాని యాతప్పు నీ
చెవులంబెట్టి కొనంగరాని పురిగాసింబెట్టి కట్టిండి వా
సవుఁ డెట్టుం దనుజంపఁజాలు టెతఁ డెంచంజాలఁ డింద్రానుజా!"

... ... ... ... ...

తే. "కన్నమోహంబు విడువదు గాన నేను, వగపుమై నెంతొదూలిన వనజనాభ
సెలవులే దింక గతజలసేతుబంధ, నంబు చేసిన గా దటు నవ్వఁబాటు!"

తనకన్నకుమారులందఱు మృత్యువుపాలుగాఁగా, నాబ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునితోఁ దనగోడు చెప్పికొను దీనత్వ మెం బతి పుఁడు—

మ. "అవియెల్లం గడచన్న నేఁడుతుదగా నస్మత్కళత్రంబు గా
రవముం మోదము ఖేదముం బెరయ గర్భం బిప్పులం దాల్చి నా
నవమాసంబులు నిండె గుండెవగిలె న్నా కంతలోఁ గొంత లో
కవినోదంబున కీఫలంబు చవిదాఁకంజేసి రక్షింపవే!"

సీ. "తడియొత్తుచీరతో దాదికౌఁగిటఁజేర్చి చూపంగఁ గన్నారఁ జూడనైతిఁ
దడవియాడకమున్న తట్టిడు మని పట్టి వడఁకంగ సెజ్జపై త్రావ్చనైతి
నల్లంతదవ్వుల నప్పలప్పల యని యెదురుగాఁ బఱతేర నెత్తనైతి
వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు దిట్టింప విని సప్పిదేఱనైతి
గీ. నకట! మిథ్యామనోరథుం డైతిఁ గాని, కొడుకులం గని తమవారు గొండసేయ
నుండ లేదయ్యె, సంపద లుబ్బెనేని, లేబరముగాదె బిడ్డలు లేనిబ్రతుకు!"

యజ్ఞదీక్షితుఁ డగు శ్రీకృష్ణుఁ డాబాఁపని కుమారుని రక్షింప నేమియు పాయ మని చింతించుచుండఁగా, నర్జునుఁడు నేఁబోయెద నని జంబములు పల్కి యావిప్రుని బిలిచికొని వచ్చినాఁడు. వచ్చి యింటిచుట్టును సైన్యంబు నిలిపి, తానును వాకిట వింటి నెక్కువెట్టి యమకింకరులు వచ్చుత్రోవ కడ్డముగా నిలిచి వేచియుండెను. కాని యాబిడ్డని పాలిమృత్యువు వీరందఱి కనులలో మన్నుగొట్టి యెపుడో యుసుఱుగొన్నది. అపు డాబ్రాహ్మణుఁడు రోషశోకంబులు పెనఁగొన వట్టిబీరములు పల్కిన యర్జునుతో నేమనుచున్నాఁడు వినుండు!

క. "ఓపార్థ! నిన్ను నమ్మితిఁ, బాపని రక్షింప కిట్లపార్థుఁడవైతే!
నాపాలి పారిజాతము, గోపాలకచక్రవర్తిఁ గొని రానైతిఁ!"

చ. “ పిలిచితినన్న నిన్ను ? నతిభీతుఁడ విప్రుఁడ నమ్మినాఁడ, నీ
పలు కనృతంబు గాఁదగునె ? పాతెడుబండ్లకుఁ గాళ్ళుసాఁపఁ గా
నలవడునన్న ? పోటుమగఁడై యిటు చేసితి కాక యాసతో
నిలుతు మురారి నన్నిచట నీళ్లను ముంచినఁ బాలముంచినన్ ! ”

క. నీవేమిచేయు దీగాం,డీవము నీకిచ్చి యమ్ము డెప్పరమైనన్
లావు గలదంచుఁ బలికిన, పావకుచేఁగాదె కోలుపడితిఁ గుమారున్ ! ”

అర్జునుఁడు గావున నీయవమానపు మాటల విని సైరించుటయకాక, యన్నగారితో నీవిషయ మనుప్రాసములతోఁ జెప్పుచున్నాఁడు గాని, కర్ణునివంటి వాఁడైనఁ జెప్పక యేబావిలోనైనఁ బడియుండును !

ఘంటాకర్ణుఁ డను పిశాచనాయకుఁడు తపముఁ జేయుచున్న శ్రీకృష్ణుఁ జూచి, యతఁ డని తెలియక యడుగుపద్యముల సొంపు చూడుఁడు !—.

ఉ. “ ఎక్కడివాఁడవన్న ? కడునింపుగఁ గాఱడవిం జరించె దీ
చక్కనిమేను నీగరువచందము నెందును గాన మక్కటా !
నిక్కము మాకుఁ జిత్తములు నీరగుచున్నవి ! క్రూరసత్త్వముల్
దెక్కలిగొన్నఁ బొక్కపడదే మదిలో నినుఁగన్నతల్లియున్ ! ”

శా. “ చేతోజాతుఁడు నీవు నేమవుదురో ! శీతాంశుచూడామణిం
బ్రీతిం గోరి తపంబుసేసెదో ! పిచారింపంగ నశ్లేలగున్
బాతాళంబును నేలయుం ద్రిదివముం బాలించు సిద్ధుండవో !
నాతండ్రీ ! నను నేలవచ్చినజగన్నాథుండవో ! తెల్పుమా ! ”

ఎక్కువ శౌర్యము ధైర్యముఁ గలవారికే దయాదాక్షిణ్యాది మృదుగుణములును నతిశయితములుగ నుండు ననుట కీఘట్టము ప్రథమోదాహరణము. మఱియు నావెంటనే శ్రీకృష్ణుఁడు వానిని గొంచెము కఠినముగ మందలింపఁగా నతఁడు రేఁగి బదులు పల్కునౌద్ధత్యముఁ గనుండు !

శా. “ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ము
*క్కంటిం గొల్తుము కిన్నరేశుపనికై కైలాసశైలంబునన్

* ముక్కంటిం గొల్తు మనుట ప్రాసమునకై వచ్చినది. లేక హరిహరాద్వైతము బోధించు తలఁపుతోఁ గవివ్రాసియుండును. కాని ఘంటాకర్ణుఁడు పరమవైష్ణవుఁడు.

జంటగా వచ్చినసారమేయములు నీసైన్యంబులుగా మావె యే
వెంటంబోయితి మేమి! కానడవిలో వేటాడనే యెవ్వరుగా!
తే. "నీవు పోవు దెసం బొమ్ము! నీకు సాకు, మాటలేటికి?"

రాజసగుణము లక్షణమే యింత! పొమ్మని పరుషమాట లాడినవారిని బెదరించినందునకు శ్రీకృష్ణునకుఁ దగిన మర్యాద జరిగినది! ఆపిశాచముల భక్తి రసమత్యద్భుతము! ఊర్ధ్వపుండ్రాదులలో మహాగ్రహము ప్రకటించు పరమవైదికాగ్రేసరుల దొంగభక్తికన్న నీవద్యముల మూఢభక్తి వేయింతలు నిష్కల్మషము! జాతిపై శౌచము. వృత్తిజంతుహింస! వెంబడించెను శ్రీకృష్ణుఁడు! ఆతనికారగింపు వెట్టునది విప్రులిక నేబదరు! వారాతనినిహ్వానించు సౌందర్యముం జూడుఁడు.

సీ. "పుండరీకములతోఁ బురిడించుకన్నులఁ గారుణ్య మను తేనె గడలుకొనఁగ
మందారశాఖతో మలయఁజాలెడు కేలఁ బాంచజన్యం బనుపండు మెఱయ
నుదయాద్రితటముతో నుద్దించునురమునఁ గౌస్తుభం బను దివాకరుఁడు దోఁప
నాలోకనంబుతో నవ్వుపాదంబున నాకాశగంగ యను నమృత మొప్ప
గీ. నమృతధారాధరము మాట లాడినట్లు, భాగ్యదేవత రూపు చేపట్టినట్లు
లలితగతి నున్న సగుణాలంకరిష్ణు, విష్ణుఁ బొడగంటి భవములు వీడుకొంటి!"

మఱియు శ్రీకృష్ణుఁడు సత్యభామాదులతో నెత్తమాడునపు డతనితో నాయమ వల్కుపల్కులు ముద్దులొల్కునవి. స్త్రీప్రకృతి నెంతయు సొగసుగఁ జూపఁజాలినవి. చూడుఁడు—

ఆ. "వామలోచనితోడ వాల్గీనితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ
నటమటీనితోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరపుగాదు!"

క. "కలిగె నొకజాంబవతి! వెన్నెల వడఁబడె దేల? వలపు నీతలవేఁగెఁ!
బులియక వేసవతులు గల, పొలఁతులకే పాటువడక పోరాఁ దనుచుఁ."

క. "చిత్తంబూరక కలఁచెదు, నెత్తము నాతోడ నాడ నేరుపు గలదే?
పొత్తుగలసి నీవును నీ, తత్తబడలు రాదు! గెలిచెదం బరువడితోఁ!"

ఉ. ఇంతయునేల? మీకు నెదురెక్కటి నొక్కటికిం బదాఱు చె
ల్లింతుఁ గడళ్లతాఁకున వెలింబడ సారె గలవ్వ డిత్తు గె

ల్పంతనసంగ్రహంబున సహోరువుతోఁ గను మోడిపోయినర్
బంతముతోడ హోరువునఁ బట్టుదుఁ బాసికబొమ్మ గట్టుదుర్ !"

ఉద్ధతురా లగు స్త్రీస్వభావ మింతకు మించి చెప్పట యసాధ్యము. ఇం తియకాదు. ఇఁక ముం దితఁడు వారు నైత్తమాడుటను వర్ణించువైఖరిం జూడ, సంజ్ఞావాచకములతోడ నాయాటను గ్రొత్తగ సృజించినవాఁడే యితఁడు గాఁ బోలు నని సందియము గలిగెడును !

ఇట్లనేకస్థలముల నితఁడు తక్కుంగల కవులకంటె గంభీరుఁ డని చాటఁ జాలు నుదాహరణములఁ గనుఁగొనవచ్చును. ఐనను నివన్నియుఁ బ్రబంధపరమేశ్వ రుని మీఱుటకుఁ బనికిరావు. ఈ స్థలములందే యాతఁడు నెంతయు మనోహరము గనే వ్రాసినాఁడు. ముఖ్యముగ ఘంటాకర్ణుని చరిత్రములో నతఁడు చూపిన నిష్క ల్మష మగుభక్తిరసము ప్రతిమనుజుని మోహితుం జేయఁజాలినది. ఎట్లు దూఁచి నను నితనిప్రక్కనే ముల్లునూపును. ఇతనిమహిమ నింకను స్పష్టముగ నెఱుఁగ వలయునన్నఁ బూర్వభాగమున నెన్నియో యుదాహరణములు గలవు. శ్రీకృష్ణుని బాలలీలలును, నతనిదుండగములు గోపికలు యశోదతోఁ జెప్పుకొనురీతులును, నాతల్లి వాత్సల్యకోపములు ముప్పిరిగొనఁ గొడుకును దండింపఁబూను తెఱంగు లును రసము లొల్కునవి ! ముద్దులమూటగట్టునవి ! ఎన్నిమాఱులు చదివినను దనివి దీరదు. అట్లువ్రాయఁగల్గుట యతని తలలోనే పుట్టి యుండే మాయమైన యదృష్టవిశేషము కాని సామాన్యకవులకు సాధ్యముగాదు. అది యెల్ల నిం దు దాహరించుట యప్రకృతము.

ఇంతవఱకుఁ జేసిన విచారముచే సోమనాథుఁడు, కవిత్రయమువారికిఁ దగ్గి యు నితరప్రబంధకవులకు మించియు నున్నాఁ డని నాయభిప్రాయముఁ దేలినది. కావున నితనికాంధ్రవాఙ్మయ సామ్రాజ్యమున నమాత్యపదము నీఁదగు నని నా యాశయము. అనఁగా ద్వితీయస్థాన మనుట.

ఈ సిద్ధాంతము నాచనసోమనాథపక్షపాతు లగుపండితులకుఁ బెక్కురకు రుచింపకపోవు నేని యందు నాయపరాధ మేమియు లేదు. వారందఱును సో మున కాంధ్రవాఙ్మయ సామ్రాజ్యమునఁ గేవల మొకరాజత్వమునే కాక, చక్ర వర్తిత్వముగూడ నొసంగఁ దలఁచినవారు. నేను మంత్రిత్వ మొసఁగినఁ జాలు ననుచున్నాఁడను. అనఁగా వారియందఱికన్న నేనెక్కువ మెచ్చఁగిన వాఁడ నని

యు, విమర్శకుఁడ ననియు నేఁజెప్పికొన రాలేదు. వారికిని నాకును సర్వవిధముల హస్తిమశకములకు బలెఁ జాల నంతరము గలదు. ఐనను నిది న్యాయమే. ముఖ్యముగాఁ గలప్రజాసామ్రాజ్యము రాజులను గాని రాజకీయాధికారులను గాని నిర్ణయించుటకుఁ బెద్దలకు బలెఁ జిన్నలకు నధికారము గలదు. కావున నాయభిప్రాయము నిం దిట్లు విన్నవించితి. ఇదియ సిద్ధాంత మని నాయాశయము గాదు. దీనిని బూర్వపక్షముగా నైన నుంచికొని సహేతుకముగ ఖండించి, సోముఁడు కవిత్రయమువారికన్న మిన్న యని పండితులు నిర్ణయించిరేని, కృతజ్ఞతాపూర్వకముగ నప్పుడు నాయభిప్రాయము మార్చికొన సిద్ధముగ నున్నాఁడ నని సప్రశ్రయముగ విన్నవించుచు నీయల్పపరిశ్రమము నింతటఁ జాలించెద.

రా. అనంతకృష్ణశర్మ,

మైసూరు.

---

విషయ

(67) మైరావణచరిత్రము—(గ్రం. సం. 896.)

ఇది యొక చిన్నపుస్తకము. ద్విపదకావ్య మని వ్రాసియున్నారు గాని కందపద్యములు వచనములుం గూడ నడుమనడుమ నగపడుచున్నవి. సంపూర్ణముగా నున్నది. ప్రారంభమున—

క. గజవదను నేకదంతుని, ద్విజగన్నుతుఁ బరశుధరుని ద్రిపురారిసుతున్
భుజగేంద్రహారు గణపతి, విజితేంద్రుని (యు) గొల్తు సకలవిద్యలకర్తన్.

అని కథారంభము చేసినాఁడు. కడపటను ఫలశ్రుతి యున్నది. ప్రమాదీచనామసంవత్సరము కార్తిక బ ౭ జయవారమువఱకు పాలెపు సీతన్న వ్రాసినట్లున్నది. కవివృత్తాంత మెక్కడను గానరాదు. గ్రంథమునం దక్షరములకంటెఁ బురుగుపోట్లు మిక్కుటమై యున్నవి. తప్పులు వ్రాఁతలోను గవితలోనుగూడ నున్నవి.

"చొచ్చిపాతాళంబు సూచికుం డపుడు, అచ్చట వెయ్యోజనంబులు వోయి...
ఆవిభీషణరూప మంతయుఁ దాల్చి, ఆవుక్కుపెట్టెయు నటు చంకఁబెట్టి."

(68) కర్మవిపాకము—(గ్రం. సం. 904.)

ఇది మూఁడాశ్వాసముల పద్యకావ్యము. పేరువలననే గ్రంథవిషయము సులభముగాఁ దెలియవచ్చుచున్నది. కవిగద్యము. "శ్రీరామచంద్రవరప్రసాదలబ్ధ కవితావిలాస పుష్పాలగోత్ర ధేనువకొండ జోగినామాఖ్యపుత్ర సరసగుణధుర్య కేశవనామధేయప్రణీతం బైన కర్మవిపాకం బనుధర్మశాస్త్రమున" నని రెండుతావులను "... ధేనువుకొండ జోగినామాఖ్యపుత్ర నరసయ్యనామధేయప్రణీత" అని యొక్కచోటను గన్పట్టుచున్నది. ప్రతి వ్రాసికొనినవాఁడు సరసగుణధుర్య యనుపదమునుజూచి నరసయ్య యనివ్రాసినారో లేక, సరసగుణధుర్య నరసయ్య యనియుండవలయునో విచార్యము. మఱి కేశవనామము నెట్లు సాధింపవలయునో: గ్రంథాదిని :—

క. శ్రీసీతాహృద్వల్లభ, వాసవభోగీశవినుత వారిజనేత్రా
వాసవపుత్రవిమర్దన, దాసాఘవిరామ భీమ దశరథరామా.

వ. మహనీయగుణగరిష్ఠుం డగుశంకరుండు శాంకరికిం జెప్పినట్లుగాఁ గర్మవిపాకంబు సవిస్తరంబుగా నెఱిఁగించువాఁడై యగస్త్యుం డాత్రేయున కిట్లనియె.

అని మొదలిడియెనే గాని తనవంశాదికము నేమియుఁ గవి చెప్పికొనియుం

డలేదు. కృత్యాదిఁ గొంత యుండవలసియుండును. ఇక్కడివి పుష్పాలగోత్ర మను టచే శూద్రకులజుఁ డని స్పష్టము. కవిత్వము మృదువుగానున్నది.

వ. "మునీంద్రా సాక్షియు నుత్తము లగువిప్రులమాన్యంబు లపహరించువార లును, వసంతగ్రీష్మకాలంబుల మిగుల నీరుపట్టుచేత గోవులు తటాకంబులకుం జనిన పిమ్మట వాని నిర్బంధించి మరల్చువాఁడును చివురని విత్తంబు పుచ్చు కొని మరల నొసంగనివాఁడును వేదం బబద్ధం బని నిశ్చయించువాఁడును గో పంబునఁ బురంబులు వనంబులు ప్రాయంబుగఁ గాల్చువాఁడును గులశీల యౌవనప్రాయంబులు గలవరుని విడిచి ధనాపేక్షుండై కురూపునకు వృద్ధు నకుఁ గన్య నిచ్చువాఁడును బ్రహ్మహత్యఁ జేయువారితోఁ దుల్యులు.......

గీ. వేల్పుచవికె లెల్ల విప్పిన గ్రుడ్డి యౌా, వేదఘనులను దాఁప వెట్టి యగును
దూఁచునపుడు దొంగతూనిక దూఁచిన, గూని యగు నతండు క్షోణియందు.

మ. తొలుజన్మంబున సర్వసంపదలతోఁ దూఁగాడుచున్నట్టి వా
రలభాగ్యంబులఁ జూడలేక మఱి భార్యాభర్తృపుత్త్రాళికిం
బలుమాఱుం జెఱసాలఁ బెట్టిన మహాపాపాత్ముఁ డుర్వీస్థలిం
బలుగై నిర్ధనుఁడై కళత్రహరుఁడై పాటిల్లు నార్యోత్తమా.

సర్వజిత్సంవత్సర ఫాల్గున శు ౧౩ స్థిరవారమున గుడిమెట్ల వేంకటాచా ర్యులు వ్రాసినప్రతి—

(69) రామాయణముపాట—(గ్రం. సం. 1000)

ఇది విశాఖపట్టణము గోదావరి మండలములలో శూద్రులలో మిక్కిలి వాడుకగానుండు పాట.

"హరిహరీనారాయణాదినారాయణా కరుణింపుమీా మమ్ము కమలలోచ నుఁడ" అనియు, "శ్రీరామరామరా మోరామ రామయ్య హరిరామ రామరామా యోధ్యరామ" యనియుఁ బ్రతిచరణముతోడ నిరువురు వెనుకపాటయు నొకఁడు మూలకథ ముందుపాటయునుగాఁ బండుగులు సంక్రమణము మొదలగుదినము లలోఁ దోటపెద్దు లనువృషభములవెంటఁ బాడుచుందురు. బ్రాహ్మణులలో శ్రుతి స్మృతులువలెనే శూద్రులలో నీరీతిపాట యనేకులకుఁ గంఠస్థమై యున్నది. వేదా దులవలెనే యిదియును వ్రాసియుంట కలవైనదిగాదు. ఇట్టిగీతములు రామాయ ణము, నుత్తరరామాయణము, భారతము, భాగవతముఁ, బూర్ణముగాఁ బలువు

రకుఁ గంతపాతముగా వచ్చును. ఆరామాయణకథలోనిదే యీగ్రంథము. అయోధ్యాకాండము, ఆరణ్యకాండము, యుద్ధకాండములోని లక్ష్మణమూర్ఛ యను భాగములు మాత్ర మిం దున్నవి. నోటిపాటలోని తప్పులనే గ్రంథములో వారు వా రుచ్చరించునట్లే ప్రతివ్రాసినారు. కవి శ్రీనాథుఁ డనుప్రతీతి యున్నది. వ్రాఁత పరిశుభ్రముగా నున్నది.

“ నీరాక నీయునికి యింగున్నకారణము నంతయును జెప్పుమని యడిగె రావణుఁడు
ఈమునికిఁ జెప్పినను నేమి తప్పగు ననుచు సీత తనయాపత్తు చెప్పఁగాఁ దొడఁగె
తండ్రిజనకునిమహిమ దశరథునిపెనువంతి యతనితనయులరీతియభిషేకవిధము.
మునినాథ యిచ్చోట క్షణమాత్రము.ను నిలువు జననాయకుఁడు వచ్చి నినుఁ [బూజసేయు
హితవుగనుజానకియిన్నియును నెఱిఁగింప నధికసంతోషమున ననియె రావణుఁడు
నీతెఱఁగునీవారినేర్పడఁగజెప్పితివి నాతెఱఁగు వినుమనుచుననియె దశముఖుఁడు.

కీలకనామసంవత్సర కార్తిక బ ౧౩ గురువారము. శృంగారము పాపయ్య వ్రాసినప్రతి.

(70) జగన్నాథమాహాత్మ్యము—(గ్రం. సం. 950.)

ఇది యొకపద్యకావ్యము. కవి గౌతమగోత్రజుఁడు, రామయామాత్య పుత్త్రుఁడు, సూరయనామధేయుఁడు. ఇంతకంటె నిం దీతనివిషయము తెలియ వచ్చునది కృత్యాదిని గాని గద్యములోఁ గాని లేదు. ప్రథమాశ్వాసము పూర్తిగా నున్నది. ద్వితీయాశ్వాసము కొంచెము కొఱఁతపడి యున్నది. ఎన్నియాశ్వాస ములగ్రంథమో యెఱకపడదు. భద్రాచలరామునకుఁ గృతి యిచ్చెను. కవిత్వము ధారాళముగాఁ జక్కఁగా నున్నది.

శా. స్వామీ మీరు వచస్పతిప్రతిము లంచద్భూరికారుణ్య వా
క్స్వామీచీనులు నిక్కమారు మదభీష్టా(?)సిద్ధిగా సర్వవి
ద్యామాధుర్యరసగ్రహానుభవ సంధానాత్ముగాఁ జేసినా
రే మీ కేమిఋణంబు దీర్పనగు నుత్కృష్టప్రభావోదయా!

ఉ. మీసరివారు మా కెవ రమేయగుణాకరు లీర కారె వి
శ్వాసపదంబు మీహృదయసంశ్రయ మంచు మృదూక్తి భక్తివి
న్యాసముతోడ నమ్రుఁడయి నాగురుని స్ననకాభిషేకముం
జేసి కృతార్థజన్మఫలసిద్ధుఁడ నైతి నటంచుఁ బల్కుచున్.

విస్మయ మైన యీమహిమ వేయుము ఖంబులు గల్గు శేషుఁడైన, నాస్తరియింపలేఁడు.

శా. ఏమీ యిట్టివిచిత్రసంగతులు సున్నే మెప్డు మద్ధాత్రి వి
న్నామా వైకృతి గల్గె నేఁటి కిది యన్యాయంబు మానల్లనే
యేమో వచ్చె నటంచు శిష్యుఁ డయి పృథ్వీశుండు సబ్బాలుఁ జూ
తా మాచు న్మదిలోఁ దలంచె          నిట్టివికొన్ని యందందుఁ గలవు.

## (71) రాజయోగము—(గ్రం. సం. 889.)

ఇది యొక వేదాంతగ్రంథము. ఇం దందందలి శ్లోకములు పద్యములుం జేర్చి సంక్షేపముగా రాజయోగము వ్రాయఁబడినది ఎవ్వరువ్రాసిరో తెలియరాదు. పూర్తిగా నున్నది. కీలకనామసంవత్సర పుష్య శు ౧౪ ఆదిత్యవారము సరికి సాంఖ్యయోగంబునందు రాజయోగం బనుప్రకాశాధారము సమాప్త మని మాత్ర మున్నది. మఱియు—

గీ. రాజయోగంబురాచకొండసోమయాజులు, శాస్త్రసద్ధతివ్రాసెను శాంతముగను
పరమసాయుజ్యమొంతయు భక్తి గలుగు, వినినఁ జదిపిన వ్రాసిన విబుధులకును.

అని యొక్కచోట కనఁబడుచున్నది గాని, యీసోమయాజియే గ్రంథకర్త యనుటకుఁ దగినంత విశ్వాసము లేదు.

## (72) చంద్రరేఖావిలాసము—(గ్రం. సం. 863.)

ఇది యొకయక్షగానకావ్యము. కవి ధర్మపురి నివాసియో తత్సమీపస్థుఁడో యగుటచే—

ద్వి. సరవినొప్పగ వలయు ధర్మపురినిలయు, స్వామి రామయలింగసర్వేశుఁ డనఁగ—

అనిస్తుతించెను. కథయును ధర్మపురిరామలింగముకడఁ దపస్సుచేయుటకై బైలుపురి యింద్రుఁ డనురాజు వచ్చుట, యీశ్వరవరమున నొకపుత్రుఁడు దీర్ఘుఁ డనువాఁడు గలుగుట, నీకుఁ బుట్టినపుత్త్రునకు దీర్ఘుఁ డనుపేరు పెట్టు మని స్వామి కోరుట, యాదీర్ఘరాజునకు స్వయంవరము, చంద్రరేఖ యనుశాలివాహనుని పుత్త్రిని వివాహముచేయుటయు నే. ఇది యొక క్రొత్తకథయే.

ద్వి. ఇది గురుభజనపారీణతత్పరుఁడు, సదమలాత్మక జ్ఞాన సత్కవీశ్వరుఁడు
పరఁగ నలంకారభావముల్ నిండి, విరచించె నీకథ విశ్వేశ్వరుండు
భూచక్రమున ధర్మపురి యీశుపేర, నాచంద్రతారార్కమై యొప్పఁగాక.

అనియున్నది. ఈవిశ్వేశ్వరకవి యితరవిషయము లేమియు నిందుఁ గనఁబడవు. కవిత్వము సాధారణముగా నున్నది. ప్రతి, క్రోధనసంవత్సర వైశాఖ బ ౮ జయవారము యెద్దమల్లి సర్వేశము వ్రాసినది—

(73) శతకంఠరామాయణము. (గ్రం. సం. 1320.)

ఇది యొకద్విపదకావ్యము.

" విశ్వకర్మకులీనవిఖ్యాతిపరుఁడు, సొనరనిగర్భసగోత్రోద్భవుండు ...
నీలకంఠుం డనునిత్యమానసుఁడు, చాల జనించె నాసద్గుణోన్నతుఁడు
అతనికిఁ గులసతి యగునన్నమాంబ, పొసఁగ లింగనకవి పుణ్యుండు వెలసె.

అని మొదటిమాటలం బట్టి గద్యలంబట్టి కవితండ్రి నీలకంఠాచారి యని తల్లి యన్నమాంబ యని కవిపేరు లింగన్న యనియుఁ దేలినది. విశ్వకర్మకులీనుఁడు. భవిష్యోత్తరపర్వములో నున్నదానిని గురువుగారిసెలవుపై ద్విపదగా నీహారికథను రచియించె నని చెప్పఁబడియున్నది. దశకంఠరామాయణకథ సాధారణముగా నందఱు నెఱిఁగియున్నారు. శతకంఠరామాయణకథ ; ఇందుఁ గొన్ని చిత్రగాథలుండును. గ్రంథము చిన్నదియే. మూఁడుకాండములతో ముగిసినది. కవిత్వమునఁ జాల దోషము లగపడుచున్నవి. అన్నిటిని వ్రాఁతతప్పు లనుటకు వలను కనఁబడుటలేదు. ఈప్రతి క్రోధినామసంవత్సర భాద్రపద శు ౫ మి మొదలుకొని విశ్వావసు సం॥ వైశాఖ శు ౧౫ లు వఱకు, కడపజిల్లా చిట్టివోలుతాలూకా జ్యోబుళంపేటలో నుండు నాగరాజువల్లె రంగభట్టు కుమారుఁడు వీరరాఘవులకు, కామలాపురము తాలూకా పైఁడికాల్వలో నుండు వారణాసి చెంచుభట్టు కుమారుఁడు వేంకటరామాభట్టు వ్రాసినది. కవికూడ నీ పైఁడికాల్వ గ్రామనివాసియేమో యని గద్యములో నున్న—

" అలర శ్రియఃపతి కంకితంబుగను, సిరులొసంగుచునుండు శ్రీపైఁడికాల్వ
పురపాలకాధ్యక్షు పుణ్యుల నెలమి, శివకేశవులఁ బ్రీతి చెన్నొందఁ గల్గు."

అనుదానివలన నూహింపఁదగి యున్నది.

" కాశ్యపీసుతపతి గజవైరిరిపుని, శాశ్వతనూత్రుని జగతినాటకుని......
వాతాశనాపతివర్ణించుకరణి, మాతాపితాదుల మఱి చాల నెన్ని......
పదపడి శతజిహ్వప్రభునిచారిత్ర, మిదిద్వితీయఃకాండమింపొందనలరు ...

ఇట్టివి వ్రాఁతలో వచ్చుతపులు కావు. వ్రాఁతసవరించి యిందుఁ గొంత శైలికై చూపుచున్నారము.

"వనిత యేపట్లను వరుని నెగ్గాడు, పణఁతికి నిహపరఫలములు నాస్తి
పనివడి పురుషుని భక్షించినట్టి, జలజాక్షిఁ జూచిన జముఁడు భీతిల్లు
వెలఁదిని శిక్షింప నెఱుఁగ రెవ్వరును, వలదు నాయెదుటను వనిత నీవింక
నిలువక చను వేగ నిర్భాగ్యురాల, ఇదికొండగా నాతో వినిపింప నీవు
నిను గన్నవారికి నిలుచునె ఘనము, పనియేమి లేలెమ్ము పణఁతి యేమనిన
విని జనకునిమాట యిగిలించి కనులు, పెనఁగి తండ్రిని జూచి పేర్చి యిట్లనియె.
నను బుజ్జగింపక నను మెచ్చుకొనక, నను గారవింపక నమ్మ రమ్మనక
వినరానిదుర్భాష లిట్లంటి విపుడు, విను జనక నేనొక్క యుగ్రతంబు
తలకొని సూర్యుచేఁ దనయుని వడసి, యిలమీఁద నీతల లిట్టిచిత్రో యింతు."

## (74) శతకంఠరామాయణము—(గ్రం. సం. 900.)

సీతావిజయ మనునామాంతరము గలయీశతకంఠరామాయణము నాలు గాశ్వాసముల పద్యకావ్యము. కవి, లక్ష్మీనృహింహ కరుణాకటాక్ష వీక్షణసంప్రాప్త కవిత్వవిద్యాపారీణుఁడు, ఆత్రేయగోత్రజుఁడు, లింగననామధేయుఁడు, ధర్మనార్యపుత్త్రుఁడు. కవిత్వమంతప్రౌఢమైనదిగాదు. రామునకుఁ గృతియిచ్చినాఁడు. కృత్యాదినేమియుఁ దనవిషయముగాని కృతికారణాదులనుగాని వ్రాయలేదు. పైద్విపదకావ్యమునకు దీనికిని గవి లింగననామధేయుఁడే యని యొక్కరనుగా భ్రమపడవలదు.

మూఁడవపద్యమునుండియే.

ఉ. భాసురలీల శంభుఁడు కృపారస ముప్పతిలంగఁ జారుకై
లాసమునందుఁ బార్వతికి రామకథ ల్వివరింప నందుచే
వాసిగ సంతసిల్లి నిజవల్లభుపైఁ దనచూడ్కి నిల్పి యో
దాసజనావతంసము సదాశివ యింకొక టానతీయవే.

మ. శతకంఠుం డనుఘోరదైత్యుఁడు రఘుస్వామిన్ రణంబందు నే
కతమై తల్లడిలంగఁ జేసె నది తత్కాంతాలలామంబు న
ల్కతో వీక్షించి పెనంగెనెట్లు మఱి తత్కాండప్రచండక్రియన్
మృతమై యేవిధి చూచెనాతఁడు—

ఉ. వెండియు రాఘవుండు పృథివీపరిణీమణియింటికి న్సుమం
త్రుండు నిజాగతిం దెలిపి తోడ్కొనిపోఁ జని యూర్మిళాసహా
యుండు విదేహరాజసుతయున్ వనికిం దనవెంటఁ బైనమై
యుండుట విన్నవింప విపినోన్ముఖుఁ డయ్యె సతండు నయ్యెడన్. 53

క. చింతిలి సుమంత్రుఁ డాజగ, జ్జాతం గైకేయిఁ జూచి సడలందగ దే
యింతట నభిషేకనిదా, ఘాంతావగ్రహము నీదురాగ్రహ మింతీ. 54

— సుమంత్రుఁడు కైకను నిందించుట —

చ. మును పొకనాఁడు జేఁడు తనగ్రోలఁ బిపీలిక లాడుముచ్చటల్
విని నగ, నవ్వఁ గారణము వేఁడ నతం డది చెప్పినప్పుడే
తనువు దొఱంగుఁ బ్రాణ మనఁ దన్సతికిన్ మతినొప్పకొన్నదు
ర్జనికిఁ బుట్టినట్టియతిసాహసురాలవు గావె నావుడున్. 55

క. అసమంజు వెడలనడిచిన, వసుధేశ్వరుఁ డేజనాపవాదముఁ జెందెన్
దెస లెఱిఁగిన వరములకా, మునగసలని కైక నోరుమూయించెఁ బలిన్. 56

క. సరయూపాతితపౌరో, త్కరుఁ డాయసమంజురీతి దాశరథి యిఁకన్
బురివెడలుట కెంతటి ముష్కర వని సిద్ధార్థకుండు కైకం బలికెన్. 57

చ. వనికి గురూక్తిఁ దోఁచుపరివారపుబొంద వయి న్నిరీహుఁడై
తనపినతల్లియానతిని దాల్చెఁ గటిస్థలి రాఘవుం డధి
స్తనతటనానటజ్జనకజానయనాంబుఝరాభిషేకసం
జనితదుకూలతాగుణవిశాలము వల్కలచేల మత్తఱిన్. 58

క. వల్కలధృతి నజగవహృతి, శుల్కాత్తకళత్రుఁ డతఁడు సుషమవహింపన్
నూల్కొనె జనముఖబిసకిం, జల్కతతిన్ వికృతి నిఖిలజగదద్భుతమై. 59

మ. అనఘుల్ గన్గొననోఁచు రాఘవునియాథాత్మ్యంబు భావించులీ
ల నధోవల్కలదర్శనాసహనిమీలన్నేత్రుఁడై మున్ను గ
ట్టినహాళంబట్టు సడల్ప నేమికొద దృప్తిన్ గోటికందర్పమో
హనునెమ్మేని కటంచు వాక్పతిసుతుం డార్తిన్ మరల్చెన్ మతిన్. 60

క. కులగురువారితనిజవ, ల్కలధృతియై యపుడు సీత కౌసల్యపదం
బ్ములకెరఁగి వనికి సెలవిడఁ, దెలుపన్ మది నడలి యాసతీమణి పల్కెన్. 61

చ. ఖరకిరణాతపోత్కరనఖంపచజాగ్రదరణ్యమార్గసం
చరణములన్ నిమీశకులజాత నవావతరారవిందమం

దిర వగు నిన్నుఁ జూచి వనదేవత లాత్మనిమేషకల్పనా
పరిహృతి కొగ్గినాఁ డనుచుఁ బంకజగర్భునిఁ దిట్టకుందురే. 62

వ. అని యనుజ్ఝితానపాయవాత్సల్య యగుకౌసల్యకు సుశీలచారిత్ర యగుసుమిత్రకుఁ ద్రిలోకీహితాచరణకార్మణవరోత్సేక యగుకైకకు విశకలితమనోరథుం డగుదశరథునకు ననవరతనిష్ఠాగరిష్ఠుం డగువసిష్ఠునకుఁ బ్రయాణోచితప్రదక్షిణయుతప్రణామంబు లాచరించి కాంచనమయం బగునిశాంతంబు వెలువడి నివార్యమాణానుసారిదౌవారికవితానుం డగుచు జానకీసౌమిత్రియుక్తంబుగా నమేయగుణసముద్రుం డగు రామభద్రుండు తండ్రియానతి సుమంత్రుండు మున్నొకని హజారంబు చాయ కాయితం బొనర్చి తెచ్చిన మరుచ్చటులజవనిరాఘాటఘోటకానుషంగం బగుశతాంగంబు నుత్తుంగరంగసానుశృంగంబు నారోహించు చంచలామణిధనురుదారధారాధరంబు డంబు మెఱయ నెక్కి యెక్కటం గ్రిక్కిఱిసి గుమురుగుము రై వెంబడించు నాగరకసముదయంబు పదరయంబువలన నుదయంబుఁ జెందు పెందూళి మైథిలీజాని * లేనియారాజధాని విడుచుపుడమి వసువునం దోడరి సీత యడవి కై నడచు నెడ నిది యమంగళం బనుచుఁ దత్పౌరజానయనజాలకీలితానల్పబాష్పపూరంబు దూరంబు గావింప సాంతఃపురంబుగాఁ బురంబును వినిర్గమించి రొక్కించుక తడవునకుఁ దనరథం బతీతలోచనపథం బగుటయు వగం బొగిలి మూర్ఛిల్లి పరిజనానీతశిశిరోపచారగౌరవానీతచేతనుం డై యజతనూజుండు పురికి మరలి కోసలకుమారికాగారంబు చేరి వర్తింప నిటు నివారింప రానిమానవపరంపరల సందడుల మందమందగమనుం డై చనిచని వికసదరవిందసందోహశోణిమాళికలోచక్షురాలోకదూరీతకృతావగాహిదేహి మోహాసంతమస యగు తమస డాసి వాసరకరుండు తనదువనరాశిజిగమిష ననుకరింపక యపరవనరాశి గదియుపగిది నస్తమించుటయుఁ దత్తటినీతట తరుతటాంచ లాస్తీర్ణపర్ణశయనాయతనరీతి నుల్లంబు పల్లవింపం జేయ నెల్లవారు శయనించురాతిరి నిశీథసమయంబున నమాత్యునాలోకించి వంచితజనప్రపంచవేగసంచారచారు వగుతేరు దోలించి వేగాసాదిత వేదశ్రుతిగోమతినిషందికాహ్వాయనదీత్రయాలంకృతియు నిక్ష్వాకునకు మనువితీర్ణియు నగువసుమతిం గడచి జాహ్నవీసముద్వేలకల్లోలమాలికాను

* మైథిలీజానిమైన దావేని—యని మాతృక.

వేలశీతలవిశాలమూలంబుగను నదూరమందాకినీసలిల శీకరాసారతోషితానేక శాఖాశిఖానిరంతరకులాయవిశ్రాంత బహువిధశకుంతవారంబును నభంగశృంగి బేరనగరశృంగారంబును నగుహింగుదీపాదపంబుచాయ నిరవుకొని యున్న సమయంబున. 63

— * గుహుఁడు రాముం జూడవచ్చుట * —

మ. జనిసాహస్రతపఃఫలం బితని సాక్షాత్కార మీస్వామి కై
క నిదేశింప వనిం జరింపఁ జను టాకర్ణింప శక్యంబె కా
దని తాదాత్వికమోదఖేదగుణశీతాశీతనేత్రాంబు లా
ననము న్నింప గుహుండు రాఘవునకు న్వందారుఁడై యిట్లనున్. 64

మ. భటదుర్గోద్భటదుర్గవజ్జనపదప్రాజ్యంబు నారాజ్య మె
ప్పటికి న్నీది గదా చతుర్దశసమాపర్యంతముం దేవ రి
చ్చోటనే యుండి నను న్భవచ్చరణదాసుం బ్రోవరాదా మరు
త్తటినీసేవ జనన్యదర్శనమనస్తాపంబుఁ బాప న్నృపా. 65

శా. * నామందాధిపుఁ డాదరింపఁదగు నన్నన్ రాఘవుం డంబకు
న్నే ము న్నిచ్చినమాటపట్టు సడల న్లేసన్నా! యిఁక న్వల్కలం
బేమే నొందుటగాక రాచసొగసు ల్వేట్టంగ నర్హంబె యే
లామిథ్య ల్మనువంశ్యులం దనుమఁ బల్కంగొంకె వాఁ డంతటన్. 66

సీ. హరుఁ ఖడ్గము లూడ్చి యంబువు ల్గోలించి సారథి దరితరుచ్ఛాయ నిలుప
మధుపర్క మిసురీతి మకరందబృందమందరగంధవహుఁడు ముందట మెలంగ
వనవాసభృతనిజవ్యథ జూడలేక డాఁగినరీతి నపరాద్రి నినుఁడు గ్రుంకఁ
దనతోన సాంధ్యవందన మొనర్చినమునీంద్రులగోష్ఠి నిశఁ గొంతప్రొద్దు జరగ
గీ. ధనువు చేఁబూని భిల్లుండు దవుల నుండ, లక్ష్మణుఁడు నిద్ర సౌవిదల్లత భజింప
జానకియుఁ దాను గాంగరోధోనికుంజ, పర్ణమయశయ్య రఘుపతి పవ్వళించె.

క. మఱునాఁ డరుణోదయమున, భరితజటాభారుఁ డగుచు భాగీరథి ది
వ్యరథానుగ యగు నిమ్నగ, దరి నిలిచి రఘూద్వహుండు ధరణిజ కనియెన్. 68

సీ. కంజాతవిమత శేఖరజట్టాకోటీరకా బేరవారిజాకరమరాళి
ప్రకృతి కై తవగవీభరితశివాలయక్షితిధరోధఃక్షురక్షీరలహరి
కపిలకోపజ్వరగ్లపితసాగరసముద్ధృతనవ్యదివ్యౌషధీమతల్లి
జాతుమజ్జనకృజ్జనాతిపాతకజాతదర్దురీసందోహదందశూకి

* ప్రత్యంతరము లేక సవరింపఁబడలేదు.

గీ. ఆహరిద్వారవార్ధిపర్యంతచారి, జాహ్నవీమునిప్రసిద్ధస్మృతిస్ఫటికరథ్య
యగు నిది శరణ్య కృష్ణవేణ్యాగసింధు, జాహ్నవ్యగ్రాలమూర్ధన్య జహ్నుకన్య.

మ. అని మంత్రిం బురికి న్మరల్చి తరిచే నామింటనున్నీరి జ
వ్వనిదాటించి గుహుండు వీడుకొని పోవన్ మత్స్యదేశంబుత్రో
వ ననేకావను లెల్లఁ జూచుచు భరద్వాజాశ్రమక్షోణికిం
జని యాతం డనుపం బ్లవోత్తరితభాస్వన్నంగనావారి నై. 70

— * సుమంత్రుఁడు శూన్యరథంబుతో నయోధ్యకు వచ్చుట. * —

చ. చనిచని కాంచె దాశరథి సానుఝరీతటజాతచూతచం
దనలతికాదిపాదప విగానకృతానిశఖేలనామిళ
జ్జనతతిగీతివిశ్రుతివిశంకటపంకజరాగధోరణీ
కనదరుణీకృతిద్విగుణగైరికఝూటము చిత్రకూటమున్. 71

ఉ. కాంచి వసించి దైవతశిఖామణి కోకిలకంఠకాహళీ
పంచమనాదపంచశరపాటహమాఖరి లక్ష్మణప్రియ
భ్రాంచితలోచనోత్సవదఫాలయచాతురిఁ గొంత సేపు వ
ర్తించుకతంబున న్నిజపురీవిహృతి న్మఱపించె నంతటన్. 72

వ. అంతట సుమంత్రుండు కాంతారవైరస్యంబున రఘునతంసంబు మరలునో యనుదురాశం జేసి యాశృంగిబేరనగరంబున గుహసకాశంబునం గొన్నివాసరంబు లుండి వేసరి కతిపయప్రయాణంబులఁ బరిక్షీణోత్సవప్రజాసమేతం బగు సాకేతంబు సొచ్చి దాశరథివిరహిత నిజసమాగమసంజాత శోకాతిరేక నాగరకలోక బహువిధాక్రందమందీభవన్నినిస్వనతరంగం బగుశతాంగంబు డిగ్గి నగరుసొచ్చి యచ్చట మహీపతికి సతి యొనర్చినఁ దనపినా రఘుపతిసమాగతిం దిరోభూతచేతనుం డగుచు నతండు కోసలసుతాసుమిత్రాసమాశ్వాసితుండై రాఘవుం డేగతిం బదాతి యయ్యె, సీత యేమి యనియె, సౌమిత్రి యెట్లు మెలంగె నని చిప్పిల్లు కన్నీళ్లు నడరు గద్గదిక నడుగ నగుడ నడుగులకు నెరఁగి యి ట్లనియె. 73

క. నీరథమునకుం జౌరమ, నోరథమునకున్ భవత్తనుజు లెడలిరి మి
న్నేరవ్వలిదరి వని జా, వారికులై రావిదేహవరసుత కథిపా. 74

మ. కటు వై తోఁచుదురుక్తు లేమిటికి వక్కాణింతు వైరించియుం
తటి బ్రహ్మర్షి మరుద్గవీనవపయోధారాభిషేకంబు స

ల్పుటకుం జాలకయున్న కుంతలభరంబు న్నీతనూజుండు చెం
చటవిం దెచ్చిన మట్టిపాలఁ దడిపెన్ సాస్రీకృతోర్వీజుఁ డై. 75

చ. ఘనతతిఁ దోఁచుక్రొమ్మెఱుఁగు కైవడిఁ గాఱడవిం జరించు న
జ్జనకజకాళ్ల గోళ్ల నొకచక్కఁదనం బిడురత్తిమంబు మె
త్తనిజిగి లత్తుకయ్యె మఱి తాఁ గనఁబోదు వివర్ణభావ మా
ననమున కింత యైన రఘునాథసనాథవిహారహారితన్. 76

మ. వనమార్గంబున రాత్రులుం గిసలయవ్రాతంబుచే రామభ
ద్రునకుం దల్ప మమర్చి దుష్టమృగసందోహంబు రాకుండ బల్
ధను వమ్ము ల్గొని కాచి యుండుట సుమిత్రాపుత్త్రుఁ డస్వప్నభా
వనకుం జొప్పడె రామసేవకుల కస్వప్నత్వ మాశ్చర్యమే! 77

క. అని సుతులయునికిఁ దన కా, యన దెలుప నృపాలుఁ డప్పు డపరాద్రికిఁ బ్రా
మిను కున్నెనగుమినుకుం, జనఁ గౌసల్యకు సశోకశల్యం బలికెన్. 78

క. మగువా నీకిఁక వగవం, దగవా విను మిందుకు న్విధానము మున్నే
నగయాపితఘు ర్మవని, న్మృగయారతిఁ దమనకెలన మెలఁగుచు నచటన్. 79

చ. యతిసుతుఁ డొక్కనాఁటినిశి నంబువు ముంచురొద న్మదేభమ
న్మతిశితశబ్దవేదిఁ దునుమ న్నను వృద్ధులు నంధులైన త
త్పితరులు వానితోనె చితి పేర్చి శిఖిం బడువారు మాగతిన్
మృతియెడఁ బుత్త్రశోకమె భరించుమటంచు శపించి రంగనా. 80

క. కలిగితినిల శూద్రావై, శ్యులవలనఁ దపస్వి నగుచు నోనృపపర సం
ధిలు బ్రహ్మహత్య యనువెత, వల దని యాదుర్గతుండు స్వర్గతుఁ డయ్యెన్. 81

— * దశరథుని మరణము. * —

క. వశమా యటుగావున దు, ర్దశమాన్పఁగ రాదు రామరామా యనుచో
దశమావస్థకుఁ దార్చెం, బ్రశమాధికు శాప మపుడు పఙ్క్తిరథేశున్. 82

సీ. అమరావతీపురం బాఁగుకోఁజూచెనా యేసిశాచరకులాధీశుఁ డైనఁ
చెఱవోయెనా యేమి జేజేనగరి * నూళగేరిలోపలి దేమిటారి యైన
రాయబారము వచ్చెనా యిత్తఱి నయోధ్య కింద్రుహేజీబులం దెవ్వఁడైన
నాజ్ఞప్తుఁ డాయెనా యఖిలావనీపరిత్రాణచాతురికిఁ బ్రధాని యైన

* "నూళగేరి" యనుపదము ద్వితీయాశ్వాసము 25 పద్యములో నొకసారి వచ్చినది. నూళగేరి (రు) = నాగవాసము (అని తోఁచుచున్నది.)

గీ. హరి యనఁడు తేరు వెదకఁడు కరినిఁ గోర, డేనిమిత్తంబు వినుపీఁటిపైన మితని
కనఁగ నరిగె నభంగురాహవవిహార, విశకలితదైత్యరఘుఁడగు దశరథుండు. 83

ఉ. అత్తఱి దృగ్ఘనోదయత నశ్రుఝరంబులు గండమండలిన్
హత్తి కుచాద్రులం దొరసి నాభిసరంబులు నిండి పో నెలుం
గెత్తి నిశాంతచంద్రముఖు లేడ్చి రమర్త్యనతోదరీకరో
ద్యత్తరకిన్నరీముఖరితాహరితానవితానమాధురిన్. 84

ఉ. సూనృతవాది రా జనెడుసుద్దులు నిమ్మహిమాయెఁ గైకసం
స్థాన మటంచుఁ దిట్లు రుదితంబులు గానకు రాఘవుండు పోఁ
గా నిపు డింత పుట్టెఁ గడగం డ్లనువార్తలు మిన్ను ముట్టె బి
ట్టై నగ రెల్ల గొల్లు మన నాగత మయ్యెఁ బ్రభాత మంతటన్. 85

క. భరతాగమపర్యంతము, ధరణీపాలకుని మేనుఁ దైలద్రోణిం
దొరయింపఁ దత్ప్రిధానుల, నరుంధతీప్రాణబంధుఁ డాజ్ఞాపించెన్. 86

గీ. అర్హమాయెఁగృతాధ్వరుం డైనయతని, దేహము తిలోత్తమోదితస్నేహమునకు
నర్హముగదాకృతాధ్వరుం డైనయతని, దేహము తిలోత్త మోదితస్నేహమునకు.

— * భరతుఁ డయోధ్యకు వచ్చుట * —

వ. అంతట ననుత్తసంక్లిరథవిరామవార్తానీతభరతు లగుటకు వసిష్ఠుచే ననుజ్ఞాతు లైన దూత లతిపవనజవనయువనహాయసంచోదితసరణులై తురగపతినగరి కరిగి దుస్వప్న దూయమానుం డైన కైకయీసూనునకు గురునిదేశంబు విన్నవింప నాతని మాతామహుండును యుధాజిత్తుండు ననుపం గతిపయదినంబుల నపశకునసంపాతసాతంక చేతస్కుండగుచు దుర్దినంబుకరణి నస్ఫురద్దివంబై వీరభటజనంబుగతి నసీతాసహాయఖేలనం బై నిదాఘసమయసరసిజాకరంబువై ఖరి ననూర్మికళాపాన్వితం బైనసాకేతంబు సొచ్చి, యచ్చోటు యథాపురప్రచారచారుపౌరంబు గామికి విచారంబు దోఁప భూపతియగారంబు దరిసి యరసి యం దెవ్వరిం గానక మగిడి జనని నగరి కరిగి మాత కానతుం డై తండ్రిసేమం బడుగఁ బరుషతరవాపదూక యగుకైక యి ట్లనియె.

చ. అడవికిఁ దండ్రిపంపువడి యాలును దమ్ముఁడుఁ దానుఁ జెంచుకై
వడిఁ జనినాఁడు రాముఁడు భవద్గురుఁ డంతటఁ గాలధర్మముం

దడయిడలేమి గైకొనిమెఁ దద్గతి నింకఁ గళంకు లేక నీ
కుడిభుజపీఠికి న్మరలు గొన్నది పంటవలంతి నావుడున్. 89

క. కేకయజోక్తి మయూరీ, కేక యహిం గలఁచువీఁకఁ గిలితపరితా
పాకృతిఁ బూన్ప వివేకా, పాకృతి ధృతిసడలి యడలి భరతుఁడు పలికెన్. 90

శా. కైకా యెంతటి పాతకంబు ఫలమో కా తల్లి వై తీ వికన్
మాకు న్నల్గుర కన్నదమ్ములకు నంబాత్వంబు నీయం దనం
గీకార్యం బగు నింతనుండియును దుష్కీర్తి ప్రసూభావమే
చేకో నర్హమౌ నీకుఁ బట్టి ననుకో సిగ్గయ్యెడి న్మామదిన్. 91

క. మాతృవ్యాజము గాంచిన, పాతకధోరణి వటంచు భరితక్రోధుం
డై తన్ముఖమున కభిముఖ, మై తగుదృష్టి న్మరల్చి యనుజున కనియెన్. 92

గీ. మనుకులంబుఁ గాల్తు నని కంకణము గట్టు, కొన్నయట్టి చెట్ల కొఱవి యుండ
సవనభరణకేళి భువనపావనకేలి, నాశ్రయాశసంజ్ఞ యగడుగాదె. 93

శా. వాల్యన్నోచి కొమాళ్లు దున్నఁగఁ దదీయక్రాంతి యెంతో మన
శ్శల్యం బై కనిపింప లంపటపడె న్నంతానబాహుళ్యమాం
గల్యం బొందియు వేల్పుటా వనఁగ నింకం బుత్రశోకంబు కౌ
సల్యాదేవికి నేకపుత్త్రకుఁ దరించన్ శక్యమా యక్కటా! 94

చ. తనవిధిచే నరేంద్రుఁ డవితర్కితమంత్రగతి న్వసింప నా
తని యసువాయువు ల్వరముధారసనాద్వయిఁ గ్రోలి యున్నదీ
ఘనకుటిలస్వభావ యిది గట్టును జెట్టును బుట్ట మిట్ట యుం
డిన వని కింతె గాని తగునే జను లుండెడు రాజధానికిన్. 95

గీ. ఆత్మవృత్తి కర్హ మగుదైత్యకులము లె, న్నేని యుండఁ గేకయేశునింట
లెస్సపుట్టె నీపె లేమావిగుమినట్ట, నడుమ విసపుఁదీఁగె పొడమినట్లు. 96

క. జననీతి కెడయు మామక, జననీతిగ్మత నయంబు సౌజన్యంబుం
జననోఁచితి నిఁక మనుకుల, జననోచితకీర్తి యేల సంధిలు ననుచున్. 97

చ. అనుజునితోడఁ గైకనగ రాతఁడు వెల్వడి కోసలేంద్రనం
దనఁ గని మ్రొక్కి పెక్కుశపథంబుల రామవనాప్తి కాత్మఁ దా
ననుమతి చెందమిం దెలిపి యంత గురూదితసూత్రపద్ధతిన్
జనకున కాహితాగ్న్యుచితసంస్క్రియల న్నఱవేర్చె నన్నిటన్. 98

క. జనకుం డీగతిఁ బిత్రువన, మునకుం జన భ్రాతృవనసముత్సుకుఁ డగు న
య్యనఘుఁడు జననీముఖహిత, జనములతో మరలి వచ్చె సదనంబునకున్. 99

వ. వచ్చి యంత యథావిధిసమాహితౌర్ధ్వదైహిక చతుర్దశదినుం డగుచు నాఘనుం డున్నయెడ జలజహిత కులహితాచరణ బాగాహాకం బగుపౌరలోకంబు సప్రధానానీకంబై మకుటభరణార్హంబు తన్నుఁ బ్రార్థింప నప్పార్థివతనూజుం డి ట్లనియె. 100

శా. చాలింపుం డిది యేటిమాట యకటా సౌమిత్రి చారిత్రమే
నాలంబించుట కోపలేక భవదీయాజ్ఞస్తిఁ గోటీరము
న్మౌళిం బూనక యుండునే గొనుదవే యున్నం బగ్గ్యోలాసకా
శాలంభం బిఁక దండకావిపినసాలాంతర్విశాలావనిన్. 101

చ. అని వనయాత్రఁ దెల్పె నతఁ డంతిపురంబున కేగి యచ్చటన్
జననయనాసుఖప్రరత సత్పథపాంసులతావహత్వమున్
దనకుటిలత్వముం దలఁచిన న్నుడిగాలిని బోలు మందరం
గని యనుజుండు చంపఁ జనఁగా విడిపించినరాముతల్లికిన్. 102

వ. ఇట్లు తెలిపి యద్దేవి మొదలైన జననీజనంబు వెంబడింప నగరంబు వెల్వడి యనల్పశిల్పికల్పితసమీకృతసమీచీన కానసపథంబు వట్టి ఘోట్టాణవారణ ఘటాపీరభటశతాంగసంఘసంఘాతభూతలోదితపరాగయోగపంకిలనభోవిటం కరింఖద్ఘురీసరీవాహుండును సుమంత్రమంత్రిమణి ఫణితగుణనివహాగుహ సహాయతాని స్తగిత భాగీరథీపురస్సరసరిద్వ్యూహుండును నై మ్ముందట భరద్వాజు నాశ్రమద్వారంబునందుఁ బరివారంబు డించి యాతనిం గతిపయ సమన్వితుం డగుచుఁ బొడగాంచి యావిరించిప్రభావుం డమేయనిజయోగ మాయాబలానీయమాన సంతానకామధేనువై మానికచకోరలోచనా సమాచారితోదాత్త తత్తజ్జనోచిత నిమజ్జనానులేపనాభరణభోజనాది బహువిధోప చార గౌరవతృణీకృతశచీసహచరత్రిదివపదనైపథ్యం బైన యాతిథ్యంబు సలుపం బొలు పెసంగుసేనతో నాఁ డచట నుండి మఱునాఁడు తన్మౌని యనుప ననుపమచిరత్న రత్నషిచిత్రకూటం బగు చిత్రకూటంబు డగ్గఱి యగ్గిరి యుపత్యకావకాశంబునందు సేనానివేశంబునుంచి చెంచుత్రేఁడునుం దానును

చందా సం॥ కు రూ. 3—0—0. విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 4. } రాక్షసనామసంవత్సరము ... మాసములు. { సంచిక. 12.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

ప్రతిమాసమున గడపటివారములో ప్రకటింపబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.

# విషయసూచిక.

# విషయసూచిక.

రాక్షససంవత్సర పరిషత్పత్త్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల

శీర్షికలు, తత్కర్తలు.

(చతుర్థసంపుటము)

# బమ్మెర పోతరాజు.

ఆంధ్రకవికులతిలకుఁడగు బమ్మెర పోతరాజునివాసము కడపమండలమందలి యొంటిమిట్ట యని కొందఱును, గోలకొండదేశములోని యోరుగల్లని మఱికొందఱును గలకాలమునుండి వాదించుచున్నారు. గతానుగతికముగా నొంటిమిట్టవాదము నంగీకరించి యిదివఱకు నేనుం దానికే జేరియుంటిని. కాని 1914 వ సంవత్సరము డిసెంబరు నెలలో నే నోరుగంటికిఁ బోయి యెనిమిదిదినము లచ్చట నుండుట సంభవించఁగా నాకాలమున నేను విని కన్నదానిని బట్టియు, నిటీవల నాకుఁ దెలియవచ్చిన కొన్ని విషయములఁ బట్టియుఁ బోతనామాత్యుఁ డోరుగంటిప్రాంతమువాఁ డనువాదము బలవత్తర మని నాకిపుడు తోఁచుచున్నది. ఈ రెండువాదములకుఁ గలయాధారములు నాకుఁ దెలిసినంతవఱకు వివరించెదను. ఇంతకంటె నధికముగా నెవ్వరికయినఁ దెలిసినచో వారద్దానిఁ బ్రకటింతురుఁ గాక యనియుఁ బండితులు ప్రమాణముల నన్నింటిని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించి సత్యమును దేల్తురనియుఁ బ్రార్థించెద. ఈ వాదమున కాధారము లగు ముఖ్యాంశము లెవ్వి యన :—

(౧) పోతరాజుయొక్కయు, భాగవతములో శిథిలములయినభాగములఁ బూరించిన యితరకవులయొక్కయు నింటిపేళ్లు.

(౨) పోతరాజు గంగాతీరమందు మహేశ్వరధ్యానము సేయుచున్నసమయమున రామభద్రుఁడు ప్రత్యక్షమయి భాగవతముఁ దెనిఁగింపు మని యనుజ్ఞ యిచ్చె ననుట.

(౩) రామభద్రునిచే ననుజ్ఞాతుండై పోతన కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండై కృతి యారంభించె ననుట.

(౪) పోతరాజు భోగినీదండకము రావు సర్వజ్ఞసింగమనేని ప్రేరణముచే రచించె ననుజనశ్రుతి.

(౫) ఇతరము లగుజనశ్రుతులు.

(౬) భాగవతాంధ్రభాషావిశేషములు.

(౧) పోతరాజు నింటిపేరు బమ్మెరవారని యున్నట్లు భాగవతములో రెండుమూఁడుచోట్ల నున్నది. ఇది నిర్వివాదాంశము కదా! ఇది గ్రామనామముగాఁ గనుపట్టుచున్నది. బమ్మెర యనుగ్రామము నోరుగంటికి రమారమి మూఁడామడదూరములో నల్లగొండమండలమందు చేర్యాలతాలూకాలో నున్నది. దీని నచ్చట జనులు సాధారణముగా బొమ్మెర యని పిలుతురు. ఈ పేరు గలగ్రామము మఱియొక్క చెక్కడ నున్నట్లు తెలియరాలేదు. కావున, పోతరాజు నింటిపేరీ బమ్మెరను బట్టియే పుట్టినదని యూహింపవచ్చును. మఱియు, భాగవతము పంచమస్కంధము బొప్పనామాత్యపుత్త్రుఁడగుగంగనార్యుఁడును, షష్ఠస్కంధము నేర్చూరి సింగయయు, నేకాదశద్వాదశస్కంధములు పోతనామాత్యప్రియశిష్యుఁడగు వెలిగందల నారయయుఁ దెనిఁగించిన ట్లచ్చుప్రతులలో నున్నది. గంగనార్యుని యింటిపేరు మనకుఁ దెలియదు. ఏర్చూ రనుగ్రామము గోలకొండదేశములోని నల్లగొండమండలములోను, వెలిగందల యనుగ్రామ మా దేశమందే పూర్వము వెలిగందలజిల్లా యనియు, నిప్పుడు కరీంనగరము జిల్లా యనియు వ్యవహారము గల మండలమందును గలవు. ఈ గ్రామములంబట్టియే సింగయ నారయల యింటిపేళ్లు పుట్టినవని యూహింపఁదగు. బమ్మెర, ఏర్చూరు, వెలిగందలయు నోరుగంటి ప్రాంతదేశములో నుండుటచే నాయింటిపేళ్లు గలవా రాదేశమువారని యూహించుట యసమంజసము కాదు.

కాని, యాయింటిపేళ్లు గలవా రితరదేశములకుఁ బోయి యచ్చట నివసించి యుండఁగూడదా యని యొంటిమిట్టవాదు లాక్షేపింపవచ్చును. ప్రస్తుతము తూర్పుదేశమం దున్న గోలకొండ వేపారుల యొక్కయు, తెలగాణ్యులయొక్కయు నింటిపేళ్లు గలగ్రామము లనేకములు గోలకొండదేశములో నున్నవి. దీనినిబట్టి యాగృహనామములు గలవారు తొలుత గోలకొండదేశమునుండి వచ్చినా రని తెలుచున్నది. ఆప్రకారమే, బమ్మెరవారు, వెలిగందలవారు, ఏర్చూరివారును దమతమగ్రామములనుండి వచ్చి యొంటిమిట్టప్రాంతమందు స్థిరపడి యుండిన నుండవచ్చును. కాని యాయింటిపేళ్లు గలవారు పోతరాజుకాలమున నొంటిమిట్టప్రాంతమున నుండి రనుటకుఁ దగినయాధారములు కనఁబడినఁ గాని యాయాక్షేపమునకు బలము లేదు. అట్టియాధారములు లేనిచో నాయింటిపేళ్లు గలవారు గోలకొండదేశమం దుండి రనియే యూహింపవలసియుండును.

(౨) గ్రంథరచనకు మూలమును జెప్పుచుం బోతరాజు "మదీయపూర్వ జన్మసహస్రసంచిత తపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనా కుతూహలుండ నై యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం గనుంగొని సజ్జనానుమతంబున సకలజనసుభగసముత్తుంగభంగ యగుగంగకుం జని క్రుంకులిడి వెడలి మహనీయమంజులపులినప్రదేశంబున మహేశ్వరధ్యానంబు సేయుచుం గించిదున్మీలితలోచనుండ నై యున్న యెడ" రాజముఖ్యుం డొక్కఁడు ప్రత్యక్షమై "రామభద్రుండ నన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుం దెలుంగు సేయుము. నీకు భవబంధంబులు దెగు నని యానతిచ్చి తిరోహితుం డయ్యె" నని వ్రాసెను. పోతరాజు స్నానము చేసిన "గంగ" యేదియో నిర్ణయింపవలసియున్నది. గంగ యనుపేరు సాధారణముగా భాగీరథికి రూఢమయి యున్నది. కాని, యిచ్చట నీయర్థము సరిపోవునట్లు లేదు. భాగీరథి యోరుగంటి కాకాలములోఁ "గొన్నిదినంబుల" ప్రయాణమునకంటెఁ గడుదూరము. ఒంటిమిట్టకంతకంటెను దూరము. ఒంటిమిట్టనుండి గాని, యోరుగంటినుండి గాని పోతన చంద్రగ్రహణనిమిత్తమున స్నానమునకై యంతదూరము పోయి యుండఁడు. పోయె నన్నచో గంగ యేకశిలానగరమునకుఁ "గొన్నిదినంబుల" ప్రయాణములో నున్న దనుమాట తప్పగును. కావున నీసందర్భమున గంగ యనఁగా భాగీరథి కా దని చెప్పవలసియున్నది. అట్లయినచో నది మఱి యేనది యైయుండును? సుప్రసిద్ధ మయినపుణ్యనది యై యుండవలయును. అనది గోదావరి యని తోఁచుచున్నది. గోదావరి యోరుగంటికిఁ బదియామడదూరమున నున్నది. నాలు గయిదుదినములప్రయాణము. ఈ నదికి గోలకొండదేశమం దంతటను "గంగ" యను సంజ్ఞ రూఢ మయియున్నది. ఇది నిస్సంశయము. ఆదేశమువారు పర్వదినములందు గోదావరీ స్నానమునకుఁ దఱుచుగా వెళ్లుట కలదు. ఒంటిమిట్టకు సమీపములో నిట్టినది లేదు, గాని శ్రీశైలమునొద్దఁ గృష్ణానది యున్నది. ఆప్రదేశమం దానదికి "పాతాళగంగ" యను సంజ్ఞ శాసనములందుఁ గలదు. కాని శ్రీశైలయాత్ర యిప్పుడే కష్టసాధ్యము. పూర్వము కష్టతరముగా నుండియుండవలయును. ఈయాత్రకుఁ బోవువారు శివరాత్రికిఁ గాని, వసంతనవరాత్రములందుఁ గాని పోవుదురు. ఇతరపర్వములయందుఁ బోవునాచారము లేదు. పోయినను శ్రీశైలము మొదటఁ బోయి యక్కడనుండి క్రిందికిఁ దిగి నదిలో స్నానము చేసి తిరిగి యాలయమునొద్దకుఁ బోవలయును. శివపూజాధురంధరుం

డగు పోతన యట్లు పోయినాఁ డనినను, శ్రీశైలపతి యగు మల్లికార్జునుఁ జేర్కొనక యుండఁడు. ఆప్రకారమే గంగాస్నానమునకై కాశికిఁ గాని, ప్రయాగకుఁ గాని పోయి యుండినచో నా పట్టణములను నచటనుండు దేవతలను జేర్కొనక యుండఁడు. ఈ హేతువును బట్టి రామభద్రుఁడు పోతనకుఁ గనఁబడినది గోదావరీతీరమం దైయుండును, గాని భాగీరథీతీరమందుఁ గాదు; కృష్ణాతీరమందును గా దని తెలుచున్నది. ఈనిర్ణయ మోరుగంటివాదమును నిస్సంశయముగా బలపఱచుచున్నది.

ఒంటిమిట్టలోఁ గోదండరామస్వామియాలయ మున్న దనియు, నీకోదండరామస్వామియే భాగవతకృతిపతి యగు రామభద్రుఁ డనియు, నిందుచేతఁ బోతన యొంటిమిట్టవాఁ డని తేలుచున్న దనియు నొంటిమిట్టవాదులు వాదించుచున్నారు. కాని, యీవాద మంత సరసముగా లేదు. కవి తనకు ధ్యానములోఁ దోఁచినవాఁడు రామభద్రుఁ డని చెప్పెను, గాని యేకశిలానగరమందుండు దేవుఁ డని చెప్పియుండలేదు. ఆశ్వాసాద్యంతపద్యములఁ బట్టి చూచినను గృతిపతి విష్ణ్వవతారమై యిక్ష్వాకువంశమందు జనించిన మహాపురుషుఁ డనియే యేర్పడుచున్నది గాని యొంటిమిట్టలో వెలసిన కోదండరామస్వామి యనుట కాధారములు కనఁబడుట లేదు. ఒంటిమిట్టలోఁ గోదండరామస్వామియాలయ మున్నంత మాత్రాన పోతరాజక్కడివాఁ డనుట యుక్తము గాదు.

(3) రామభద్రునిచే ననుజ్ఞాతుం డైనపిదప "మరలి కొన్ని దినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి యందు గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండ నై" కృతికిఁ బూనితి నని పోతరాజు వ్రాసెను. కృతినిర్మాణ మేకశిలానగరమం దయిన దనుమాట యీవాదమున కంతకు మూలాధారముగా నున్నది. ఏకశిలానగర మన నేదియో నిర్ణయింపవలసియున్నది. ఇది గ్రామనామముయొక్క సంస్కృతరూపము గాని మూలనామము గాదు. "ఓరుగల్లు" "ఒంటిమిట్ట" యనునివి రెండును గూడ దీనికి దేశ్యరూపములుగ చెప్పవచ్చును, గాని కొన్ని కారణములచే నేకశిలానగరశబ్దవాచ్య మగుపట్టణము ఓరుగల్లే యని నిర్ణయింపవలసి యున్నది. ఆకారణము లెవ్వి యనిన:—ఒంటిమిట్ట యనఁగా నొంటిగా నుండుగుట్ట (చిన్నకొండ) యని యర్థము. ఓరుగల్లు, ఒరుగల్లుశబ్దవికారము. ఒరుగ ల్లనఁగా, గన్నడమున నొక్కరాయి యని యర్థము. కాకతీయరాజ్యాభివృద్ధికిఁ బూర్వ మీదేశము పశ్చిమచాళుక్యులపాలనములోఁ జేరియుండి కన్నడభాష యచ్చటఁ

ప్రచురముగా నుండెను. ఆకాలమందుఁ బుట్టిన కన్నడపద్యశాసన మొక్కటి యిప్పటికిని హనుమకొండకోటలోని పద్మావతియాలయమున కెదుటఁ జూడనగు. ఆకాలమందీపట్టణము పుట్టి యుండుటచే దాని కీకన్నడనామము గలిగెను. ఓరుగల్లు, ఏకశిల యనునీరెండుశబ్దముల కర్థము నందించుకైన భేదములేదు. ఏకశిలకును, ఒంటిమిట్టకును భేద మధికముగా నున్నది. ఇంతియకాక, యేకశిల యనఁగా నఖండశిల యని యర్థము. ఒరుగల్లునకు నిదియే యర్థము. ఓరుగంటికోట నట్టనడుమ బాస్తురాతివలె నఖండశిలారూప మగునొకచిన్నకొండ యున్నది. దానిపైఁ బాహుదేవాలయ మొక్కటి గలదు. ఈరాతినిబట్టియే పట్టణమున కాపేరు వచ్చియుండు నని చూచినవారికిఁ దోఁపక మానదు.

ఇంతియగాక, పోతనకుఁ బూర్వము పుట్టినప్రతాపరుద్రీయాదిగ్రంథము లందును, కొన్నిశాసనములందును, ఏకశిలానగర మనుసంజ్ఞ యోరుగంటికి రూఢమై యున్నది. ఒంటిమిట్టకాసంజ్ఞ పూర్వ మున్నట్లు తోఁపదు. మఱియు, నగరశబ్దము పెద్దపట్టణమునకుఁ జెల్లును గాని యొంటిమిట్టవంటి చిన్నయూరికి వర్తింపదు. ఈ కారణములఁ బట్టి యేకశిలానగర మన నోరుగల్లనియే తోఁచుచున్నది.

(౮) భోగినీదండకము పోతరాజు రావు సర్వజ్ఞసింగమనేని యంపుడుకత్తె నుద్దేశించి రచించె నని లోకములో వాడుక కలదు. ఈదండకము పోతరాజుకృత మనుమాట సత్యమయ్యెనేని యది కూడ నోరుగల్లువాదమునకే యుపకరించు నని నాయభిప్రాయము. "సురభివారివంశచరిత్ర" మనుగ్రంథమందును "వెలుగోటివారివంశచరిత్ర" మనుగ్రంథమందును, బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రులుగా రీరావువారిచరిత్రము విపులముగాఁ జర్చించి భోగినీదండకమునకు సంబంధించిన సర్వజ్ఞసింగభూపతి రావువంశములోఁ బదియవతరము వారిలో జ్యేష్ఠుఁడనియు, నాతఁడు 1458 వ క్రీస్తవాబ్దప్రాంతమునఁ గర్ణాట ప్రౌఢదేవరాయల కాలములో జీవించియుండె ననియు నిర్ణయించిరి.

ఈకాలమందు రావువారు గోలకొండదేశములో నల్లగొండ, రాచకొండ, దేవరకొండ, ఓరుగల్లు, ఈ ప్రాంతములందే రాజ్యము చేయుచుండినట్లు కనఁబడుచున్నది. ఈ విషయమున సదాశివశాస్త్రులుగారే యిట్లు వ్రాయుచున్నారు. 7 వ తరమువారిని గూర్చి వ్రాయుచు "వీరిలోఁ బెదసింగమనాయఁడు, ధర్మానాయఁడు, తమప్రధానరాజధాని యగురాచకొండలో నివసించి భువనగిరి,

యోరుగల్లు, నల్లగొండ, ఆమనగల్లు, రేచెర్ల మొదలుగాఁ దమదండ్రిగారి దినంబులలో నుండిన వింధ్య శ్రీశైలమధ్యమండలము నేలుచుండిన వారు" అని వ్రాసినారు. 8 వ తరమును గుఱించి వ్రాయుచు "కాఁబట్టి యీయెనిమిదవ తరములోవా రంద ఱించుమించుగా నక్కాలములో నున్నవారై యానెగొందిరాజుల వశంవదులై దేవరకొండ, నల్లగొండ, యేకశిలానగరము మొదలుగాఁ గలతమ పితృపితామహాదిపరిపాలితం బగుదేశమునంతయుఁ బాలించినవా" రని వ్రాసినారు. 9 వ తరము వారిని గూర్చి యిట్లు వ్రాసిరి. "ఈ లింగమనాయఁడు, ధర్మానాయఁడు, అనపోతానాయఁడు, తమ పిత్రాదులచే నేలఁబడిన యావద్దేశము నేలుచుండుటయే కాక పిత్రార్జితము లగురాజమహేంద్ర ప్రాంతదేశముల నేలినారు." ఈ చివరముక్కకుఁ బ్రమాణము లేమియుఁ జూపక "ఈవిషయము వారివారిచరితములు చదివిన విశదమగు" నని విరమించిరి. 10 వ తరమువాఁడైన సర్వజ్ఞసింగమనాయనిగూర్చి వ్రాయుచు "మరియు నాతండు బమ్మెర పోతనామాత్యునిచే భోగినీదండకము కృతి నొందుటనుబట్టి బమ్మెర పోతనామాత్య శ్రీనాథాది కవులకాలములోఁ దమపిత్రార్జిత మగురాజమహేంద్రవర రాజధానిలో వసించి రాజ్యము చేయుచుండినవాఁడు" అని వ్రాసినారు. సర్వజ్ఞసింగమనాయఁడు రాజమహేంద్రవరమున నివసించె నని చెప్పుట కాతఁడు "బమ్మెర పోతనామాత్యునిచే భోగినీదండకము కృతినొందుట" తప్ప వేఱే యాధారము లేదు. పోతరా జొంటిమిట్టనివాసి యనుకొని సదాశివశాస్త్రులవా రిట్లు వ్రాసినారు. ఇతరాధారరహిత మగునీవ్రాఁత పోతరా జొంటిమిట్టనివాసి యనుట కాధారము కానేరదు. 11, 12 వ తరములవారలు కూడ నోరుగల్లుప్రాంతమున రాజ్యము చేసినట్లు సదాశివశాస్త్రులుగారి గ్రంథములవలననే కనుపట్టుచున్నది. భోగినీదండకము పోతరాజుకృతియే యయి, కృతిపతి యోరుగంటిప్రాంతమువాఁడై యుండినచోఁ బోతరాజుకూడ నాప్రాంతమువాఁడే యయియుండు నని యూహించుట యసమంజసము కాదు. పోతరా జొంటిమిట్టవాఁ డయినను, శ్రీనాథునివలెనే యోరుగంటికిఁ బోయి సర్వజ్ఞసింగమనేనిఁ జూచి యుండఁగూడదా యని యొంటిమిట్టవాదు లనవచ్చును. అదియు సమంజసమే. కాని, శ్రీనాథునివలెఁ బోతరాజు బహుదేశద్రష్ట యని కాని, యనేకరాజుల నాశ్రయించి నట్లు గాని ప్రమాణములు గానరావు. జనశ్రుతియు లేదు. తగినయాధారములు లేనప్పుడు కృతికర్తయుఁ గృతిపతియు నేకదేశస్థులే యని యూహించుట యుక్తము.

(౫) ఒంటిమిట్టలో నొకానొకపొలమునకు బమ్మెర పోతరాజుగారి పొల మనువాడుక గల దనియు, కోదండరామస్వామి యాలయములో నొకచోటు చూపి యచ్చటనే కూర్చుండి పోతరాజు భాగవతమును వ్రాసె నని యాగ్రామ స్థులు చెప్పుదు రనియు నేను వినియున్నాఁడను. పోతరాజు బమ్మెర నివాసి యని బమ్మెరయందును సమీపమందున్న గ్రామములందును వాడుక కలదు. ఈబమ్మెర గ్రామము నెల్లుట్లవారను గోలకొండవేపారులకు మొఖాసాగాఁ జెల్లుచుండెడిది. ఈ నెల్లుట్లవారిది కౌండిన్యసగోత్రము, ఆపస్తంబసూత్రము. ఈవంశములోఁ జిట్ట చివరవాఁడు నెల్లుట్ల నరసింహారావుగారు. ఆయన గత వికారిసంవత్సరమందు వృద్ధదశలో గతించెను. ప్రస్తుత మాయన దౌహిత్రుఁ డగు వేంకటపాపయ్యగా రాగ్రామమున కధికారిగా నున్నారు. నరసింహారావుగారు పోతరాజు తమవంశ మునకు మూలపురుషుఁడని చెప్పుచుండినట్లును, ఆమాటయే యాప్రాంతమందలి జనులు విశ్వసించుచున్నట్లును దెలియుచున్నది. ఇంతియకాక, బమ్మెరలోఁ బోతరా జనునొక శిలావిగ్రహ మున్న దఁట. పోతనామాత్యునకుఁ బ్రతిబింబముగా నది చెక్కఁబడిన దని యాగ్రామమువా రందురు. ఈ దేవతనుబట్టియే కవి కానా మము కలిగిన దనుట యెక్కువ యుక్తముగా నుండును. ఎట్లయిన నేమి, కవికిని శిలావిగ్రహమునకును సంబంధము సిద్ధము. బమ్మెరప్రాంతమందలి జనశ్రుతులను దెలుపుపత్రములు కొన్ని నాయొద్ద నున్నవి. అవి యాంధ్రసాహిత్యపరిషత్తునకై గ్రంథముల సంపాదించుటకు నియమింపఁబడిన దూపాటి తిరుమల వేంకటరమణా చార్యులుగారు సంపాదించినారు. వానికి సరియయినప్రతుల నీక్రిందఁ బొందుపఱ చుచున్నాఁడను. మాతృకలు పరిషత్కార్యస్థానమందుఁ గలవు.

(౬) భాగవతమందు ద్రొబ్బు, నూకు, ననుశబ్దములు "త్రోయు" నను నర్థమందుఁ బ్రయోగింపఁబడినవి. ఈశబ్దముల కీయర్థ మొంటిమిట్టప్రాంతము నందు వలెనే యోరుగంటిప్రాంతమునందును గలదు. వ్యాకరణకార్యవిశేషములు కూడ నచ్చటచ్చటఁ గొన్ని భాగవతమునందుఁ గలవు. కాని యవి దేశ్యములు కాకపోవుటచే వానింబట్టి కవి యీదేశమువాఁ డని నిర్ణయించుట కవకాశము లేదు.

నాకుఁ దెలిసినంతవఱకు నుభయవాదముల బలాబలములు వివరించినాఁ డను. నేఁ జెప్పినహేతువుల నొక్కటొక్కటిగా విడఁదీసి పరిశీలించినచోఁ గొన్ని యిటు, కొన్ని యటు బ్రొగ్గవచ్చును. కాని యాధారముల నన్నిటి సమష్టిగా

నిష్పక్షపాతబుద్ధితో విమర్శించినగాని సలు నొగుగింటినా కే విలుచు నని నాయభిప్రాయము.

జ. గోపయ్య.

# అనుబంధములు.

(బమ్మెరకు 3 మైళ్లదూరమందున్న గూడూరులో నివసించు పాలడుగు లక్ష్మీరావుగారు వ్రాయించినవి.)

బమ్మెర పోతరాజుగారు బొమ్మెరలో ప్రస్తుత మున్న నెల్లుట్లవారి వంశీకుడు. ఆయనకు బింబముగా పోతరాజు అనేఒకరాయిని ఒకదానిని ఊరిబయట హనుమంతుని దేవళముదగ్గిర వేసియున్నారు. ఆరాయిని అంతా పోతరాజుగారు అని అంటూవుంటారు. బొమ్మెరలో దొరవారిగు నెల్లుట్ల నరసింహారావుగారు జీవించి వున్నప్పుడు పోతరాజును గురించి యెన్నెన్నో కథలు చెప్పుదు ఆయన తమవంశమునకు మూలపురుషు డని చెప్పగా నేను అనేకమార్లు వినివున్నాను. పోతరాజుగారు బొమ్మెరనివాసి యే యని చుట్టుపట్ల పాలెములు పట్టణములలో గూడా ప్రకాస్తి కలదు.

పోతరాజుగారు పూర్వకాలములో జీవించియుండగా బొమ్మెరలో చెరువు కింద సెలకలు దున్నుచూ వుండంగా శ్రీనాథు డనేటి ఒకకవీశ్వరుడు మేనా యెక్కి చెరువుకట్టమీదనుంచి పోతూ పోతరాజు తనకు బావమరది కాబట్టి పరిహాసముగా ముందు బొజుబోయీలను తోలగమన్నా డట. అప్పుడు శ్రీనాథుని పల్లకీ మునుపటివలెనే ముందువాం ఘున్నప్పటివలెనే పోతూ వుందట. ఆవఖ్తులో పోతరాజు తననాగలిదున్నె ఒకదున్నను విడిచిపెట్టినాడట. యెప్పటివలె నాగలి పోయినదట. తరువాత శ్రీనాథుడు రెండవవైపు బోయీలను తోలగించగా మునుపటిరీతుగా పోయిందట. పోతరాజు తరువాత రెండోదున్నపోతును తీయగా యెప్పటివలెనే నాగలి దున్నుకొంటూ పోయిం దని చెప్పుతూ పోతరాజు దున్నిన చేలున్ను శ్రీనాథుడు పోయిన చెరువుకట్ట చూపుచు నరసింహారావుగారు చెప్పేవారు. వారు వికారి సం॥ గతించిరి. పోతరాజు కాలములో ఆయనవంశీకులు శైవులుగా వుండేవారు. రానురాను వైష్ణవము పుచ్చుకొని గోలకొండ వ్యాపారు లనబడుచున్నారు.

పాలడ్గు లక్ష్మీరావు మవుజే గుడురు అని యున్నది.

(పత్రము వ్రాంత వేంకటరమణాచార్యులుగారిది.)

(౨)

(బమ్మెర కామడదూరములోనున్న వేల్పుకొండయందు నివసించు ఎల్లంభట్ల రామకృష్ణశాస్త్రులుగారు వ్రాసినది.)

గోదావరి అనేది మంథెన్నవద్దున వున్నది. దీనికి సుమారు ౧౨ ఆమడ వున్నది. బొమ్మెరనుంచి గోదావరికి పోవటానికి వరంగ్గల్ మీదుగా బాటా వున్నది. పూర్వంనుంచి యిదేబాటా. వరంగ్గల్ బొమ్మెరకు సుమారు ౧౮ పద్నాల్గు కోసులు వున్నది. వరంగ్గల్‌లును యిక్కడివారు ఏకశిలానగరం అని అనుకోవటం కలదు. గోదావరిని యిక్కడ వాడుక గంగ్గా అంటారు. పర్వదినముల్లో వెళ్లి స్నానములుచేశి రావటం కద్దు. పోతరాజు బొమ్మెరగ్రామంకు బయిట సమీపంలో హనుమానగుడిదెగ్గిర వున్నది. పోతరాజుగారిగద్ది అని నాల్గుస్తంభములు పొడుగు సుమారు కంచె (నిలువు) అంద్దాజా రవుతులి వున్నవి. వాటిని పోతరాజుగారు వుండ్డేగద్దె అని పెద్దలు చెప్పగా వినివుంన్నాము. దీనికి దసరారోజు శమీవృక్షము దర్శనమునకు పొయ్యే అపుడు అదేమార్గం పోయి అక్షతలు మొదలయినవి బ్రాంహ్మణులు మొదలగువారు వెయ్యటం కద్దు. యిక్కడ పోతరాజు అనేది గ్రామదేవతకాదు. గ్రామదేవత గ్రామము మధ్యన వుంట్టుంది. దీనికి బొడ్డురాయి అని అంటారు. దీనికి బ్రాంహ్మణులు పూజ చెయ్యరు. వెనుకటినుంచి పోతరాజుకు ప్రతిబింబం అని అనుకోవటం వాడుక. ఇటీవల పుట్టింది కాదు.

“ఏకశిలానగరంబ్బునకు దక్షిణభాగంబ్బున కనతిదూరంబ్బున బొమ్మెర అనేగ్రామంబ్బున పోతరాజుగారు” అని యేదో వక గ్రంథం చూచినట్టు జ్ఞాపకం కలదు. పోతరాజుగారిది యిదేబొమ్మెరని చుట్టుపట్టు వారంత్త అనటం కద్దు. పోతరాజుగారి కాలంలో బొమ్మెరవారనింన్నీ కృష్ణదేవరాయలవారి వఖ్తులో నారాయణప్ప మొదలయ్ను వారు దివానిగిరి చేశినంద్దువల్ల రాయభండ్డారువారనింన్నీ తర్వాత ఆలంగ్గీరి బాషావఖ్తులో ఖిల్లతుపొంద్ది నాల్గుపర్గణాలకు దేశముఖు దేశపాండ్యాగిరి సంపాదించ్చిరి. వారివంశ్శ్యులు రామభక్తులు. పూర్వం శివపూజాధురంధురులు కాబట్టి యిక్కడ వీరాచలం అనేగ్రామంలో శ్రీరామక్షేత్రం వున్నది. యిపుడు ఆక్షేత్రంకు జీడికల్లు అని అంట్టారు. ఆగ్రామం వారికి సర్కారువారు యిచ్చినవతనులు గలనిడిగొండ పర్గణాలోదే కాబట్టి నిడిగొండ్డ అనేగ్రామంకు సమీపంగ్గ కోశెడుదూరంలో వుండ్డే నెల్లుట్ల గ్రామంలో వున్నంద్దువల్ల నెల్లుట్ల

వారు అని యిప్పటికి అంట్టూ వుంన్నారు. ఆవతనులు యిప్పటికి జర్గుతూవుండే రుసుంకు అదె బొమ్మెర అనే గ్రామం పన్ను మఖ్తాగా యింకా- కొన్నిగ్రామంలు వారివంశ్యస్తులకు కొంద్దరికి యిచ్చివుంన్నారు. జర్గుతూవుంన్నవి. కొంద్దరు గ్రామంలు యిష్టంలేక రుసుంలు తీసుకుంట్టూ వుంన్నారు. సర్కా-రులో దాఖలా వుంన్నది. అప్పటినుంచ్చి యింతవరకు కండిన్య (కౌండిన్య) సగోత్రం ఆపస్తంబ సూత్రం జర్గుతూవుంన్నది. పోతరాజుగారినివాసం యిక్క-డనే నని నిశ్చయం అంద్దరు అంట్టారు. పోతరాజుగారు భాగవతం చెప్పినట్టు వుంన్నది. యితరగ్రంథములు యేమి చెప్పినట్టు లేదు. యీబొమ్మెర పోతరాజుగారిది నేలకొండ్లపల్లిలో గుడికట్టు వుంన్నట్టు తెలుస్తుంది. పోతరాజు తమవంశ్యస్తులు అని యీధొరవారు అయ్ని నెల్లుట్ల నర్సింహారావుగారు యీవంశీకులు చెప్పగా వినివుంన్నాను. నర్సింహారావుగారు వికారి సం॥ పుష్య శు ౫ రోజున గతించిరి. వీరియింటిలో భాగవతం లేదు. వకదశమస్కం-ధం మట్టుకు జీర్ణం అయ్నది వుంన్నది. మేము ఆది నుంచ్చి రాజాశ్రమం వీరిది కాబట్టి వీరిసంగ్గతి బాగా తెలిశి వుంన్నది పయిసంగతులు యధార్థం కల్పితము కావు.

యల్లంభట్ల రామకృష్ణయ్యవ్రాలు.
వేల్పుగొండ గ్రామం.

రాక్షసం॥ చయిత్ర శు ౫ లు (అని యున్నది.)

పైదాని కనుబంధము.

భాగవతంలో నూకుట దొబ్బుట అని ప్రయోగంలు కలవు. యీమాటకు నెట్టుట త్రోయుట అని అర్థం కలదు. 20—3—15.

య. రా. (అనియున్నది.)

(3)

2 వ పత్రమున కనుబంధము.

పై సంగతులు మేముకూడా విని వున్నాము.

నెల్లుట్ల వేంకటపాపయ్య ధా॥
మఖ్తాదారు మవుజే బొమ్మెరా
(అనియున్నది.)

(ఈనెల్లుట్ల వేంకటపాపయ్య అనువారు ప్రస్తుతగ్రామ మగుబమ్మెరకు అధికారులు. వీరు దౌహిత్రసంప్రదాయమున నీయాస్తికి కామందులైరి. వీరితాతగారు వీరిబాల్యమందు గతించినందున పోతరాజును గూర్చి విశేషములు కథలు తెలియవుగాని పోతరాజు తప్పక తమవంశీకుఁ డని చెప్పుచున్నారు. దూ. తి. వేంకటరమణాచార్యులు. (అనియున్నది.)

(౪)

గోదావరిని గంగ్గా అని యిక్కడివారు అంటారు. పోతరాజుగారు యీ బొమ్మెర నెల్లుట్లవారివంశమునకు మూలపురుషు డని యీవంశీకులు చెప్పగా చాలకాలమునుంచి వింట్టూ వున్నాము.

గోమఠం బుచ్చయ్యగారు బొమ్మెర నివాసం. రాక్షస సం॥ చైత్ర శు ౬ ఆదిత్యవారం (అని యున్నది.)

(౫)

గోదావరిని గంగ యని వాడుక మిక్కిలి యిక్కడ వాడుక కలదు. ఏకశిలానగర మనునది వరంగల్. ప్రతాపరుద్రియగ్రంథమందు నాటకప్రకరణమందు వైతాళికవాక్యమందు "రాజ న్నేకశిలానగరాధీశ" అని సంబోధనవాక్యము చేత ప్రతాపరుద్రుడేలిన వరంగల్ అని చెప్పవల్సినది. పోతరాజు విగ్రహము పోతరాజు ప్రతిబింబమే యని వీరివంశస్తులు చెప్పగా వినియున్నాను.

శ్రీమాన్ విద్వాన్ అమరవాది నారాయణాచార్యులు, వరంగల్ 21-3-15.
(అనియున్నది.)

(౬)

"పాలకుర్తినిలయా। సోమయలింగ్గ। పాదాములకుశరణు। పురవ్పూగ బొమ్మెర పోతరాజుకు। మీరుకోరినవరములు కృపచేశిసారట, పాలకుర్తినిలయా &c." అని అనేకపదములు ప్రతివారు చదువుటం వల్ల లక్షణం లేనట్టు వున్నవి. యీపదం వేల్పుగొండ నివాశియగు చవుదరి నర్సయ్య అనేవారు చదువంగ్గ విని వ్రాశితిని. పాలకుర్తి అనేగ్రామం యీబొమ్మెరకు వకమయిలుకు లోవుగా వున్నది. అక్కడ సోమలింగ్గం అనేరుద్రుడు నరశింహ్వాస్వామిన్ని హరహరిక్షేత్రం అనాది నుంచ్చి వుత్సవం జర్గుతూ (వున్నవి) పూర్వ్వం పాలకూరి అనిపేరు. యిప్పుడు పాలకుర్తి అని అంట్టారు.

యీదేశంలో పోలికను సూచించ్చుమాటకు బోలె అను భాగవతకారు డగు పోతరాజు గారినాడు "పోతరాజు బోలెలు" అని పరిహాసంగ్గా అంట్టారు.

య. రామకృష్ణశాస్త్రి వ్రాలు (అని యున్నది.)

(ఈ య. రామకృష్ణశాస్త్రిగారును, రెండవపత్త్రము వ్రాసిన యెల్లంభట్ల రామకృష్ణయ్యగారు నొక్కఁడే. ఈరెండు కాగితములు కూడ నాయన స్వహస్తలిఖితములే. పాల్కురికి సోమనాధకవి పైనఁ జెప్పఁబడిన పాలకుర్తి నివాసియే. జ. రా.)

---

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః.

# విశ్వరూపస్తవము.

---

శ్రీకృష్ణ ! విశ్వరూపం । బాకొలువునఁ దాల్చినప్పు డడుగఁగఁ బుట్టుం
జీకునకుఁ గన్ను లిచ్చితి ; । వా కిడు తత్త్స్తవము సలుప వసురాయనికిన్ ॥

ఉ. మీసము గడ్డముల్ నరసి, మే లనుభూతిని విద్య నేరుపన్
వాసిని గన్నదొడ్డబడిపంతులు, మాయయగారితోడ సా
వాసమునన్ గురంగపురి వర్తిలు చేనవయేఁట నక్షరా
భ్యాసముఁ జేసెఁ గీర్తికులుఁ డన్నపరాజు ; దలంతుఁ దొల్గురున్. ౨

ఉ. ప్రేమను నాంధ్రపండితకవిన్ ననుఁ జేయఁగ, నాంధ్రశబ్దచిం
తామణి షష్ఠహాయనమునన్ జదివించి, ఫలంబుఁ జూడకే
యామరలోక మొందితిరి ; హాపిత ! సూరపరాజమంత్రిసు
త్రామ ! హరిస్తవం బిది, సుతగ్రథితం బవధారు సద్గురూ. 3

ఉ. పుట్టుక దృష్టి నష్ట మయి పుట్టినయంబికపట్టి, తన్నుఁ జే
పట్టి యతర్కితంబుగ సభం గను లిచ్చినవిశ్వరూపునిన్
బట్టఁగరానిహర్షభయభక్తులు నద్భుత మొక్కపెట్ట లోఁ
దొట్ట, గగుర్పు గద్గదిక దొట్రు వడం కయి, మ్రొక్కి యి ట్లనున్. ౪

---

శ్రీకరుణాసముద్ర ! యదుసింహా ! వికుంఠపదాధినాథ ! లీ
లాకవితావతార ! కటిలద్విపదంతక ! బంధురక్షణాం

గీకృతదూతభావ! నినుఁ గేవలమానవుఁగాఁ దలంచుమా
ప్రాకృతకృత్యముల్ సయిఁపఁ బ్రార్థన; నిశ్చల! భక్తవత్సలా. ౫

మ. పరపృథ్వీశులు పాదపీఠము భజింపన్ సర్వభూచక్రమున్
బరిపాలించితిఁ; గాంచితిం దనయులన్ బ్రఖ్యాతులన్ నూర్వరన్;
జిరభోగానుభవంబు నొందితిని; లక్ష్మీనాధ! యుష్మత్పదాం
బురుహాలోకము నేఁడు నా కిసుముదంబుం గూర్ప దం దేది యున్. ౬

మ. కను మర్త్యుం డతిఘోరసంతమసపుంగారాగృహాంబందు బం
ధనముం గొన్నిదినాలె, సల్పి యపరాధం బుత్కటం బచ్యుతా!
చనియెం బాల్యము; జాఱె జవ్వనము; హా! సంధిల్లి యుగ్రాకృతిన్
నను గ్రమ్మింగెం జర; యుంటి నట్టిచెఱ నిన్నాళ్ళు; క్లాంతపాపిష్ఠుఁడన్. ౭

చ. చదువున విన్కి నారకము స్వర్గము నన్యజనంబు లిట్టి ది
ట్టిది యనుచుం గ్రహింతురు; ఘటిల్లుఁ బరంబున వారి కం దెదో;
తదుభయరూపముల్ హృదయదర్పణసంగతి ప్రత్ననూతనా
స్మదనుభవాకృతిం బొరసె; మాధవ! రెంటిని గంటి నే నిటన్. ౮

మ. "చెడుగుల్ గూడ, నెఱుంగ నేర్చిన, మహాశ్రేయోనిమిత్తంబు" ల
న్నుడుగుల్ నిక్కవ మంచు నెన్నుదును; నిన్నున్ సర్వభూతాత్మకున్
వెడఁగుల్ గట్టిద మంచు నాకొడుకు లీవేళం గడంగం గదా!
యుడిగెన్ నాచెఱ; గంటిఁ బెన్వెలుఁగు; ధన్యుండన్ జగన్నాయకా. ౯

ఉ. కాళుల వ్రేళులం గలుఁగుకన్నులు నా కిపు డాననంబునన్
గ్రాలుటఁజేసి, క్రొత్తలును బ్రాఁతలుఁ గ్రొత్తవె యై పదార్థముల్
చాలఁగ వింతగొల్పెడు; బలా! బలువింతలవింత! యీజగ
జ్జాలము నీశరీరమున సర్వముఁ దోఁచుట పూరుషోత్తమా. ౧౦

చ. కను లిటు నీప్రసాదమునఁ గల్గినదానికిఁ దోడనంత! మ
జ్జనకునిపోలికం గవనచాతురియున్ లభియించెనేని, త్వ
త్తనుభువనాద్భుతప్రథమదర్శనజాతవినూతనాత్మభా
వనశుభవర్ణనాప్రతిమబంధ మొనర్పనె సత్ప్రబంధమున్. ౧౧

చ. "వెలుతురు చీకువాలులకు వేఁడిమియే గలభేద" మంచు లోఁ
దలఁచెడుపుట్టుగ్రుడ్డికిఁ, బదార్థవిభేదము వర్ణభేద మం

దులపరిమాణభేదముఁ గనుంగొనుశక్తి నిమేషమాత్ర నా
కలవడునట్లు చేసితి; మహాత్మ! భజింతు భవత్పదాబ్జముల్. ౧౨

ఉ. స్థావరభేదముల్, సకలజంగమభేదములున్, వచింపఁ బే
ర్లే వినుచుందు; నైనను గ్రహింపఁగ నేరను సంజ్ఞ దృష్టిచే;
నావిషయంబునన్ ముదుక నయ్యు నిసుంగ; మదాంధ్యమున్ బలెన్
దేవ! తదజ్ఞతన్ దొలఁచి తెల్పవె నీమెయిచిత్రమూర్తులన్. ౧౩

చ. ఇముడుచుశక్తి నీది పరమేశ్వర! యద్భుతగోచరంబు; వి
శ్వము భవదీయదేహమున, స్వల్పపుబీజమునన్ వటావనీ
జము బలె సంతరించి; తెది సాగదు నీ వెద నెంచ? నాదునే
త్రమున నజాండ మెల్లఁ జొరదా? వరదా! మురదావనీరదా. ౧౪

ఉ. పొక్కిలిదమ్మిలోనినలుమోములసామి విరించి యొ? కుడిం,
మిక్కిలికన్ను గల్గి యరమేఁ జెలి, గ్రాల్గొర శంకరుండొ? నీ
యక్కునఁ బొల్చుతల్లి సిరియా? మొగమందలిజోతు లర్కుఁడుం
జుక్కలతేఁడు నొక్కొ? వినుచొ ప్పిటు గాంచితి; నేఁ గృతార్థుఁడన్. ౧౫

ఉ. వాకొన రావు పే; ళ్లెదుటివస్తులఁ గొన్నిటిఁ బోలునట్టివె
న్నో కలలందు నంధతఁ గనుంగొనిన ట్లిపు డే స్మరించెదన్;
జీకుగఁ బుట్టునో వెనుకఁ జెందినమేనుల? వానివాసనల్
గా కవి యేమి? గంటి నినుఁ; గాంచ నిఁకన్ భవదుఃఖ మీశ్వరా. ౧౬

ఉ. స్థానము వీడి యెక్కడనొ జాడయుఁ దోఁపక తా నడంగినన్
మేనును వీను బంధుసరణిన్ నిజకార్యము నిర్వహించుటన్
వానిన యిప్పుడుం దడవు వస్తువివేకముకై భవత్కృపా
దానము నాదుచూపు; పరతంత్రత దానికిఁ బాపు; శ్రీపతీ. ౧౭

చ. మఱచినవిద్యమాదిరిని, మాధవ! సృష్టి చరాచరాత్మకం
బెఱుకకు వచ్చె నీమహిమ, నీక్షణమే యభిధాయుతంబుగన్;
గొఱఁతలు దీర్ప భక్తులకుఁ గొంగుఁబసిండివి నీవ; నీకడన్
మొఱ వృథగా దటన్నమునిముఖ్యులవా క్కది నిక్క మచ్యుతా. ౧౮

ఉ. అంబుజమిత్రమండలము నద్దపుబిల్లను జేయఁగల్గుతే
జంబున వెల్గునిన్ గనెడు చర్మపుఁజక్షువులున్, జిరానుభూ

తిం బడయం దరం బగుత్వదీయపుసృష్టి పరిజ్ఞయున్, నిమే
షంబునఁ బొందఁ, బున్నె మొది సల్పితినో తొలుబామునన్ హరీ. ౧౯

శా. బృందారాజహరాద్యమర్త్యవృతు నిన్, భృగ్వాదులన్, బుత్రులన్,
గాంధారిన్, హితబంధులన్, విదురునిన్, గాంగేయు, ద్రోణాదులన్
గందమ్ముల్ వికసింపఁ గంటి నిటు; భాగ్యం బైహికాముష్మికా
నంద మ్మొక్కటఁ గల్గె నీకరుణఁ జెందన్; నందహృన్నందనా. ౨౦

శా. పాదాంభోజమృణాళనాళముక్రియన్ భాసిల్ల మిన్నేఱు, గ్రీ
వాదీవ్యన్నిజహారవల్లరులఁగేవం గ్రాలఁ దారావళుల్,
రోదోంతఃపరిపూర్ణ నీతను వహో! రోమాంచమున్ గూర్చి, కృ
ష్ణా! దృష్టుల్ మిఱుమిట్లుగొల్పు; నుపసంహారం బిఁకన్ సల్పవే. ౨౧

చ. తలతల మంచు మించు లమితంబులు గా నుదయించి, పై హాళా
ద్వలయము నొందఁ, గేవలత విన్నునఁ దోఁచువినీలమేఘముం
బలె నొకదర్శనీయ మగుభావమునం గనుపట్టి దింతలో
మలఁచి మహోజ్జ్వలాకృతిని; మాయ త్వదీయ మమేయ మచ్యుతా. ౨౨

ఉ. తెల్లని తమ్మిరేకు లెలదేఁటులఱెక్కలుఁ గెంపు నిండుజా
బిల్లిని మల్లెమొగ్గలను వెన్నెల సింగము నంటిబోదెలన్
నల్లని వానమేఘము నొనర్చుటకున్ విధి కాది రుక్మిణీ
వల్లభ ! మాదిరుల్ మది భవన్నయనాదులు గాఁ దలంచెదన్. ౨౩

ఉ. బంగరుఁజేల మంగమున, బన్నసరంబు లురంబునందు ర
త్నాంగదముల్ భుజంబుల, రథాంగము గేలఁ, గిరీటముం బ్రధా
నాంగమునందు, నుంగరము లంగుళులం గలమోహనాంగ! ని
న్నంగన లెంత, యోగులు నిజాత్మలఁ బొంగి కవుంగిలింపరే ! ౨౪

ఉ. “పొత్తులకందువై కడపెఁ బూతనఁ; గానల నాల మేపుచున్
నృత్తము సల్పెఁ గాళియునినెత్తిపయిన్; మధురాపురంబులో
మత్తగజంబు మల్లులను మామను జంపె; ననంగ, నట్టిలో
కోత్తరుఁ జూడ నోఁచ ననుమత్తల మిత్తఱిఁ బాసెఁ గేశవా. ౨౫

మ. తనయప్రేమ, మదంతరాత్మహితబోధంబుల్ చెవిం బెట్టకే
ననయంబుల్ ప్రియసోదరాత్మజులెడన్ వ్యాజంబునం జేసితిన్;
సనయుల్ సాధులు వారు, క్రూరు నను నిచ్చన్ గోముఖవ్యాఘ్రమం
చనుకో; రుల్లము వ్రక్కు; నిక్కలకుఁ బ్రాయశ్చిత్త మున్నే? హరీ. ౨౬

ఉ. భానునిరాకఁ జీఁకటిని బాసినబైలును బోలె, లోనియ
జ్ఞానము నీదుదర్శనమునన్ నిమిషంబున విచ్చుమొగ్గగా
మానస మొప్పె నిర్మలతమై నిపు; డెప్పుడ దిట్ల యుండ నీ
మేనికి జీవయాత్ర విరమింప వరం బిడు ముక్తినాయకా. ౨౭

ఉ. దైవపరుండు గా వలదు; దాసలుపన్ వలె సర్వపౌరుషం;
బావల దాని దిద్దు విధి" యం చెఱిఁగింప, నెఱింగియున్ ఫలం
బీ వవతారమూర్తివి హరీ! సభయం దిటు సంధి కెన్నియో
త్రోవలు ద్రొక్కి; తీజడమతుల్ విన; రేల వృథాశ్రమం బికన్? ౨౮

ఉ. "ఇలతలబర్వు డించుటకు నెత్తితి నీవతార" మందు; ర
క్కలసము దీఱ నొక్కొ కలిగెం బలువేఱిమి వీరి కిట్టు లి
క్కలమునఁ; దప్ప దేది గన, ఘోరవుసంగర; మయ్యెఁబున్ మహా
ప్రలయము; ధర్మ మున్నకడ ప్రాలు జయ; మ్మని నిశ్చయించితిన్. ౨౯

మ. కొలువున్ వీడక మున్న చేయు మరలం గ్రుడ్డిన్ ననుం, గృష్ణ! వే
వెలుఁ గబ్జాకరమట్టు; లీకనుల నే వీక్షింప నీ కన్యమున్;
నలినాక్షా! వెలిఁ జీఁకటయ్యెఁ ద్రుటి; నైనన్ దొంటియ ట్లొందకు
మ్మల మానందము గందుఁ గంచు నిను బ్రహ్మాండాధిపున్ లో వెలిన్. ౩౦

ఉ. అంధుఁడ నాకె కాక యిపు డందఱకుం జగ మంధకారమే;
సింధుసుతామనోహరుఁడ! శ్రీహరి! హస్తిపురంబు వీడితే?
బంధుసుహృత్కుమారపరివారచమూప సహాయభూమిభృ
త్సింధురసైంధవాదులకుఁ జెల్లెనె యొక్కటఁ గాల మక్కటా! ౩౧

క. అని మీఁదటివృత్తాంతము, జనకా! భువి నున్నయపు డసకృదావృత్తుల్
వినిచితిరి మీర యొరులకు, వననిధిగంభీర మైనవాచాధాటిన్. ౩౨

క. భవహరమువిశ్వరూప, స్తవ మిది, వసురాయకవి పితకు స్వస్థునకున్
జెవి నిడియెఁ బొడమఁ బ్రమదా, శ్రువు సూరపరాజమంత్రిసుత్రామునకున్

క. కొఱవడినకనుల నిడినన్, గఱివేల్పును బుట్టుగ్రుడ్డి గని పొగడినయీ
చిఱుఁగబ్బము వసురాయం, డఱువదిరెండేండ్లయీడునందు రచించెన్ ౩౪

క. తారలు దివమున నెటు లటు, తారాసంఖ్యాక మైనస్తవపద్యంబుల్
ధారిణి నివి శోభిల్లును, సూరపరాజాత్మభవవసుకవికృతంబుల్. ౩౫

వడ్డాది సుబ్బారాయుఁడు.

# స్త్రీవాచకము.

[దేని కీవ్యాసము ప్రత్యుత్తరమో యది పత్రికాంతరమందుఁ బ్రకటింపఁబడియున్నను నీచర్చ యీపత్రికయందే ప్రారంభ మగుటచే నీవ్యాస మిందుఁ బ్రకటించుచున్నారము. పత్రికాధిపతి.]

బాలవ్యాకరణవ్యాఖ్య యగు గుప్తార్థప్రకాశిక బ్ర. శ్రీ. కల్లూరి, వెంకట రామశాస్త్రులవారిచే రచింపఁబడిన దనియు, నయ్యది వారిచేతనే సాంతత నొందిన దనియు విని యానందముతో నద్దానిం దిలకించి యపరిమితానందము నందినాఁడను. ఇంతకు ముం దీవ్యాఖ్యానపుఁ బూర్వభాగమునందుఁ బ్రమాదము లని నాకుఁ దోఁచుచున్న వానిలోఁ గొన్నిటిని భాద్రపదమాస పరిషత్పత్రిక యందుఁ బ్రచురించియున్నాను. తక్కినవాని నిచట వ్రాయుటయె యావశ్యక మయినను లోఁగడ నేను వ్రాసిన వానిలో నొక్కవిషయమున కొకరు వేఱొక పత్రికలో సమాధానము వ్రాసియున్నందునను, నయ్యది యాంధ్రవైయాకరణ సమయవిరుద్ధ మయి యున్నందునను, నగ్రాహ్య మని పండితమండలికి విశద పఱచుకొనుటకై పండితపత్రికామతల్లి యగు నీపరిషత్పత్రికయందె ప్రచురింప నెంచితిని.

“స్త్రీలింగమ్ముల ప్రథమైకవచనంబునకు లోపం బగు” (బాల. తత్స. 57 సూ) అనుసూత్రమునందు స్త్రీలింగము లనఁగా స్త్రీవాచకము లని గుప్తార్థ ప్రకాశికాకారులు వ్యాఖ్యానము చేయుట పొరపా టనియు, నిట్టివ్యాఖ్యానముచే దేవతా, విద్యాదిశబ్దములు, స్త్రీలింగము లయ్యు, స్త్రీవాచకములు కామింజేసి దేవత, విద్య, అను మొదలగు ప్రథమైకవచనరూపములు సిద్ధింప వనియు వ్యాఖ్యాత యి ట్లపార్థము చేయకున్న నవి మూలముచే సాధ్యము లగు ననియు నేను వ్రాసియున్నాను.

సంస్కృతవైయాకరణులు పారిభాషిక పుంస్త్వస్త్రీత్వనపుంసకత్వము లనె యంగీకరింతురు గాని, లౌకికపుంస్త్వాదికము నంగీకరింపరు. కావున దేవ తా విద్యాదిశబ్దములు లౌకికపుంస్త్వాది విశిష్టార్థవాచకములె యయినను నవి పారిభాషిక స్త్రీత్వవిశిష్టపదార్థవాచకము లగుటంజేసి స్త్రీత్వవాచకము లయి స్త్రీవాచకము లనంబడును. కావున వానిని స్త్రీలింగములు స్త్రీవాచకములు నని

పర్యాయముగ వ్యవహరింపవచ్చు నని ప్రతిపక్షుల సమాధానము. "స్త్రీవాచకము గాకున్నను స్త్రీలింగ మగుననుమాట, సహోదరుఁడు గాకున్నను సోదరుఁడగు, గ్రామ్యము గాకున్నను నపశబ్ద మగు, ఎడమచేయి గాకున్నను పుచ్చిచేయి యగును' అనుటవంటిదై పరిహాసాస్పద మగుచున్నది" అని యొకరు నిందాగర్భ ప్రసంగములతో నొక పెద్దవ్యాసమును, మహాభాష్య శేఖరపంక్తులను వర్షము గురిపించుచు వ్రాసి దేశమాతలోఁ బ్రచురించియున్నారు. ఆవ్యాసము నిందాపర మగుట పిపులముగా నున్నను నందలిసారాంశము పై నుదాహరించినదియే.

ఆంధ్రవాఙ్మయమువలని లాభనష్టము లాంధ్రుల కందఱకును జెందుచుండును. కావున నందేమయిన విమర్శనీయాంశము లున్నప్పుడు వానిని విమర్శించుట యాంధ్రపండితులకుఁ గర్తవ్యము. విమర్శనస్వరూపమును దాని లాభనష్టములును నెఱిఁగిననాగరకులు విమర్శకులపై నాగ్రహింపరు. నా యీవిమర్శనమునకు సమాధానమును వ్రాయువారు కోపావేశమును జూపని ప్రసంగములతోఁ బ్రసంగింతురు గాక యని సవినయముగను నమస్కారపూర్వకముగను బ్రార్థించుచున్నాను.

సంస్కృత వ్యాకరణములయందుఁ బారిభాషికలింగము గ్రహింపఁబడియుండలే దని నేను వ్రాయలేదు. అట్లు వ్రాయుటయందు నాకుఁ దాత్పర్యమును లేదు. కాని యాంధ్రవైయాకరణులు మాత్రము నియమముగా స్త్రీలింగశబ్దము సంస్కృతవ్యాకరణప్రసిద్ధ పారిభాషిక స్త్రీలింగవిశిష్ట పదార్థవాచకపరముగను స్త్రీవాచకశబ్దము తిర్యగాదీతర స్త్రీవ్యక్తివాచకపరముగను వ్యవహరించుచున్నారు. ప్రసిద్ధు లయినయాంధ్రవైయాకరణు లెవ్వరును స్త్రీవాచకశబ్దమును బారిభాషిక స్త్రీత్వవిశిష్టపదార్థవాచకపరముగ వ్యవహరించుట గాని యట్టి యభిప్రాయముతో నుదాహరించుట గాని యగపడదు.

బాలవ్యాకరణమునందు సంధిపరిచ్ఛేదమునందలి నాల్గవసూత్రమున స్త్రీవాచకశబ్ద ముపయోగింపఁబడియున్నది. అందు "అమ్మ, నెలఁత" అను తిర్యగాదీతర స్త్రీవ్యక్తివాచకశబ్దములె స్త్రీవాచకములుగ నుదాహరింపఁబడినవి. స్త్రీలింగశబ్దము విశాదస్థప్రకృతసూత్రమునందె (బాల. తత్స. 57 సూ) గాక "మహతీతరంబు లగు స్త్రీలింగంబుల......" అను (బాల. తత్స. 86 సూ) మొదలగు మఱి కొన్నిస్థలములయందును వాడుకచేయఁబడినది. అంతటను బారిభాషిక

స్త్రీత్వ విశిష్టపదార్థవాచకము లగు లతా వనితా దేవతాదిశబ్దములె యుదాహరింపఁబడినవి. ఇట్లే ప్రౌఢవ్యాకరణమునందును దత్సమపరిచ్ఛేదములోని 14-15 సూత్రములలో స్త్రీవాచకశబ్ద ముపయోగింపఁబడినది. వానియందును "రమణి, కమలదళాక్షి, తల్లి, అమ్మ, అక్క" అను స్త్రీ వ్యక్తివాచకములె స్త్రీవాచకములుగ నుదాహరింపఁబడినవి. శబ్దరత్నాకరకోశమున రోశబ్దమున కర్థము వ్రాయు సందర్భమున "అక్క, ఇంతి, రమణి,' అను స్త్రీవ్యక్తివాచకములె స్త్రీవాచకములుగ నుదాహరింపఁబడినవి. అహోబలపండితీయ మనునామాంతరముగల కవిశిరోభూషణమునందును "దార, నవలా, పంటచెలిపట్టి," మొదలగు స్త్రీ వ్యక్తివాచకములె స్త్రీవాచకములుగ నుదాహరింపఁబడినవి (అహో 317-346 పుటలు) ఎచ్చటను స్త్రీవాచకశబ్దము తిర్యగాదీతర స్త్రీవ్యక్తివాచకములకంటె వేఱైన పారిభాషికస్త్రీత్వ విశిష్టపదార్థవాచకపరముగ వాడఁబడలేదు. ఉదాహరింపఁబడలేదు.

ఆంధ్రవ్యాకరణములలో నట్లు వాడఁబడినను సంస్కృతవ్యాకరణముల చొప్పన స్త్రీవాచకశబ్దమునకుఁ బారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచక మని యేల యర్థము చేయరాదు? అని యందురేమో? వ్యుత్పత్తినిబట్టి రెండర్థములును జెప్పఁదగియున్నను నియమముగా నాంధ్రవైయాకరణు లోకయర్థమునందె వాడుచున్నపు డధునాతను లగునాంధ్రవ్యాకరణ వ్యాఖ్యాతలును నట్లె వాడవలయును గాని సకలాంధ్రవైయాకరణోపేక్షితార్థమున వాడుట సరికాదు గదా. మఱియు స్పష్టముగా లోకమున కర్థము తెలియఁజేయుటకై వ్రాయఁబడిన వ్యాఖ్యానమునందు నాంధ్రవ్యాకరణములలో నెచ్చటను వాడుకలేని సంస్కృతవ్యాకరణమాత్రప్రసిద్ధార్థపదమును బ్రతిపదముగ వ్రాయుట యుచితమా? ఇంతియకాక యాంధ్రవైయాకరణుల యభిప్రాయముల కవిరుద్ధము లగుసంస్కృతవ్యాకరణపరిభాష లాంధ్రవ్యాకరణములలో నుపయోగింప నగును గాని తద్విరుద్ధపరిభాష లుపయోగింపరాదు గదా.

నిరర్గళసంస్కృత వ్యాకరణపాండిత్య విరాజితుండును నాంధ్రవైయాకరణాగ్రగణ్యుండును, నభినవనన్నయభట్టారకాచార్య బిరుదాంచితుండును నగు నహోబలపతి యాంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యాన మగుకవిశిరోభూషణమునందు స్త్రీలింగ స్త్రీవాచకశబ్దములు విభిన్నవిషయము లని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. "స్త్రీవాచకత్వేపి స్త్రీలింగత్వాభావా ద్దారాదిభ్యో మువర్ణక ఏవ" (అహోబల

346 పుట) అను నీవాక్యముచే దారశబ్దము స్త్రీవాచక మయ్యు స్త్రీలింగముగా దని చెప్పఁబడినది. దారశబ్దము పారిభాషికపుంస్త్వవిశిష్టపదార్థవాచక మగుట చేఁ బుంలింగ మనియు, స్త్రీవ్యక్తివాచక మగుటచే స్త్రీవాచక మనియు స్త్రీవాచకత్వస్త్రీలింగత్వములు పర్యాయములు గా వనియు విశద మగుచున్నది. ఈ యహోబలపతివాక్యము గుప్తార్థప్రకాశికాకారులవాదము నున్మూలించుచున్నది. అరయ నరయ గుప్తార్థప్రకాశికాకారులు తెలుఁగువ్యాకరణమునందును సంస్కృతవ్యాకరణ మార్గావలంబులై, దారశబ్దమును స్త్రీవాచక మనుటకు మాఱుగాఁ బుంవాచకమని వ్యవహరించుటకును సాహసింతు రని తోఁచుచున్నది.

"అస్త్రియా మిత్యథర్వణవచనే స్త్రీవాచకవ్యతిరిక్తానా ముదంతానా మితి వ్యాఖ్యానా న్నతన్వాదిభ్యో వువర్ణకవికల్పో విరుద్ధః" (అహోబలపండితీయము 296 పుట) అని యహోబలపతి వేఱొకచోటఁ జర్చించియున్నాఁడు. "ఉతా మత్ర భవే ద్వావు రస్త్రియాం ల్వాదివర్ణకే" అను నథర్వణవచనమందలి "అస్త్రియాం" అను దాని కాంధ్రవైయాకరణ వ్యవహారముచొప్పున స్త్రీలింగేతరముల కనియె యర్థము చేయవలసియున్నది. అట్లయినను "వధులు" అను మొదలగురూపము లనిష్టములును "తనువులు, తనులు," అనుమొదలగురూపములు సమ్మతములును నగుటం జేసి, స్త్రీవాచకము లగువధ్వాదిశబ్దములకె, వువర్ణ వికల్పపర్యుదాసము సమ్మతము గాని, స్త్రీలింగము లయ్యు, స్త్రీవ్యక్తివాచకములు కాని తన్వాదిశబ్దములకు వువర్ణవికల్పపర్యుదాసము సమ్మతము కాదు. కావునఁ బయి యథర్వణవచనములోని "అస్త్రియాం" అనుదానికి స్త్రీలింగేతరముల కనుసర్థమును విడుచుకొని స్త్రీవాచకేతరముల కని యర్థకల్పనము చేయఁబడె ననియు నట్టియర్థకల్పనముచేఁ దన్వాదిశబ్దములు స్త్రీలింగము లయ్యు స్త్రీవ్యక్తి స్త్రీవాచకములు కామిం జేసి స్త్రీవాచకేతరము లనఁజనును గాన వానికి వువర్ణ వికల్పము విరుద్ధము కా దనియుఁ బయి యహోబలపతి వాక్యమువలన స్పష్టమగుచున్నది. ఈయహోబలపతి వాక్యము బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకారుల వాదమును నువ్వెత్తుగ నున్మూలించుచున్నది.

అథర్వణవ్యాకరణమందు సైతము నిట్లే స్త్రీవాచకశబ్దము స్త్రీవ్యక్తివాచక మాత్ర పరముగనె యుపయోగింపఁబడెను. "వికృతావత్ర వాలోపః సంబుద్ధ్యోఋపదే తుయోః। సపూర్వత్ర స్థిత స్స్యాద్రో ఇతి స్త్రీవాచకోభవేత్, పరత్రైవ ప్రయోగస్తు స్యాత్" అనియున్నది. "యత్ర పురుషామంత్రణం తత్రలోపవికల్పః

...రో ఇతి వర్ణస్తు స్త్రీమాత్రసంబోధనపరః." అని యహోబలపతి, పైసూత్రములకు వివరణము చేసి యున్నాఁడు. ఇందలి స్త్రీవాచకశబ్దము స్త్రీవ్యక్తివాచకమాత్రపర మని యర్థముచేయక తప్పదు గదా. మఱియు సూత్రములోని స్త్రీవాచకశబ్దము పారిభాషికస్త్రీత్వవిశిష్టవాచకపరమె యయినయెడల దేవతరో, విద్యరో, లతరో, యనుననిష్టరూపములును సాధువులె కావలసివచ్చును. మఱియు "అమ్మచెల్లరో, ఇత్యాదిప్రయోగస్తు 'అన్యత్రాపి క్వచిద్రోస్యాత్ రూఢదేశ్య ప్రయోగతః। ఇతివచనా త్సాధుః" అను నహోబలపతి వివరణమును, నథర్వణుని విశేషవచనమును వ్యర్థములు కావలసివచ్చును. పైవచనములోని స్త్రీవాచకశబ్దము స్త్రీలింగపరమె యయినయెడల "అమ్మచెల్లరో" అనుదానిగతి యేమని శంకించుకొనుటకుఁ గాని, దానికి గత్యంతరము కల్పించుటకుఁ గాని యావశ్యకత లేదు గదా. స్త్రీసమములను స్త్రీలింగములే యని వ్యవహరించుచున్న (బాల. గు. ప్ర, తద్ధిత. 28 సూ. వ్యాఖ్యా) గుప్తార్థప్రకాశికాకారులు స్త్రీలింగకార్యములు స్త్రీసమములకు వచ్చు ననుటకుఁ బ్రతిఘటింపరు గదా.

పైసందర్భమె బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమున వివరించి స్త్రీవాచకశబ్దమును స్త్రీవ్యక్తివాచకపరముగ నుపయోగించియున్నారు. "రో, దే, అవ్య. సంబుద్ధియందు స్త్రీవాచకంబుల కనుప్రయుక్త మగునది (ఉదా. అక్కరో, ఇంతిరో, రమణిరో మొ)......వ్యాకరణవేత్తలు, ఇది సంబుద్ధియందు స్త్రీవాచకములకే అనుప్రయుక్త మగు నని వ్రాసియుండఁగా ప్రయోగములందును నాలాగే కనఁబడుచుండఁగా ఒకానొక ఆధునికకవి 'అన్నరో, ఏనుంగురో' అని ప్రయోగించియున్నాఁడు అది చింత్యము" (శబ్దరత్నాకరము) పైనుదాహరించిన స్త్రీవాచకశబ్దమునకుఁ బారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచక మని యర్థమున్నచో స్త్రీలింగకార్యముల నొందఁదగు అన్న, ఏనుంగు, అను స్త్రీలింగసమశబ్దములకు రోశబ్దానుప్రయోగము చింత్య మనుట కవకాశముండదు గదా. గుప్తార్థప్రకాశికాకారులు స్త్రీసమములను స్త్రీలింగము లనియు స్త్రీలింగములను స్త్రీవాచకము లనియు వ్యవహరించువా రగుటచే వారికిఁ బైవిషయములను బ్రతిఘటించుటకు బొత్తిగా నవకాశ ముండదు. ఇట్లే సీతారామాచార్యులవారిచేఁ బ్రౌఢవ్యాకరణమునందును వ్రాయఁబడెను. "రోశబ్దంబొండు సంబోధనమ్మున స్త్రీవాచకమ్మునకుఁ బరమ్ముగ నగు........." (ప్రౌఢ, శబ్ద 14 సూ) ఈసూత్రమునందుఁ గమలదళాక్షిరో, రమణిరో, అనునవి స్త్రీ

వాచకములుగా నుదాహరింపఁబడినవి. అన్నరో, ఏనుంగురో, అనునవి నిరసింపఁబడినవి.

"దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచకస్త్రీసమంబు లగుసంబోధ్యవాచకంబులమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొండును, అల యనునవ్యయం బొండును గానంబడియెడి, అల దీర్ఘాంతంబు నగు" (ప్రౌఢ, శబ్ద, 15 సూ) అను నీసూత్రమునందును, తల్లి, అక్క, అమ్మ, అను స్త్రీవ్యక్తివాచకములె స్త్రీవాచకములుగ నుదాహరింపఁబడినవి. మఱియు నీసూత్రవివరణమున "ఈకవి పాపజాతికాన, అని ప్రయోగించియున్నాఁడు. అది విచార్యము" అని వ్రాసియున్నారు. గుప్తార్థప్రకాశికాకారుల సిద్ధాంతముచొప్పున సూత్రములోని స్త్రీవాచకశబ్దము స్త్రీలింగాపరనామమై, పారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచక మనునర్థము నీయఁదగియున్నయెడల పాపజాతికాన, అనుదానిని నిరాకరించుట కవకాశముండదు. మఱియు, విద్యకాన, దేవతకాన, లతకాన, అనునవిష్టరూపములును సాధువులు కావలసివచ్చును. ఇంతియకాక సూత్రమునందలి స్త్రీసమశబ్దమునకు వైయర్థ్యము సంభవించును. స్త్రీసమములను, స్త్రీలింగము లనియే వ్యవహరించుచున్న గుప్తార్థప్రకాశికాకారులు స్త్రీసమములు స్త్రీలింగకార్యములనందు ననుటలో విరోధింపఁజాలరు గదా.

బాల్యవ్యాకరణకారు లగుసూరిగారికిని స్త్రీవాచకశబ్దమునకు, స్త్రీవ్యక్తివాచకమాత్రమునందె తాత్పర్య మని స్పష్టపడుచున్నది. "అధునికకృతులందొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగనుకాసె, నెలఁతిచ్చెను" (బాల, సంధి, 4 సూ) అనుచోట గుప్తార్థప్రకాశికాకారులమతముచొప్పునఁ గంగనుకాసె అనునదియు, స్త్రీవాచకోదాహరణమె యనఁదగును. అట్లయినచోఁ తత్సమసంధి యుదాహరణశూన్య మగును. అందుకు గుప్తార్థప్రకాశికాకారులును నంగీకరింపలేదు. గంగనుకాసె అనునది, తత్సమసంధి కుదాహరణముగ వారిచే నుదాహరింపఁబడినది. ఇచ్చటి స్త్రీవాచకశబ్దమునకుఁ బారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచక మనియే యర్థ మయినచోఁ గంగనుకాసె, అనునది మాత్రము స్త్రీవాచకోదాహరణ మేల గాకుండును. గంగనుకాసె, అనునది ప్రయోగింపఁబడిన గ్రంథము నందే (ఆముక్తమాల్యదయందే) "శ్రీరంగభర్తంచు" అనుస్పష్ట మగుతత్సమసంధిప్రయోగముండఁగా, సూరిగారు తత్సమసంధిని నిరుదాహరణముగా విడుతురా ? కాఁబట్టి గంగాశబ్దము స్త్రీలింగమయ్యు స్త్రీవాచ

కము కాదనునభిప్రాయముతోడనే "నెలఁతిచ్చెను" అనుదానిని స్త్రీవాచకసంధికిని, గంగనుకాసె, అనుదానిని దత్సమసంధికిని నుదాహరించి రని విశద మగుచున్నది.

పై రీతిని నియతముగాను నిస్సందేహముగాను స్త్రీవాచకశబ్దము స్త్రీవ్యక్తివాచకమాత్రపరముగ నాంధ్రవైయాకరణులందఱిచే వాడఁబడుచుండుటం జేసి, స్త్రీలింగ మనుదానికి స్త్రీవాచకమని వివరణము వ్రాయుట ప్రామాదిక మని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

సంస్కృతవ్యాకరణములలో స్త్రీలింగస్త్రీవాచకశబ్దములు పర్యాయములుగ వాడఁబడినను, నాంధ్రవైయాకరణులు పారిభాషిక స్త్రీత్వవిశిష్టపదార్థవాచకములకును దిర్యగాదీతరస్త్రీవ్యక్తివాచకములకును గలకార్యభేదములను స్పష్టముగా నుపదేశింపఁ గలుగుటకై వానిని విభిన్నవిషయకములుగ వ్యవహరించియున్నారు. అట్టిసకలాంధ్రవైయాకరణవ్యవహారమునంతను మఱచి తమయీయాంధ్రవ్యాఖ్యానమునందుమాత్రము, శాస్త్రాంతరమాత్రప్రసిద్ధార్థ మగుపారిభాషికార్థమును గ్రహింపుఁ డని పాఠకులను నియమించుట సమంజస మగునో కాదో చదువరులగునాంధ్రమహాశయులె నిర్ణయింతురుగాక!

అదృష్టవశమున నిట్టివాదము గ్రంథకర్తగారికాలముననండె సంభవించినదిగాన నీవిషయమున గ్రంథకర్తగారి నటుంచి యితరులు నిందాగర్భముగాఁ బ్రసంగించుటకంటె గ్రంథకర్తగారే నిష్పాక్షికముగను, నిరాగ్రహముగను బ్రసంగించి న్యాయమును వెల్లడించి తమగ్రంథమును, నాంధ్రవాఙ్మయమును, నలంకరించుట యుచిత మని సవినయముగా విన్నవించుచున్నాను.

వఝల చినసీతారామస్వామిశాస్త్రి.

---

# విజ్ఞాపనము.

ఆర్యవర్యులారా!

మేమీపత్రికయందుఁ బ్రకటించుచున్న ఋగ్వేదికవి వేంకటాచలపతి కవి ప్రణీతంబైన చంపూరామాయణము ప్రతి మాయొద్ద నొక్కటియే యున్నది, ప్రత్యంతరము లేని కారణమున సంస్కృతము చూచినను దీఁని సందేహములు పెక్కులు గలుగుచున్నవి. దయచేసి యెవ్వరియొద్దనైన వేఱొక ప్రతి యున్నచో నొక్కసారి పంపించెదరని వేఁడుచున్నారము. పని తీరిన వెంటనే ముద్రిత ప్రతితోఁ గూడ వారి ప్రతిని వారికి వందనపూర్వకముగఁ బంపి వైచుచున్నారము.

మాయొద్దనున్న ప్రతి యెతుల నారసింహరాజు వ్రాసినది. చివర పత్రము మీఁద, కీలకనామసంవత్సరము (మొన్నటి కీలక కాఁగూడదు) అషాఢ శు ౫ లు, సువర్ణం సుబ్బాశాస్త్రు వాలురు, యరగుడి చిఁచురాజుగారు. గోపవరము దగ్గఱి చినగోపవరము గ్రామము వీరివిషయము కొంతగలదు. ఈ సందర్భములను బట్టి, పై ముగ్గురకు సంబంధబాంధవ్యములు గలవారు దీనిని సంపాదింపఁ గలరని మాయాశయము.

ఇట్లు:

బుధవిధేయుఁడు,

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికా సంపాదకుఁడు.

అని మొదలు పెట్టినారు. [illegible] రామాయణములో [illegible] సీతయే యుద్ధముచేసి గెలిచినట్లు [illegible] పద్యములు :—

ఉ. "ఇన్నియుఁ [illegible] నిష్ఠుఁ జంపె నే
పున్నతవృత్తి [illegible] యశోమలిం
[illegible] సుగంధిఁ [illegible] సుఖం
బున్నను [illegible] నోరివానరా.

శా. మేఘాభంగు [illegible] యుద్ధక్రియా
శోభాయుక్తిని [illegible] సౌజన్యంబు బ్రహ్మాండభాం
[illegible] ప్రతిమా [illegible] లంబితా
[illegible] ముదంబొప్పఁగన్.

ఉ. పుడమి [illegible] చలింప [illegible] చయంబు [illegible] మొగ్గ [illegible]
జడధి [illegible] లంక భీషణధనుర్జ్యాఘోషము గావించుచుం
బిడుగు [illegible] దరిగి యాభీలప్రతాపంబుతో
వెడలె [illegible] సుర లీక్షింప నుద్ధండుఁడై.

ఈప్రతి 1903 న సం॥ లో (శోభకృతు - కార్తికమాసము) వ్రాయఁబడినది. అల్లవరము నివాసి గుబ్బల సుబ్బారాయఁడు వ్రాసినది. దీనిమాతృక నలనామ సంవత్సర మార్గశిర బ ౧౩ గురువారమునాఁడు పాలెపు సీతాపతిగారు వ్రాసినది.

(75) కాళిందీవిలాసము. (గ్రం. సం. 905)

ఇదియొక యక్షగాన కావ్యము. కవిపేరు కనఁబడదు. కృతి వడాలి (వడలి) పురనికేతనుండగు శ్రీజగన్నాథస్వామి కర్పింపఁబడినది.

వ. "అని యిట్లనేక ప్రకారంబుల ప్రభాత ప్రభాకర మండలాఖండ దీప్తకుండల మండిత గండద్వయుండగు, చండీశ చండకోదండ ఖండనుని హృత్పుండరీకంబున నిల్పి సాష్టాంగదండవత్ప్రణా ... ... కరణ గైకొని రచియింపం బూనిన కాళిందీవిలాస మృదుతర నాటకాలంకార కావ్యప్రబంధంబునకుఁ గథా ప్రారంభం బెట్టిదనిన" అని ప్రారంభించెనేకాని కవి తన సంగతి యెక్కడను జెప్పుకొనలేదు. దరువులలో, ద్విపదలలో నందందు వడాలినగరము శ్రీజగన్నాయకుని మాత్ర ముగ్గడించుచుండును. భామకలాపమునకు దీనికి భేదములేదు. రానేమాధవీ, కృష్ణుఁడు తెరవెళ్లేదరువు, చంద్రోపాలంభన,

ఇత్యమరః, వాకొన్ము, శకునములు, మొదలైనవి సర్వము సమానము. ఈవడ లిపుర నివాసి యెవ్వరో కవియై యుండును. మాకీగ్రంథమును గోదావరి మండలములోని (కస్తూరివారి సావరము) మ॥ కస్తూరి నరసింహామూర్తిగా రిచ్చిరి. వడలి గోదావరిజిల్లాలో నున్నది. కవియు నచ్చటివాఁడగుట నిశ్చయము. పుస్తకము కస్తూరి మృత్యుంజయునిది అని పైపత్రము మీఁద నున్నది.

కవిత్వశైలి కొక్కపద్యము.

ఉ. శ్వేతవిలాసహాస శశిశేఖరసేవితపాదపద్మ జీ
మూతనిభాంగ దుష్కృతవిమోచన నామ నగేంద్రధీర కం
జాత విశాలనేత్ర కరకంకణశోభిత మిత్రకోటి సం
ఘాత ప్రకాశ శార్ఙ్గధర కంసమురాంతక రుక్మిణీపతీ.

(76) తిరుపతిచరిత్ర ప్రశ్నోత్తరమాలిక. (గ్రం. సం. 40)

ఇదియొక వచనకావ్యము. తిరుపతిక్షేత్రచారిత్రము ప్రశ్నోత్తరరూపముగ వ్రాయఁబడినది. ప్రశ్నించినవా రెవ్వరో ప్రత్యుత్తరమిచ్చువా రెవ్వరో కవి యెవ్వరో తెలియదుగాని విషయము మాత్ర మాక్షేత్రమును గుఱించి బహుపురాణములను జక్కఁగాఁ బరిశీలించిన బుద్ధిశాలి వ్రాసియున్నాఁడు. ఉదాహరణమునకై కొన్ని ప్రశ్నోత్తరముల నిందుఁ జూపెదము.

౨ ప్రశ్న. ఈ శేషాచలపర్వతము మహామేరు పర్వతము. ఈ పర్వత మెవరిచేత నేకారణమునఁ దేఁబడినది ?

ఉత్తర. అనేక ... వైకుంఠ లోకమందు శ్రీవారి సముఖములో నాదిశేషునకును వాయుదేవునకును బలపరీక్షలు వచ్చి యాదిశేషుఁడు తన సహస్రఫణములతో నొకానొక మేరు శిఖరము నాక్రమింగుకొని నిలిచి... దేవుఁడు తనబలముచేత నిష్కర్ష చేసికొన్నంతట వాయుదేవునికి బహుకోపం నించి ప్రళయకాల వాయువు వలెనె మహావాయువు సంభవించినందున నామేరు శిఖర మిక్కడికిఁ దేఁబడినది. ఈ సంగతి బ్రహ్మపురాణములో ... చెప్పఁబడి యున్నది.

నడుమ నడుమలోపములు రంధ్రములు నుండుటచేఁ దోఁచినట్లు కొన్ని ప్రశ్నల కుత్తరములు మాత్రమే యీక్రింద వ్రాసెదము.

“ చోళరాయపట్టములు సంతతిపురుషులు ౨౩ కి ప్రభుత్వసంవత్సరములు ౪౭౧. శాలివాహనుఁ డనుపురుషుఁడు ౧ కి ప్రభుత్వసంవత్సరములు ౖ౦, జోటం

అను పేరుగలిగిన పురుషసంతతి ౧౨ పాదం అనుపేరు గలిగిన పురుషసంతతి. ప్రతాపరుద్ర మహారాజ పురుషసంతతి ౧౪ ప్రభుత్వ సంవత్సరములు ౫౮. .... అన వేమారెడ్డి పురుషసంతతి ౧కి ప్రభుత్వ సంవత్సరములు ౯౭. రాయల ... పురుషులు ౨౭కి ప్రభుత్వ సంవత్సరములు ౩౨౯. పరాభవ సం॥ మొదలు క్రోధి సంవత్సరము వఱకు రాజరాజనరేంద్ర ప్రభుత్వము చేసిన సంవత్సరములు ౧౪౦. అక్షయసంవత్సరము మొదలు వికారిసంవత్సరము వఱకు సారంగధరు ... ... గలందులకుఁ గాను దిగువ తిరుపతిలో రాతియుగ్రాణము సుమారు ౨౦౦ యిన్నూట ౮౦ అంకణాలు ...... యిప్పుడు కొంత శిథిలముగా నున్నది. ఈ సంగతి అక్కడనే శిలాశాసనములుగ వ్రాయఁబడి యున్నవి. ... ... శాకాబ్దము ౧౩౫౧ మీఁద కీలక సంవత్సరము లగాయతి దుర్ముఖి సంవత్సరమువఱకు సాళ్వ నరసింగరాయల ప్రభుత్వము సంవత్సరములు ౪౯. శాకాబ్దము ౧౪౦౦ మీఁద హేవళంబి సంవత్సరము లగాయతి ప్లవంగ సం॥ ము(యి) మ్మడి దేవరాయల ప్రభుత్వము. ౧౪౧౧ మీఁద కీలక మొ॥ విభవ న॥ చరనరసింగరాయల ప్రభుత్వము. శా. ౧౪౩౨ మీఁద శుక్ల సం॥ ఆవణి నెల శ్రీజయంతి లగాయతి విరోధి సం॥ ...... హ్వరాయల ప్రభుత్వము. సం॥ ౨౦ నెలలు ౩ దినములు ౪. కృష్ణరాయలు విజయనగరములోఁ ప్రభుత్వము చేయుచున్నపుడు ౧౧ పట్టముల యాదవరాయలు కట్టించిన చంద్రగిరి దుర్గముకోట వాకిండ్లలోఁ దమకుఁ దమ్ముడైన కస్తూరి వెంకట......రాచవేటి రాయని, అనేక సైన్యములు గూర్చి తాణావుతో నుంపుమని చెప్పి ప్రజోత్పత్తి సం॥ త్రై నెల ది ౧౨ తేదిలు శాలిజాం మొదలయిన మూఁడు సంస్థానాలమీఁద దండెత్తి ...... వారివలనఁ గానుకలను బొంది ... దొరతనముఁజేయుచు శ్రీముఖ సం॥ చిత్రినెల శ్రీరామనవమినాఁడు గజపతివారిమీఁద దండెత్తినంతట వారు సమాధానమైనారు గనుక వారియింటి చిన్నదైన లక్ష్మీదేవిని వివాహము చేసికొని...విజయ సం॥ కార్తికి నెలలో స్వర్గస్థులైనారు ... ... శకాబ్దము ౧౬౭౦ ముతాబకు స్న ౧౧౫౮ ఫసలీ, శకాబ్దము ౧౭౧౬ ముతాబకు స్న ౧౨౦౪ ఫసలీ ౮॥ నవాబు వాలాజాహా ...... యేండ్లు ౪౭. ౧౨౧౧ ఫసలీవఱకు నవాబు వుమదత్తుఖా యేలిన యేండ్లు ౩. అంతు మొగలాయి పట్టములు ౧౧కి యేలిన యేండ్లు ౧౪౫. ఈవల ..... ౧౨౧౧ ఫసలీ దుర్మతిసంవత్సరము అఖండిత సామ్రాజ్యముగా కుంఫిణీవారు ప్రభుత్వము చేయుచున్నారు. యుధిష్ఠిర శకము, విక్రమార్క శకము, శాలివా

హాన శకము. కుంఫిణి శకమని యింకా వ్రాయవచ్చునా. పురా(ణా)ల్లో దాఖలాలేక యిటీవల రాఁబడిన సంగతులకు వ్రాయుటకు...విస్తరింపకున్నది. అయినప్పటికి దొరల చిత్తానకు బోధరావడానకుగాను సంక్షేపముగా వ్రాయఁబడినది."

తుదవఱకుఁ బ్రశ్నోత్తరరూపముగ 18 పత్రములలో వ్రాయఁబడినది. శిథిలమైన ప్రతియగుటచే నొక్కవిషయమును బూర్తిగ వ్రాయుటకు వలనుపడలేదు. కలియుగము ప్రారంభమునుండి యేలిన జనమేజయుఁడు మొదలు కుంఫిణీవారి ప్రభుత్వము వఱకు నిందు సందర్భవశమునఁ గనఁబఱచినాఁడు.

(77) వరాహపురాణము. (గ్ర. సం. 986.)

ఈ పురాణము నాంధ్రీకరించిన కవి హరిభట్టు.

గద్యము. ఇది శ్రీహనుమత్కరుణా వరప్రసాదాసాదిత సారస్వత నిరాతంకచంద్రనామాంక రామవిద్వన్మణిజాత, అష్టఘంటావధాన పరమేశ్వర బిరుద విఖ్యాత హరిభట్ట ప్రణీతంబైన శ్రీవరాహపురాణంబు. అని. ౫ ఆశ్వాసములు. "సరోజాతుండు రక్షించు ధైర్యాకల్పుం గొలిపాక సర్వవిభునెఱ్ఱామాత్యచూడామణికి" అను ప్రథమపద్యములోని చరణముంబట్టి కొలిపాక సర్వయ్యకుమారుఁడగు నెఱ్ఱనామాత్యుఁడు పురాణమునకుఁ గృతిభర్త.

శైలికై కొన్నిపద్యములు—

చ. అకట నిజప్రయోజన సహాయతకై హరితానె ముస్సుసో
మును సృజియించి క్రమ్మఱ సముద్రములోన వధించె నన్న నే
రికి విన నింపుగాదు విషవృక్షము నైనను బెట్టి పెంచి తాఁ
బెకలిచి వైచునే కరుణపేరు నెఱుంగని పాతకాత్ముఁడున్.

శా. శాలగ్రామ శిలాస్వరూప హరిపూజం దన్పి తద్పాద తీ
ర్థాలింగ్రోలి తదర్పితాన్నముల నాహారించి తద్భక్తరం
జాలోలుం డగుచు న్మెలంగి జగదాశ్చర్యంబుగాఁ జెందుఁ ద
న్నాలీకాక్షు విహార(తీర) జనితానందైక భోగంబులున్.

ఉ. చూచితి మొక్క చోద్యము యశోధన నీసుతు నంబురాశిలో
వైచిన వేళ నొక్క ఫణిపర్యుఁడు వచ్చి తదీయబంధని
ర్మోచన మాచరించి యనుమోదమునం గొనిపోయి వార్ధిరా
డ్వీచిపరంపరావిమల వేషము చొచ్చెఁ బ్రసన్నమూర్తి యై.

ఈప్రతి నానందనామసంవత్సరములో మొదలిడి రాక్షస సం॥ పుష్య బ ౨ సోమ వారమువఱకు, పెన్నాడ పంద్రంగి వేంకటశివుఁడు వ్రాసినప్రతి నున్నక్రమమున సీతారామపురము కొప్పర్తి వెంకన్నకుమారుఁడు రామేశము వ్రాసినది.

(78) చమత్కారమంజరి. (గ్రం. సం. 947)

గ్రంథకర్త సింహాద్రి వేంకటకవి. మూఁడాశ్వాసముల ప్రబంధము. పేరే యీగ్రంథ చమత్కారముం దెల్పుచున్నది.

గద్యము, శ్రీమద్రామానుజ భాగినేయకుల సార్వభౌమ శ్రీమన్నల్లనాచార్యవర్య పరిచర్యాధుర్య చెన్నకేశవార్యపుత్ర తిరుమలాచార్యపౌత్ర గౌతమ గోత్ర సింహాద్రి వేంకటనామధేయ ప్రణీతంబు, అని యుండుటచేఁ గవి గోత్ర నామములు గురువుల పేరులు తెల్లముగఁ దెలిసినవి.

క. ధృతిమతికి విబుధ రచిత, స్తుతి తతికి నజన్యవాక్యచూడాభివ్యా
కృతిరతికి దుర్మతమదా, హతికృతికిని లక్ష్మణాఖ్యుఁ డగు యతిపతికిన్.

అంకితం బొనర్పఁబడినది. కృష్ణకథ. వర్ణనాచమత్కారము గలది. శైలి—

మ. అపు డాము త్తెపుఁ బాసికల్విడిచి తా నాడంగనంచించు సా
రెపయిం గేలటు చాఁచి భీష్మకధరిత్రీజానిగారాపుఁబు
త్రి పరాకమ్యె పిలోకనాన్యముల కుద్రిక్తామ్బుతావేశ చి
హ్నాపటుద్భానవికాసహాసరుచు లందంబొప్ప సంధిల్లఁగన్.

శా. జోక ల్వీడ్కొని చుక్కలేగను జుమీ శుభ్రాంశుబింబప్రభో
త్సేకంబుల్ దఱిఁగంజుమీ కడకు విచ్చెం జుమ్మ యీరేయి చిం
తాకాలుష్యము లేల బాలమదిలో ధైర్యం బవార్యంబుగాఁ
గోకోయన్గతిఁ గుక్కుటంబు లలరెం గోకో పిరావార్భటిన్.

జయసంవత్సర పుష్య బ ౨ శుక్రవారమునాఁటికిఁ బ్రతి వ్రాయఁబడినది.

79. చంద్రాంగదచరిత్రము. (గ్రం. సం. 12)

శ్రీమద్రామచంద్రచరణారవిందభృంగాయమాన మానస సకలశాస్త్రాధ్వరిరంస పైఁడిమఱ్ఱి పద్మనాభాధ్వరివతంస కృపాభూషణ కృష్ణరాయభూషణ పర్వతరాజతనయ వేంకటపతి రచితంబైన యీప్రబంధము ౫ ఆశ్వాసములు పూర్తిగను ౩ వ యాశ్వాసములోఁ గొంతవఱకుఁ గలదు. ఉన్నంతవఱకుఁ బ్రతి శుభ్రముగా నున్నది. వ్రాఁత చక్కఁగ నున్నది. కవి స్వతంత్రశక్తిగలవాఁడు.

సమర్థుఁడు నగును. కవులలో నొక్కొక్కఁడో నొక్కొక్కరి ననుకరించు నభ్యాసము. చూడుఁడు.

గీ. అచటిపందులఁ జెప్పంగ నలవియగునె, చప్పరింపంగ సెలవుల జాఱుచొంగ
సిలల బెడిదంబుఁ గోఱల సెకలువుట్టి, మట్టుమీఱిన కాఱగ్గిపుట్టుమాన్చు.

గీ. దండచేలావు గలయట్టి పందు వెదురు, తండములఁ గొమ్ముపంగల మొంపువెట్టి
బెండు విఱిచినకైవడిఁ బెనచి విఱుచుఁ, బోతరించిన పుష్పా లప్పాలములోన.

ఇట్టివి మనుచరిత్రములోని వేఁట విషయము ననుకరించినట్లు తోఁపించును గదా. ఒకరన్నమాటలకే తల విఱుపులలోఁ దమ కానందముగలవారు నుందురు.

చ. కనుఁ గొనయ్యెఁ బండి యొరగంబడి యుండెడు రాజనంబుఁ జ
య్యన హాలికుల్మముం గనినయట్టి మహీమహివన్మదర్థమై
ఖననము సేయఁ బూనెదరు గా యని యాంతరకైరివాళిసం
జనితమరందబాష్పములు జాఱఁగ మూర్ఛిలి వ్రాలుకైవడిఁ౯.

మ. నిరతిం బండితు లేగతిం బలికి రేనిం బల్కనీ శాస్త్రిమే
కరణిం జెప్పినఁ జెప్పనీ నుదుట నాకంజాతసంజాతుఁడే
సరణిన్ వ్రాసిన వ్రాయనీ తలఁప నస్మద్దివ్యవాక్యంబు లో
ధరణీనాథవతంస తప్పవు సుమీ తథ్యంబుగాఁ బల్కితి౯.

శా. ఆవేళం జనవొప్పఁగా సకలదేశాధీశులం జూపి వా
చావైచక్షణిఁ జిత్రరేఖవలికెన్ సంభ్యాతినృత్యన్మహో
దేవోత్తంససుధామయూఖవిగళద్దివ్యామృతాస్వీతగం
గావాఃపూరఝుళంఝుళధ్వనికి ధిక్కారంబుఁ గల్పించుచు౯.

ఇది దక్షిణదేశమున దొరకిన ప్రతి—

(80) అంగజవిజయము—(గ్రం. సం. 34)

ఇది యొక్కయక్షగానము. చివరఁ గొంతభాగము లేదు.

"నన్ను నుద్దేశించి యిక్కావ్యం బంగజవిజయంబునా నమర్చిన భవబంధంబులు దెగునని యానతిచ్చి తిరోహితుం డయ్యె నయ్యెడ నద్దేవుకారుణ్యంబు వడసి యక్కథకుద్దీపించువో మద్వంశం బభివర్ణించెద."

సీ. అనుమకొండకులామృతాంభోధి తద్వీప ప్రకటకల్పకయశః ప్రథమశాఖ
జనితుఁ డాత్రేయసగోత్ర సుచరిత్రుఁడాది శుక్లయజుస్సుకమ్మాతకరుఁడు

భానయమంత్రి సద్భార్య వాబమకును సూనుఁడై జనియించె సుగుణమూర్తి
రంగయ యననొప్పు రమ్యప్రకాశుండు అంగన వెంగమ యందుఁగనియె

గీ. నమిత తేజులనల్వుర నందు వెలయు, ఘనుఁడు చినవెంగసచివుఁడు కమితయశుఁడు
సరసగుణులను నల్వుర సదయమతుల, వెంగమాంబావధూమణియందువడసె.

వారిలోన—అటతాళము. పుణ్యపురుషుల పుణ్యమున పురుషోత్తముండు ననఁగను గణ్యవర్తన కెక్కువాఁడును ఘనులదయచే, అనుదానింబట్టి కొండత్రవ్వి యెలుకను బట్టఁగాఁ గవిపురుషోత్తముఁ డని యొక్కింత తేలినది. ఇతర యక్షగాన కవులు పెక్కురకంటె మేలు. ఇంతమాత్రము నుడివినాఁడు. ఇందలికథ మన్మథు నీశ్వరుఁడుదహించుట మొదలగునది. శివభక్తియుతము.

(81) దశథరాజనందనచరిత్రము—(గ్రం. సం. 908)

ఇది యొక నిరోష్ఠ్యప్రబంధము. కవి మరింగంటి సింగరాచార్యుఁడు. కథ రామకథయే.

ఇందలి గద్యము. శ్రీమల్లక్ష్మీనృసింహావతార వేంకటేశ్వర వరప్రసాదలబ్ధస కలైశ్వర్యధుర్య ఆంధ్రభాషానిరోష్ఠ్యాదివింశతి ప్రబంధనిర్మాణ మౌద్గల్యగోత్ర పవిత్ర తిరుమలదేశికపౌత్ర వేంగళాచార్యపుత్ర మరింగంటి సింగరాచార్యప్రణీతం బైన దశరథరాజనందనచరిత్రం బనుమహాకావ్యము.

ఇందు నిరోష్ఠ్యనియమము కథాభాగమున మాత్రమేకలదు. ఆశ్వాసాద్యంతపద్యములు కృతికారణాదులలో నీ నియమమును పాటింపక మిశ్రముగానే వ్రాసినాఁడు. పలువురవలె పఫబభమవలనె యితఁడను నిరోష్ఠ్యములుగ గ్రహించెను.

నాలుగాశ్వాసములు మాత్రమేకలవు. అనఁగా యుద్ధకాండములోఁ గొంత వఱకును—భాస్కరరామాయణములోని "ఎఱుఁగుదుఁ బద్మబాంధవ కులీనుఁడు రాముఁడు" అను రావణవాక్యమువఱకుఁ గల కథయిందీ నాల్గాశ్వాసములలో నిమిడినదని నాల్గవయాశ్వాసము చివరనున్న—

ఉ. సీతయె కంధినందనగచేత ఖరారియె శేషశాయిగా
నీతిఘటిల్లఁగా నెఱుఁగనేరనె దాఁచఁగ నేటి కాజి నే

నాతనిచేతఁ ద్రెళ్లి సనకాదియతిచ్ఛటలంద లేని యా
ఖ్యాతిఁదనర్చి సద్గతిని గాంచెదఁ జిల్లర గాద లేటికిన్.

అనుపద్యము తెల్పుచున్నది.

ఈ పేర నొకరామాయణమును మొల్ల రచియించుచున్నట్లును నొక సమయమున రామలింగ కవి మొల్లను జూడవచ్చి గుమ్మము కడనున్న దాసిం గాంచి మొల్ల యేమిచేయుచున్నదని యడిగినట్లును దశరధరాజనందన చరిత్ర రచియించుచున్నదని నిరోష్ఠ్యముగనె ప్రత్యుత్తర మిచ్చినట్లును గాలికథలు గలవు. కొన్ని పద్యములను మచ్చుచూపెదము.

చ. కనకనగాకృతి న్నిగిడి కానగనైన గిరీశసాయకా
సనదృఢయష్టిఁ జేరి యతిసాహసశక్తి నిశాచరచ్ఛటల్
గనితలనుద్ధరించి జనకక్షితిరక్షిత యగ్రధాత్రికిన్
జనిచని యక్కరించిరి దిశల్ చలియించఁగ నట్టిచెంగటన్.

చ. అకటనిశాచరాగ్రణి దశాస్య జగజ్జనయిత్రి రాజక
న్యకనిట కేల తెచ్చితదయక్రియ సంధిలఁ దెచ్చినట్టిదా
నికి నఖచింతచే నెనకనేర్చెద నేరగరాదె ధాత్రిఁగీ
లికిఁ జెద లంటరానిసరణిం దిలకించిన లెస్స యన్నిటన్.

వ్రాఁతలోఁ దప్పులు మెండుగఁ గలవు. ఇక్కడి మిశ్రకవిత్వమున నొక్క పద్యము.

ఉ. ఆరయశబ్దహీన మగునట్టిపదస్థితి గల్గి పైనలం
కారము లెవ్వి చేకుఱక క్రమ్మినశయ్యల సంధి దెల్పుచున్
గారవవృత్తియర్థములు గానని కాకవివారకోటికిన్
సారముసేయఁగావలె వెసన్ ద్విజరాజకళాసమృద్ధిచేన్.

ఈ పుస్తకము గోదావరిమండలములోని కస్తూరివారిసావర గ్రామ నివాసులు దెందులూరి రామమూర్తిగారిచ్చినది.

---

జానకీజాని నన్వేషింగి యుచిత హావిర్గంధగంధవహకిశోర హోమధూమ దూరతోవిభావ్యమానంబును చలితసారంగగణతిరోహితశరీర వనదేవతా వితాన శీలితోపహారప్రసూనంబును నిశితనీచరపిశాచవాటీ సముచ్చాటన ప్రవీణ మంత్రాయమాన సామాసుజధనుగ్ని నదనిశమనసముచితసమీప ఘటితదర్భకుటీరజటిలబంధుర ...తమహీభాగంబును, ననేకశాఖి శాఖావలంబమాన వల్కలాంతరప్రతానంబును, నంబరపురాయాత దివిజ భామోదరీకరకిసలయమానపారిజాత సౌరభవాటిజాత కీలితవితానసీతావిహా రణాగార రసఫలప్రచురవిచికిలలతాజాలయమానకాయమానంబును, నధ్యు టజచత్వరాలక్షితసాలమూల హేమకరోపలవితర్దికానిహితసితకృపాణ తూణీర చారవాణ చాపాసనవిశేషంబును, నతిథిజనసపర్యాపర్యుత్సుక సు మిత్రాపుత్ర నిర్వ్యాహింతానుందకంద మూలఫలకోశమాదిరాయితైకదేశంబు ను, నవిరహిత ధరణీసుతాచరణవిన్యాసధన్యతా పరిహసితసాకేతరామణీ యకంబును నగు రామాశ్రమంబు నొంది నైకేయీనందనుండు కందళిత మానసానందుండై యంతట. 103

సీ. మినుమినుక్కను సీతమేనికాంతిఁ గడానివలువత ళ్కొలయు వల్కలమువాని
ఘనసారతిలకనై ఖరి ఫాలతలముసం గీక్షింపఁ దగు హోమరక్షవాని
జలసేకజనితపాటలిమఁ గాంచనకిరీటతగాంచు జాటజూటంబువాని
మహిమండలి వహించురహినాదిభోగిభోగముల మించుభుజాయుగంబువాని

గీ. తమ్ములనదమ్ముల నెడునేత్రములవాని, నును మొయిలుచాయలుడివోనితనువువాని
నకృతసుకృతావిధేయత నమరువాని, రాము శ్రీరాము శౌంత్యభిరాముఁ గాంచె.

చ. కని యారామసమీపసీమ లతినై కన్పించు క్రొమ్మించుఁ బో
ణి నరణ్యాని కయోధ్యఁబుక్కు బిగిచే నిగ్గించు రాజీవపా
ణి నిమిత్రోణికళత్రు వంగడపుమున్నీటన్ సముద్భూతిఁ గాం
చినదై వాత్మకరేఖ భూమితనయన్ సేవించె సాధ్వీమణిన్. 105

ఉ. ఏన్నృపుఁ డాసుమిత్ర కుదయించియుఁ దా నితరానవాప్యరా
మానుజచర్యఁగాంచు నిశలం దపనిద్రతఁ జెందనేని యె
వ్వాని కనుంగవం జెనయు వారిజబృందము లందు రాగుణ
శ్రీనిధి నూర్మిళేశు నిజదృక్పథముం దొరయించె నంతటన్. 106

చ. మరుగతి మూడుపేసవినిమ్రగ్గి తలంకెడు జింక పంకజా
కర మెదుటం గనుం గొనినకై వడి రాఘవుఁ గాంచి తత్పదాం

బురుహామదాళి యై జనకుపోకడ నేడ్పొదవ న్వచించుచు
న్భరతుఁడు మూర్ఛముంచె రఘునాయకు లక్ష్మణు జానకీసతిన్. 107

క. ఆఁగో నంతఃపురజన, జాలోదితరోదనార్తి చదలంట నిడన్
వేలాతిగశోకార్ణవ, కోలాహల మానసిస్థకుంభజుఁ డణఁచెన్. 108

గీ. తెలివి ఘటియిల్ల నంతటఁ గులగురూక్తి, సరణి రఘువీరుఁ డామరసైంధవాప
కృతనివాపాది సముచితకృత్యసముప, యుండగుచునుండెసుఖగోష్ఠి నుటజవాటి.

మ. మనువంశంబునకున్ యశంబునకు ధర్మశ్రీకిఁ బ్రాకృణ్యావ
ర్తన కాచారబహుశ్రుతాదులఁ గనర్హం బెద్ది యాజాడ కొ
ప్పని తాత్పర్యము నిస్తరించు భరతోపజ్ఞంబు విజ్ఞాపనం
బు నిజారణ్యనివర్తనంబుఁ దెలుపన్ భూపుత్రితోఁ డత్తఱిన్. 110

మ. సకృదుద్ధ్యోతచిరేతరాంశునిభరాజ్యశ్రీమదానేశి చి
హ్న కిరీటంబు ధరింపలే నమృతసౌఖ్యం బబ్బ నీరత్నపా
దుకల న్నాపయి నుంచు మంచు పదపాథోజంబుల న్వేఁడుపో
లిక నమ్రం బగు వాలితోడి భరతున్ లేనవ్వుతోఁ జూచుచున్. 111

చ. మనము గురూక్తి సత్యగరిమం దొరయింపమి రాజధర్మమే
యని యఖిలావని న్నిజపదావనియం దిడుకోర్కి దాన్కొనం
బనిచిన మాండవీపతి సమస్తబలాన్వితుఁ డై యయోధ్యకుం
జని యచట న్వసింప కనుజన్ముఁడుఁ దాను జటాధురీణులై. 112

క. ఎందాఁక రామువనగతి, యందాఁక వసింతు నిచట ననుపూనికతో
నందిగ్రామావసథము,నం దిగ్రామాభినంద్యనయుఁ డతఁ డుండెన్. 113

క. దాశరథిజటాధరభయ, దాశరథికృతి ఘటింప నంతట మర్యా
దాశరథియు భృతచాపము, హాశరథియు నైన యనుజుఁ డతివయుఁ దానున్.

ఉ. లేటికులంబు నోటఁ గబళించిన దర్భ త్యజించి సోగకన్
దేటల కల్వచాలు వనినిండ నిజాకృతిఁ గొంకులేని స
య్యాటముతోఁ గనుంగొనెడు నత్రిమునీశ్వరు నాశ్రమక్షమా
వాటికి నేగి యాజటిలవర్యుసపర్య భజించె నయ్యెడన్. 115

గీ. అత్రికనకగాత్రి యవనిపుత్రికినంగ, రాగ మొసఁగె సానురాగసరణి
దాన నొకటఁ బూనె జానకి మేనును, మించుమించు నాక్రమించు ఠీవి. 11

చ. వననిధిమేఖలావలయవారిజనీరజనీభవన్నరా
దనభటతండఖండనపితండకతండసురక్షితైకఘనా
ఘనవలయంబుఁ దూఱెపు నీకీర్తను కైవడిఁ జొచ్చె దండకా
వనిఁ జమరీకిరీభహరివాహరిపుప్రాత్కరగండకావనిన్. 117

ఉ. చంద్రధరప్రభావ శతచంద్రధరోపమరూప శ్రీహరి
శ్చంద్రమహామహేంద్రనిభసత్యవచోరచనాధురంధరా
చంద్రమతీసమానగుణసౌరభవచ్ఛసక్రృష్ణమాజిమా
చంద్రముఖీమనోరమణ సాదరణశ్రుతబాణభాషణా. 118

క. కిన్నరనిధినాయకనిభ, కిన్నరకంఠీనవీనకేళీవ్యధిపా
పన్నాళాగరధరణీ, భృన్నుతకీర్తిప్రతాప నృదుసల్లాపా. 119

కవిరాజవిరాజితము. భరతభగీరథనైషధనాహుషపఙ్క్తిరథాత్మజరంతియుధి
ష్ఠిరయువనాశ్వతనూభవ భార్గవ చిత్రపవిత్రచరిత్ర నిధీ
వరకవిరాజవిరాజితమందిరవందిరసాలవసంతనిరం
తరనిరవద్యయశోజితశారదనారదపారదహారధరా. 120

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాద సమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిర్వేంగళార్యకలశరత్నాకర సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతంబైన చంపూరామాయణం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

శ్రీ

# చంపూరామాయణము.

## పంచమాశ్వాసము.

— అరణ్యకాండము —

క. శ్రీవేంకటపెరుమాళ్ళను, ధ్యానింపంసేవితాంఘ్రితామరసలస
త్కావేరీ వల్లభసా, రావారగభీర కనకరాజనగరా. 1

శా. కాకుత్స్థాగ్రణి దండకావిపినభాగ వ్యోమసీమాసునుం
డై కోదండము దోఃప్రకాండనిచయం బాచాంతరిక్షోపవా
సీకం బై మెఱయన్ మెఱుంగు కరణి న్దేవేరి వెన్వెంటఁ దాఁ
గేకింబోలి త్రిలోకి రంజిల మెలంగన్ శీలసైలచ్ఛవిన్. 2

మ. వనశుండాలకపోలకాషవిగళత్స్వర్గాలసాలాలినూ
తననిర్యాసము తావిమాటు హుతగంధంబుల్ సదంబుల్ తపో
ధనపుణ్యాశ్రమభూములం దెలుపఁ దత్తన్మౌనిపూజాహృతా
యనజాతి న్మనువంశు లాయడవి నుద్యానంబుగా నెన్నుచోన్. 3

క. శాతాయస్త్రిశిఖశిఖా, ప్రోతశవవ్రాతుఁ డై తిరుగువాఁ డచిర
జ్యోతిర్లతాశతావహ, నీతావనితావలోకచిత్రాకృతి యై. 4

గీ. యాతుధానుఁ డొకఁడు విరాధాభిధానుఁ
డలరుసరి మాంసమతిఁ గాక మపహరించు
కరణి ధరణిజఁ గొని యభ్రసరణి నిలిచి
రాకొమరులఁ జూచి తలయూఁచి కేకవైచి. 5

మ. కట్టినవల్కలంబు జడగట్టిన కైశికముం గరంబులం
బట్టిన విండ్లుఁ జూడఁ గనుపట్టెస దచ్చెరు వెవ్వరో కదా
పెట్టెఁడుసొమ్ముచే సొగసు వెట్టెడు నిట్టి మిటారికత్తెతోఁ
నట్టడవిం జరించెదరు నాయపదానము లాలకింపరో. 6

క. కాచితి మి మ్మిపు డీచెలి, నాచే నొప్పించి చనుఁ డన న్రాముఁడు దో
షాచరు చను మొన నొకనా, రాచము నాటింప స్రుక్కి రక్కసుఁ డలుకన్. 7

సీ. సీత నుర్వికి డించి చేకొద్ది నైనశూల మామర్త్యహృదయశూలంబుతోడ
నడువ గేడించి మార్గావరోధాపరాధము నైఁప నిందు భాస్కరుల సాను
వునఁ దాల్చువింధ్యము ట్లనుజాతుఁ డేనునెత్తికొని మింటి కరుగు దైత్యుని భుజంబు
లిరువురు ఖండింప భువిపైనొఱఁగి మేనుఁ దొఱఁగి వాఁ డమరుఁడై తొలుతరంభ
గీ. బలిమిఁ బైకొనుటను నైలబిలుని కినుక, గనిన యెడ లిది గర్హ్యమనుచు వేఁడఁ
దత్తనువు మున్నునెత్తుటఁ దడిసినవన, యినధరణిఁ ద్రవ్విపూడ్పించె నినకులుండు.

క. శరభంగయతికి నతఁ డా, శరభంగజకీర్తి రాక చాటుచు గంగా
శరభంగసంగరాశన, శరభంగజనితదక్షసఫలత నలిసెన్. 9

గీ. ఇంద్రుఁ జూచియుఁ బనుమాని వేంద్రుఁ జూచు
దనుకననటుండి జటిలుండు ననలశిఖకు
సమిధ మై మింటి కరుగ నైక్ష్వాకుమణి సు
తీక్ష్ణు నాతిథ్య మెనసి యాదిక్కు వాసి. 10

చ. అరిగి కనెం గుఱంగట జలాశయసింధుమరందకందళీ
కరణధురీణపాణిమయకంబతదంతికభీతభీతసం
చరణవిధాయితోయధరసంశయదాయకహోమధూమదం
తురితపురోవనిన్ ఘటతనూజతపోవని లోకపావనిన్. 11

— * రాముఁ డగస్త్యాశ్రమముం జేరుట. * —

వ. కనుంగొని యనుంగుఁదోయారి యగుమహీకుమారి కిట్లనియె. 12

సీ. సెలయేటివడి నగస్థలినుండి పడి వాసవాభాసుగతి దెల్పు నజగరములు
నజగరములనోళ్లఁ గబ్బి వెల్వడలేక వాతాపిదశఁ జూపు వనగజములు
వనగజాహతులఁ గైరవాలి వింధ్యనగంబుభాతిఁ జొప్పడు నల్లకీతరువులుఁ
దరువుల శాఖాగ్రసరణిఁ జూపట్టి వార్ధి తెఱంగనుకరించు తేనెపెఱలు
గీ. నహుషబుషివిద్విషన్మేరుమహీధరప్రదీప వనరాజదుర్మదాటోపహరణ
పటుతరఘటీతనూభవ ప్రాక్చరిత్ర, మెదురుకొలిపెడు మదికి నిం దిగురుఁబోఁడి.

మ. జలరాశి న్వెలకేలఁ గుంభభవుఁ డాస్వాదించుచో నీఁగలుం
బలెఁ బైమూఁగు మొయిళ్లు డాపలిచెయి న్వారింపఁ గంపించి శం
పలకుం బాసి నిలింపమార్గము భజింపన్లేక యీమబ్బు లిం
డు లులాయాకృతిఁ బూని పల్వలముల న్వర్తిల్లెడుం గంటివే. 14

గీ. అని యగస్త్యునాశ్రమాభిరామతకు విస్మితమనస్కుఁ డగుచుఁ జేరఁబోవు
నెడఁ దదీయశిష్యు లెదురుగా వచ్చి తోడ్కొనుచుఁ జనఁగ నరిగె మనుకులుండు.

సీ. నహుషనామ భుజంగవిహ్వలతఁ దప్పించె మునివీటి పేరిది గాదె విప్రవరత
యంభోధి నొకగ్రుక్క నాపోశనముగొన్న వీఁడు పూనినదిగాదె బాడబాఖ్య
కేలనంటి నగంబు నేలమట్ట మొనర్చె నీమేటిదిగదా యతీంద్రచర్య
యసురప్రాణంబున కెసరువెట్టినకుక్షి గలుగు నీనిదిగదా కలశజన్మ

గీ. మనఁ దనరు లోకవంద్యు నిరాశుఁడయ్యు, దక్షిణాశ భజించు చిత్రప్రచారు
బ్రహ్మతేజోమయు నిజప్రభావగాత్రు, గౌతమాత్రిపులస్త్యు నగస్త్యుఁ గాంచె. 16

క. నామము గోత్రము నొడివి ప్రణామము గావింప మౌనినాయకుఁ డాశీ
స్తోమముతో నాదవె ముని, క్షేమము లిడి నని సపర్య సేయుచు నంతన్. 17

మ. మురజిచ్చాపముఁ దమ్మిచూలివిశిఖంబున్ వజ్రితూణీరమున్
గరవాలంబు నొసంగి యానియమిలేఖస్వామి తన్ బంప నేఁ
గి రఘూత్తంసుఁ డొనర్చెఁ బంచవటి చక్కం దెంకి గోదావరీ
సరసీజాతమరందమందరమరుత్సంప్రీత చేతస్కుఁ డై. 18

మ. పులుఁ గొక్కం డెదుటం జటాధరనిరంభోవార్థియై వజ్రయా
వలిఁ దం జేరెడు గట్టురాకొమరు శేవగ దోఁచి మీ తండ్రికిం
జెలినై యుందు జటాయువందురు ననుం జేకోఁ దగు న్నాయెడం
బలలాదభ్రమ మేలరామ! యని సంభాషించి పో సంతటన్. 19

క. పంచవటిన్ సౌమిత్రిఘటించిన కారాకునగరి చొక్కి లయోధ్యన్
మించ న్సంతోషించి వసించె రఘుపుంగవుండు సీతాన్వితుఁ డై. 20

— శ్రీరాముఁడు పంచవటిని వసించుట. —

శా. అంతం దోఁచె నితాంతకంతువిజయోదంతంబు సిందూరితా
నంతాశాలివిపాకశీలితపిశంగాకార కేదారసీ
మంతం బాదినయోషావనోదయ మిళన్మాంద్యాంశుమంతంబు శే
మంతం బధ్వచరోద్ధవాదినటరుఘుంపానాట్యపర్యంతమై. 21

క. శరదాతపతప్తనభః, క్షరదమితనిదాఘబిందుసంఘము లతుల
స్మరమదకుంజరసరసీ, కరనికరము లొలసెఁ దుహినకణవిసరంబుల్. 22

సీ. జాడ్యాకరం బయ్యెఁ జంద్రోపలవితర్ది శరపాత మయ్యెఁ గాసారవిహృతి
యప్రదృశ్యం బయ్యె హల్లకోత్పలవాటి విపదావహం బయ్యె నుపవనంబు

చర్చాగళితమయ్యెఁ జందనాలేపనం బతిశైత్య మయ్యెఁ జంద్రాతపంబు
గగనమయ్యె గృహాగ్రగతచంద్రశాలిక యసుకరం బయ్యె లాజానిలంబు

గీ. విరచితామోద మైతోఁచె విరులశయ్య, భారము ఘటించెఁ బూనంగ హారవల్లి
కంటకోత్సేధ మొనరించెఁ గప్పురంబు, నిరవధికభోగ పరులైన దొరల కపుడు. 23

మ. బురునీసుల్ సకలాతియాంతరగృహాభోగాసికల్ దోమబ
త్తెరమంచంబుల ధూమధూసరహసంతీయంత్రముల్ కుంకుమా
గురుసారంగమదానులేపనములుం గోష్ణాంబుజాతేక్షణా
గురువక్షోజభరోపగూహములు భోగుల్గాంచి రాసీతునన్. 24

క. నెఱసునటి విశ్రమింపం, దఱియై నెఱిమించు మంచుతాఁకుల జిగివా
తెఱ పిల్లగ్రోవిఁబూనం, గొఱమాలె న్వేలమిటారికూఁతురితెగకున్. 25

ఉ. అట్టియెడం గడంగి జగమంతయు నాఁగెడు మంచుదాడి కి
ట్టట్టు చనంగలేక శరణంచుఁ దమున్భజియించు వెట్టకుం
దట్టుపునుంగు వాసనలతావగు లేజవరాండ్ర చొక్కపుం
గట్టిమెఱుంగుచన్గవలు గట్టె నిజోపరి పట్టబంధమున్. 26

గీ. అనతిచకితదివాంధంబు లైనయెండ, లనతిముదితమరాళంబు లైనకొలఁకు
లనతిసుఖితచకోరిక లైనచంద్రి, కలుఁ బ్రియము లౌనెజనులకుఁ గంటుగాక. 27

సీ. హృత్పద్మ మాతంక మెనయనీయక మాటుకరణిఁ గరస్వస్తికంబు దోఁపఁ
జలివో జపించు నోజ వణంకునఁ దొలంకు రదనఘట్టనమునఁ బెదవులదరఁ
గృపవుట్టి విధి గొనసంగిన కంబళమనంగ నంగంబు రోమాంచ మాదరింప
దార్గత్యమయన్నృపధ్వజపతాకికరీతిఁ గటిఁ బటచ్చరవేష్టి గానిపింపఁ

గీ. దిరుగుభిక్షాశనులమీఁద దృష్టియిడని
యదయురాలగు కలిమితొయ్యలిగృహంబు
లలజడికిఁ దార్చునై వడిఁ బులుముకొనియె
వనజవిసరంబు హేమంతవాసరంబు. 28

క. ఎన్నులతుద హిమకణము, ల్వెన్నుఁగఁదట్టొరగి రాజిలె న్రాజనముల్
సన్నిహితలవనచింతా, సన్నతిఁ గన్నీరునించు చందము దోఁపన్. 29

క. తాలిమివదలి విరాళిన్, జాలిం బడి వెఱచు నళికచామణు లచ్చోఁ
జాల రతివ్యసనాంబుధి, వేలయు రజనీవిరామవేలయుఁ దెలియన్. 30

